# రహస్యం

శ్రీమతి పోమిరెడ్డి జమున

వంశీ పబ్లికేషన్స్
వంశీ నర్సింగ్ హోమ్
ఇందిరా భవన్ రోడ్, నెల్లూరు-524 001

RAHASYAM

By :

Smt. Somireddy Jamuna

Nellore.

First Edition :

March-1995

PRICE :

Rs : 45-00

Cover Design :

V. S. PRAKASH

Printed At :

D. B. Printers

Vijayawada-2

Published By :

VAMSI PUBLICATIONS

NELLORE

# ముందుమాట

రచయిత్రి సోమిరెడ్డి జమునగారు మంచి భావనాపటిమ కలిగిన వారు. మనోనేత్రంతో మనసుకూ, మనసుకూ మధ్య మనోహర చిత్రాలను వీక్షించగలరు.

ఉద్యోగం చేసినంత మాత్రాన, మగవారితో కలిసి మెలిసి తిరిగినంత మాత్రాన మహిళల ఋజువర్తన దెబ్బ తింటుందా ?? ట్రాష్.... పురుషులతో సమానంగా ప్రవర్తించే ఆడవారిని గురించి ఓర్చుకోలేని రాజేష్‌లాటి వారికి అలాటి ఆడవారు అపవిత్రులుగా కన్పిస్తారు. పనికట్టుకుని అలాటి వ్యక్తులు ఆడవాళ్ళపై దుష్ప్రచారం సాగిస్తారు. ఇలాంటి వారి పుకార్ల వలన కొంతమంది కుటుంబాలు అగ్నిపర్వతాలు బ్రద్దలవుతాయి. పెల్లుబికిన ఆ లావా ఈ సమాజానికి మచ్చ.

అసలు అనుమానం అనేది మనసులోకి రానేగూడదు. ఒకసారి ఏదో ఒకరంగా ఆ బీజం మదిలో పడిందంటే చాలు. అది క్రమంగా పెరిగిపోతుంది. పొడవైన, వాడియైన గోళ్ళను ఏపుగా పెంచుకుంటుంది. హృదయాన్ని ఒక్కొక్క ముక్కగా గిల్లి పారేస్తుంది. కొంత కాలానికి హృదయమున్న స్థానాన్ని యిది ఆక్రమించుకుంటుంది. ఒక సందర్భంలో అలాటి స్థితికి వస్తాడు ఈ నవలలోని స్వరూప్.

ఈ నవలలో అందరికన్నా నాకు నచ్చిన పాత్ర మీకు నచ్చే పాత్ర కూడా చిరుహాస.

సోమిరెడ్డి జమునగారు వ్రాసిన ఈ నవల రకరకాల మనస్తత్వాలకు రూపు. నేటి సమాజ గమన రీతులకు మ్యాపు- మరి ముందుకు వెళదామా? ఆస్వాదిద్దామా??

—జయంపు కృష్ణ

కృష్ణ కుటీర్

నెల్లూరు

# రచయిత్రి మాట



చిరకాల వాంఛ తీరిన రోజు కాశ్మీర్‌లో అడుగుపెట్టి ఆనందంగా లేక్‌లో బోట్‌లో మా కుటుంబం షికారుకెళుతున్న సమయంలో మా ప్రక్కబోట్‌లో కొత్తగా పెళ్ళయిన జంట పూలసజ్జలాటి బోట్- కసుల కెంపుగా ఆ నీళ్ళలో మా ఎదురుగా వస్తోంది. ఆ బోట్ ఆపి అందులోని పూలు కొని ఆ అమ్మాయి కందిస్తున్నాడు ఆ అబ్బాయి. ఆ అబ్బాయి ఏమి జోక్ విసిరాడో కానీ ఆ అమ్మాయి సిగ్గుల మొగ్గయింది. నా మెదడులో మెరుపు ఫలితం ఈ నవలకు కథా వస్తువు దొరికింది. అలా మొదలుపెట్టాను ఈ నవల.

మనస్సనేది చాలా లోతయినది- చాలా చిత్రమైంది కూడా— ఆ మనస్సుకు ప్రతిబింబం మంచి చెడూ.

మనుష్యుల మనస్తత్వాల మీద ఆధారపడ్తుంది సంతోషం-దుఃఖం అనేది.

ఎదుటివాళ్ళ సంతోషాన్ని కోరుకునేవాళ్ళు తన దుఃఖాన్ని మ్రింగేసి ఎదుటివారి సంతోషంలో పాలుపంచుకుంటారు.

ఎదుటివారి విషాదాన్ని చూడాలనుకునే వాళ్ళు- ఎదుటివార్ని హింసించాలనుకునేవాళ్ళు తమ మనసుల్ని కలుషితం చేసుకుని పైశాచికంగా మారి ఎదుటివారికి అశాంతిని రుచి చూపిస్తారు.

తన తప్పుని ఎదుటివారి మీద రుద్ది తప్పించుకుంటారు మరికొందరు.

ఇలా.... ఇలా మనస్సుల్లోకి తొంగిచూస్తే ఎన్నో.... ఎన్నెన్నో కానీ మనస్సులోని శంకను రహస్యంగా దాచుకోకుండా అనుమానమనే పిశాచాన్ని నిర్భయంగా వెలికి తీస్తే దంపతుల మధ్య అశాంతి పటాపంచలయిపోదా....?

అవునంటారా? కాదంటారా? చదివి మీరే చెప్పాలి మరి.

నమస్తే

-జమున

# కృతజ్ఞతలు

నేను అడగగానే ఓపికగా నా నవల ఆసాంతం చదివి వారి విలువైన అభిప్రాయాన్ని ముందు మాటగా అందించిన జాతీయ అవార్డు గ్రహీత జయంపు కృష్ణగారికి నా తొలి కృతజ్ఞతలు.

ఎలాటి అసౌకర్యం కలిగించకుండా తప్పులు లేకుండా ఈ పుస్తకాన్ని ప్రింట్ చేసిన డి.బి. ప్రింటర్స్ అధినేత కె.వి. దుర్గారావుగారికి, బుజ్జిగారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని సర్వాంగ సుందరంగా తయారు చేసిన చిత్రకారుడు వి.యస్. ప్రకాష్‌గారికి సంతృప్తి పూర్వక కృతజ్ఞతలు.

వికలాంగుల సహాయార్థం ఈ పుస్తకాలు అమ్మిపెట్టడంలో శ్రద్ధ తీసుకున్న మా బంధు మిత్రాదులకు నా కృతజ్ఞతాయుత కృతజ్ఞతలు.

నమస్తే

—జమున

# అంకితం



**శ్రీమతి సునీత** ఎం.ఎ., ఎం. ఫిల్

'స్నేహమంటే తియ్యనిదోయ్' అనే సూక్తిని మా 25 సంవత్సరాల స్నేహంలో నిరూపించిన నా స్నేహితురాలు, నా శ్రేయోభిలాషి, నాకు అత్యంత ప్రీతిపాత్రురాలైన డా॥ వెంకటేశ్వర రెడ్డి సహధర్మచారిణి సునీతకు నా సీతకు....

స్నేహాంజలితో
ప్రేమాంజలితో
—జమున

# రహస్యం

కాలేజీ ఆవరణమంతా నూతనోత్సాహం నిండిన గొంతులతో మార్మోగిపోతోంది.

జూనియర్ ఇంటర్ స్టూడెంట్స్ బెరుగ్గా క్లాస్ రూమ్స్‌లో కూర్చునుంటే సీనియర్స్ వాళ్ళని లాక్కెళుతున్నారు. కాలేజీ తెరిచిన మూడవ రోజే స్ట్రైక్ ప్రారంభమయింది. ఆడ పిల్లల చేత నిరాహారదీక్ష చేస్తామని నినాదాలు పలికిస్తున్నారు అబ్బాయిలు.

ఇంత మంచి సదవకాశాన్ని పోగొట్టుకోవడం తెలివి తక్కువ తనమని భావిస్తూ అమ్మాయిల చుట్టూ చేరి స్ట్రైక్‌లో పాల్గొని విజయ వంతం చేయమని బ్రతిమిలాడు కుంటున్నారు.

ఆడపిల్లలు ఎండలో కూర్చోలేరని నిముషాలమీద షామియానాలు తెచ్చివేసేసారు. మూడు సంవత్సరాల కోర్సుని సంవత్సరానికి కొకమారు పెడితే కష్టంగా వుందని మేము చదవలేమని డిగ్రీ కోర్సు పిల్లలకు ప్రతి సంవత్సరం గ్రూప్ పరీక్షలు పెట్టాలనే కోరికను ఈ విధంగా సాధించు కోవాలనుకుంటున్నారు.

కానీ వాళ్ళు సాధించాలనుకున్న దాన్ని ప్రక్కన పెట్టేసి జోక్స్ విసురుకుంటున్నారు అమ్మాయిల మీద. వాళ్ళ అందాల్ని దగ్గరగా, అతి దగ్గరగా తమ కళ్ళల్లో నింపుకుని ఆనందిస్తున్నారే తప్ప వాళ్ళను కున్న ధ్యేయానికి స్థిరత్వం లేదు.

లెక్చరర్స్ ఎవరి డిపార్ట్‌మెంటులో వాళ్ళు కూర్చుని వున్నారు. సమ్మర్ హాలిడేస్ తర్వాత స్టాఫ్ మెంబర్స్‌కి ఎవరికి ట్రాన్స్‌ఫర్ అయిందో, కొత్త లెక్చరర్స్ ఎవరు జాయిన్ అయ్యారో తెల్సుకునే అవకాశం గానీ, కొత్త లెక్చరర్స్ స్టూడెంట్స్‌కి, కోలెక్చరర్స్‌కి తమని తాము పరిచయం చేసుకునే అవకాశం గానీ కలగకుండానే స్ట్రయిక్ మొదలయింది. కాలేజీకి వచ్చే సిన్సియర్ స్టూడెంట్స్‌ని గేటు దగ్గరే ఆపేస్తున్నారు.

ఆ కాలేజీలో కొత్తగా అపాయింట్ అయిన స్వరూప్ అబ్బాయిలకు తీసిపోకుండా స్ట్రయిక్ చేస్తున్న ఆడపిల్లల్ని వింతగా చూస్తూ వరండాలో నిల్చున్నాడు.

"మీరు" సందిగ్ధంగా అడిగాడు హిస్టరీ లెక్చరర్ చంద్రకిరణ్.

"నేను మాథ్స్ లెక్చరర్‌గా అపాయింటయ్యాను. నా పేరు స్వరూప్."

ఇద్దరు పరస్పరం పరిచయాలయ్యాక మరలా కాలేజీ కాంపౌండ్‌లో అబ్బాయిలు అమ్మాయిలు కల్సి చేస్తున్న అల్లరి చూడసాగారు.

"స్టూడెంట్స్‌కి మీరయినా చెప్పాల్సింది వాళ్ళ కోరికలు తీర్చుకునే విధానం ఇది కాదని."

శుష్కంగా నవ్వాడు చంద్రకిరణ్.

"గవర్నమెంటు వాళ్ళు మనకు జీతాలిచ్చేది స్టూడెంట్స్‌కి పాఠాలు చెప్పడానికి మాత్రమే అంతకు మించి ఒక్క స్టెప్ పైకిపోయి ఆలోచించినా మన ఆరోగ్యానికి మంచిది కాదంటారు స్టూడెంట్స్"

"బాధ్యత తెలిసిన వయస్సు వాళ్ళేదో మాట్లాడారని మనం సైలెంట్‌గా వుండిపోతే స్టడీస్ నెగ్లెక్ట్ చేస్తే తర్వాత ఫ్యూచర్‌లో సఫర్ అవుతారని వాళ్ళకు వివరిస్తే అర్థం చేసుకుంటారు కదా!"

అక్కడ జరిగే గందరగోళం చూసి ఎదుటి వ్యక్తి కొత్తవాడనే విషయం స్ఫురణకు రానట్టుగా అన్నాడు స్వరూప్.

"వాళ్ళది ఉడుకు రక్తం—మన ఉపదేశాలు చెవ్వులో కెక్కించు

కోరు. మీ రావేశపడ్డంలో అర్థం లేదని త్వరలో మీరే తెల్సుకుంటారు" చంద్రకిరణ్ చిరునవ్వుతో జవాబిచ్చాడు.

"రండి మా డిపార్ట్‌మెంట్‌లో కూర్చుందాం" అంటున్న చంద్ర కిరణ్ మాట పూర్తి చేయక ముందే స్టాఫ్ మెంబర్సంతా బయట కొచ్చే సారు

"డిపార్ట్‌మెంటు నుండి ఈ కోలాహాలం చూడ్డానికి మేము వరండాలో కొస్తుంటే మీరు డిపార్టుమెంటుకెందుకు? అందరం ఇక్కడే నిల్చుందాం" అన్నారు వాళ్ళు.

స్వరూప్‌ని స్టాఫ్ మెంబర్స్‌కి పరిచయం చేసి స్టాఫ్‌మెంబర్స్ నందర్నీ పేరు పేరున స్వరూప్‌కి పరిచయం చేసాడు చంద్రకిరణ్.

"అమ్మాయిల్ని యింత విచ్చల విడిగా వదులుతున్నందుకు ఆ తల్లిదండ్రుల ననాలి" ఫిజిక్స్ హెడ్ ఆనందశర్మ విసుక్కున్నాడు.

"పొరపడుతున్నారండీ శర్మగారూ. వీళ్ళను యిలాంటి పాప కార్యాలు చేయమని పంపుతున్నారా వాళ్ళ తల్లి దండ్రులు. చదువుకుని డిగ్రీలు పుచ్చుకుని వాళ్ళ భవిష్యత్తుకి బంగారు సోపానాలు వేసుకుంటారని పంపుతున్నారు గానీ" చంద్రకిరణ్ బాధ్యతంతా తల్లి దండ్రుల దంటే నేనొప్పుకోను అన్నట్లు అన్నాడు.

"మందు చేదుగా వుంది నేను తాగనమ్మా అని ఏడ్చే పసిబిడ్డను లాలించి మందు తాగేలా చేస్తున్నామా లేక త్రాక్కుండే వుంటారులే అని వదిలేస్తున్నామా?" స్వరూప్ అడిగాడు.

"వాళ్ళు పాలుకారే పసిపిల్లలు.... వాళ్ళకి నాలుగు తగిలించయినా మందు త్రాగించ గలం కానీ యీ పిల్లలుకేం తక్కువ వయస్సుంది వాళ్ళని అలా పసి బిడ్డలతో పోల్చకండి" ప్రొద్దుటి నుండీ అసహనంగా వున్న బాటనీ హెడ్ వర్ధనమ్మ విసుక్కుంది. ఆమె పెళ్ళి చేసుకో లేదు.

"మనం పిల్లలకు వయసొచ్చిందని వదిలేయకూడదండీ. యీ వయస్సులోనే వాళ్ళ జీవితానికి టర్నింగ్ పాయింట్ వుంటుంది. వాళ్ళని

చెక్ చేస్తూ వుండాలి. వయస్సు తెచ్చే ఆకర్షణ రెవల్యూషన్ చదువు మీద అశ్రద్ధ. వీటిని మనం మంచిగా గయిడెన్స్ యిచ్చి వాటికి గుడ్‌బై చెప్పించి చదువు మీద ఇంటరెస్ట్ పెరిగేలా చూడాలి" స్వరూప్ అన్నాడు.

పిల్లల బరువు బాధ్యతలతో తల పండిన జువాలజీ హెడ్ హేమలతగారు వెంటనే అంది.

"నేనొప్పుకుంటాను. బిడ్డలు కాలేజీకి సక్రమంగా వెళుతున్నారా? లేదా? అని ప్రతి తండ్రీ చెక్ చేయాలి." తన పనేంటో తనేంటోగానీ యింట్లో ఏ ఒక్క విషయం పట్టించుకోని తన భర్తను తల్చుకొని విసుగ్గా అంది హేమలత.

"బిడ్డల ఎడల తండ్రి బాధ్యత ఎంతుందో తల్లి బాధ్యత కూడా అంతే వుందండీ హేమలతగారూ!"

"తల్లి బాధ్యత ఎంత వరకుంటుందంటారు. ఇంటి గడప దిడ దాటే వరకు అన్నీ సమకూర్చి పెట్టేవరకే. ఆ పైన బిడ్డను పాలో అవలేదుగా!"

ఎదురు ప్రశ్న వేసింది వర్ధనమ్మ కెమిస్ట్రీ లెక్చరర్ సంపత్‌తో.

"మానసిక శాస్త్రవేత్తలు తమ బిడ్డల ముఖ కవళికల్ని బట్టి వాళ్ళ మానసిక మార్పులను కనుక్కోవచ్చంటున్నారండీ. స్కూలు నుండి గానీ కాలేజీ నుండి గాని తమ బిడ్డ ఆలస్యంగా వస్తే ఎందుకాలస్యమయింది అని ప్రశ్నించినపుడు వాళ్ళిచ్చే సమాధానంలో నిజం తెలియక పోయినా ఆ జవాబిచ్చేటప్పుడు వాళ్ళ కంఠంలో నిజాయితీ వాళ్ళ కళ్ళల్లో నిర్మలత్వాన్ని బట్టి వాళ్ళ సమాధానంలో నిజముందో అబద్ధముందో చప్పున పట్టేయొచ్చు" శ్రీకళ అంది.

"అలా కనుక్కునే రోజులు పోయాయండీ. పసిపిల్లే కదా అని అమాయకంగా వూరుకుంటే పద్నాలుగేళ్ళ ఆడపిల్ల ఏడు నెలలు తన పొట్టలో పసికందుని దాచిపెట్టి తల్లినీ తండ్రినీ మభ్య పెట్టగలుగుతున్నారు. డాక్టరు మీ అమ్మాయికి ఏడవనెల అని చెపితే డాక్టరు

చెప్పింది నమ్మకపోగా ఈవిడెవరో ఏమీ తెలియని డాక్టరమ్మలా వుంది. వేరే డాక్టరు దగ్గరకు వెళదాం పదమ్మా! అనేలా తల్లిని నమ్మించ గలుగుతున్నారు ఏం కాలమో ఏం పిల్లలో లేకుంటే బుద్ధిగా ఇంటి దగ్గర దించిన తల కాలేజీలో చేర్పించిన ఆడపిల్లలు యిలా ఏ కాలేజీ నుండో వచ్చిన అబ్బాయిల ప్రోద్బలంతో నిరాహార దీక్షకు పూనుకుంటారా?" ఆఖరి కూతురి పెళ్ళి చేయలేక సతమతమయిపోతున్న కామర్స్ లెక్చరర్ గుర్నాధంగారు అక్కడ లేడీ లెక్చరర్స్ వున్నారనే మాట మర్చిపోయినట్టుగా అన్నాడు.

"ఆడపిల్లల్నే ఎందుకనాలి దానికి సమాన బాధ్యత వహించిన మగ పిల్లల్నెందుకు వదిలేయాలి? ప్రొఫెషనల్ కాలేజీల్లో, ఆఫీస్‌లో ఆడపిల్లల సంఖ్య తక్కువగా వుందా? అబ్బాయిల్ని మించి కష్టపడి చదివి గోల్డ్‌మెడల్స్ అందుకుంటున్నారు. అలాటి ఈ రోజుల్లో వాళ్ళ హక్కులకోసం పోరాడ్డంలో తప్పులేదంటాను నేను" పి.జి డిగ్రీ చేతికి రాగానే పెళ్ళయిపోవడం ఆ తర్వాత ఉద్యోగం రావడంతో ఆవేశ పడి పోయింది మాధవి.

"నువ్వు చెప్పే పాయింట్ బాగానే వుందమ్మాయ్ నే నొప్పు కుంటాను. కాని ఒక్కటి చెప్పనా ఇలా రోడ్డెక్కి అల్లరిచేసే అమ్మా యిల్ని ఎవరు పెళ్ళి చేసుకుంటారంటావ్?" పెద్ద వయస్సున్న గుర్నా ధం చిన్నవాళ్ళని మీరని పిలవకూడదంటూ అందర్నీ నువ్వనే పిలుస్తూ వుంటాడు.

"వాళ్ళేం తప్పు చేయలేదే సంఘం వెలివెయ్యడానికి?"

"ఈరోజు నడిరోడ్డెక్కింది రేపు ఇంటిని నడిరోడ్డుకీడ్చగలదు అనే భయం ఎదుటి వాళ్ళలో కలగదంటారా?" మరలా మాధవి అంది.

"అలాగే అమ్మాయి తల్లిదండ్రులు రోడ్డుకెక్కిన తుంటరి వెధవ కిచ్చి చేస్తే జీవితాంతం ఏదో ఒక రకంగా మా పిల్లను క్షోభ పెట్టడా అని అనుకోరంటారా?"

"పెళ్ళికాకపోతే ఒకబ్బాయికిగానీ, ఒకమ్మాయికి గానీ అన్యాయం జరక్కపోవచ్చుకానీ ఈ స్ట్రయిక్‌లేమిటి? నిరాహార దీక్షలేమిటి? అర్థంలేని ఆవేశంలో బస్సులు తగలబెట్టడమేమిటి? మన ఆస్తులను మనమే నష్టపర్చుకోవడమేమిటి? దాంతో కర్ఫ్యూలు విధించడం-ప్రజలు నిత్యావసరాలు కూడా మర్చిపోయి భయంతో గడప దాటకపోవడంతో వస్తువులు అమ్ముకుని, కూరలు అమ్ముకుని ఆ రోజుకారోజు వచ్చే లాభంతో పొట్టపోసుకునే మనుష్యులు ఆ లాభం లేక బియ్యంగింజలు కూడా కొనలేక ఇంటిల్లిపాదీ పస్తులు పడుకో బెట్టడమేమిటి? ఇదంతా ఏమిటి? అని ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకుంటే ఇలా స్ట్రయిక్‌లు చేయగలరా?" వర్ధనమ్మ వాపోయింది.

"అంతటితో ఆపితే పర్వాలేదండీ భారతిదేవిగారూ! పిచ్చిగా ఈ ఆత్మాహుతులేంటీ? గుంపుల్లో చేరి గలాటాల్లో తలదూర్చి కాళ్ళు చేతులు విరగ్గొట్టుకుని జీవితాంతం వికలాంగులుగా గడపడమేమిటి?" వర్ధనమ్మ విసుక్కుంది మరలా.

"అదే....అదే నాకూ బాధగా వుంటుంది. ఆ ఒక్కక్షణం ఆవేశాన్ని అదిమిపెట్టుకో గలిగితే యిన్ని అనర్థాలు జరగవు గదా!" సివిక్స్ లెక్చరర్ భారతీదేవి మాటలను ఆపాడు స్వరూప్.

"ఇలా మనం మనలోనే డిస్కస్ చేసుకునే కంటే ఒక మీటింగ్ ఏర్పాటుచేసి వాళ్ళనందర్నీ మీటింగ్‌కు అటెండవమని రిక్వెస్టుచేసి వాళ్ళను వాళ్ళ కోరికలు తీరే విధానం యిది కాదని చెప్పి వాళ్ళు ఎన్నుకున్న మార్గాన్నెందుకు మార్చకూడదు?" స్వరూప్ తన మనసులో వున్న బాధను బయటికి కక్కాడు.

అతనా బాధలో కొత్త మర్చిపోయి అందరితో మాట్లాడేస్తున్నాడు.

"మీరు స్ట్రయిక్ చేయొద్దు. మూడుసంవత్సరాల గ్రూప్ సిలబస్‌కి ఒకేమారు ఎగ్జామ్స్ పెట్టకుండా విభజించి ప్రతి సంవత్సరం పెట్టేలా ప్రభుత్వాన్ని ఒప్పిస్తాము అనే బాధ్యత మీరు తీసుకోగలరా?" ఫిజిక్స్ లెక్చరర్ శేఖర్ నిలదీసాడు.

"కాలేజీకి వచ్చే స్టూడెంట్స్‌ని ప్రతి ఒక్కరినీ తీర్చిదిద్దే బాధ్యత కోసం మనం శ్రమపడలేమంటారా?" స్వరూప్ కొద్దిగా తగ్గాడు.

శుష్కంగా నవ్వింది హేమలత.

"ఒక టీచర్‌గానీ, ఒక లెక్చరర్‌గానీ వాళ్ళార్జించిన విజ్ఞానాన్ని తమ స్టూడెంట్స్‌కి బోధించి వాళ్ళను విజ్ఞానవంతులుగా తీర్చిదిద్దాలనే ఆరాటం ఎవరికుండదంటారు స్వరూప్‌గారూ! ఆ స్టూడెంట్స్‌లో కొంత శాతం మాకీ చదువులు అక్కరలేదు. మేము ఉద్యోగం చేస్తేనే మా భవిష్యత్తు బాగుంటుందనేది లేదు. మా వెనుక పెద్దలు సంపాదించిన ఆస్తి చాలానే వుంది జస్ట్ పాస్‌కి, కట్నంకోసం చదువుతున్నామనేలా బిహేవ్ చేస్తుంటే వాళ్ళనెలా ఇంటలిజెంట్ స్టూడెంట్స్‌గా తీర్చిదిద్దగలం చెప్పండి" స్టూడెంట్స్‌తో తన అనుభవాలను నెమరువేసుకుంటూ అన్నాడు గుర్నాథంగారు.

"నో....నో....అందరూ అలాంటివాళ్ళే ఎందుకుంటారు? మంచి పిల్లలు లెక్చరర్స్ చెప్పే పాఠం శ్రద్ధగా విని వాళ్ళిచ్చే నోట్స్ వ్రాసుకుని ఇంటికెళ్ళి చదువుకోవాలనే వాళ్ళెంతమంది లేరూ!" లెక్చరర్ శ్రీకళ అంది.

"ఒప్పుకుంటాను. ఇలాంటి స్ట్రయిక్ సమయంలో క్లాసులకు రావాలని ఆరాటపడే వాళ్ళున్నారు, క్లాసులకు రానీకుండా అటకాయిస్తే బుద్ధిగా పుస్తకాలు ముందేసుకునే వాళ్ళున్నారు."

తెలియని సబ్జెక్టులో డౌట్స్ వుంటే ఏ లెక్చరర్‌నో లేక తల్లిదండ్రులనో అడిగి చెప్పించుకుని మరీ చదివే ఇంటలిజెంట్స్ వున్నారు.

"అదే నా బాధ. చదువుకోవాలని ఆరాటపడే మంచిపిల్లల భవిష్యత్తుకూడా ఇలా తగలబడిపోతోంది. ప్రతి ఏడాది ఏదో రకం స్ట్రయిక్—కాలేజీ మూత—ఏ నెలకో కాలేజీ తెరిస్తే అప్పుడు సిలబస్ కవర్ చేయలేక మన తొందర- నాలుగు ముక్కలు ముక్కుకు కరిపించుకుని పరీక్షలు పూర్తయ్యాయనిపిస్తారు స్టూడెంట్స్. వాళ్ళల్లో పాతిక

గ్రంథాల్లో సారాంశం బుర్ర కెక్కించుకుని విజ్ఞానాన్ని సంపాదించాలనే ఆకాంక్షకంటే యింపార్టెంట్ క్వశ్చన్స్‌కి నాలుగు ఆన్సర్స్ చదివేస్తే పాస్ మార్కులు తెచ్చేసుకోవచ్చనే ధీమా! అలాంటప్పుడు వాళ్ళను మార్చగలిగేదేమీ వుండదు స్వరూప్‌గారూ!"

ఇంతలో ఆఫీస్ ప్యూన్ నోటీసుతో వచ్చాడు. అందులో సారాంశం కాలేజీకి పదిరోజులు శెలవలిచ్చారని లెక్చరర్స్, స్టూడెంట్స్ వెళ్ళిపోవచ్చని.

ఆ సంభాషణకి ఫుల్‌స్టాప్ పెట్టి లెక్చరర్స్ ఎవరి డిపార్ట్‌మెంట్ లోకి వాళ్ళెళ్ళి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే దురవస్థ తప్పినందుకు సంతోషిస్తూ ఇంటి ముఖం పట్టాడు.

"మన కాలేజ్‌లో మనం నలుగురుమేనా మేల్ లెక్చరర్స్‌మి?" వాళ్ళంతా వెళ్ళిపోయాక స్వరూప్ అడిగాడు.

"లేడీస్ కాలేజ్ కదా! మన సంఖ్య తక్కువే మరి"

"లేడీస్ గవర్నమెంట్ కాలేజ్ అని యిష్టంలేదు నాకు" అన్నాడు స్వరూప్.

"మరెందుకు జాయిన్ అయ్యారు?" నవ్వుతూ అడిగాడు చంద్ర కిరణ్.

"ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోలేక."

"లేక నెల్లూరు నెరజాణలకు నెలవని తెల్సి వచ్చావా?" నవ్వుతూ అనేసాక నాలుక్కర్చుకుని.

"సారీ! స్వరూప్‌గారూ! తొందరలో మిమ్మల్ని నువ్వు అనేసాను" నొచ్చుకున్నాడు చంద్రకిరణ్.

"ఏం పర్వాలేదు ఇద్దరం ఒకే వయస్సు వాళ్ళం, ఒకే కాలేజీలో పనిచేసే వాళ్ళం"

"మీ కిష్టమయితే ఒకే రూమ్ మేట్స్ మవుదాం?" చంద్రకిరణ్ అభ్యర్థనగా అన్నాడు.

"నాకు రూమ్ దొరకలేదని మీకెలా తెల్సు?" ఆశ్చర్యంగా చూసాడు స్వరూప్.

"సాముద్రికం. నాకేం తెలియదనుకోండి. సంవత్సరంనుండి రూమ్‌లో ఒంటరిగా గడిపి బోర్ కొట్టేసింది. ఇంట్లో బోర్ కొట్టించినా నాకు లైఫ్‌మేట్ కోసం వాళ్ళ గాలింపు. ఇంకా పూర్తవలేదు. కనీసం రూమ్‌మేట్ కోసం గాలింపయినా ఫలిస్తుందని" హాస్యం జోడించి చెప్పాడు చంద్రకిరణ్.

"అరెరె ఒక్క సంవత్సరం నుండి మీకి ఊర్లో రూమ్‌మేట్ దొరక లేదా?" ఆశ్చర్యంగా అడిగాడు స్వరూప్.

"అందరూ పెళ్ళయి హాయిగా కాపురాలు చేసుకుంటున్నారు. వాళ్ళెందుకు నా రూమ్‌మేట్‌గా వస్తారు చెప్పండి. నాకో చిన్న డౌట్. మీకూ పెళ్ళయి పోయిందా?" విషాదం నటిస్తూ అడిగాడు చంద్రకిరణ్.

"నో....నో నేను సింహపురి లాడ్జిలో దిగాను. అక్కడనుండి యిక్కడకు రావాలంటే చాలా దూరంగా వుంది. మీ సహాయానికి చాలా థాంక్స్."

"నా ఒంటరి తనానికి గుడ్‌బై చెప్పిస్తున్న మీకే నా థాంక్స్."

"నాకింత త్వరగా రూమ్ దొరుకుతుందని ఎక్స్‌పెక్ట్ చేయలేదు."

"మరి మీరు మీల్స్ ఎక్కడ చేస్తున్నారు?"

"గుర్తు చేసారా! మా ఇల్లుగలావిడ పెట్టే ఆ రుచికరమైన భోజనం తినలేకే చెప్పాగా మా వాళ్ళని నాకు తొందరగా పెళ్ళి చేయమని గోలపెట్టేది"

* * * *

చంద్రకిరణ్ మాటలు విన్పించనంత అరుపులు.

స్వరూప్ వాళ్ళకేదో నీతి బోధ చేయాలని నాలుగడుగులు ముందుకేసాడు. చప్పున గ్రహించి స్వరూప్ చెయ్యి పట్టుకుని వెనక్కి తీసుకొచ్చాడు చంద్రకిరణ్.

"స్వరూప్‌గారూ! ప్రస్తుతం మీరేంచెప్పినా వాళ్ళర్థం చేసుకోలేరు, చేసుకోరు కూడా. వాళ్ళ ఆవేశం అలాంటిది. అనవసరంగా యీ విషయంలో తలదూర్చి పీస్ ఆఫ్ మైండ్ లేకుండా చేసుకోకండి" స్వరూప్‌తో మెల్లిగా అని ముందుకి నడుస్తూ మరలా మాట కలిపేడు చంద్రకిరణ్.

"పదండి మీ సింహపురి హోటల్‌లో ఓ కప్పు కాఫీ త్రాగేసి మీ లగేజ్‌ని నా రూమ్‌లోకి చేరవేసే కార్యక్రమాన్ని చేబడ్దాం "

"వేరే కాలేజీ అబ్బాయి లిక్కడకొచ్చి గోలచేయడమేమిటి?"

"మీరా ఆలోచన మానేయండి ప్లీ

"ఓకే ఇంతకూ మీకక్కడ భోజనం బాగుండదా? కూరలు బాగుండవా?" కాలేజీ గొడవ వదిలించుకుంటూ అడిగాడు స్వరూప్.

"కూరలా? అయ్యో, కూరలు అనే పదాన్ని ఖూనీచేసేస్తోం దావిడ.

ఏ కూరగాయలు బజారులో చీప్‌గా వుంటే అవే తెచ్చి వండు తుంది. దానికీ సర్దుకుపోవచ్చనుకో కానీ వాటినికూడా ఉడకనివ్వదు. ఆయిల్‌లో ఫ్రై చేసానంటుంది కానీ అవి నీళ్ళలో ఉడికిన పదార్థాలే. ఒక గిన్నెకు తయారవ్వాల్సిన కూరను నాలుగు గిన్నెలకు తయారు చేసే ఘనత ఆవిడకే దక్కింది" కొత్త స్నేహితుడితో సరదాగా చెప్పాడు.

"అదీ మన మంచికే అనుకుంటే సరి, విటమిన్స్ పోకుండా ఉడకబెడుతోందావిడ. మీకు కొలెస్ట్రాల్ రాకుండా, ఆయిల్ వేయ కుండా జాగ్రత్తపడుతూ సదా మీ ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకుంటుం దన్నమాట" నవ్వుతూ సమర్థించాడు స్వరూప్ ఆవిడ్ని.

"శ్రద్ధా పాడా? అరకేజి కూరగాయలకు బదులు వందగ్రాముల కూరగాయలతో, నెలకు నాలుగు కేజీల ఆయిల్ బదులు ఒక్క కేజీ ఆయిల్‌తో తయారుచేసేసి డబ్బంతా మిగిల్చేసుకుంటుంది."

"పెరుగు వేసుకుని తినేస్తే సరి" ఉపాయం చెప్పాడు స్వరూప్.

"ఈ వయస్సులో మనం పెరిగినా ఆశ్చర్యపడక్కర లేదుగానీ, ఆవిడ ప్రతిరోజూ పశువులకు పెట్టే కుడితిలాగ ఒకే రకమైన వాసన ఒకే ఒకమైన పులుపు రావడం చూసి ఆశ్చర్యపోక తప్పదు. పాపం ప్రతిదగ్గర పొదుపు చేస్తుందిగానీ ఆ చేమిరికివేసే మజ్జిగ విషయంలో మాత్రం పొదుపు చేయదు."

పక పక నవ్వేసాడు స్వరూప్.

"పోనీ అదీ మానేసి మనకి పచ్చళ్ళే మోక్షం అనుకుంటే సరి"

"హతోస్మి. మేకుల్లాంటి అన్నంలో సున్నమేదో కలుపుతుంది. అన్నం తినేప్పుడు యిక ఆకలి తీరిపోయినట్లుంటుంది తిని లేచిన అర గంటకు మరలా ఆకలి ప్రారంభమవుతుంది."

"ఇక సర్దుకునే అవకాశాలు లేవు కాబట్టి, ఆవిడ దగ్గర మానేసి యింకో హోటలు వెతుక్కుందాం" ఓ ఉచిత సలహా వదిలాడు స్వరూప్.

"ఆవిడగార్కి పేయింగ్ గెస్ట్‌గా వుంటేనే రూమ్ ఇస్తానంది."

"వేరే రూమ్ మనిద్దరం కలిసి గాలిద్దాం ఎలాగూ కాలేజీకి సెల వలే కదా!" అతి తేలిగ్గా అన్నాడు స్వరూప్ మసిలా.

"చూడండి స్వరూప్‌గారూ! ఈ టౌన్‌తో ఈ మాత్రం రూమ్ దొరకటానికి నేను భగీరథ ప్రయత్నం చేయాల్సి వచ్చింది."

"పోనీ ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకుందాం"

"ఇల్లే! అద్దెకు దొరకడమే! బ్రహ్మచారులకు అద్దెకు కొంప ఇస్తే వాళ్ళ నెత్తిన కుంపటి పెడతామని భయం. అందుకే ఆడపిల్లగల తల్లి దండ్రులు మనకి బాడుక్కి ఇల్లివ్వాలనుకుంటే నీకు ఫామిలీ వుందా? మహాశయా అని అడుగుతున్నారు" చంద్రకిరణ్ నడుస్తున్నవాడల్లా ఆగిపోయి అన్నాడు.

"పోనీ ఆడపిల్లలు లేని ఓనర్స్‌ని సంపాదిద్దాం."

"మనిద్దరం పెళ్ళిళ్ళు చేసుకుని ఫామిలీస్‌తోసహా ఈ పదిరోజు లలో రాగలమేమోగానీ అద్దెకు యివ్వటానికి మాత్రం అలాంటి ఓనర్స్

దొరకరు. మనకు మరీ జిహ్వాచాపల్యం ఎక్కువయినప్పుడు హోటలు కెళ్ళి పచ్చకాగితం సమర్పించుకోవాల్సిందే స్వరూప్‌గారూ! అంతకంటే మార్గంలేదు పగండి"

"మీరు అలా స్వరూప్‌గారూ అనడం మానేయండి ప్లీజ్. మనిద్దరం ఒకే రూములో మెలగబోతున్నాం. ఆ బహువచనం వదిలేయండి"

ఈసారి పెద్దగా నవ్వాడు చంద్రకిరణ్.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"నవ్వక ఏం చెయమంటారు? నన్ను బహువచనంమానివేయమని నన్ను మీరు అనడం బాగుందా?" మరలా నవ్వాడు.

మనసారా నవ్వుకుంటూ "సారీ! నేను నువ్వు అనే పిలుస్తాను సరేనా!"

"ఒకే, ఒకే" అంటూ స్కూటర్ స్టార్టు చేసాడు చంద్ర

"మామ్మగారూ! మీ కింకో పేయింగ్ గెస్ట్‌ని తీసుకొచ్చానండీ, మన నెల్లూరు బియ్యం స్పెషాలిటీ తెల్సి ఎప్పుడెప్పుడు మీచేతి వంట తిందామా అని వుందట. ఇంకాస్త బియ్యం ఎక్కువ వేసుకోండి" లగేజ్ రూమ్‌లో పెట్టడానికి తీసుకెళుతూ ఇంటావిడతో అన్నాడు చంద్ర

"అలాగే చంద్రయ్యా! ఆ అబ్బాయి తినే పిడికెడు మెతుకులకు మరలా అన్నం వండాలా? ఇప్పుడొచ్చినా వడ్డించేయను కమ్మగా" ముసిముసిగా నవ్వుతూ అందా ముసలావిడ.

'కమ్మగా నువ్వెందుకు పెట్టవు తల్లీ! నీ భోజనం కమ్మగా తిని నేనిలా బక్కచిక్కిపోయాను' మనసులో అనుకుని ముందుకు నడిచాడు చంద్రకిరణ్. అతనివెంటే నడిచాడు స్వరూప్.

"రూమ్ నచ్చిందా?" కూర్చొంటుని స్వరూప్‌కి చెపుతూ అడిగాడు.

నచ్చిందన్నట్టు తలూపి—

"అలా బయట దోసెలు పోస్తుంటే ఎలా కొనుక్కొని తినగలరు?" రోడ్డులో అప్పుడే వెళ్ళిన లారీ ఎగజిమ్మిన దుమ్మును చూస్తూ అన్నాడు స్వరూప్

"దారినపోయ్యే వెహికల్ దుమ్ము ఆ దోసెల పిండిలో ఆవిడ చేతితో కలపలేదుగా. మన మామ్మగారయితే మనం తినే అన్నంలో బియ్యానికి సరిసమానంగా తెల్లరాళ్ళు కలుపుతుంది.

ఎవరయినా పాలల్లో నీళ్ళు కలుపుతారు. కానీ ఈవిడ నీళ్ళలో పాలు కలుపుతుంది. పద పద లోపలకెళ్ళి ముఖం కడుక్కుందువు" చంద్రకిరణ్ స్వరూప్‌ని లోపలికి తీసుకెళ్ళాడే కానీ బాత్‌రూమ్‌లో బకెట్లు ఖాళీగా వున్నాయి.

"మునెమ్మ ఈరోజు నీళ్ళు పెట్టినట్టులేదు, క్రింద వున్నట్టుంది పిలుస్తానుండు" అంటూ క్రిందకు దిగబోతున్న చంద్రకిరణ్‌కు మునెమ్మ ఎదురొచ్చింది.

"ఏమయింది మునెమ్మా ఆ దెబ్బలేంటి ఎక్కడ పడ్డావు?" మునెమ్మ నీళ్ళు తీసుకురాలేదనే కోపం మర్చిపోయి ఆదుర్దాగా అడిగాడు చంద్రకిరణ్.

"మా ఇంటోడు కమ్చీ తీసుకుని ఇరగగొట్టాడు బాబూ!"

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రకిరణ్.

"ఎదురింటి గుడిసెలో పోలమ్మ మొగుడు బాగా తాగి యింట్లో వున్న వస్తువులన్నీ పారేస్తుంటే అది కూలికెళ్ళొచ్చి లబోదిబో మంటుంటే అది అడి కర్ణంబోయి చెయ్యిచ్చురుని బయటకు లాగాను. అంతే అందరూ ఆడికి నాకూ రంకుందని వాగేసారు. అది యిని మా ఇంటాయన నన్ను సితకొట్టేసాడు" సాధారణంగా చెప్పేసింది.

"ఏం మీ అయనకు యిన్ని సంవత్సరాల మీ కాపురంలో నువ్వె లాటి దానివో తెలియదా?"

"తెలియకేం బాబూ బాగా తెలుసు. ఆడికిది అవమానమట. తన పెళ్ళాన్ని ఎవరేమయినా అంటే ఆడికి బాధట కొట్టేసి మరలా సెపుతున్నాడు. మునెమ్మా! నీకు అంత మంచితనం వద్దేవాళ్ళలా కాదు, మాతలు కూస్తుంటే నేనసలు తట్టుకోలేకపోయానే అని."

"మరి వాడు కష్టపడి పనిచేసి నిన్ను పోషించొచ్చుగా. ఇలా ఒకరిదగ్గరకు పనికి పంపడమెందుకు? అనుమానించి నిన్ను కొట్టడ మెందుకు?" అడిగాడు చంద్రకిరణ్.

"లేదు బాబూ, ఆడికి నామీద అనుమానంలేదు. ఎర్రి ఇరు రకాలన్నట్లు ఈడిదీ ఎర్రి ఏం చేయను" బకెట్ తీసుకుని నీళ్ళు తెస్తా నంటూ క్రింద కెళ్ళిపోయింది మునెమ్మ.

"అదేమిటీ, బార్య మంచితనం తెలిసీ కొట్టడమేమిటి?" అసహనంగా అడిగాడు స్వరూప్.

"అది అంతేలే స్వరూప్. పాపం మునెమ్మకు పాపభీతి తనం ఎక్కువ. తోటి ఆడవాళ్ళకు అన్యాయం జరుగుతుంటే భరించలేదు. ఆ మంచితనాన్ని అలుసుగా తీసుకుని ప్రక్కన మనుష్యులు మునెమ్మ మంచిది కాదని పుకార్లు పుట్టించేస్తారు. దాంతో మునెమ్మ భర్తకు చిర్రెత్తుకొచ్చి చావ బాదుతాడు. అరిటాకు ముల్లు సామెతలాగ అరిటాకు ముల్లుమీద పడినా, ముల్లు అరిటాకుమీద పడినా ఆకేగా చిరిగిపోయేది. ఆడపిల్ల జీవితంకూడా అంతే. పెద్దవాళ్ళు సామెతలకి ఎన్ని అర్థాలుంటాయో?"

"మున్నెమ్మ అలా తన్నించుకుని అభిమానం లేకుండా అతనితో ఎలా కాపురం చేస్తుందో. అతనిమీద ఎంత ప్రేమున్నా అతనలాకొడితే ఎలా భరిస్తుంది?" తనలోతను అనుకున్నట్లు మెల్లగా అన్నాడు స్వరూప్.

"అదే వివాహబంధంలో వుండే చిత్రం. భార్య ఎలా వున్నా సర్దుకుపోయి కాపురం చేస్తాం. ఆమెలో లోపం ప్రేమ మరుగున మాయమయి పోతుంది. ఇక భర్త విషయం చెప్పక్కర్లేదు. మన భారతనారీమణులకు సహనం ఎక్కువే అని నిరూపించుకున్నారు. అందులో మునెమ్మ కూడా ఒకతి."

స్వరూప్ ఆలోచనలో పడిపోయాడు.

అతనికి ఆలోచించే టైమ్ ఇవ్వకుండా మునెమ్మ నీళ్ళు తెచ్చి ముఖం కడుక్కోండంటూ తొందర చేసింది. ఆమె ఎలా సర్దుకుపోగలుగుతుందో జవాబు దొరకని ప్రశ్నగా నిల్చిపోయింది స్వరూప్‌కి.

ఆరు నెలలు గిర్రున తిరిగి పోయాయి. స్వరూప్ చంద్రకిరణ్‌ల స్నేహం పటిష్టమయింది. ఏకవచనంలోనుండి స్వతంత్రంగా ఒరే అనే స్టేజిలోకి వచ్చారు. చంద్రకిరణ్ మనస్తత్వం పెద్ద విషయాన్ని కూడా స్వల్పంగా ఆలోచిస్తాడు. స్వరూప్ అలా కాదు చిన్న విషయానికి కూడా చలిస్తాడు. దాన్ని గురించి డీప్‌గా ఆలోచిస్తాడు. చంద్రకిరణ్ పిల్లలు వస్తుంటే చెప్పటం ఆపేస్తాడు. బుద్ధిగా వుంటే చెప్తాడు.

స్వరూప్ క్లాస్‌లో చాలా స్ట్రిక్ట్‌గా వుంటాడని పేరు తెచ్చుకున్నాడు. పిల్లలకు ఎంతో నమ్రతగా టీచ్ చేస్తాడు. తన్ని గవర్నమెంటువాళ్ళు ఒక లెక్చరర్‌గా అపాయింట్ చేసి జీతం యిచ్చేది స్టూడెంట్స్‌కి శ్రద్ధగా చెప్పడానికే అనే ఉద్దేశ్యం అతనిలో బలంగా నాటుకు పోయింది.

ఆ రోజు క్లాస్‌లో అడుగు పెట్టగానే పిల్లల్ని ఉద్దేశించి అన్నాడు స్వరూప్-

"రేపు టెస్టు పెడతాను. ప్రతిఒక్కరు మంచి మార్క్స్ తెచ్చుకోవాలి."

"రేపు కాదు సర్ నెక్స్ట్ మన్‌డే పెట్టండి" అందరూ ఏకకంఠంగా అరిచారు.

"అలాగే మీ ఇష్టం. కానీ అందరూ సమ్స్ బాగా చేయాలి" అంటూ బోర్డుమీద సమ్ వేసి క్లాస్ స్టార్ట్ చేసాడు.

టెస్ట్ పెట్టేరోజు రానే వచ్చింది. నీరజ తప్ప అందరూ క్లాస్ టెస్ట్‌కు అటెండ్ అయ్యారు.

మరుసటిరోజు అందంగా తయారయి వచ్చిన నీరజను నిలేసాడు స్వరూప్.

"నిన్న క్లాస్ టెస్ట్‌కి రాలేదేం?"

"సివియర్ హెడ్‌ఎక్ సార్" నిర్లక్ష్యంగా జవాబిచ్చిందామ్మాయి.

"హెడ్‌ఎక్ తగ్గిందా ఇప్పుడు?"

తగ్గిందన్నట్లు తలూపింది.

"అయితే ఈ బోర్డ్ మీద నేను వేసే సమ్స్‌కి ఆన్సర్స్ వ్రాసి తీసుకురా."

బోర్డుమీద సమ్స్ వేయడం పూర్తి చేసాడు స్వరూప్.

"నేను ప్రిపేర్ కాలేదు" జంకు లేకుండా అంది నీరజ. "నిన్న ఒక్కరోజేకదా. తలనొప్పి లాస్ట్ మన్‌డే నుండి సన్‌డే వరకూ ప్రిపేర్ కాలేదా?" ఆ అమ్మాయి నిర్లక్ష్యం స్వరూప్‌లో విసుగును కలిగించింది.

జవాబివ్వలేదు నీరజ.

"పోనీ ముందు పోర్షన్‌లో యిస్తాను చేస్తావా?"

"నాకు మాథ్స్ అంటే ఇంటరెస్ట్ లేదు" ఆ అమ్మాయి కంఠంలో పొగరు.

"ఇంటరెస్టు లేనప్పుడు ఎం పి సి గ్రూప్ తీసుకోవడమెందుకు? మాకు మూడు సంవత్సరాల గ్రూప్ కోర్స్ పైనల్ ఇంటర్‌లో పెట్టొద్దు. ఏ సంవత్సరాని కాసంవత్సరం ఎగ్జామ్స్ కండెక్ట్ చేయమని మీరేగా కోరారు. మీ కోరిక ప్రకారం ఇంక మూడు నెలల్లో యాన్యువల్ ఎగ్జామ్స్ పెడుతున్నారు. ఇప్పటికీ ప్రిపేర్ అవకుంటే పాస్ ఎలా అవు తావు? అంత శ్రద్ధ తీసుకుని మీ పేరెంట్స్ కాలేజీలో చేర్పిస్తే చదవ

కుంటే ఎలా? డిగ్రీ కోర్సులో జాయిన్ అయికూడా ఇంకా బాధ్యత లేకుండా వుండొచ్చా?" కోపాన్ని అణుచుకుని అడిగాడు.

"సారీ నాకీ చాప్టర్ అర్థం కాలేదు" ఒకమ్మాయి లేచి నిల్చుని అడిగింది.

"వెరీగుడ్ అలా వుండాలి. మీలో ఎవ్వరికయినా ఏ సమ్ అర్థం కా పోయినా త్రీ మంత్స్ యీవినింగ్ ఫైవ్ టు సిక్స్ క్లాస్ తీసుకుంటాను. మీరొచ్చి మీ డౌట్స్ క్లియర్ చేసుకోవచ్చు" అనేసి నీరజవైపు తిరిగి–

"నెక్స్ట్‌పీరియడ్ నీ కొక్కదానికే ఎగ్జామ్ పెడతాను. అప్పటికయినా ప్రిపేర్ అవు" అని చెప్పి పాఠాలు చెప్పడంలో మునిగి పోయాడు స్వరూప్. ఆ విషయం అతను మర్చిపోయాడు. కానీ ఒక రోజు ప్రిన్సిపాల్ దగ్గర నుండి స్వరూప్‌కి రమ్మని పిలుపు వచ్చింది.

ప్రిన్సిపాల్ అంత కోపంగా ఎందుకున్నారో అర్థం కాలేదు స్వరూప్‌కి.

"ఏమయ్యా! ఇప్పుడిప్పుడే వృత్తిలోకి వస్తున్న వాడివి ఇవేం బుద్ధులు. ఒక లెక్చరర్‌గా ఒక స్టూడెంట్‌కి పాఠాలు చెప్పాలేగానీ ప్రేమ పాఠాలు వల్లించకూడదని. తెలీదా మీకు"

ప్రిన్సిపాల్ మాటలకి తెల్లబోయాడు స్వరూప్.

"మీరనేదేమిటో నాకేమీ అర్థం కావడంలేదుసర్."

"ప్రైవేట్‌క్లాస్ తీసుకుంటానని చెప్పి నీరజని సాయంత్రంరమ్మని ఆ మినిష్టర్ కూతురు నీరజని బలవంతంగా దగ్గరకు తీసుకుని ప్రేమ కబుర్లు చెప్పావట. ఆ మినిష్టర్ ఫోన్ చేసాడు. ఆ లెక్చరర్‌ని పిలవండి అతన్ని భూమ్మీద వుండనివ్వనని అరిచాడు. నేనే ఫోన్‌లో సర్దిచెప్పాల్సి వచ్చింది."

దిమ్మెరపోయిన స్వరూప్ కాస్సేపటికి తేరుకుని-

"లేదుసర్. నేనసలు ఆ అమ్మాయికి ప్రైవేట్‌క్లాస్ తీసుకోనే లేదు. క్లాస్‌లో స్టూడెంట్స్ అందరితో మీకు డౌట్స్ వుంటే సాయంత్రం

మీ కోసం ఒక అవర్ వుంటాను. వచ్చి డౌట్స్ క్లియర్ చేసుకోమని చెప్పానంతే. నా మాటమీద మీకు నమ్మకం కలగకపోతే నేనిక్కడే వుంటాను. మీరు ఆ క్లాస్ పిల్లలనడగండి."

అతని మాటల్లో నిజాయితీ కన్పించి కూల్ డౌన్ అయ్యాడు ప్రిన్సిపాల్.

"మరి అంత నీచంగా నీరజ వాళ్ళతండ్రికలా ఎందుకు చెప్పిందంటావ్?"

"నాకు తెలియదు సర్" అని క్లాస్‌లో నీరజతో జరిగిన సంభాషణ వివరించి చెప్పాడు స్వరూప్.

పదవులున్నాయని జులుం చేయాలంటారు. వాళ్ళమ్మాయిలో తప్పు పైకి కన్పించదేమో. ఒకే యుకెన్‌గో" అంటూ ప్రిన్సిపాల్ ఆలోచనలో పడి వెంటనే తేరుకుని-

"సారీ మిష్టర్ స్వరూప్" అన్నాడు.

"ఇట్స్ ఆల్ రైట్ సర్" అంటూ బయట పడిన స్వరూప్ మనసులో అలజడి.

ఆ వార్త గాలిలో తేలి కాలేజీ స్టాఫ్ రూమ్‌లో పర్చుకుంది. అది నిజమో అబద్ధమో తెలియకుండా ఒక్కొక్కరు ఒక్కోరకంగా వ్యాఖ్యానించడం మొదలు పెట్టారు.

"వెరీగుడ్ గురూ! మగాడివనిపించుకున్నావ్" లెక్చరర్ నోటి వెంట ఓ చెణుకు.

"ఆఁ అలా అనకు. ఆడగాలిసోకి ఆమె స్పర్శ తగిలితే ఇంకొకరయితే తర్వాత పరిణామాలెలావున్నా ముందా ఆవేశంలో ఆ అమ్మాయి అందాల్ని సొంతం చేసుకునేవాడు."

"ఈ మహాకాయుడు కాబట్టి భయపడి వదిలేసినట్లున్నాడు." ప్రక్కనే వున్న శేఖర్ ముఖంమీదే అనేసాడు నిర్లజ్జగా.

"సర్లెండి. ఇప్పుడలా అంటున్నారుగానీ మీరే స్వరూప్‌గారి

ప్లేస్‌లో వుంటే ఆ అమ్మాయి కిష్టంలేకుండా అదీ కాలేజి కాంపస్‌లో మీరూ ఏం చేయలేరు."

స్వరూప్ వాళ్ళ మాటలు వినడానికే ఇష్టపడనట్లు కూర్చున్నాడు. అక్కడనుండి వెంటనే లేచి వెళితే తననింకా అపార్థం చేసుకుంటారని తప్పనిసరి పరిస్థితిలో కూర్చుని తనను తానే అసహ్యించుకుంటున్నాడు ఇలాంటి సంఘటన ఎదురయినందుకు.

స్వరూప్ ముఖంలో భావాలను గమనించి అన్నాడు మరలా శేఖర్.

"ఆ అమ్మాయి ఇష్టపడాలని రూలేముంది? ఆ అమ్మాయి ఐసాయకంగా వుండొచ్చు, వుండకపోవచ్చు. ఆ అమ్మాయికిష్టం లేకపోయినా, అమ్మాయి స్పర్శ తగిలాక యింక దాని పరిణామాలెలా వున్నా ఆ మూమెంట్‌లో నిగ్రహించుకోవడం కూడానా?"

స్వరూప్ ఇక అక్కడ నిలవలేనట్టు లేచి నిలబడ్డాడు.

"మీరెందుకలా గిల్టీగా ఫీల్ అవుతున్నారో నా కర్థం కావటం లేదు. కాలరెత్తుకుని తిరగాలి ఇలాంటప్పుడు. మనం ఎదుటి మనిషి అందాన్ని ఈ వయస్సులో కాకుంటే ఇంకే వయస్సులో ఆస్వాదిస్తాం. పెళ్ళయ్యాక ఇంత థ్రిల్ వుండదుగదా" ఇంకో లెక్చరర్ తన బాణంలా ఇంకో విసురు విసిరాడు.

క్లాసు తీసుకుని అప్పుడే స్టాఫ్ రూమ్‌లో అడుగు పెట్టిన చంద్ర కిరణ్ స్వరూప్ ముఖంలో ఫీలింగ్ గమనించి స్వరూప్‌తో బయటకు నడిచాడు.

రూమ్ కొచ్చాక కూడా మౌనంగా వున్న స్నేహితుణ్ని అడిగాడు చంద్రకిరణ్.

"ఏమైంది? ఎందుకలా వున్నావ్? ప్లీజ్ చెప్పు"

స్వరూప్ విషయమంతా చెప్పాక-

"ఓ సిల్లీ! ఇందులో నీ తప్పేమీ లేదు. అవాకులు చవాకులు వాక్కునేవాళ్ళు వాక్కుంటూనే వుంటారు. అయినా నీ కెన్నిసార్లు

చెప్పాను ఏదీ పట్టించుకోకు అని ఇప్పుడామ్మాయి టెస్ట్ వ్రాయకుంటే ఎవరికి నష్టం? నీకొక్కడు కదా! వదిలెయ్. బుద్ధిగా చదువుకునే పిల్లల మీద నీ ఇంటరెస్ట్ చూపించు."

"ఆ అమ్మాయి పసిది తెలిసీ తెలియని వయస్సులో చదువుమీద శ్రద్ధ లేకపోవచ్చుగానీ ఆ తండ్రి బుద్దేమయింది" విసురుగా అన్నాడు స్వరూప్.

"లీవిట్ వాళ్ళ వెనకనున్న ఆస్థులు వాళ్ళనలా తయారుచేస్తాయి. అయినా ప్రతి చిన్న విషయానికి ఇలా ఫీల్ అవుతావేంటి?

ఎవరి జీవితాలు వాళ్ళవి. నీ జీవితం నీది. అనుకుని గవర్నమెంటు వాళ్ళిచ్చే జీతం డబ్బులు జేబులో వేసుకోవడం నేర్చుకో. డీప్‌గా ఆలోచించడం మానేయ్. అలాంటి వ్యక్తులు వాళ్ళ చేతిలో వున్న డబ్బుతో మనబోటి వాళ్ళను ఏమైనా చేయగలరు. మన జాగ్రత్తలో మనం వుండడం మనకు మంచిది" అప్పటికి స్నేహితుణ్ని శాంతపర్చ గలిగాడేగాని ఆరునెలల తర్వాత జరిగిన సంఘటనతో స్వరూప్ రిజైన్ చేసే ఆవేశాన్ని మాత్రం ఆపలేకపోయాడు చంద్రకిరణ్.

ఆ రోజు?

"స్వరూప్‌గారూ! మీ కభ్యంతరం లేకపోతే నాకొక హెల్ప్ చేయగలరా?" వరండాలో నడుస్తున్న స్వరూప్ నడిగింది శ్రీకళ.

"తప్పకుండా? ఏమిటో అడగండి"

"మా తమ్ముడికి ఎమ్. బి. బి. ఎస్.ఎంట్రన్స్ వ్రాయాలనుందట నెల్లూరులో కోచింగ్ కోసం వచ్చాడు. నాకు ఎవ్వరూ తెలియదిక్కడ. మీ కెవరయినా తెల్సుంటే ప్రవేట్స్ ఏర్పాటు చేయగలరా. ఇలా అడుగుతున్నందుకు మీరు ఏమీ అనుకోవడంలేదు కదా."

"దానికింతగా ప్రాధేయపడాలా? మీ బ్రదర్‌ని మా రూమ్‌కి పంపండి. నేను కనుక్కుని జాయిన్ చేస్తాను."

"మా తమ్ముడికి ఈ వూరు క్రొత్త మేం రూమ్ అడ్రస్ చెప్పినా కనుక్కోలేడేమో ఎలా?"

"దాన్దేముంది లెండి. నేవచ్చి తీసుకెళతాను. ఎన్నింటికి రమ్మ టారో చెప్పండి."

"ఆరుగంటలవరకు అలౌవ్ చేస్తారు. మీరు ఆరుగంటలకు వస్తే గేటు దగ్గరే మీ కోసం ఎదురు చూస్తుంటాను. చాలా థాంక్సండీ తప్పని సరై మీ హెల్ప్ తీసుకోవాల్సి వచ్చింది. అన్యథా భావించకండి" అనేసి వెళ్ళిపోయింది

"ఏమిటీ! ఆవిడగారు మిమ్మల్ని వల్లో వేసుకోవాలని చూస్తున్న ట్లుందే. నయాగారాలు పడుతోంది. హాస్టల్ కొచ్చి మిమ్మల్ని ఆవిణ్ని మీ రూమ్‌కి తీసుకెళ్ళమంటోందా? ఛీ ఛీ"

"మీరు శ్రీకళగార్ని అపార్థం చేసుకుంటున్నారు శేఖర్‌గారూ!"

"దాచి పెట్టాలని ప్రయత్నం చేయకండి. ఆవిడగార్కి యిది క్రొత్తేమీకాదు. కొత్తగా జాయిన్ అయిందికదా అని ఫార్మాలిటీ సేక్ పలకరించాను. అంతే నేను ఆవిడను ఆకర్షించేలా ఎన్నో విధాల ప్రయ త్నము చేసింది. ఒక రోజయితే మా ఇంటికే వచ్చేసింది ఏకంగా. ఆవిడగార్ని చూసి ఆశ్చర్యపోవడం నావంతయింది. ఎలా తెల్సుకుందో ఏమో మా ఆవిడ పుట్టింటికెళ్ళినట్టు ఆ టైమ్‌కే మా ఆవిడ వచ్చింది. అప్పుడేమని సమర్ధించిందో తెల్సా? వాళ్ళ బామ్మగారు ఈవిడ్ని చూసి పోవడానికి ఈవూరొస్తున్నారట. ఆవిడగారేమో హాస్టల్‌లో వుండదట. పూజ మడి జరగాలట. అందుకని వాళ్ళ బామ్మగార్ని మా ఇంటికి తీసు కొస్తుందట. రెండురోజులపాటు వంటచేసుకునే ఏర్పాటు చేయమని ఏదేదో మా ఆవిడ్ని అడగడం-ఎదుటి మనుష్యులు చెవుల్లో పూలు పెట్టుకోనున్నారనుకుంది కాబోలు"

"శ్రీకళగార్ని అపార్థం చేసుకుంటున్నారు మీరు. ఆమె తమ్ముణ్ణి ఎం. బి. బి. యస్. తొలి ఎంట్రన్స్‌కి ట్యూషన్స్ ఏర్పాటు చేయ మన్నారు ఆమె కిక్కడ ఎవ్వరూ తెలియదట."

"అక్కడ ఆగండి స్వరూప్‌గారూ! ఆవిడకు ఎన్నో సమస్యలు పుట్టుకొస్తాయి. మనల్ని ఆకర్షించి వాటి సాకుపెట్టుకుని మనతో పరి

... పెంచుకోవాలనుకుంటుంది. ఆరోజు బామ్మగారి సాకు పెట్టుకుని ... ఇంటికి వచ్చిందా? ఈరోజు వాళ్ళ తమ్ముడి సాకు పెట్టుకుని మీ ఇంటికొస్తోంది. నేనెలాగూ మా ఆవిడ రావడంతో మిస్ అయ్యాను. మీరు మాత్రం మిస్ అవకండి. విష్ యు బెస్ట్ ఆఫ్ టైమ్" అంటూ వ్యంగ్యంగా నవ్వి సంస్కారం అనే పదానికి అర్థం తెలియనట్టు మాట్లాడి వెళ్ళాడు శేఖర్.

శేఖర్ వెళ్ళిపోయినా స్వరూప్ ఒక్క అడుగు కూడా ముందు కేయలేక పోయాడు. శ్రీకళగారంటే ఎందుకంత సంకుచితంగామాట్లాడు తున్నాడు. ఆ ప్రశ్నకు రెండు రోజుల తర్వాత ఆ సాయంత్రం వచ్చిన చంద్రకిరణ్ దగ్గర జవాబు దొరికింది.

"కామెర్లవాడికి వూరంతా పచ్చగా వుంటుందంటారే అలాగే ... అలాగే అందరూ వుంటారనుకుని వాగుతాడు ఆ వాగుడు కూడా ... హండ్రెడ్ పర్సెంట్ కరెక్ట్ అనుకుంటాడు ఆవిడను ... అల్లరి పెట్టింది సరిపోలేదుకాబోలు" ఛీత్కారంగా అన్నాడు చంద్ర కిరణ్.

"ఏమైంది?" స్వరూప్ వివరంగా అర్థమయ్యేలా అతని మన స్తత్వం తెల్సుకోవాలని అడిగాడు.

"శ్రీకళగార్కి బామ్మగారు తప్ప పెద్దవాళ్ళెవ్వరూ లేరు. తన కంటే చిన్నవాడైన తమ్ముడికి, బామ్మకి ఈమెసంపాదనే ఆధారం

ఒకరోజు- వాళ్ళ బామ్మ పెద్దావిడ కదా!

ఛాందసురాలులాగుంది.

హాస్టల్లో వుండను. అక్కడ నీకు తెలిసిన వారింట్లో మడి, పూజ జరిగేట్లు చూస్తే వచ్చి రెండు రోజులుంటానని జాబు వ్రాసిందట. విధి లేక శేఖర్ భార్య సహాయం అడుగుదామని వెళితే అబ్బో ఇతను ఎన్ని విధాలుగా ఆ అమ్మాయిని అల్లరిపెట్టాడో!"

"అతని సహాయమే ఎందుకు? వాళ్ళ కొలెక్చరర్స్ వున్నా రుగా?"

"ఉండడానికేమో బయట ఇద్దరున్నారు వాళ్ళకి బామ్మగారి మడి ఆచారాలు గిట్టవు

ఏదో సాకు చెప్పి తప్పించుకున్నారు. ఇక వర్ధనమ్మగారు, హేమలతగారు మొహంమీదే చెప్పేసారు–మా ఇల్లు చిన్నది పిలవదని. మిగతావాళ్ళంతా హాస్టల్‌లోనే వున్నారు.

గుర్నాధంగార్ని అడిగితే "ఏమీ అనుకోకమ్మా, మా ఆవిడ గదిలోకి ఎవర్నీ అడుగు పెట్టనీదు" అన్నాడట."

"అన్యాయం, ఒక ఆడపిల్లమీద అపనిందవేయడం చాలా తప్పు" బాధగా అన్నాడు స్వరూప్.

"ఒక ఆడపిల్లేంటి! లాస్ట్ ఇయర్ జయంతి అని సివిక్స్ లెక్చరర్ వుండేది. ఆమెకు కడుపునొప్పి విపరీతంగా వస్తే కాలేజీ దగ్గర ఏ వెహికల్ లేదట.

పాపం ఆవిడ నొప్పి భరించలేక శేఖర్ వెళుతుంటే హాస్పిటల్ వరకూ లిఫ్ట్ అడిగిందట. ఆమె చేసిన పొరపాటు అదే.

హాస్పిటల్‌కెళ్ళాక వెంటనే జాయిన్ అయితే ఆపరేషన్ చేయాలన్నారట. అది ఇరవై నాలుగు గంటల్లో అపెండిసెక్టమి ఆపరేషన్ జరిగి తీరాలి. ఆమెకేమీ తోచక వాళ్ళింటి అడ్రస్ యిచ్చి టెలిగ్రాం ఇవ్వమన్నదట."

"అందులో ఆమె పొరపాటేముంది?" అర్ధంగాక అడిగాడు స్వరూప్

"పొరపాటంతా యిలాటి వ్యక్తిత్వంగల మనిషి సహాయం ఆమె తీసుకోవడమే. ప్రతి ఒక్కరితో జయంతి సరదాగా తన స్కూటర్‌లో ఎక్కినట్టు, ఆమె స్పర్శ తనకు గిలిగింతలు పెట్టినట్టు తనకు ఆమె ఎంతో మధురానుభూతినందించినట్లు ఆఖరకు వాళ్ళ అడ్రసుకూడా తనకు తెలుసంటూ జయంతి అవసరానికిచ్చిన అడ్రస్‌ని అలా ఉపయోగించుకున్నాడు.

కనీసం ఆ టైమ్‌లో జయంతిని హాస్పిటల్ కెళ్ళిచ పడకోపెట్టా రనే ఇంగిత జ్ఞానంకూడా లేకుండా వాగాడు. ఆ విషయం జయంతికి తెలిసి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయింది."

"మనకి అక్కచెల్లెళ్ళు వున్నారు కదా! వాళ్ళని ఎవరయినా ఇలా రచ్చకీడిస్తే మనం బాధపడమా?

ఆ ఒక్కటి ఆలోచిస్తే అతనిలా వాగ్గలడా?" శ్రీకళని అతనన్న మాటలు గుర్తువచ్చి బాధపడ్డాడు స్వరూప్.

"వదిలెయ్‌రా అలాటివాళ్ళ గురించి చర్చించుకోవడం కుక్క తోక వంకర తియ్యాలని ప్రయత్నం చేసినట్టే అవుతుంది. పద పద, మన హూమ్మగారు మనకోసం ఏం స్పెషల్ చేసారో చూద్దాం" ఇద్దరూ భోజనానికి లేచారు.

మరుసటిరోజు కాలేజీకి సెలవు అవటంతో శ్రీకళ తమ్ముడికి ప్రైవేట్స్ ఏర్పాటు చేయడం సులభమయింది. సోమవారం కాలేజీకి వెళ్ళేసరికి గోడలనిండా స్వరూప్-శ్రీకళల శృంగారస్టేజి నంబర్ ఒన్ శ్రీకళే స్వరూప్‌ని రూమ్ కొస్తానని అడగడం సెకండ్ స్టెప్ స్వరూప్ వచ్చి రూమ్‌కి తీసుకెళ్ళటం థర్డ్ స్టెప్ శృంగారకేళి.

అవి చదివి స్వరూప్ ఒంట్లో ఒక్క సి సి కూడా రక్తంలేని వాడిలా అయిపోయాడు. అంత సంకుచిత బుద్ధితో వ్రాసిన మనిషిని అదీ పి జి డిగ్రీ చేతికి తీసుకున్న వ్యక్తిని అతను క్షమించలేకపోతు న్నాడు. అతని మనసులో కల్లోలం అతనికి కళ్ళముందు భూకంపం వచ్చి తను ఆ భూమిలోకి వెళ్ళిపోవాలనేంత జుగుప్స- మంచి మనిషి ఒక సహాయం చేయడం పొరపాటా? అది తప్పెలా అవుతుంది? అనే వ్యధ—

ఎదురుగా శ్రీకళ ఆమె ముఖంలో ఒక్క బొట్టు నెత్తురుకూడా లేనట్లు పాలిపోయింది.

శుష్కంగా నవ్వి అంది.

"సారీ స్వరూప్‌గారూ! నావల్ల మీరు యిలా గోడలకెక్కుతారని ఊహించలేకపోయాను. అవమానాలు భరించడం అలవాటే అయినా నేను చేయని తప్పుకు శిక్షించబడ్తున్నాను. అదే నా బాధ. మీరు నన్ను ఎక్స్‌క్యూజ్ చేయండి" అనేసి తలవంచుకుని వెళ్ళిపోయింది.

చంద్రకిరణ్ ఎంతగా సర్ది చెప్పినా స్వరూప్ సర్దుకోలేకపోయాడు.

"నేను రెండు విధాలుగా బాధపడుతున్నాను చందూ! మొదటిది శ్రీకళగారు మంచివయికూడా అనవసరంగా యిలా రచ్చకీడ్వబడటం. రెండవది నేను నా ఆనందాన్నంతా నా భార్యతోనే పంచుకోవాలని ఎంతో ఆర్తిగా ఎదురుచూస్తున్న వ్యక్తినే కాని ఎదుటి ఆడవాళ్ళను ఆకర్షించాలనే కోరిక నాలో లేదు. అలాంటి నన్ను కాలేజీలో ఇంత అల్లరి పెడితే నాకింక ఈ ఉద్యోగంమీదే విరక్తిగా వుంది. ఇలాంటి వ్యక్తుల మధ్య జీవితం వద్దనిపిస్తోంది."

"స్వరూప్! నీవు పొరపడుతున్నావు. ఇది సంఘం. ఈ సంఘములో నువ్వెక్కడికెళ్ళినా ఇలాంటివి తప్పవు. మనలో తప్పులేనప్పుడు మనమెందుకు భయపడాలి? ధైర్యంగా ప్రిన్సిపాల్‌గారికి చెప్పెయ్యి జరిగింది."

"నో....నేనిక ప్రిన్సిపాల్ దగ్గరకు ఏ పరిష్కారానికి వెళ్ళదలుచుకోలేదు. అప్పుడు నీరజతో యిప్పుడు శ్రీకళగారితో ఛీఛీ వీళ్ళు అసలు మనుష్యులేనా, వద్దుకాని ఉద్యోగం వద్దని రిజైన్‌చేసి వస్తాను" అంటూ ఆవేశంగా వెళుతున్న స్నేహితుడి చెయ్యి పట్టుకుని ఆపాడు చంద్రకిరణ్.

"ఆడపిల్ల ఆమెకున్న ధైర్యం నీకు లేకపోతే ఎలా? శ్రీకళగారు ధైర్యంగా క్లాసు తీసుకోవటానికి వెళుతున్నాడు చూడు"

"అది ఆమె ధైర్యంకాదు చందూ! ఆమె పరిస్థితులు ఆమెనంత సహనవంతురాలిగా, మనోనిబ్బరమున్న మనిషిలా తీర్చిదిద్దాయి. నేను

రిజైన్‌చేసి వెళ్ళిపోతే నాకోసం నా తల్లిదండ్రులు ఏ బిజినెస్ అయినా పెట్టించే స్థోమతు గలిగి వున్నారు.

కానీ శ్రీకళగార్కి వెనుక అర్థబలం అంగబలం రెండూ లేవు. అందుకే అవిడ తనబాధను మింగేసి క్లాసుకు వెళ్ళగలుగుతోంది" ఆఫీస్ రూమ్ నడుస్తూ అన్నాడు స్వరూప్.

"నువ్వు ఆవేశంలో ఈ నిర్ణయం తీసుకోకురా మా చిన్నాన్న కొడుకు పి.హెచ్.డి. చేసికూడా మూడు సంవత్సరాలనుండి ఉద్యోగం రాక ఇంట్లోనే వున్నాడు.

అలాంటిది నువ్వు గవర్నమెంట్ ఉద్యోగానికి రాజీనామా ఇవ్వడమేమిటి? ఇప్పుడు ఆ టాపిక్ వద్దు. నువ్వు శాంతపడ్డాక ఆలోచించుకుందాం" అంటూ బలవంతంగా లీవ్ పెట్టించి తనూ లీవ్ పెట్టి మనను బాగుంటుందని సినిమాకు తీసుకెళ్ళాడు చంద్రశేఖర్.

ఆ పిక్చర్ థీమ్‌కూడా యిలాటిదే. ఆఖరున అవమానాలు అపనిందలు భరిస్తూ నిశ్శబ్దంగా జీవితంతో రాజీపడి అలసిపోయిన హీరోయిన్ పిచ్చాసుపత్రి పాలవుతుంది.

ఆ సినిమా చూసి మరీ కదిలిపోయాడు స్వరూప్.

ఇలాటి సమయంలో తన స్నేహితుడ్ని ఆ పిక్చరుకు తీసుకు వచ్చినందుకు తనని తానే తిట్టుకున్నాడు చంద్రకిరణ్.

ఆ మరుసటి రోజు ఒక్క నిముషం కూడా అలస్యం చేయకుండా రిజైన్ చేసేసాడు. ఎందుకలాటి పని చేసావ్ అని అడిగిన ప్రతి ఒక్కరికీ ఇలాటి జీవితంతో రాజీ పడలేక ఈ మనుష్యుల మధ్య ఇమడలేక వెళ్ళిపోతున్నానని చెప్పలేకపోయాడు. తండ్రికి ఆరోగ్యం సరిగ్గా లేదని తండ్రి బిజినెస్ వ్యవహారాలన్నీ తానే ఇంక చూసుకోవాలని అబద్ధం చెప్పాడు స్వరూప్.

"ఏం ఎందుకలా అబద్ధం చెప్పాలి. శ్రీకళ గార్కి నీకు లేని అక్రమ సంబంధం అంటగట్టిన మీ సంకుచిత తత్వాన్ని భరించలేక

వెళ్ళిపోతున్నానని చెప్పొచ్చుగా" తన స్నేహితుడు అనవసరంగా రిజైన్ చేసి తనని వదిలి వెళ్ళిపోతున్నందుకు అసహనంగా వున్న చంద్రకిరణ్ చిరాగ్గా అన్నాడు.

"ఏమిటో ఇలా ఒక దాని మీదొకటి కలిసొస్తాయి. నేనూ రెళ్ళక పోయినా బాగుండేది అక్కడేదో పెళ్ళి కుదిరిపోయినట్లే పెళ్ళి చూపులకు పరిగెట్టాను" విచారంగా అన్నాడు చంద్రకిరణ్.

తన స్నేహితుడి విచారాన్ని ఒక నెలరోజుల్లో తుడిచేసాడు. స్వరూప్ నెల్లూరులోనే ఐరన్ రాడ్స్ బిజినెస్ స్టార్ట్ చేసాడు సంవత్సరం రోజులు ఒకే రూమ్‌లో గడిపారు.

"నాన్న ఫోన్ చేసారురా?" అప్పుడే కాలేజీ నుండి వచ్చిన స్నేహితుడితో అన్నాడు స్వరూప్

"ఏదయినా విశేషమా?" ఏదో మ్యాచ్ వుంది రమ్మనడం చంద్రకిరణ్ తల్లిదండ్రులకు రివాజయిపోయింది. అలాటిదేమైనా వుందేమోనని అడిగాడు.

"ఎలా కనిపెట్టేసావ్?" వింతగా చూసాడు స్నేహితుడి వైపు స్వరూప్.

"సిటీది మొదటి సారే అనుకో నాయనా దుగా అందుకే తమరి ముఖం చూసి కనిపెట్టేసా అమ్మాయిది ఏ వూరట?"

"ఈ వూరేనట అడ్రస్ చెప్పాడు. మనం ఎల్లుండి వాళ్ళింటికి వెళ్ళాలి."

"అమ్మాయి పేరేమిటి? ఏం చదివింది? ఆ కబుర్లేమిటిరా త్వరగా చెప్పు."

"ఊహుఁ అవన్నీ తెలియదు. ఇద్దరం తీరగ్గా ఎల్లుండి తెల్సుకుందాం"

"చందూ! రెడీగా"

"నేనెందుకు రేరా నువ్వు వెళ్ళి చూసి వచ్చెయ్యి" పడుకుని నవల చదువుకుంటూ జవాబిచ్చాడు చంద్రకిరణ్.

ఆ స్నేహితుల మధ్య ఈ సంభాషణ జరగడం ఇది రెండవసారి ఇక అడ్డం చెపితే స్వరూప్ బాధపడతాడేమోనని సరే అన్నాడు చంద్ర కిరణ్.

పెర్ఫ్యూమ్ స్ప్రే చేసుకుంటున్న స్నేహితుడి మీద జోక్ వేసాడు స్వరూప్.

"పెళ్ళి కొడుకువి నువ్వా? నేనా?"

"ప్రస్తుతం నువ్వే పెళ్ళికొడుకువి ఒప్పుకుంటాను. అక్కడ ఇంకెవరయినా వుండి హఠాత్తుగా నన్ను ప్రేమించేస్తే నాకు మాత్రం నిద్ర సత్రం భోజనం తప్పిపోయి నేనూ పెళ్ళి కొడుకునయిపోతాగా" సరదాగా అన్నాడు చంద్రకిరణ్.

"అలా అయితే నేనింకో గంటయినా వెయిట్ చేస్తాను రెడీమేడ్ షాపు కెళదాం పద నువ్వూ ఓ క్రొత్త డ్రస్ కొనుక్కుని వేసుకో."

"అంటే నా ముఖం కంటే నా డ్రస్సే బాగుండాలంటావా? ఎంత అన్యాయంరా నా క్రొత్త డ్రస్‌ని చూసేసి ప్రేమించేస్తే నేనేమయి పోతాను."

"ఏమీ అయిపోవు ఎదుటమ్మాయి ఐస్ అయిపోతుంది"

"ఆ తర్వాత నేను ఫ్రీజ్ అయిపోతాను ఆవిడగార్కి ప్రతిరోజూ కొత్త చీరలు కొనిపెట్టలేక" అనేసి—

"అవునూ! ఏమిటీ, నా మీద బాణాలు విసురుతున్నావు నేను నీ మీద వదిలే టైమ్ ఇది" చంద్రకిరణ్ షూస్ వేసుకుంటున్న వాడల్లా స్వరూప్ వైపుకి తిరిగి అన్నాడు.

"దానిదేముంది నీ కోరిక ప్రకారం నీకూ అక్కడొకమ్మాయి నచ్చుతుందేమో! అప్పుడు నువ్వూ పెళ్ళి కొడుకువవుతావు. ఈ జోక్స్ వ్యర్థం కావు" రూమ్‌కి తాళం వేస్తూ అన్నాడు స్నేహితుడితో స్వరూప్.

"అంటే నీదేమో అరేంజ్డ్ మ్యేరేజ్ నాదేమో లవ్ మ్యేరేజ్‌నా? నేసంత ఫాస్ట్ అయ్యుంటే నీ కంటే ముందు పెళ్ళికొడుకునై ఈ పాటికి ఇద్దరు బిడ్డల తండ్రినయిపోయుందును" స్కూటర్ స్టార్ట్ చేస్తున్న స్నేహితుడితో అన్నాడు చంద్రకిరణ్.

"ఏమిటీ! పిల్లలకోసం అంత తొందర పెళ్ళవగానే ఆ జంజాట కంలో పడ్డావంటే మీ దంపతులిద్దరికి కబుర్లు చెప్పుకోను కూడా టైమ్ వుండదు నీ ఇష్టం."

"అలూలేదు చూలూలేదు కొడుకు పేరు సోమలింగం అని ఇప్పుడీ కబుర్లెందుకు? ముందు నీకీమ్యారేజ్ సెటిల్ అయితే బావుణ్ను" స్నేహితుడి వెనుక కూర్చుని గాలిలో మాటలు కల్సిపోకుండా పెద్దగా అన్నాడు.

చంద్రకిరణ్ మాటలకు నవ్వాడు స్వరూప్.

అతని మనస్సు గాలిలో తేలిపోయింది. అతని మనస్సునిండా ఆలోచనల ముసుర్లు.

తండ్రి తనను వెళ్ళి అమ్మాయిని చూసిరమ్మని ఫోన్ చేసేరే కానీ వివరాలేమీ చెప్పలేదు కనీసం అమ్మాయి బాగుంటుందా? అనే ప్రశ్నకు కూడా నువెళుతున్నావుగా నువ్వే చూసి నాకు చెప్పు అన్నారు. కానీ వాళ్ళింటి కెళితే మీరెవరు అంటే ఎంత అవమానం! దాడికి ఫోన్ లైన్ అందిందో లేదో వాళ్ళకి ఫోన్ చేసి తానొస్తున్నట్లు చెప్ప డానికి.

"స్వరూప్! ఎక్కడకి అలా వెళ్ళిపోతూనే వున్నావు? అంకుల్ చెప్పిన అడ్రస్ ప్రకారమయితే మనం లెఫ్ట్ తిరగాలి."

స్నేహితుడు చెప్పినట్లు స్కూటర్‌ని పోనిచ్చాడు స్వరూప్ ఆలోచనల నుండి తేరుకుని....

ఇద్దరూ వాళ్ళ ఇంటి నంబర్ సులభంగానే కనుక్కోగలిగారు.

"శ్రీనివాసులరెడ్డిగారిల్లు ఇదేనా?" అని అడుగుతున్న చంద్ర కిరణ్‌ని.

"అవును బాబూ నేనే శ్రీనివాసులరెడ్డిని నాన్నగారు ఫోన్ చేసారు ఈరోజు వస్తారని."

కొద్దిగా సిగ్గుపడ్డాడు చంద్రకిరణ్.

"నా ఫ్రెండ్ చంద్రకిరణ్. డి.కె. డబ్ల్యు కాలేజీలో హిస్టరీ లెక్చరర్‌గా పని చేస్తున్నాడు.

అప్పటి కాయనకు పెళ్ళి కొడుకెవరో అర్థమయింది.

"రండి బాబూ లోపలికి రండి" అని సాదరంగా ఆహ్వానించాడు.

వాళ్ళింట్లో వీళ్ళూహించినట్టు జోక్స్ వేసుకునేంత హడావుడేమీ లేదు.

"ఈయన మా బావమరిది డాక్టర్ రాజగోపాలరెడ్డి" అని పరిచయం చేసాడు ప్రక్కనున్నతనిని చూపించి.

"మీరు ప్రయివేట్ ప్రాక్టీస్ చేస్తున్నారా?" ఏదో ఒకటి మాట్లాడాలి కదా అని మొదలెట్టాడు చంద్రకిరణ్.

"నేను మనుష్యుల డాక్టర్ని కాదు చెట్లకు డాక్టర్ని" అని నవ్వారాయన.

"బాటనీ సబ్జక్ట్‌లో రీసెర్చ్ చేసాడు. హైదరాబాద్‌లో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాడు" బావమరిది వివరాలు చెప్పాడు శ్రీనివాసులరెడ్డి.

టిఫిన్ల కార్యక్రమం పూర్తయ్యే వరకు స్నేహితులిద్దరికీ ఏవో కబుర్లు చెపుతూనే వున్నారు పెద్ద వాళ్ళిద్దరూ.

రాజకీయం మొదలుకుని ఉప్పు పంట అంచుల వరకు వెళ్ళారు.

స్వరూప్ మనస్సులో ఇంకా పెళ్ళికూతుర్ని చూపించరేం? అనే సందిగ్ధం. స్నేహితుడి మనోభావాల్ని పసిగట్టాడు చంద్రకిరణ్. అయినా నా స్నేహితుడికి పెళ్ళికూతుర్ని చూపించండి అని అడగా

లంటే ముహమాటపడ్డాడు. తన పెళ్ళిచూపులప్పుడు ప్రక్కన స్వరూప్ వున్నా తప్పకుండా పెద్దవాళ్ళను తీసుకెళ్ళాలనుకున్నాడు. వాళ్ళయితే ముందమ్మాయిని చూపించండి తర్వాతే టిఫిన్ తింటాం అనేవాళ్ళేమో!

"దివ్యకు ఫోన్ చేసాను బాబూ! ఏక్సిడెంట్ కేస్ ఆపరేషన్ చేయాల్సి వచ్చిందట. మధ్యలో వదిలిరాలేనుగా నాన్నా! అందులో పేషెంట్ చిన్నపిల్లవాడు. నోట్లో ఒకవైపు పళ్ళన్నీ బాగా దెబ్బ తిన్నాయి ఎంత త్వరగా రావాలన్నా వీలవడం లేదంది. పది నిము షాల్లో వచ్చేస్తానంది బాబూ ఏమీ అనుకోవద్దనికూడా చెప్పమంది" శ్రీనివాసులురెడ్డి నొచ్చుకుంటూ చెప్పాడు

"మీ అమ్మాయి డాక్టరా?" స్వరూప్ నోట్లోనుండి అతనికి తెలియ కుండానే ఆ మాట వచ్చింది.

"ఎమ్.డి.ఎస్. చేసి హైటెక్ ప్రాక్టీస్ పెట్టింది నా మేనకోడలని గొప్పలు చెప్పుకోవడం కాదు కానీ దివ్యకు ప్రొఫెషన్ మీద చాలా ఇంటరెస్ట్ వుంది. అది సైక్లోన్ కానీ, స్ట్రయిక్ పీరియడ్‌గానీ ఎలాగయినా వీలు చూసుకుని వెళుతుంది గానీ ఒక్కరోజు కూడా హాస్పిటల్‌కు వెళ్ళ కుండా వుండలేదు" పెళ్ళికూతురి మేనమామ జవాబిచ్చాడు.

"ఏమీ అనుకోకండి బాబూ! మీరు ఏ టైమ్‌లో వస్తారో తెలియక ఒక పేషెంట్‌ని డెంచెర్స్ తీసుకెళ్ళడానికి ఈరోజు రమ్మని చెప్పిందట. వాళ్ళది కడపట. అందుకని తప్పనిసరిగా వెళ్ళాల్సి వెళ్ళింది. వెంటనే వచ్చేస్తానని చెప్పింది. అక్కడ ఆ కేస్ అమ్మాయిని త్వరగా రావ డానికి వీలులేకుండా చేసింది. ఏమాత్రం వీలయినా దివ్య వచ్చేసేదే. అంతేకానీ మా అమ్మాయికి మానర్స్ తెలియని 'మాత్రం అనుకోకండి ప్లీజ్" పెళ్ళికూతురి తండ్రికి స్వరూప్ నచ్చినట్లున్నాడు. ఎక్కడ వెళ్ళి పోతామంటారో అనే భయంతో వుందతని ముఖం.

"ఇలేవారే వాళ్ళ ప్రొఫెషనే అంత. అప్పుడే డాక్టర్లకు విలువ.. మీరేమీ ఫీల్ కాకండి. మేము ఆమె వచ్చేవరకు వెయిట్ చెయ్యగలం" వెంటనే అన్నాడు చంద్రకిరణ్!

అప్పటివరకూ ఆ అమ్మాయి పేరు ఏమయ్యుంటుందా? అని ఆలోచిస్తున్న స్వరూప్ దివ్య పేరు చాలా బాగున్నా ఆనందపడలేదు. ప్రక్కన మనుష్యులే లేనట్లు అతను ఆలోచనలో పడ్డాడు.

తనెంత తప్పు చేసాడు. ఉద్యోగంచేసే అమ్మాయి తనకిష్టంలేదని తండ్రికి చెప్పుండాల్సింది?

ఇప్పుడెలా?

మొదటి మారు ఏర్పాటయిన పెళ్ళిచూపుల కార్యక్రమం ఇలా తనకు నచ్చని అంశాలతో ప్రారంభమయిందేమిటి?

తన స్నేహితుడి మౌనం వెనుక అతని మనోభావాలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు చంద్రకిరణ్.

"ఎందుకలా వున్నావు?" స్వరూప్ వైపు తిరిగి ఎవరికీ విన్పించనంత స్వరంతో అడిగాడు చంద్రకిరణ్.

"ఏమీలేదురా" మరలా ఆలోచనలో పడిపోయాడు స్వరూప్.

స్వరూప్‌కి తన మనోభావాలు బయట పెట్టడం ఇష్టంలేదు.

తనలో ఇంత సంకుచిత్వం వుందా? అని ఎవరనుకున్నా తను భరించలేడు.

ఉద్యోగం చేసే అమ్మాయిలకు ఎదురయ్యే సమస్యలు, అవమానాలు ఇప్పటికే మూడు సంఘటనలను చూసాడతను. తన భార్యకు కూడా అలాటి అవమానం ఎదురయితే తను భరించగలడా? ఊహుం ఓర్చుకోలేడు.

"మంచినీళ్ళు కావాలండీ" చంద్రకిరణ్ తన స్నేహితుడితో మాట్లాడాలనే ఉద్దేశ్యంతో దాహం కాకపోయినా మంచినీళ్ళడిగాడు. అతను లోపలికెళ్ళాక స్నేహితుడి వైపు తిరిగి-

"ఏమయిందిరా? ఇప్పటివరకు బాగానే వున్నావుగా?"

"ఏమవుతుంది? ఏమీ కాలేదు. కొద్దిగా తలనొప్పిగా వుంది. కూర్చోవాలంటే ఓపికలేదు" తడుముకోకుండా అబద్ధం చెప్పేశాడు స్వరూప్.

"టాబ్లెట్ తీసుకురానా ఎదురుగానే మెడికల్ షాప్ వుంది" లేవబోయాడు చంద్రకిరణ్.

"ఇంకోసారి వస్తామని వెళ్ళిపోదామా?"

"ఇప్పుడు మనం వెళ్ళిపోతే బాగుండదు కదా! ఇంకో అరగంట చూద్దాం"

ఎక్కువసేపు తన మనోభావాల్ని ఎదుటివాళ్ళ ముందు దాచ నవసరం లేకుండా ఆ అమ్మాయి వచ్చింది. లోపలికెళ్ళడానికి వేరే మార్గం లేదేమో వరండాలో సంకోచంగా నిలబడి పోయింది.

"రామ్మా దివ్యా! ఫర్వాలేదురా" దివ్య మేనమామ ఆమెను పిల్చాడు.

మెల్లిగా నడుచుకుంటూ వచ్చి కూర్చుంది.

స్వరూప్‌ని, చంద్రకిరణ్‌ని పరిచయం చేసాడు దివ్యకు.

"మా అక్క కూతురు దివ్య"

దివ్య నమస్కారం చేసింది.

హాస్పిటల్‌లో అలిసిపోయి వచ్చినా ఆమె ముఖంనిండా అలసట ఆక్రమించినా ఆమెలో అందం చెక్కుచెదరలేదు. స్వరూప్‌కి అలాగే ఆమెను చూడాలనిపించినా తన మనసులోని ఆలోచనలు దానికి ఆన కట్టవేసాయి.

"అయాంసారీ! మీరు వచ్చారని నాన్న చెప్పినా ఆపరేషన్ వదిలి రాలేకపోయాను" వంచుకున్న తలెత్తి చిన్నగా అంది.

"ఆ అమ్మాయి మాటలో ఎదుటివాళ్ళను బాధపెట్టానేమో అనే గిల్టీ ఫీలింగ్-

"డాక్టర్స్ ధర్మమది. ఆ మాత్రం మేము అర్థం చేసుకోలేక పోతామా! మీరేమీ ఫీల్ అవ్వద్దు" చంద్రకిరణ్ పెద్దతరహాగా అన్నాడు.

"మీరు బి.డి.యస్. ఎక్కడ చేసారు?" అందరూ మౌనంగా వుంటే బాగుండదని క్యాజువల్‌గా అడిగాడు చంద్రకిరణ్.

"హైద్రాబాద్‌లో" ఆమె మాట ప్రసన్నంగా వుంది.

"ఎం.డి.ఎస్. ఎక్కడ చేసారు?" ఈసారి చంద్రకిరణ్ అడిగాడు.

"మణి పాల్‌లో చేసాను" నవ్వకపోయినా ఆమె నవ్వుతూ జవాబిచ్చినట్లే వుంది.

"లేడీస్‌కు ఆ ప్రొఫెషన్ కష్టమని మా అన్న కూతుర్ని సీటొచ్చినా చేర్పించలేదు. కష్టం ఏమీ వుండదంటారా?"

చిన్నగా నవ్వి అంది దివ్య. "ఏ ప్రొఫెషనన్ కష్టంలేదంటారు. మన కిష్టమైంది ఎప్పుడూ కష్టమనిపించదు" చిన్నగా అంది.

చంద్రకిరణ్ మామూలుగా మాట్లాడుతున్నాడు.

కాని స్వరూప్ నోటినుండి ఒక్కమాటకూడా వెలువడలేదు. దివ్య రాకముందున్న తన భావాలకు కాళ్ళొచ్చినట్లు పారిపోయాయి. ఆమెను చూడగానే స్వరూప్‌లో చైతన్యం—నవ చైతన్యం.

పచ్చటి శరీరఛాయ ఎత్తుకి తగ్గలావుతో గాంభీర్యంగా కాకుండా ముగ్ధమోహనంగా నవ్వకపోయినా నవ్వినట్లున్న ముఖం.

మాటలో అణకువ, ముఖంలో ప్రసన్నత అలంకరణలేమీ లేకపోయినా బాపూబొమ్మలా వున్న దివ్యను చూసి 'నో' అనలేకపోయాడు. అలా అని అక్కడికక్కడే 'ఎస్' అని కూడా చెప్పలేక పోయాడు స్వరూప్.

"మేమొచ్చి చాలా సేపయింది ఇంక వెళతామండి" అంటూ దివ్యకు చెప్పి ఆ తర్వాత అక్కడున్న అందరికీ నమస్కారంపెట్టి బయటకొచ్చాడు స్వరూప్.

అతని వెనుకే అందరిదగ్గర వీడ్కోలు తీసుకుని బయటబడ్డాడు చంద్రకిరణ్.

"యు ఆర్ లక్కీ! దివ్యగారు అన్ని విధాలా బాగున్నారు. అంకుల్‌కు వెంటనే ఫోన్ చేసెయ్యి. పెళ్ళిభోజనాలు ఏర్పాటు చేసేస్తారు" ఉషారుగా అన్నాడు ఫ్రెండ్ భుజం తడుతూ చంద్రకిరణ్.

మెల్లిగా నవ్వాడేగానీ తనలో చెలరేగే భావాల్ని స్నేహితుడి ముందు పర్చలేదు. తన స్నేహితుడు తనని సంస్కారుడిగా అను కుంటాడేమో అనే భయంతో.

"ఈ కాలంలో ఆడపిల్లలే సిగ్గుపడడం లేదు. నీ వలా సిగ్గుపడ్డం నాకేం నచ్చడంలేదు" స్నేహితుడు సిగ్గుపడి జవాబివ్వలేదనుకుని జోక్ విసిరాడు చంద్రకిరణ్.

దారి పొడవునా చంద్రకిరణ్ వాళ్ళింట్లో జరిగిన మర్యాదల గురించి దివ్య ఎం.డి.యస్. చేసినా పదహారణాల వెలగంటి ఆడబడు చులా వుంటేగాని గర్వంగా లేదనీ, ఇలా .... ఇలా చెపుతూనే వున్నాడు.

రూమ్‌కి రాగానే స్నేహితుడ్ని దింపేసి నేనిప్పుడే వస్తానంటూ వెళ్ళిపోయాడు.

స్వరూప్ రూమ్‌లో కొచ్చి పడకమీద వాలిపోయాడు. అతని మనస్సు అస్థిమితంగా వుంది.

ఈ పెళ్ళి చూపులకు వెళ్ళ కుండా వుండాల్సిందనిపించింది. తనకి వెళ్ళాక దివ్యను చూసాక 'నో' అని చెప్పాలనిపించలేదు. ఆమె అందం, మర్యాద, చదువుకున్నా గర్వం లేకుండా అణుకువగా వుండడం ఇవన్నీ అతన్ని ఆకట్టుకున్నాయి. కానీ... కానీ అతని కెందుకో దివ్య ప్రాక్టీస్ చేయకుండా వుండి వుంటే అక్కడే ఒప్పేసుకుని వచ్చే వాడని పించింది.

అతని ఆలోచనలిలా వున్నాయి.

ఆ అమ్మాయి జీవితంలో ఆ ప్రొఫెషన్‌లో ఎన్ని అవమానాలు పొందాలో—అప్పుడు తను భరించగలడా?

ఊహుఁ....తను శ్రీకళ విషయంలోనే చలించిపోయి ఉద్యోగానికి రిజైన్ చేసేసాడు అలాటిది తనకు కాబోయే భార్య విషయంలో అనా లోచితంగా వుండ కూడదు. పెళ్ళంటూ చేసుకున్నాక భార్యని అపురూ

పంగా చూసుకోవాలేగానీ అనుమానాలతో వేధించకూడదు. తన ప్రొఫెషన్‌లో ఎన్నో సమస్యలు ఎదురవుతాయి. వాటిని తను ఓర్పుగా సాల్వ్ చేయలేక తను బాధపడి దివ్యను బాద పెడితే ఎలా? అతని బుర్ర వేడెక్కేలా తన కోణంలో నుండి ఆ అమ్మాయిని చేసుకున్న తర్వాత జీవితం సాఫీగా వుండే అవకాశాలుంటాయా? లేక జీవితాంతం తను అసంతృప్తి జీవితాన్ననుభవించాల్సి వస్తుందా? లేక దివ్య సాన్నిహిత్యంలో తను సుఖపడగలడా?

అతని కళ్ళలో దివ్య రూపం కదలాడింది. తను అవివేకంగా ఇంత మంచమ్మాయిని వదులుకుంటే భవిష్యత్తులో పశ్చాత్తాప పడాల్సి వస్తుందేమో అనే ఆలోచనా అతన్ని తొలిచేస్తుంది. ఆలోచనల్ని పదిలించుకుని కళ్ళు మూసుకున్నా. మూసుకున్న కళ్ళ వెనుక అందమైన దివ్య రూపం అతని మనస్సు త్రాసులో పెడితే....దివ్య వైపుకే మొగ్గుతోంది.

తను 'ఓకే' అంటే దివ్య తనకు కాబోయే భార్య అనుకుంటే ఇన్ని సమస్యలమధ్య కూడా యింత మధురంగా వుందేమిటి? నిద్రాదేవి ఒడిలో వాలబోతున్న స్వరూప్‌ని పిల్చాడు గంట తర్వాత వచ్చిన చంద్రకిరణ్.

"స్వరూప్! మా ఆంటీ నిన్నడిగినట్లు చెప్పమంది. నువ్వు చాలా అదృష్టవంతుడవని పొగిడింది."

"ఎందుకట?"

"నేనే చెప్పాను నువ్వు దివ్యగార్ని చూసొచ్చినట్లు వాళ్ళ కుటుంబము మా ఆంటీకి బాగా తెల్సంట. ఇక ఆపకుండా దివ్య గారి గురించి చెప్పింది. చాలా మంచి పిల్ల. పెద్దవాళ్ళను గౌరవిస్తుంది. మర్యాద తెల్సిన పిల్ల చదువు పూర్తయి రాగానే ప్రాక్టీస్ పెట్టింది. ఎవ్వరి నోట విన్నా డాక్టరమ్మ నమ్రతగా చూస్తుంది మంచామె అనే వాళ్ళే—బంగారంలాటి పిల్ల చేసుకునే వాడు అదృష్టవంతుడు అనుకునే దాన్ని" అంటూ దివ్యగార్ని ఆకాశాని కెత్తేసిందనుకో.

"కంగ్రాచ్యులేషన్స్‌రా మొదటి మ్యాచ్‌తోనే నీకు మ్యారేజ్ ఫిక్స్ అయిపోతున్నందుకు.... ఈ రోజు మాత్రం మామ్మగారి చేతివంట నేను తినను. నువ్వు సింహపురిలో లంచ్ యివ్వాల్సిందే" చాలా సంతోషంగా అన్నాడు చంద్రకిరణ్.

రాత్రి పడుకోబోయేవరకు తన స్నేహితుడి నోటివెంట దివ్య మంచి తనాన్ని విని స్వరూప్ మనస్సులో దివ్యను పెళ్ళి చేసుకోవాలనే నిర్ణయం వచ్చేసింది. అతను మనసులో అనుకోగానే తేలిగ్గా హాయిగా వున్నట్లని పించింది.

"దివ్యా!" సిగ్గుగా నిలబడి వున్న భార్యను పిలిచాడు.

ఆమె తలెత్తలేదు.

చదువుకుని ప్రాక్టిస్ చేస్తున్న ఆ అమ్మాయిలో ఇంత సిగ్గేమిటి? అనుకుని ఆమెను పట్టుకుని తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"దివ్యా! మనం హనీమూన్ ఎప్పుడెళదాం?"

"మీ ఇష్టం."

"చందూ మనిద్దరికోసం కాశ్మీర్‌కి టిక్కెట్లు బుక్ చేసాడు వెళ దామా....?" ఆమె చేతికి వేసుకున్న బంగారు గాజులు సవరిస్తూ అన్నాడు.

"అలాగే" ఆమె తలెత్తలేక పోతోంది

"నేను నీ కిష్టపడ్డానా దివ్యా" మొదటి రాత్రి భర్త అడిగిన ప్రశ్నకు తలెత్తిందామె

"చాలా ఇష్టపడ్డారు...." మెల్లిగా చెప్పినా స్పష్టంగా వుందామె గొంతు.

"నేను నీలాగ డాక్టర్ని కానుకదా! ఎలా ఒప్పుకున్నావ్?" భార్య అందాన్ని తనివితీరా చూస్తూ అడిగాడు.

నాకు డాక్టర్నే చేసుకోవాలనే పట్టింపు లేదు. మీ లాంటి మంచి వ్యక్తి నీడలో నేను సుఖపడగలననిపించింది.

స్వరూప్ మనస్సు సంతృప్తితో నిండిపోయింది.

"నీ ప్రాక్టీసులో నీ కలసటగా వుంటే మానెయ్ దివ్యా నేనేమి అనుకోను. మనకున్న డబ్బు చాలు.

"అలసటెందుకుంటుంది ప్రాక్టీస్ చేసేది డబ్బుకోసమే అన్పించదు నాకు. పేషెంట్ల బాధను తొలగించాననుకుంటేనే నా కెంతో తృప్తిగా వుంటుంది." అనేసి ఇంత చొరవగా ఎలా మాట్లాడగల్గుతుంది ఈ వ్యక్తితో అనుకుంది.

దివ్యతో మాట్లాడు తుంటే ఇంత పరవశం, ఇంత దగ్గర తనం ఒక్క గంటలో ఎలా వచ్చింది అని ఆశ్చర్యపోవడం స్వరూప్ వంతు అయింది.

స్వరూప్‌తో కల్సి చంద్రకిరణ్ కూడా తిరిగాడు ఇంటికోసం. బాలాజి నగర్ ఏరియాలో డబుల్ బెడ్‌రూమ్ హౌస్ దొరికింది. దివ్య అమ్మ నాన్నగారు కూతురు సంసారానికి కావల్సిన వస్తువులన్నీ తీసి ఇచ్చారు.

స్వరూప్ తల్లి దండ్రులు వచ్చి దివ్యను నాలుగు రోజులు తీసుకు రమ్మని కొడుకుని అడిగారు.

చందూ కాశ్మీర్ టిక్కెట్స్ ప్రెజెంట్ చేసాడని కాశ్మీర్ నుండి వచ్చాక వస్తామని చెప్పాడు స్వరూప్.

ఇటు స్వరూప్ తల్లిదండ్రులు దివ్య తమకు కోడలుగా దొరకడం అదృష్టంగా భావిస్తే....అటు దివ్య తల్లి దండ్రులు స్వరూప్ తమ అల్లుడిగా దొరకడం తమ అదృష్టం అని సంతోషపడ్డారు.

ఇద్దరు మనుష్యులచేత డ్రస్సింగ్ టేబుల్ మోయించుకుని వస్తున్న చంద్రకిరణ్‌ను చూసి ఆశ్చర్యపోయింది దివ్య.

"ఎందుకన్నయ్యా? ఇప్పుడిది మా కోసం కొన్నారా?' చాల మొహమాటంగా అంది దివ్య.

దివ్య పెళ్ళయిన నాటి నుండి చంద్రకిరణ్‌ని ఎంతో ఆప్యాయముగా అన్నయ్యా అని పిలుస్తోంది అందుకు చంద్రకిరణ్ సంతోషించాడు. స్వరూప్ కొచ్చే భార్య వల్ల తమ స్నేహం కొంత ఎడమవుతుందేమో అని సంశయపడ్డ చంద్రకిరణ్‌కి ఆ శంక తీరిపోయింది.

"నువ్వు మాకు కాశ్మీర్‌కు టిక్కెట్లు కొనిస్తావు కదరా. మరి ఇదేమిటి? స్నేహితుడి దగ్గరకు వస్తూ అడిగాడు.

"మాకోసం మీరింత ఖర్చుపెట్టడమేమిటన్నయ్యా!"

"నేనిచ్చిన వస్తువును డబ్బుతో ధరకట్టకమ్మా! అభిమానానికి చిహ్నం అనుకో" మొదట్లో దివ్యను దివ్యగారూ అని పిలిచేవాడు దివ్య అందుకు ఒప్పుకోలేదు. నా కన్నయ్యలెవ్వరూ లేరు. మీరు నన్ను చెల్లెలిగా భావిస్తే దివ్యా అని పిలవండి అని స్పష్టంగా చెప్పాక దివ్యా అనడం మొదలెట్టాడు.

"నువ్వు నాకు ప్రెజెంటేషన్ ఇస్తేనే నా మీద నీకు ప్రేమున్నట్లు లెక్క? అలా నేనాలోచిస్తాననుకున్నావురా ఫూల్"

"డ్రస్సింగ్ టేబిల్ అద్దంలో నీ ముఖం చూసుకున్నప్పుడల్లా ఈ స్నేహితుడు గుర్తువస్తాడనీ" నవ్వుతూ అన్నాడు.

"నిన్ను నేను మర్చిపోతేకదా గుర్తు తెచ్చుకోవడానికి" డ్రస్సింగ్ టేబిల్ మీదున్న పేపర్ తీస్తూ అన్నాడు స్వరూప్.

"అన్నయ్యా! మీరింక మీ లగేజి అంతా యిదిగో ఈ రూమ్‌లో సర్దేసుకోండి. మీరూ వెళ్ళండి. అన్నయ్య లగేజి అంతా ప్యాక్ చేసి తెచ్చెయ్యండి" భర్తవైపు తిరిగి అంది పెళ్ళయి ఎన్నో రోజులు కాకపోయినా వాళ్ళమధ్య ఆ చనువు పెరిగింది.

"భలేదానివమ్మా! ఇప్పుడు యిక్కడకు నేనెందుకు?"

"భయపడకండన్నయ్యా! మీ మామ్మగారంత రుచిగా నేను చేయలేకపోయినా పరిశుభ్రంగా మాత్రం చేసి పెడతాను "

"మామ్మగారికంటే మీరు సారీ అమ్మా! నువ్వు వంట రెట్లు బాగ చెయ్యగలవు. అందుకే వారంలో ఒకరోజు తప్పక నీ చేతివంటకై వచ్చేస్తాను"

"అదేం కుదరదు. మీరు మాట్లాడుకుంటూ వుండండి. ఇప్పుడే కాఫీ కలుపుకుని వస్తాను" అంటూ లోపలికెళ్ళింది.

"చందూ! నాకు నిన్ను వదిలి వుండాలంటే చాలా దిగులుగా వుందిరా. ప్లీజ్ నువ్విక్కడకు వచ్చేయ్. దివ్య ఆహ్వానించిందిగా అలాంటప్పుడు నువ్వు సందేహించడంలో అర్థం లేదు"

"ఏమో! నీ కిష్టంలేకపోతే" జోక్ విసిరాడు చంద్రకిరణ్.

"మాట మార్చకురా చందూ! నాకంటూ ఓ ఇల్లు వుంచుకుని నిన్నింకా ఆ మామ్మతిండి తినిపించమంటావా? ప్లీజ్‌రా నీమీద నేను పెంచుకున్న అభిమానం ఇది."

చంద్రకిరణ్ కళ్ళు చెమ్మగిల్లాయి.

"నేను నీకు దూరంగా వున్నా నా మనస్సులో ఎప్పుడూ దగ్గరగానే వుంటావు. ఇక నీ మనస్సు నాకు తెలియదా!"

"ఏం ఇక్కడుండటానికి నీకింత మొగమాటం దేనికి?"

"కొత్తగా పెళ్ళయిన జంట మీది. నేనిక్కడున్నాననుకో-మీ ఇద్దరినీ డిస్టర్బ్ చేసినట్లవుతుంది."

"నోర్మూసుకోరా మాకు నువ్వేమీ డిస్టర్బెన్స్ కాదు."

"ఇది చెప్పనీ తర్వాత నోర్మూసుకుంటాను. ఏవో కబుర్లు చెప్పుకుంటూ మీరిద్దరూ వున్నారనుకో అప్పుడే నేను వచ్చాననుకో నీకు నాతో స్పెండ్ చేయకపోతే గిల్టీగా వుంటుంది. నాదగ్గరకొచ్చి కబుర్లు చెపుతూ వున్నా మనస్సు మా చెల్లెమ్మ దగ్గరుండాలన్పిస్తుంది. దివ్య కూడా నేనుంటే నీతో ఫ్రీగా మూవ్ అవలేదు. మీరిద్దరూ నన్నెంతో అభిమానంగా ఆహ్వానిస్తున్నారు అది చాలు."

"ఇంతకూ దీని సారాంశం నువ్వుండనంటావ్? పెళ్ళయ్యేవరకు వుండు చందు!" మరలా బ్రతిమాలాడు స్నేహితుణ్ని స్వరూప్.

"అంటే నాకిప్పుడిప్పుడే పెళ్ళి కాదనుకుంటున్నావా?"

"ఎందుక్కాదూ! దివ్యతో నా పెళ్ళి అనుకోకుండా జరిగి పోలేదూ! అలాగే నీకూ యీ నెలల్లోనే ఫిక్స్ అవడం పెళ్ళవడం జరిగి పోవచ్చుగా. అప్పుడు ఈ వీధిలోనో, ప్రక్కవీధిలోనో, నీకో ఇల్లు చూసి పెట్టే బాధ్యత నా మీద వేసుకోనూ."

"ఈ నెలరోజుల్లో ఇక్కడుంటే చెల్లెమ్మ వంటలు రుచిగా వున్నాయి అంటూ తినేయడం ప్రారంభిస్తే నా వెయిట్ పెరిగి అంతకు మించి నన్ను వికారుణ్ని చేసేలా నా పొట్ట పెరిగిపోయి నా పెళ్ళికది ఆటంకమయిపోయే ప్రమాదం వుంది. అది కనిపెట్టి నన్ను వదిలెయ్యమని ప్రార్థిస్తున్నాను" హాస్యం జోడించి వాళ్ళ మనస్సులు నొప్పించకుండా వాళ్ళ మాటను తిరస్కరించాడు చంద్రకిరణ్.

* * * *

విజయవాడవరకు కారులో తీసుకెళ్ళి కొత్త దంపతులను జమ్ము ట్రైన్ ఎక్కించి–జమ్మూ నుండి కాశ్మీర్‌కు ఫ్లైయిట్ టికెట్ బుక్ చేయమని చెప్పిన స్నేహితుడు రైల్వేస్టేషన్‌కి వస్తాడని అతని దగ్గర నుండి ఫ్లయిట్ టిక్కెట్ తీసుకోమని చెప్తూ అతని ఫొటో స్వరూప్‌కి అందించాడు. ట్రైన్ కదిలేవరకు భార్యాభర్తలిద్దరికీ జాగ్రత్తలు చెపుతూనే వున్నాడు.

అతని అభిమానానికి స్వరూప్ కళ్ళు చెమ్మగిల్లితే దివ్య మనస్సు తన భర్తకంత మంచి స్నేహితుడున్నందుకు గర్వపడింది. సంతోషించింది.

"బాగా చలేస్తుందండీ"

"నేను ప్రక్కనుండగానే" చిలిపిగా అన్నాడు భార్య కళ్ళల్లోకి చూస్తూ స్వరూప్.

ఆమె బుగ్గల్లో ఎరుపుదనం-సిగ్గుతో కళ్ళు వాలిపోయాయి.

**"ఇది బస్ కాకుంటే ఎంత బావుణ్ణు దివ్యా" గుసగుస లాడాడు భార్య చెవిలో.**

"ఎందుకూ?"

"నువ్వలా అడుగుతున్నందుకు జవాబు నోటితో చెప్పాల్సి వచ్చేదికాదు."

ఈసారి దివ్యముఖం అస్తమించే సూర్యబింబంలా అయిపో యింది ముడుచుకుని కూర్చుని వున్న భార్య భుజంచుట్టూ ప్రేమగా షాల్ కప్పాడు స్వరూప్.

అతని ఆ చర్య ఆమె శరీరంలో ప్రతి అణువు స్వరూప్ నా వాడు అని పలికాయి.

బస్‌లో చైతన్యం

పదిహేనుమంది స్టూడెంట్స్ చేతిలో వాటర్ బాగ్స్‌తో, భుజాల మీద స్వెట్టర్స్‌తో ఉత్సాహంగా వాళ్ళ సీట్ల నెంబర్లు వెతుక్కుంటు న్నారు. వాళ్ళ సీట్ల నంబర్ల క్రమం వరుసగా లేకపోవడంతో ఒక బ్బాయి మర్యాదగా స్వరూప్ నడిగాడు.

"ఇఫ్‌యు డోంట్ మైండ్ విల్‌యు గో దట్ కార్నర్ సీట్ ఇట్ విల్ బి కన్వీనియంట్ ఫర్ యు ఐ థింగ్ (మీ కభ్యంతరం లేకుంటే ఆ మూల సీట్ కెళతారా? ఆ సీట్ మీకు సౌకర్యంగా వుంటుందని నే ననుకుంటున్నాను?"

భార్య అంగీకారం వైపు తల తిప్పాడు స్వరూప్.

"మీ ఇష్టం" అంది చిన్నగా దివ్య.

"అరె మీరు తెలుగు వాళ్ళా? అబ్బ! మా కిక్కడకు వచ్చినప్పటి నుండి ఒక్కరంటే ఒక్కరు తెలుగువాళ్ళు తారస పడలేదనుకోండి. ఏ ప్లేస్‌నుండి వస్తారు" ఆ అబ్బాయి సంతోషంగా అడిగాడు.

"మాది నెల్లూరు" స్వరూప్ లేస్తూ అన్నాడు.

"మేము అగ్రికల్చర్ ఎమ్. ఎస్‌సి. ఢిల్లీలో చదువుకుంటున్నాము. తెలుగు స్టూడెంట్స్ మంతా కల్సి యీ ట్రిప్ వేసాము" అతని చేతిలో వాటర్ బాగ్ స్వరూప్ సీటులో పెడుతూ అన్నాడు.

వెనుక కార్నర్ సీటులో కూర్చోబోతున్న ఆడపిల్లలు అరుగురు దివ్యను చుట్టేసారు.

"మీ పేరేంటి?"

"మీ హాస్బెండ్ ఏం జాబ్ చేస్తున్నారు?"

"ఆయన మీకు రెలిటివా?"

"ఈ ఏరియా మీకెలా వుంది?"

"ఇక్కడెన్ని రోజులుంటారు?"

"మీది హనీమూన్ ట్రిప్ అన్నమాట?"

అన్నిటికీ నవ్వుతూ జవాబులిచ్చింది దివ్య.

బస్ కదిలింది. అబ్బాయిలు జోకులు వేసుకుంటూ అల్లరి చేస్తున్నారు.

బస్ కదిలినప్పటినుండి ప్రతి ఒక్క సీను అందంగా వుంది. కళ్ళు తిప్పుకోలేనంత పచ్చదనం, నీళ్ళ-

"వాటర్ బాగ్ తెచ్చుకోవడం మర్చిపోయాము" దివ్య అంది

"దాహంగా వుందా?"

"ఊఁ"

"అదిగో యీ బస్‌లోనుండి ఆ జలపాతంలోకి దూకేసి నీళ్ళు తీసుకురానా?"

ఆ మాట సరదాకే అన్నా ఆతను తనకోసం, తన దాహంకోసం అలా అనేసరికి ఎంత తియ్యటి బంధం యిది అని అన్పించింది దివ్యకు.

రోడ్డుకు ప్రక్కగా పచ్చని చెట్లు, మధ్యగా తృళ్ళుతూ గెంతుతూ బండలమధ్యగా, బండలమీదుగా నీళ్ళు ప్రవహిస్తుంటే ఆ ఒరవడికి నీళ్ళు నురుగులు గ్రక్కుతుంటే స్వరూప్ తన చేతిలో దివ్య చేతినుంచుకుని ఆ నీళ్ళను చూపుతూ ఆనందాన్ని పంచాడు.

"నరేష్ పొరపాటు చేసాము రా ఒక జత బట్టలు తెచ్చుకునుంటే ఈ జలపాతంలో మునిగే వాళ్ళంగదా!" ముందు సీట్లోనుంచి అరిచాడు. ఒక బ్బాయి.

అది మినీ బస్. వున్నదే ఇరవై అయిదు మంది.

"అంత మునగాలని కోర్కె వుంటే ప్యాంట్లతో మునిగేయడమే" సిద్దార్థ అరిచాడు.

"బాప్‌రే ఈ చలిలో ఈ తడిబట్టల్తో ఐ కాంట్" ఇంకొకబ్బాయి గొంతు కలిపాడు.

"దివ్యా! నువ్వు మునిగేయ్ హాయిగా చూస్తూ నేను ఎంజాయ్ చేస్తాను. ఆ గాలికి చీర నిముషంలో ఆరిపోతుందిలే భయపడకు."

"వెనుకే స్టూడెంట్స్ వున్నారు నాకు సిగ్గేస్తుంది బాబూ మీరలా మాట్లాడకండి" చాలా మెల్లిగా భర్తతో అంది.

ఆ అమ్మాయికి భర్త ఏది మాట్లాడినా చక్కలిగింతలు పెట్టి నట్లుగా వుంది.

"మీ దగ్గర వాటర్ వుంటే యిస్తారా. మా దివ్యకు దాహంగా వుందంట. రూమ్‌లో మా వాటర్ బ్యాగ్ మర్చిపోయి వచ్చాము" వెనక్కు తిరిగి ఆడపిల్లల్ని అడిగాడు స్వరూప్.

"అన్యాయమండీ దివ్యగారూ! మన జాతికే అవమానం. మీరు డైరెక్టుగా మమ్మల్ని అడక్కపోవడం" యూనివర్శిటీ స్టూడెంట్స్ సర దాగా అన్నారు.

"సారీ అండీ ఈయన అడిగేదే నాకు తెలియదు."

"అంటే మీ శ్రీవారికి మీకు దాహం అయినట్లు ఏదయినా దివ్య శక్తివల్ల తెలుసుకున్నారా?" ఆట పట్టించారు వాళ్ళు.

"వద్దండీ నాకు దాహం కావడంలేదు" భర్త వైపు తిరిగి అంది దివ్య.

"చిన్నగా సందేశాలివ్వకండి దివ్యగారూ! మాకు వినిపిస్తోంది. అయినా ఒకే భాష, ఒకే తెగ వాళ్ళదగ్గర మొహమాటమేమిటండి" వద్దంటున్నా బలవంతంగా ఫ్లాస్క్ మూతలోకి నీళ్ళు వంచి దివ్యకందిం చాడు.

అందుకోవడంలో దివ్యమీద నీళ్ళు పడ్డాయి. బస్ వెలుపలనుండి రివ్వున చలిగాలి.

"ఇక్కడివాళ్ళు యింతచలిలో ఎలా బ్రతగ్గలరబ్బా" పైన పడిన నీళ్ళు తుడుచుకుంటూ అంది దివ్య.

"పెహల్‌గామ్ కెళ్ళాక ఎలా బ్రతగ్గలరో చూపిస్తాగా" అతనికి భార్యతో ప్రతిక్షణం ఏకాంతంగా గడపాలనుంది.

అతని సాన్నిహిత్యం ఇరవై రోజులే అయినా ఆమెకి అనుభూతి కొత్తగా అన్పించినా అతను పరాయివాడనిపించడంలేదు. ఇతను నా వాడు అని దివ్య మనసు పరవశిస్తోంది

"అలా సైలెంట్‌గా వుండిపోయావేం దివ్యా! నీకు మీ హాస్పిటల్ పేషెంట్స్ గుర్తుకొస్తున్నారా ఏంటి?" జోక్ వేసారు స్వరూప్.

"నో....నో...." అలా అనేసిన దివ్యకు ఆశ్చర్యంగా వుంది. తను ప్రాక్టీసు పెట్టిన ఒక్క సంవత్సరంలో ఏ ఒక్కరోజూ తను తన కన్సల్టేషన్ అవర్స్‌లో బయట గడపలేదు.

"పేషెంట్స్ లేరులే దివ్యా. పిక్చర్ కెళదాం" అని తన ఫ్రెండ్స్ పిలిస్తే తను వెళ్ళేది కాదు.

"హోవోయ్ బడాయి రేపు పెళ్ళయితే మీ ఆయన రమ్మంటే కూడా ఇలాగే అంటావా?" అనేవాళ్ళు.

"ఎగ్జాక్ట్‌లీ. ఫస్ట్ మన డ్యూటీ, తర్వాతే మన యాక్టివిటీస్"

'మేమూ చూస్తాంలే' అన్న ఫ్రెండ్స్ మాటలను ఆరోజు కొట్టేసిందేగానీ యిప్పుడు యిన్నిరోజులుగా హాస్పిటల్ వర్క్ గుర్తురానంతగా తన భర్త లాలనలో వుండిపోలేదూ?

ఏమిటీ వింత? ఇది నాచురల్ ఏమో!

ఆలోచనలనుండి తేరుకుంది స్వరూప్ చెయ్యి దివ్య భుజంమీద ఆప్యాయంగా తాకడంతో. అతను దివ్య చెవిలో గుసగుసగా అంటున్నాడు.

"నువ్వు లేకుండా ఇన్ని సంవత్సరాలు వృథా అయిపోయాయని దిగులుగా వుంది దివ్యా!"

తన ప్రజెన్స్ అతనిలో యింత ఉత్తేజాన్ని కలిగించిందనుకుంటేనే ఆమె మేనులో నుండి పులకింత.

"మీరు గుల్‌మార్గ్ చూసారా?" ముందుసీట్లో వున్న సిద్దార్థ అడిగాడు వెనక్కు తిరిగి.

"రేపటికి బుక్ చేసుకున్నాం"

"ఏ నంబర్ బస్‌కి"

"నంబర్ టెన్"

"మేమూ దానికే బుక్ చేసుకున్నాం సరదాగా వుండొచ్చు" అని వాళ్ళంటుంటే-

స్వరూప్‌కి మాత్రం అలా అన్పించలేదు. వాళ్ళు లేకుంటే బాగుండును అన్పింపించింది.

దారి పొడవునా పక్షుల కిలకిలా రావాలతో నిండిన యాపిల్ తోటలు, సీమబాదం చెట్లు, వాల్‌నట్ల చెట్లు శోభాయమానంగా వున్న ఆ ప్రకృతిని, వాటిమధ్య గలగలపారుతున్న నీళ్ళ శబ్దాలను దాటుకుంటూ వెళ్ళి బస్ తన గమ్యస్థానాన్ని చేరుకుంది.

"ఏమండీ! దివ్యగారూ! మీరు మాతో వచ్చేయండి సరదాగా" ఆడపిల్లలు గుమిగూడారు దివ్య చుట్టూ.

నవ్వింది దివ్య.

"మీరామెను మీతో తీసుకెళ్ళారంటే బెట్ మేమంతా గంటసేపు పారే ఈ ఐస్ నీళ్ళలో మునుగుతాము."

"స్వరూప్‌గారూ! దివ్యగార్ని పంపించండి ప్లీజ్" అమ్మాయిలు అతన్ని చుట్టేసారు.

ఆ చలికే స్వెట్టర్ వేస్తున్న ఒకబ్బాయి మాత్రం ఈ అమ్మాయిలతో దివ్యగారు వెళితే తనూ ఆ నీళ్ళలో దిగాలేమో అనే బెంగతో వున్నాడు.

"రండి దివ్యగారూ! అక్కడ క్యాంటీన్ వుంది ముందక్కడకు వెళదాం" ఇద్దరమ్మాయిలు దివ్య రెండు చేతులు పట్టుకున్నారు చనువుగా.

'అన్యాయమండ్రా పాపం కొత్త జంట' చలికి వణికే స్నేహంత్ అన్నాడు.

"అవునా దివ్యగారూ!" ఎదురుగా వున్న సీనర్‌ని కెమెరాలో ముద్ర పర్చే ప్రయత్నంలో అంది ఓ అమ్మాయి.

"ఈ బస్‌లో రాకపోవాల్సింది" మనసులో అలా అనుకున్నా పైకి మాత్రం 'పదండి' అంది నవ్వుతూ దివ్య.

"మీ వారు ప్రక్కన లేరని దిగులేవద్దు. ఆయన్ని మరిపించేంత అందాలున్నాయి. సాయంత్రం వరకు మనకి టైమ్ చాలదేమో!"

"బాబోయ్ సాయంత్రం వరకా" అప్రయత్నంగా అనేసాడు స్వరూప్.

"దిగండి మీరే దిగండి" అల్లరి ప్రారంభించారు మగపిల్లలు. స్వెట్టర్లందుకుని ఆడపిల్లలు పరుగులు తీసారు.

దివ్య స్వరూప్ వాళ్ళ అల్లరికి నవ్వుకుంటూ ఒకరి చేతుల్లో ఒకరొకరు చేతులుంచి నడవసాగారు.

"ఆడపిల్లలు మరీ అంత ఫాస్ట్‌గా వుండకూడదు" అన్నాడు స్వరూప్ భార్యతో.

ఆ వీధినిండా అంగళ్ళ క్రికెట్ బాట్స్ ఎక్కువగా వున్నాయి. అక్కడ అడవుల్లో కలపతో తయారు చేస్తారట చీప్‌గా దొరుకుతాయనే సరికి ప్రతి మగపిల్లాడిచేతిలో అదే వుంది. చిత్రంగా సీమ బాదంపప్పు ఎండు ద్రాక్ష, వాల్‌నట్స్ బస్తాలకుపోసి ప్రతి అంగడిలో వున్నాయి. యాపిల్స్ బుట్టలు ఎనిమిదిరూపాయలు మాత్రమే యాపిల్ తోటల అందాలు ఆమెకు కంట్లో మెదుల్తున్నాయి. పచ్చటి చెట్ల మధ్య ఎర్రటి యాపిల్స్—అది చిత్రకారుడు పెయింట్ చేసినట్లున్నాయేగానీ యింకా తన కంటితో చూసి, చెట్లులా అన్పించడంలేదామెకు

"స్టూడెంట్ లైఫ్ అంటే అలాగే సరదాగా వుంటుంది." దివ్య అని మరలా—

"అదేవిటీ ఫోటో చెప్పకుండా తీస్తున్నారు." భర్తనుచూస్తూ అంది దివ్య.

"ఇప్పటికా గుర్తొచ్చింది ఆరు ఫిలిమ్స్ అయిపోయాయి తెలుసా!"

"ఏవిటండీ చిన్నపిల్లల్లా ఎలా వుంటే అలా కొట్టేయడమేనా అసలే ఫోటోలో నేను చెత్తగా పడ్తాను."

"అది ఎవరో చెత్తఫోటో గ్రాఫర్ తీసినవి అయివుంటాయిలే ఇదిగో మనం ఫోటోగ్రఫీలో ఫస్ట్ తెల్సా నీ ఫోటోస్ కూడా ఫస్ట్‌గా వస్తాయి"

మాట్లాడుకుంటూ వెళ్తున్న ఈజంటను వెంబడించారు ఒక గ్రూప్ ఫారినర్స్—

"ఇఫ్ యు డోంట్ మైండ్ ఐవిల్ టేక్ ఒన్ ఫిల్మ్."

చాలా మర్యాదగా ముఖం నిండా నవ్వు పులుముకొని ఒకతను అడిగాడు.

సరదాగా అన్పించింది దివ్యకు అలాగే అని తలూపి మంచి ఫోజిచ్చింది.

పది నిముషాలు దివ్య వేసుకున్న నగలను, చీరను పట్టుకుని చూసి "మీ కట్టు సంప్రదాయం మాకెంతో ఇష్టం" అని చెప్పారు. అందరూ వెళ్తూ దివ్యకు స్వరూప్‌కి ముఖం నిండా నవ్వు నింపుకుని టాటా చెప్పారు.

వాళ్ళు వెళ్ళిపోయాక స్వరూప్ అన్నాడు.

"వాళ్ళకు ఫోటో తీసుకోవడానికి నువ్వు అవకాశం యివ్వాల్సింది కాదు."

"వాళ్ళు సరదా పడ్డారు. పోన్లెండి నా ఫోటో స్టేట్స్‌లో వుంటుంది" అతని హావ భావాలు గమనించకుండా ఆనందంగా వుంది.

అదే....అదే ఇష్టం లేదు స్వరూప్‌కు సరదాకి తీసిన ఆ ఫోటో ఏం ముప్పు తెస్తుందో అనే భయం....

రాళ్ళ గుట్టల్లో దివ్య నడవలేక పోతోంది. దివ్య నడుము చుట్టూ చెయ్యివేసి మెల్లిగా నడిపించాడు స్వరూప్ ఐదునిముషాల ముందున్న అశాంతి అతనిలో పారిపోయింది.

"పడను లెండి నడవండి."

"పడిపోతే"

"అప్పుడు పట్టుకుందురు లెండి"

"అది తెలివిగలవాళ్ళ లక్షణం కాదోయ్" ఆమెను ఇంకా దగ్గరకు తీసుకుని నడుస్తూ కొంటెగా అన్నాడు.

"ఆ నీళ్ళలో దిగుదామండీ"

"నీ కోరిక కాదంటానా వెళ్దాం పద" అంటూ గలగల పారే ఆ నీళ్ళల్లో యిద్దరూ కాళ్ళు పెట్టారు.

నీళ్ళల్లో కాలు పెట్టిన ఒక్క నిముషానికి పైకి వచ్చేస్తూ అంది "అబ్బ! ఫ్రీజర్‌లో నీళ్ళలా వున్నాయేంటి? మన ఫంక్షన్స్‌లో ఐస్ కరిగించిన నీళ్ళు వీటి ముందు దిగదుడుపే."

ఐదు నిముషాలు కాళ్ళు నీళ్ళలో పెట్టిన స్వరూప్ యిక పెట్టలేక పోయాడు. అతని పాదాలు రెండు ఎర్రగా కందిపోయాయి.

"ఇంత ఐస్ నీళ్ళెలా వస్తాయోగదా!"

"ఎలా ఏంటి దివ్యా అదంతా మంచుకొండ. యీ ఎండాకాలం అది కరిగి యిలా పారుతుందన్నమాట. మరలా చలికాలం వచ్చేసరికి మంచుకొండలంతా కప్పేస్తుంది మనం వచ్చిన 60. కిలోమీటర్ల పొడవునా జనవరి ఫిబ్రవరి నెలల్లో తెల్లగా ఐస్ వుంటుంది అప్పుడిక్కడకు ఎవ్వరూ రారు. బస్సులు కూడా రాలేవు."

"పాపం అప్పుడీళ్ళకు బిజినెస్ ఎలా?"

"ఏముందీ యీ మూడు నెలలు మనమీద వేసేస్తారు చిలుము అంతే" నవ్వేస్తూ అన్నాడు.

"ఈ శబ్దమే చాలా బాగుందండీ" కనుచూపుమేరకు అంతా వెడల్పుగా నీళ్ళు పారుతూవుంటే ఆశ్చర్యంగా చూస్తూ అంది దివ్య.

"ఇంకా యిక్కడనుండి అమర్‌నాథ్‌కు వెళ్ళాలంటే గుర్రాల్లో వెళ్ళాలి వస్తావా?"

"వద్దులే బాబూ! గుర్రాన్ని చూస్తేనే భయమేస్తుంది."

"పోనీ ఇద్దరం ఒకే గుర్రం ఎక్కుదామా?"

ఎలాగో ఒప్పుకుంది దివ్య.

గుర్రాలబ్బాయిలు పిళ్ళిద్దర్నీ చుట్టేసారు.

బేరం కుదుర్చుకున్నారు.

ఇద్దరూ ఎక్కబోయేసరికి వాళ్ళు పకపక నవ్వారు.

"ఏం?"

"ఎక్కలేరు సాబ్. చాలా ఎత్తుకి వెళ్ళాలి" వాళ్ళ హిందీ అర్ధ మయింది దివ్యకు.

"అక్కడకు మీరు వెళ్ళలేరు వద్దు రిస్కుతో కూడింది. గుల్ మార్గ్‌లో మీకి సరదా ఎలాగూ తీరిపోతుంది." అనేసి వెళ్ళిపోయాడొక తెలుగతను.

బస్ దిగి వాళ్ళుండే హోటల్‌కి నడిచి వస్తుంటే కాశ్మీర్‌లో వున్న ఇరవై ఐదుమైళ్ళ కాలువ దగ్గరుంచుకున్న బోట్ నడిపే అతను వెంట పడ్డాడు. ముప్పైరూపాయలిస్తే గంటసేపు తిప్పి తీసుకొస్తానంటూ.

"వెళ్దామా?" భార్య వైపు తిరిగి అడిగాడు స్వరూప్ "అలాగే" అంది. ఆమెకు ఆశ్చర్యంగా వుంది నెల్లూరులో తను క్లినిక్ నుండి యింటికి వెళ్ళగానే స్నానం చెయ్యందే భోంచేసేది కాదు. అలాంటిది ప్రొద్దుటినుండి తిరిగినా అలసటగాని ఆకలిగాని అన్పించడం లేదు. ప్రొద్దున కడుక్కున్న ముఖం అయినా జిడ్డుగా లేదు. విసుగ్గాలేదు. రేగిన జుట్టు భర్త జేబులో దువ్వెనతో పైపైన సరిచేసుకుంది.

పడవ చాలా అందంగా వుంది అందులో పరుపు దానిమీద పువ్వులున్న ముఖమల్ క్లాత్ "కాళ్ళు రెండూ చాపుకుని ఓరాగా కూర్చోండి సార్" అన్నాడు పడవతను.

అలాగే కూర్చున్నారిద్దరూ.

పడవకదిలింది. చుట్టూచూసింది దివ్య. తమాషాగా వున్నాయి నీళ్ళలో బోట్‌హౌసెస్, వెళ్ళికొలదీ కొన్నివేల యిళ్ళు.

"ఇది ఇక్కడ ఎవరుకట్టారు?" పడవతన్ని అడిగింది. హిందీ వచ్చినా వాళ్ళ బాష బాగా అర్ధం అవడంలేదు వీళ్ళకు.

"బ్రిటీష్‌వాళ్ళు కట్టేరు బహిన్. యిప్పుడువాళ్ళు వెళ్ళిపోయాక మన వాళ్ళు కొన్ని మార్పులు చేసుకున్నారు."

చిత్రంగా ఆ యిళ్ళవైపు చూడసాగారాదంపతులు.

కొయ్యలతో కట్టిన ఆ ఇళ్ళు కొత్తవిగానే వున్నాయి కొయ్య మెట్లు ప్రతి ఇంటికి వున్నాయి. రోజాచెట్లు పాట్స్‌లో చాలా అందంగా అమర్చి వున్నారు. కొన్ని యిళ్ళకు మధ్యలో బ్రిడ్జికట్టి వున్నారు.

పనిపిల్లలు ఆ బ్రిడ్జిమీద రెండు యిళ్ళల్లోకి పరిగెడ్తున్నారు. మంచి హోటల్స్, షాప్ కూడా ఆ నీళ్ళ మధ్య వుండడం వింతగా వుంది.

"ఈ నీళ్ళలో షాప్స్‌లో ఎవరుకొంటారు?" మరలా అడిగాడు స్వరూప్.

"మీలాటి వాళ్ళు కొంటారు సాబ్ ముఖ్యంగా ఫారినర్స్ యీ బోట్‌హౌస్‌లే యిష్టపడ్తారు సాబ్!"

"బోట్ హౌస్ రోజుకెంత?"

"అరవై రూపాయలకు రెండు పోర్షన్‌లు వున్నాయి. వంద రూపాయలకున్నాయి, రెండు వందలకున్నాయి, ఐదువందల్లో కూడా వుంటాయి. అదిగో మీకు కన్పిస్తుందే అది ఐదువందలుసాబ్"

ఇద్దరూ ఆ ఇంటి దగ్గరకు పడవ వెళ్ళగానే నిశితంగా ఆ ఇంటి లోకి చూసారు.

చక్కటి కొయ్యతో చేసిన కుర్చీలు వరండాలో వేసున్నాయి.

"అక్కడ ఆపుతావా? లోపలకెళ్ళి చూసొస్తాం"

"ఆఁగే బహెన్! వెళ్ళండి త్వరగా వచ్చేయండి"

ఆ పడవను మెట్లకు కట్టేసాడతను.

కదులుతున్న పడవలోనుండి చెయ్యందించి దివ్యను మెట్టుమీదకు లాక్కున్నాడు స్వరూప్.

ఇద్దరూ కలిసి లోపలికెళ్ళారు.

ఒక ముసలావిడ పుస్తకం చదువుకుంటోంది.

"ఈ ఇల్లు చూడాలని సరదాపడుతున్నాము" ఇంగ్లీషులో అడిగాడామెను స్వరూప్.

"విత్ ప్లెషర్ చూడండి" అనేసి మరలా బుక్‌లో తల దూర్చిందామె.

ఆనాటి కళావైభవానికి చిహ్నంగా వుందా బోట్‌హౌస్.

పెద్ద ఇత్తడి ఫ్లవర్‌వాజ్ ఒక మూలగా వుంది.

ప్రకృతి అందించిన రంగురంగుల అందాల పువ్వులు అందులో కుదురుగా కూర్చుని వున్నాయి.

ఆ కొయ్యతలుపులమీద చెక్కడాలు మరలా చూడాలనేంత కళాత్మకంగా వున్నాయి.

డైనింగ్ టేబుల్ చుట్టూ వున్న కర్రకుర్చీలు సింహాసనాలు ఉన్నాయి.

బెడ్‌రూమ్‌లో ప్రతి ఒక్క వస్తువూ కొయ్యతో చేసిందే. వాటికి అవి రంగులు పులుముకోలేదు. తమ సహజరంగును కోల్పోకుండా వున్నాయి

తలెత్తి చూసింది దివ్య.

పెద్ద క్రిష్టల్‌లైట్ వెలుగును విరజిమ్మకముందే ఎరుపు, పసుపు ఆకుపచ్చ కాంతులను నలువైపులకూ ప్రసరిస్తోంది!

"ఎక్కడివండీ యీ లైట్లు ఆ రోజుల్లో?" వానివెపే చూస్తూ భర్తనడిగింది దివ్య.

"అక్కడే మనం పొరపడుతున్నాం దివ్యా? మన మ్యూజి యమ్స్‌లో రాజులు వాడిన పింగాణి సామాను, వెండిసామాను, వాళ్ళ వస్త్రాలు, ఆఖరకు వాళ్ళు వాడిన మైనపొత్తి స్టాండ్స్ పీ.షింగ్ ఇంత వైజ్ఞానం ముదిరినా మనకాలంలో వున్నాయంటావా?"

అతను ఆ హాలు మధ్యలో హాంగవుతున్న పెద్ద క్రిష్టల్‌లైట్‌ని పరిశీలిస్తూ అన్నాడు.

"నిజమే" ఒప్పుకుంది దివ్య.

ఆ బోట్ షేపులో వున్న చిన్న ఇంటిలో ఒక డైనింగ్‌రూమ్, ఒక కిచెన్, ఒక బెడ్రూమ్, ఒక హాలు, ఒక వరండా వుంది.

ఆ ఇంటి కిటికీలోంచి చూస్తే చుట్టూ నీళ్ళు కన్పిస్తూ తమాషాగా అన్పించింది వాళ్ళకు.

"అంత సరదాగా వుంటే రేపు ఇక్కడకు వచ్చి వుందామా?"

"అమ్మో వద్దు! అర్థరాత్రి ఇక్కడేదయినా జరిగితే మనం పారి పోవాలన్నా ఈ ఇళ్ళలో వెళ్ళలేం" భయంగా అంది దివ్య.

"నేనుండగా నీకేం భయం?"

"మీకే ఏదయినా ఆపదవస్తే....ఇలాంటి ఎక్స్‌పెరిమెంట్స్ వద్దు లెండి" ఆమెకు థాంక్స్ చెప్పి మెట్లు దిగుతూ అతని భుజంపట్టుకుని అంది దివ్య.

"ఇక్కడ వాళ్ళకు వంట చేసుకోవాలంటే వస్తువులెలా దొరుకు తాయి?" దివ్య పడవతన్ని అడిగింది.

"ప్రతి వస్తువూ ఇక్కడ పడవలో అమ్ముతారు. అక్కడ పడ వలో పూలు అమ్ముతున్నారు-తీసుకెళతాను రండి."

అతని హిందీ కొంత అర్థమవుతోంది, కొంత అర్థంకావడంలేదు వీళ్ళకు.

"అబ్బ! చాలా అందంగా వుంది కదండి ఆ పడవ"

పడవనిండా రకరకాల పువ్వులు ఎంతో అందంగా అమర్చి తెస్తున్నారు వాళ్ళు.

"ఆ పూలు ప్రతి ఇంటివాళ్ళు కొని ఫ్లవర్‌వాజ్‌లో పెట్టుకుంటారు. బహిన్"

"ఇదేంటి ఈ క్రింద చెట్లున్నాయి?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు స్వరూప్.

పడవ క్రింద నీళ్ళల్లో చెట్లు.

"అవి పుచ్చచెట్లు సాబ్! రైతులు పుచ్చచెట్లువేసి ఈ సీజన్‌లోనే సంపాయించుకుంటారు"

"నీళ్ళలో పుచ్చచెట్లు ఎలా వస్తాయి?" ఇంకా ఆశ్చర్యపోతూ అడిగింది దివ్య.

"ఇక్కడంతే బహిన్ పుచ్చచెట్లే కాదు. నూల్‌కోర్ చెట్లుకూడా ఈ నీళ్ళలోపల చెట్లు వస్తాయి"

"ఇవి పండాక ఎలా కోస్తారు?"

"నీళ్ళలోకి దిగి కోసుకుంటారు. బండ్లు వచ్చి ఒడ్డునే ఉంటాయి. అక్కడకు పడవల్లో తీసుకెళతారు సాబ్!"

"మరలా రెండో పంట వేస్తారా?"

పకపక నవ్వాడు పడవతను.

"నవంబరునుండి ఈ ఇరవయ్ అయిదు మైళ్ళ కాలవలోని నీళ్ళు అన్నీ ఐస్‌కట్టేస్తాయి బహిన్! అప్పుడు పిల్లలు ఈ ఐస్‌మీద ఆడుకుంటూ వుంటారు, మరలా ఏప్రియల్‌నుండి మంచు కరిగి నీళ్ళలా అవుతుంది. మంచు గడ్డకట్టినపుడు మాకు బిజినెస్సే వుండదు" అతను ఉత్సాహంగా చెపుతున్నాడు ప్రతివిషయం.

అలా నీళ్ళక్రింద చెట్లు, నీళ్ళచుట్టూ బోట్‌హౌస్‌లు వెళ్ళినంత దూరం అందంగా వుంది.

ఉన్నట్టుండి కారుమబ్బు కప్పేసి చినుకులు విసురుగా పడ సాగాయి.

ఈదురుగాలులు, వణికే చలి.

ఒక దగ్గర పడవ ఆపేసాడతను.

భయంగా చూసింది దివ్య

"భయమేమీ వుండదు బహిన్! పదినిమిషాలే తగ్గిపోతుంది. మీరా షాల్స్ షాప్‌లో కూర్చోండి" అని తన పడవను తాడుతో ఓ చెట్టుకు కట్టేసాడు

"ఇదేమిటండి? ఇలా మధ్యలో చిక్కుకుపోయాం?" కొద్దిగా జంకింది దివ్య.

"ఓ దివ్యా! నాకు చాలా చాలా థ్రిల్లింగ్‌గా వుంటే నువ్వేంటి ఇలా?" ఆమె భుజాన్ని పట్టుకుంటూ అన్నాడు స్వరూప్.

"అదికాదండీ! తెలియని ప్లేస్. వీళ్ళు మనల్నేమైనా చేస్తే?" ఇంకా భయపడ్తూనే వుంది దివ్య.

"పిచ్చీ! కాశ్మీరీవాలాలు మనల్ని బిజినెస్‌లో మోసం చేస్తారేగానీ వ్యక్తిగతంగా చాలా మంచివాళ్ళు"

"రా....ఒక షాల్ కొనుక్కుందాం గుర్తుగా"

లోపలికి నడిచారిద్దరూ.

వణికించే చలి తగ్గింది.

చలికోసం కాబోలు వాళ్ళు మంట వేసుకుని వున్నారు.

"మంట వేసుకుంటే కొయ్యకదా అంటుకోదూ?" ప్రతి ఒక్కటీ వింతగానే వుంది దివ్యకు.

ఆ షాపతను నవ్వేసి అంటుకోదని జవాబిచ్చాడు.

ఆ షాపు చెక్కల మధ్య సందులున్నాయి. ఆ సందులోనుంచి చూస్తూ షాపులో కూర్చుంటే క్రింద పారేనీళ్ళు స్పష్టంగా కనిపిస్తు న్నాయి. షాప్‌నిండా షాల్స్ ఎన్నిరకాలివో—

తెల్లటి షాల్ మీద నలుపు, ఎరుపు దారాలతో కచవర్క్ చేసి వుంది. అది ఇద్దరికీ నచ్చింది.

అరగంట తర్వాత భార్యకు షాల్ కప్పి బయటకు తీసుకొస్తే అక్కడ వాతావరణం అందుకు భిన్నంగా చీకట్లు పారిపోయి వణికే చలి తగ్గిపోయి ఈదురుగాలులు సమసిపోయి ప్రశాంతంగా వుంది. దివ్య మనసులో భయం చప్పున తగ్గిపోయింది.

"ఎంత తమాషా కదండీ! అదే మన నెల్లూరులో ఇలా అయితే, కనీసం మూడు రోజులు యీదురుగాలులు, వర్షం, జన నష్టం, ధన నష్టం, పనినష్టం ఎన్ని జరిగేవో కదా" పరిశీలనగా చూస్తూ హుషారుగా పడవ ఎక్కింది దివ్య.

ఈమారు పడవవాడ్ని విసిగించలేదు వాళ్ళిద్దరూ. మౌనంగా ప్రేమ సందేశాన్ని కళ్ళతో, పెదవులతో అందించుకున్నారు. దివ్యకు యీ పడవ ప్రయాణం-ప్రక్కన వింతలు కంటే తన భర్త తనని అపురూపంగా తీసుకెళ్ళడం—తన కళ్ళల్లో ఆనందాన్ని తన ఆనందంగా భావించడం, తనను ప్రేమగా ఎప్పుడు పిలయితే అప్పుడు దగ్గరకు తీసుకోవడం. తను లేందే అతను లేడన్నట్లు ప్రవర్తించడం ఎంతో నచ్చింది. తన గుండెల్లో ఈ అనుభూతిని పదిల పర్చుకుంది.

లాడ్జికి వచ్చిన దివ్య టైమ్ చూసుకుంటే ఎనిమిదయింది.

"నా వాచ్‌లోకి నీళ్ళు పోయినట్లున్నాయి. నిల్చిపోయినట్లయింది. టై మెంతయిందీ" భర్త నడిగింది దివ్య.

"ఎనిమిదయింది" స్వరూప్ టవల్ భుజాన వేసుకుని బాత్‌రూమ్ లోకి వెళ్ళబోతూ తన చేతివాచ్ భార్య కందించాడు.

"మీ వాచ్‌కూడా చెడిపోయిందా? కాశ్మీర్‌లో వాచ్‌లు పని చేయడం మానేస్తాయా ఏమిటి?" నవ్వుతూ అంది దివ్య.

అప్పుడే వేడి టీ తెచ్చి టీపాయ్‌మీద పెడుతున్న సర్వర్‌ని టైమ్ ఎంతయిందని అడిగాడు స్వరూప్.

"ఎయిట్ అయింది సర్" అన్నాడు.

"మరి ఇంకా వెలుతురుగా వుందేమిటి?" కిటికీలోనుండి బయటకు చూస్తూ చిత్రంగా అడిగారు భార్యా భర్త లిద్దరూ.

"ఇక్కడ సమ్మర్‌లో ఎనిమిదిన్నరకు చీకటి పడుతుంది సార్. చలికాలం ఐదు గంటలకే ప్రొద్దు పోతుంది. ఇంకో విషయం ఈ కాలం ఐదుగంటలకే వెలుగు వచ్చేస్తోంది" అతను హిందీలో మాట్లాడాడు.

"ఓ డియర్ మనం చలికాలం వచ్చుంటే ఎంచక్కా రాత్రిళ్ళు ఎక్కువకాలం గడిపేవాళ్ళంకదా. నామీద నాకే జాలిగా వుంది."

అతని మాటలు పూర్తి చేసేలోపల దివ్య సిగ్గును దాచుకుంటూ వరండాలోకి నడిచింది.

మరుసటిరోజు గుల్‌మార్గ్‌లో బస్ దిగగానే గుర్రాలవాళ్ళు చుట్టుకు పోయారు. నిన్నటి పిల్లలంతా చకచక నడిచే వెళ్ళారు.

"గుర్రం నేనెక్కనండీ భయ మేస్తుంది"

"పోనీ టాక్సీలో వెళదామా?"

"టాక్సీ రోప్‌వే దగ్గరకే వెళుతుందిసర్. మా గుర్రమయితే మంచు కొండవరకు తీసుకెళతాము" గుర్రాల మనుష్యులు చుట్టేసి అన్నారు.

"వద్దులే మేము నడిచి వెళతామంటూ" రోప్‌వే వరకు వెళ్ళి టిక్కెట్ తీసుకుని ఒక బాక్స్‌లో చిన్న బెంచీమీద కూర్చున్నారు.

చాలా చిన్న బెంచీ వున్న బాక్ అది. అందులో ఎక్కుతుంటే దివ్యకు జాగ్రత్త చెపుతూనే వున్నాడు స్వరూప్. ఇద్దరూ ఎక్కి కూర్చున్నాక అరోప్ ఆధారంతో మూవ్ అయింది. వెళ్ళేకొలదీ ఎత్తుకు పోతూ వుంది. నింగికీ నేలకు మధ్యలో వాళ్ళిద్దరే అలా వెళుతుంటే భయంగా వున్నా థ్రిల్లింగ్‌గా వుంది పెద్దపెద్ద చెట్లు పైనతాము. కొత్త అనుభవం అంత ఎత్తులో వున్న స్వరూప్ తన కాళ్ళతో దివ్య కాళ్ళను తాకాడు.

"జాగ్రత్తండీ పడిపోతారు" కంగారుగా అంది దివ్య.

"నేను పడిపోయానెప్పుడో"

"అదేంటి?" అర్థం కానట్లు అడిగింది దివ్య.

"నీ ప్రేమలో పడిపోలేదూ!"

"అలా అయితే నేనూ మీ ప్రేమలో పడిపోలేదూ!"

అలా మనసులో అనుకున్న దివ్యకు పెదాలు దాటి ఆ మాటలు పైకి రాలేదు.

రోప్‌వే పూర్తయి దిగేటప్పుడు పడిపోతామేమో అనేట్లు కదులుతున్న బాక్స్‌లోనుండి త్వరత్వరగా దిగేయాలి ఇద్దరూ రెండు వైపులకూ దిగేసారు నవ్వుకుంటూ.

అక్కడే ఓపెన్ ఏర్‌లో వున్న క్యాంటిన్‌కు వెళ్ళారు. పొటాటో సోమాసో తిని టీ త్రాగి ఒక బిస్కెట్ పాంకెట్ కొనుక్కున్నారు.

"అక్కడనుండి పైకి నడిచి పోదామండీ. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ" దివ్య ముచ్చట పడింది.

"నడవలేం దివ్యా! దారి బాగుంటే అందరూ నడవరూ"

అక్కడా గుర్రాలబ్బాయిలు ప్రత్యక్షం అయ్యారు.

"యాభై రూపాయలు ఒక్కో గుర్రానికివ్వండి సాబ్"

ఆ గుర్రం ఎక్కడానికి చాలా అవస్థలు పడింది దివ్య.

ఎక్కి కూర్చున్నాక చూసుకుంది తన పవిటచెంగు చెప్పుక్రింద ఇరుక్కు పోయిందని. వంగలేక పోయింది.

"నేను తీస్తాను బహెన్" అని చీర చెంగును విడిపించాడతను. ఆ చెంగును భుజంచుట్టూ కప్పాడతను.

కదిల్తే ఎక్కడ పడిపోతానో అన్నట్లు కూర్చుంది దివ్య. ప్రక్క గుర్రం ఎక్కబోతున్న స్వరూప్ వెనక్కు వచ్చి విసుగ్గా అన్నాడు–

"నన్ను పిలిస్తే నేను తీయనా. నువ్వేమిటి ఆ అమ్మాయిని పట్టుకునేది" అని కసురుకున్నాడు స్వరూప్.

ఆ గుర్రపబ్బాయికి శూన్యం తగలలేదు.

"ఏమిటీసాబ్ మామీద విశ్వాసం వుంచండి బహిన్ కేమీకాదు" అన్నాడు.

స్వరూప్ ఎందుకలా యిరిటేట్ అయ్యాడో అర్ధం కాలేదు దివ్యకు.

"ఆ గుర్రాన్ని నా గుర్రం పక్కనే నడిపించు" అనేసి గుర్ర మెక్కాడు స్వరూప్.

ఎప్పుడూ ఎరుగని అనుభవం-గుర్రం తల క్రిందకు వాల్చినప్పు డల్లా ఏమండీ" అని అరుస్తోంది దివ్య.

చెట్ల మధ్యగా, రాళ్ళ మధ్యలో' నీళ్ళ మధ్యగా, కొండ చివ రన ఆ గుర్రాలురెండూ ఎంతో తెలివిగా నడుస్తున్నాయి.

"మనం దిగిపోదామండీ భయమేసుంది" అరిచింది

"భయంలేదు బహిన్. రోజుకు యీ గుర్రం పదిహేనుమందిని తీసుకెళుతుంది..పదేళ్ళనుండి ఒక్కరిని కూడా పడేయలేదు."

వాళ్ళ హిందీ భాషకు అలవాటు పడ్డారు దివ్య స్వరూప్.

నీళ్ళు దాటేచోట దాహానికి గుర్రం వంగిపోయింది.

"ఏమండీ నేను పడిపోయానండీ" గట్టిగా అరిచింది.

"అరవద్దు బహిన్ ఏమీ అవదు మేమున్నావుగదా!"

దివ్య చెయ్యిని పట్టుకుని చెప్పాడు గుర్రంతో వచ్చే అతను—

చప్పున దూకేసాడు గుర్రం మీదనుండి స్వరూప్.

"నువ్వొదులు నేను పట్టుకుంటాను" అంటూ గుర్రం నడుపు తున్నతని చెయ్యి విదిలించేసాడు స్వరూప్.

"పాపం! అతను పట్టుకోకుంటే పడిపోయేదాన్నేనండీ" ఆమెకింకా దడగానే వుంది.

"పడిపోవు బహిన్. మీకు భయమేమీ అక్కర్లేదు" మరలా అన్నాడతను.

అతనికి స్వరూప్ కోపంగానీ, పరాయి ఆడపిల్లను తాకకూడదని కానీ అర్థం కావడంలేదు. "మా మీద విశ్వాసం వుంచు బహిన్" అని పదేపదే చెపుతున్నాడు.

పదినిముషాలాగాక మరలా బయలుదేరారు. ఒక దారంటూలేదు ముళ్ళల్లో కూడా ఆ గుర్రం నడుస్తోంది. కళ్ళు గట్టిగా మూసుకుంది.

దివ్య ఈ గుర్రం మీద నుండి ఏ లోయలోకో ఏ క్షణమో పడిపోతామనే భయాన్ని దిగమ్రింగి ఆ గుర్రం మీద కూర్చుంది.

"ఏమండీ! మీకు భయమెయ్యడం లేదూ!" ముందు గుర్రంలో వెళుతున్న భర్త నడిగిందే కానీ ఆ మాటలు ఆ గాలికి అతనికి విన్పించనే లేదు.

నాలుగు కిలోమీటర్ల దూరం కొండ ఎక్కాక తెల్లటి మంచు కొండ కనిపించింది. హమ్మయ్య అనుకుంటూ దిగింది. ఈ మారు స్వరూప్ జాగ్రత్తగా దివ్యను దించుకున్నాడు.

వాళ్ళు ఆ గుర్రంతో పడిన టెన్షన్ మర్చిపోయారు. మంచు కొండ మీదకు వెళ్ళబోయారు మధ్యలో షూస్ షాపతను వీళ్ళను ఆపేసాడు.

"నాకు షూస్ వున్నాయిగా" తన షూస్ చూపిస్తూ అన్నాడు స్వరూప్

"అక్కడకు యివి వేసుకెళితే మంచు కొండలో నడవలేరు భయ్యా!"

నిజమే మంచు మీద జారకుండా షూస్ వెనుక ముళ్ళలా వున్నాయి 6 రూ.లు తీసుకుని రెండు జతల షూస్ యిచ్చాడు.

పెద్ద కొండ. మామూలు చెట్లతో నిండిన కొండ కాదు. తెల్లటి మంచుకొండ. ఐస్ గడ్డలు మాత్రమే చూసిన వాళ్ళకు తమ కాళ్ళక్రింద తమ చుట్టూ వున్న ఐస్ చూసి సంబరపడిపోయారు.

ఆ మంచుకొండ మీద కొన్ని వేలమంది తిరుగుతున్నారు. నడవటానికి భయపడే వాళ్ళను ముప్పై రూపాయలు తీసుకుని బండిలో లాక్కెళుతున్నారు.

"బం వెళతావా దివ్యా!"

"వద్దు. వద్దు మీ ప్రక్కనే నడుస్తాను" ఇద్దరూ నడవసాగారు. దివ్య జర్రున జారిపోయింది.

"ఆగు. అక్కడే కూర్చో దివ్యా నేనూ వస్తున్నాను." పది అడుగులు క్రిందకు జారిపోయిన దివ్య దగ్గరకు వస్తూ అన్నాడు స్వరూప్.

క్రింప కూర్చుని ఐస్ చేతిలోకి తీసుకుని భర్త మీదకు విసిరింది దివ్య.

"ఏయ్ దెబ్బ తగులుతుంది" చెయ్యి అడ్డం పెట్టుకుని అన్నాడు. అంతలో అతనూ జారి దివ్యకంటే ముందుకెళ్ళి పడిపోయాడు.

"అరెఁమీరూ జారిపోయారా? వుండండి నేనూ మీదగ్గర కొచ్చేస్తున్నాను" అంటూ జారుడుబండలో జారినట్లు జారి భర్త భుజాల మీద పడిపోయింది దివ్య.

ఆ అవకాశాన్ని స్వరూప్ వదులుకోలేదు వెనక్కు తిరిగి ఆమెను ఒడిలో పడేట్లు చేతులు లాక్కున్నాడు.

"ఇదేంటి ఇంతమందిలో" చుట్టూ చూస్తూ అంది ఎవరి సర్కస్ ఫీట్లలో వాళ్ళున్నారు.

ఇద్దరూ ఒకరికొకరు ఆనుకుని కూర్చున్నారు ఆ చుట్టూ తెల్లగా వుండే ఐస్ కొండను చూస్తూంటే వాళ్ళకు సినిమా సీనరీ గుర్తొస్తుందే కానీ వాస్తవం అన్పించడం లేదు.

ఉన్నట్టుండి ఐసు గడ్డలుగా మారి గాలిలో తేలుతున్నాయి. వర్షం కురవసాగింది. గుర్రం దగ్గరున్న మనుష్యులు తొందర చేసారు. ఇద్దరూ ఒకరి చేతులు ఒకరు పట్టుకుని అలా జారుతూ వుంటే దివ్య ఎక్కడ

పడిపోతుందేమోనని ఆమెను గట్టిగా పట్టుకుని గుండెల కత్తుకుని నడుస్తుంటే దివ్యకది తీయటనుభూతిగా వుంది. అతని ఎదలో ఒదిగి అతి సమీపంగా నడుస్తోంటే ఆమెలో పరవశం ఆమె నూపిరాడకుండా చేసింది.

వచ్చేటప్పుడు గుర్రాల్లో ప్రయాణం భయాన్ని కలిగించలేదు. ఆ మంచుకొండ మీద వాళ్ళనుభవించిన తీయటి అనుభూతిని నెమరు వేసుకుంటుండగా రోప్‌వే దగ్గరకు వచ్చేసారు కానీ ఆ జారుడు నేలమీద గుర్రం పడిపోతుందేమో అనే భయంతో ఓ చెట్టుక్రింద ఆగారు. ఒకే షాల్ క్రింద వాళ్ళిద్దరి గుండెలు గుసగుసలాడుకున్నాయి. తెల్లటి సబ్బు బియ్యం సైజులో గింజలు జలజల రాలాయి. వాళ్ళిద్దరూ చెట్టు పైకి చూసారు.

“సబ్బు బియ్యం చెట్లుంటాయా?” ఆ చెట్టు ఆకుల వైపు పరిశీలనగా చూడలేక తల దించుకుని ఆశ్చర్యంగా అడిగింది దివ్య.

“ఏరుకుందామా సరదాగా” అంటూ క్రిందకు వంగి అందుకునే లోపల అదృశ్యమయిపోయాయి. అప్పటికిగాని వాళ్ళకి తెలియలేదు సబ్బియ్యం గింజలు కాదని ఐసు గడ్డలని ఆ చిన్న ఐసు గడ్డలు జల జలా రాలుతుంటే ఆకాశరాజు ఆ దంపతులిద్దరి మీద తలంబ్రాలు పోసినట్టుంది.

“మరిద్దరం ఒకరి మీద ఒకరం తలంబ్రాలు పోసుకున్న ముచ్చట తీరింది మన పెళ్ళప్పుడు. ఇప్పుడు మనిద్దరి మీద మంచు గడ్డల తలంబ్రాలు పోసి తన ముచ్చట తీర్చుకుంటోంది యీ ఐసు కొండ.”

“థాంక్యూ....థాంక్యూ వెరీమచ్” తమాషాగా పైకి చూస్తూ అల్లరిగా భార్యను దగ్గరకు తీసుకుని అన్నాడు స్వరూప్.

ఆ మధుర క్షణాలులాగే నిల్చిపోతే బాగుణ్ణనిపించింది దివ్యకు.

స్వరూప్ దివ్య బస్ ఎక్కే టైమ్‌కు అందరూ వచ్చి వున్నారు. అమ్మాయిలంతా దివ్యను చుట్టేసి నవ్వుతూ నరేష్ చేసిన ఘనకార్యం చెప్పారు.

"నరేష్‌గారూ! అలాటి పందాలు కట్టి ఇలా పడిపోయారేంటి?"

ఆడ పిల్లలంతా అతనికి తెలివొచ్చాక జోక్స్ వేస్తున్నారు.

"ఏమయింది?" పడుకుని వున్న ఆ అబ్బాయి నడిగాడు.

"ఏమవుతుంది ఆ అమ్మాయిలతో పందెం కట్టాడు పైకి నడిచే వెళతానని వచ్చేటప్పుడు మధ్యదారిలో ఫెయింటయిపోయాడు. వీడ్ని మోసుకొచ్చి మేమింకా ఫెయింట్ కానందుకు సంతోషిస్తున్నాము" ఒక అబ్బాయి హాస్యం జోడించి చెప్పాడు.

"అయ్యో! అంత పైకి ఎక్కాలంటే గుండెలవిసిపోవూ!"స్వరూప్ అనేసి సీట్లో కూర్చున్నాడు.

"ఒక్కసారి పల్స్ చూస్తానండి" దివ్య భర్తనడిగింది.

"అతను బాగా మాట్లాడుతున్నాడుగా భయమేమీ లేదు కూర్చో" అన్నాడు స్వరూప్.

అందరూ అలిసిపోయినట్లున్నారు అల్లరి చేయకుండా తమ సీట్లలో కూర్చుని జోగారు.

దివ్యకు నిద్రరాలేదు, గలగల శబ్దాలు చేస్తూ ప్రవహిస్తున్న నీళ్ళు, అడవి పూల వాసనలు, మంచుకొండ చల్లదనం వదిలి నిద్ర పోవాలనిపించలేదు.

స్వరూప్ నిద్రపోయి తనకు తెలియకుండానే తలను దివ్య భుజాల మీదుంచాడు. నిద్ర కొద్దిగా మెలుకువ వచ్చినప్పుడు తన భారాన్ని భార్యమీద వేయకుండా జాగ్రత్తగా సీటు కానుకుని పడుకుంటున్నాడు. నిద్రలో కూడా భార్యమీద చెయ్యి వేసి దగ్గరకు తీసుకుంటున్నాడు. ఆమెకు భర్తమీద మమకారం పెరిగిపోతూ వుంది. అతను కొత్తవాడు

అనే సత్యాన్ని దూరం చేస్తోంది. అతన్ని వదిలి వుండలేనేమో అనే భావన గుండెల్లో చోటుచేసుకుంది. ఆమెకు టైమ్ ఎంతయిందో తెలియ లేదు. కాశ్మీర్ పట్టణంలో కొచ్చి బస్ ఆగింది. అందరూ నిద్రకు గుడ్ బై చెప్పి లాడ్జి వైపుకు వడిచారు.

★ ★ ★ ★

"అబ్బ! దివ్యా! పడుకో" లేవబోతున్న దివ్యను చుట్టేసాడు స్వరూప్.

"టైం ఎంతయిందో తెల్సా మీకు" గడియారం వైపు చూపుతూ అంది దివ్య.

"ఎంతయినా పరవాలేదు" దుప్పటి ఇద్దరకూ కలుపుతూ నసిగాడు.

"ఇది కాశ్మీర్ కాదు నాథా" దుప్పటి లాగేస్తూ అంది దివ్య.

"కాశ్మీర్ అయినా, నెల్లూరయినా నువ్వు నా ప్రక్క నుండడం అబద్ధం కాదుగా."

"కానే కాదు" నవ్వును బిగపట్టుకుంటూ అంది దివ్య.

"అందుకే అప్పుడే లేచి నా అందమయిన సుప్రభాత వేళను చెరిపెయ్యకు శ్రీమతీ!" అతని గొంతులో చిలిపి తనం-అతను దివ్య మీద వేసిన చేతుల్లో యీమె నా స్వంతం అనే అధారిటీతో కూడిన ప్రేమ.

"నాకు హాస్పిటల్ కెళ్ళే టైమ్ అయిందిగా" ఆమె నోటినుండి మాత్రమే ఆ మాటలు వచ్చాయి గానీ ఆమె మనస్సు అతని సాన్నిధ్యాన్నే కోరుకుంటుంది.

"లేవక తప్పదంటావా?"

"ఊహూ...."

"నాకు లేవాలనే లేదు ఎలా?"

"ఏం చేయాలనుంది మరి."

"నీ కళ్ళల్లో కళ్ళు పెట్టి ఊసులాడుకోవాలనుంది డియర్."

"దిద్దుకోండి మహాశయా కళ్ళల్లో కళ్ళు పెడితే ఊసులు రావు రాంగ్."

"ఎందుకు రావు ఇలారా నా దగ్గర కూర్చో నా కళ్ళలో చూడు. ఊఁ గుడ్ ఇప్పుడు చెప్పు? వూసులాడుకుంటున్నాయా? లేదా?" భార్య ముఖాన్ని అతని దోసిట్లోకి తీసుకుని తదేకంగా భార్య కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

దివ్యకు కనురెప్పలు వాలిపోకుండా అతన్నే చూడాలని వుంది. ఆమెకూ అతని ప్రక్కనే వుండి అతను చెప్పే తియ్యటి కబుర్లే కాదు. అతనందించే మధురమయిన అనుభూతిని వెయ్యేళ్ళు సరిపడేలా గుండెల్లో దాచుకోవాలనుంది

కానీ యిప్పటికే నెలరోజులుగా తన డ్యూటీ మర్చిపోయిందనే గిల్టీ కాన్షెస్ నుండి బయటపడాలని భర్తను సున్నితంగా తప్పించుకుని లేచింది.

* * * *

"వర్క్ అవగానే వచ్చేస్తాను. నువ్వు పేషెంట్లను పూర్తి చేసేసుకో దివ్యా. ఇద్దరం కలిసి వెళ్ళిపోవచ్చు."

"అలాగే వచ్చేయండి" కారు కదలగానే క్లినిక్ లోపలకి నడిచింది.

డాక్టరమ్మ వచ్చిందని ఎలాతెలుసుకున్నారో అప్పటికే పేషెంట్లు వచ్చేసి వున్నారు.

"ప్రయాణం బాగా జరిగిందామ్మా" సిస్టర్ కమల అడిగింది.

నవ్వుతూ బాగానే జరిగిందన్నట్టు తలూపింది.

"ఫస్ట్ పేషెంటును లోపలికి పంపు కమలా" అంది దివ్య. కాశ్మీర్ నుండి తెచ్చిన షాల్ ఆమె కందిస్తూ.

ప్రతి పేషెంటుని వాళ్ళ కంప్లెయింట్స్ అడిగి వాళ్ళకు తగినట్లు ట్రీట్‌మెంటు ఇచ్చి పంపేస్తుంది.

"డాక్టరమ్మా! నువ్వయితే అందరిలా పుచ్చిన పన్ను పెరికి పారేయవంట బాగా శుభ్రం చేసి అదేదో సిమెంటు పెడతావంట ఆశతో వచ్చాను."

అతన్ని కుర్చీలో కూర్చోబెట్టి అతను చెప్పిన పన్నుని నిశితంగా చూసి నవ్వుకుంది దివ్య.

అరవై యేళ్ళ అతనికి పన్ను పుచ్చిపోయినా పెరికించుకోవడం ఇష్టలేదు

"మీరు...."

"మీరు ఎందుకు లెండమ్మా. నువ్వు చదువుకున్న తల్లివి నన్ను నరసయ్యా అని పిలువు చాలు" అన్నాడతను.

"చూడు నరసయ్యా! పన్ను నొప్పి రాగానే డాక్టరు దగ్గరకు వస్తే క్లీన్ చేస్తాము లేదా సిమెంటు పెడ్తాము అప్పుడు పన్ను వూడిపోయే ప్రమాదం వుండదు కానీ పన్నునొప్పి వచ్చిన సంవత్సరానికి వచ్చానని నువ్వే చెపుతున్నావుగా. ఇప్పుడు నీ పన్ను పూర్తిగా పాడయిపోయింది. ఆ పన్ను పెరికేయాలి. పెరికేయనా?" ఆ వృద్ధుడ్ని అడిగింది దివ్య.

"మరి మా ఇంటి ఎదురుగా వున్న కిష్టయ్య పన్ను నొప్పితో అల్లాడిపోయి నీ దగ్గరకు వస్తే అదేమిటో చేసావంట రెండు సంవత్సరాలయినా యిప్పటికి మరలా ఆడి పన్ను కదలనే లేదు. అందుకేగా పామూరు నుండి నీ దగ్గరకే వచ్చాను" అతనిలో యింకా ఆశ చావ లేదు.

"మీరు పెరికేయండమ్మా! అరవై యేళ్ళు వస్తే ఇంకా పళ్ళు వూడిపోకుండా ఎలా వుంటాయి?" అతని కొడుకు కుర్చీ ముందు నిల్చుని అన్నాడు వినయంగా.

"మన ఎదురింటి కిష్టయ్యకు చూసిందీ ఈ అమ్మేగా ఆడికి మాత్రం యాభయ్ యేళ్ళు లేవూ!" కొడుకుని నిలదీసాడు.

"పన్ను పరిస్థితిని బట్టి మేము చూస్తాం నరసయ్యా! అతనికి హాట్ కెపార్స్ చేసాను. నీకు అలా చెయ్యటం వీలవదు."

"ఇదిగో డాక్టరమ్మా! నువ్వు నా పన్ను పెరికే పనయితే నేనెళ్ళి పోతానంతే"

"డాక్టరమ్మను బెదిరిస్తున్నావా?" అని నవ్వేసింది.

"మీరు చూడండమ్మా. పెరికేయాల్సివస్తే మమ్మల్నడిగేదేముంది పెరికేయండి" అతని కొడుకు చేతులు కట్టుకుని నిలబడి అన్నాడు.

"చూడు నరసయ్యా! పన్ను తీసేస్తాను ప్రస్తుతం తర్వాత నీకు నేను పర్మినెంటు పన్ను కడతాను సరేనా!"

"కట్టుడు పళ్ళు తీసి పెట్టుకుంటుండాల నా కొద్దులేమ్మా." అతని ముఖంలో నిరాశ.

"అలాటి పన్నుకాదు. నీకు నేను కడితే యిక ఆ పన్ను తీసే ప్రసక్తే వుండదు. నీ పన్నులాగే వుంటుంది సరేనా."

ఈ సారి ఆశ్చర్యపోయాడు అతని కొడుకు.

"అలా ఎలా వీలవుతుందమ్మా."

"ప్రక్క సపోర్ట్‌కు ఒక పన్ను తీసుకుని కడతాం."

"అయితే తీయక తప్పదంటావా?" కొడుకు వైపు బేలగాచూసాడు నరసయ్య.

"అంత చదువులు చదువుకున్న అయమ్మకు మనం చెప్పేదేంటి నువ్వూరోక్క గోల చేయక కూర్చో."

పది నిముషాలు తన కాలాన్ని తినేసిన ఆ తండ్రీ కొడుకులను వినుకోక్కలేదు దివ్య.

ఆమెలో ప్రత్యేకతే అది పేషెంటు తన దగ్గర నుండి తృప్తిగా వెళ్ళాలనేదే ఆమె కోరిక.

లైట్ ఆన్‌చేసి ఇన్‌స్ట్రుమెంట్స్ బాక్స్‌లో చెయ్యి పెట్టింది. మౌత్ మిర్రర్‌లో మరలా ఒకసారి పుచ్చిన పన్ను చూసుకుని....

జైలోకిన్ లోడ్‌చేసి ఇంజక్షన్ చేసి పది నిముషాలాగి ఎస్ట్రాక్షన్ ఫోర్‌సిప్స్‌తో పన్ను పెరికేసింది.

"బాధగా వుందా?" చేతులు కడుక్కుంటూ అడిగింది దివ్య.

"వుంది" ఆ వృద్ధుడు కుర్చీలోంచి లేస్తూ అన్నాడు.

"అబద్ధం చెప్పకయ్యా! మీకిచ్చిన మత్తు యింజక్షన్ వల్ల ఇప్పుడు నొప్పే వుండదు" నర్స్ కమలమ్మ కసిరినట్టుగా అంది.

"డాక్టరమ్మ బాధగా వుందా అంటే వుంది అన్నానేకాని పన్ను నొప్పి అన్నానా?"

"మరింకేమిటి?" రెట్టించింది కమలమ్మ.

"పన్ను పెరికేసారని నా బాధ."

"చాల్లేవయ్యా! బాలాకుమారుడులా బాధపడుతున్నావ్‌గానీ!"

"వూర్కో కమలా!" అనేసి మీరేం బాధపడక్కరలేదు. కొద్ది రోజులు పోయాక రండి నేను మీకు యింత కంటే మంచి పన్ను కడతాను. యిప్పుడు చెప్పండి మీకు బాధ లేదు కదూ!" మందులు వ్రాసి కాగితం అతని చేతికిస్తూ అంది దివ్య.

"అలాగే వస్తాం డాక్టరమ్మా" అంటూ సంతోషంగా అతను వెళుతుంటే తృప్తిగా నవ్వుకుంది దివ్య.

గంట తర్వాత....

"పేషెంట్లంతా అయిపోయారా కమలా?" చేతి కంటుకున్న బ్లడ్ పోకపోతే మరలా వాష్ చేసుకుంటూ అడిగింది దివ్య.

"అయిపోయారు మేడమ్" ఆమె భుజాలచుట్టూ పడిన చేతుల స్పర్శకు ఉలిక్కిపడింది దివ్య.

చిద్విలాసంగా నవ్వుతున్నాడు స్వరూప్.

"హడలకొట్టేసారండీ"

"ఎందుకూ?" ఆమె చేతికి నాప్‌కిన్ అందిస్తూ అడిగాడు.

"ఎందుకేవిటీ ఈ టైమ్‌లో మీరిలా వచ్చి నన్ను...."

"ప్రతిరోజూ ఇదే టైమ్‌కు ఇక్కడకు వచ్చి దేవీగార్ని ఇంటికి తీసుకెళ్ళే కార్యక్రమాన్ని చేపట్టిన మొదటిరోజు కదా చిన్న థ్రిల్ అంతే...."

ఆమెకి అనుభవం క్రొత్త. ఎప్పుడో ఏ మూడుగంటలకో ఇంటి కెళ్ళి టైమ్‌కు భోంచేయవు ఆరోగ్యాలు పాడవవూ అనే అమ్మ స్తోత్రాన్ని ప్రతిరోజూ వింటూ భోంచేసే తనకి రోజు తన భర్త తనకోసం రావడం ఇద్దరూ కల్సి వెళ్ళడం ఎంత ఆనందం.

ఏమిటి తనిలా అనుకుంటుంది. తను కనీసం ఇంకా ఒక గంట కన్‌సల్టేషన్ రూమ్‌లో పేషెంట్లకోసం వుండాలనే విషయం మర్చిపోతే ఎలా? అదే అంది భర్తతో.

"నో....నో....నీ టైమింగ్స్ మార్చేసుకో. అంతేకానీ టైమ్‌కు భోజనం, టైమ్‌కి నిద్ర, టైమ్‌కి సరదాలు" అంటూ ముందుకు వంగబోయాడు.

"స్టాప్ స్టాప్. ఇది హాస్పిటల్ ఫస్ట్ పాయింట్. దెన్ నేను ఓ బాధ్యతగల డాక్టర్ని సెకండ్ పాయింట్."

"హోవోయ్ బడాయి. నేనూ ఓ బాధ్యతగల భర్తనే"

"ఆ బాధ్యతలు ఏవిటట?"

ప్రొద్దున్నే లేవగానే....

"ముందు రూమ్‌లో కమల వుంది. మీ నోటికి తాళంవేయక తప్పదు." వాడేసిన ఇన్‌స్ట్రుమెంట్స్‌ను కడిగేయడానికి కమలను పిల్చింది.

కమల ఇంటికెళ్ళిపోయి వాళ్ళాయనతో భోజనం చేసేస్తూ వుంటుందిగానీ మీ హాస్పిటల్‌కు తాళం వేయొచ్చు"

"ఏవిటీ కమలను పంపేసారా? మరి ఇవన్నీ ఎలా?" కడగాల్సిన ఇన్‌స్ట్రుమెంట్స్ వైపు నిస్సహాయంగా చూస్తూ అంది.

"కాసేపు ఇలానే వున్నావంటే నిన్నూ...."

"వద్దు వద్దు నేను వచ్చేస్తున్నాగా"

భోజనం చేస్తున్నంతసేపు స్వరూప్ సరదాగా కబుర్లు చెప్తూనే వున్నాడు.

ఆమె కూ మొదటిరోజు కాబట్టి పేషెంట్లు లేనందువల్ల రాగిణి గంటసేపు వుండి వెళ్ళిపోయాడు స్వరూప్ అతను వెళ్ళిపోయినా అతని అల్లరి, అతని జోక్స్ తల్చుకుని నవ్వుకుంటూనే వుంది దివ్య.

"సాయంత్రం పిక్చర్‌కెళదాం దివ్యా! నేను ఫైవో క్లాక్ వచ్చేస్తాను రెడీగా వుండు" ఫోన్‌లో చెప్పాడు స్వరూప్

"భలేవారే ఇంకా హనీమూన్ మూడ్ వదిలినట్లులేదే మీకు. 4 గంటల నుండి 8 వరకు నా ఒ.పి. వుంచని మర్చిపోతే ఎలా?"

"ఓ! నాకు తెలియదు గదా. ఓన్లీ మార్నింగ్ ఒపి అనుకున్నాను. అయినా నువ్వేమీ గవర్నమెంటు ఉద్యోగివి కాదుగా మనిష్టం వచ్చినప్పుడు లీవ్ దొరుకుతుందిలే రెడీగా వుండు."

"గవర్నమెంటు జాబ్ అయితేనే ఒక కాగితంమీద వ్రాసేసి రావొచ్చు కానీ ప్రైవేట్ ప్రాక్టీస్ అలా కుదరదు మహాశయా!" డాక్టరమ్మ యిర్రెగ్యులర్ అంటే పేషెంట్లు వుండరు."

"ఉండకపోతే పోయారులేవోయ్ నేను లేనా నీకు?"

"ఆదివారం మనం పిక్చర్‌కు వెళదాం ఈరోజు వదిలేయండి."

"నీ ఇష్టం" ఫోన్ పెట్టేసాడు స్వరూప్.

భర్తకు కోపం వచ్చిందేమోనని భయపడింది దివ్య.

ఐదు నిముషాలు ఆలోచించి ఫోన్ చేసింది.

"హలో"

"నేను దివ్యను. కోపం వచ్చిందా?"

"ఎందుకూ?"

"పిక్చర్‌కి రానన్నాని."

"అదేం లేదు దివ్యా! ఎంతో హాయిగా వుంది నాకు నీ దగ్గరే ఉండాలని వుంది, నాకీ లెక్కలు చూడాలనిలేదు. నువ్వులేని యీ ఎయిర్ కండీషన్ గది సెగలు పొగలుగా వుంది. అందుకే ఫోన్ చేశాను. నేను ఫోన్ చేసి నీతో మాట్లాడిన ఆనందంకంటే నీ దగ్గరనుండి ఫోన్ వస్తే ఎంతో హాయిగా వుంది. యిప్పుడు నా రూమ్‌నిండా పన్నీటి జల్లులు కురుస్తున్నాయోచ్!"

"ఏవిటీ దొరగారు కవిత్వం చెప్పేస్తున్నారే!"

"కవిత్వం నా పెళ్ళయిన రాత్రినుండి నా నోటినుండి కాదు నా గుండెల్లోనుండి అదీ కాదులేవోయ్ నీ సాహచర్యంనుండి పుట్టింది."

కిలకిల నవ్వింది దివ్య.

"మాట్లాడరేం?"

"ఫోన్‌లో ముత్యాలు రాలాయి ఏరుకుంటున్నాను"

స్వరూప్ కోపం పోయిందని తెలిసాక దివ్య మనసు తేలిక పడింది.

"పోనీ సెకండ్ షోకి వెళదామా?"

"ఓ డియర్. నో....నో.... సెకండ్ షో టైమింగ్స్ తెల్సా నీకు"

"ఎందుకు తెలియదు తొమ్మిదిన్నరకు మొదలవుతుంది. మొదలవడం వరకు బాగానే వుంటుంది డియర్. పిక్చర్ వదిలే టైమ్ మాత్రం బాగలేదు. ఉహుఁ నేను రాను"

"బాగలేకపోవడమేవిటి? ఎందుకు రారు?"

"టైం వేస్టయిపోతుంది" ఫోన్‌లో గుసగుసగా అన్నాడు.

"ఏయ్! యిలా అయితే నేనిక ఫోన్ పెట్టేస్తాను"

"ఫోన్ పెట్టేముందు ఒక్కటి పెట్టేయ్ డియర్"

"అల్లరి ఎక్కువై పోతుంది బాబూ మీకు" ఫోన్ పెట్టేసింది దివ్య

ఫోన్ పెట్టేసిందే కానీ ఆతని మాటలు ఆమెను వివశురాల్ని

చేసాయి. తనంటే భర్తకు యిష్టం. ఆ భావనే ఆమెలో ఆనందాన్ని నింపింది.

హాస్పిటల్ కెళ్ళేసంతదూరం ఆలోచిస్తూనే వుంది దివ్య. పెళ్ళికి ముందులా తనిప్పుడు తనిష్టానుసారంగా సరదాలకు దూరంగా వుండా లనుకుంటే తనను ప్రేమించే తన భర్తను విసిగించినట్లవుతుంది. తను హాస్పిటల్ టైమింగ్స్ మార్చుకోక తప్పదు అనుకుంది.

★ ★ ★ ★

స్వరూప్, దివ్య ఎనిమిది గంటలకు ఇంటికొచ్చేసరికి వరండాలో కుర్చుని వున్నాడు చంద్రకిరణ్.

"అరెః చందూ ఎప్పుడొచ్చావ్ లోపల కూర్చోకపోయావా?" ఆనందంగా స్నేహితుడికి ఎదురెళ్ళాడు స్వరూప్

"ఏమ్మా ప్రయాణం కులాసాగా జరిగిందా?"

"జరిగిందన్నయ్యా! మీరు లోపలికి రండి అందరికీ భోజనం వడ్డించేస్తాను" అంది దివ్య.

స్నేహితుడు కూర్చున్నాక తనూ కూర్చున్నాడు స్వరూప్.

"హనీమూన్ ట్రిప్ ఎలా వుంది? కొత్తదంపతుల మెలకువలు చెప్పక్కర్లేదుగానీ ఏ ఏ ప్లేసెస్ చూసారో చెప్పు. కాశ్మీర్ అందాలు బాగున్నాయా? లేక ఆ అందాలు బదులు మా చెల్లెమ్మనే చూస్తూ కూర్చు న్నావా?"

"పోరా! నీకు పెళ్ళవకపోతుందా? బదులు తీర్చుకోకపోతానా" కాశ్మీర్‌లో అందాలు నోటితో చెప్పేవి కాదురా. ఆ మంచుకొండల చల్ల దనం, ప్రకృతి ఒడిలో పచ్చదనం, రంగు రంగుల పువ్వులచెట్లతో నిండిన గార్డెన్స్, దారి పొడవునా కొండలమీద నుండి దుమికే జల పాతాల గలగలలు జీవితంలో ఒకసారి కాశ్మీర్ చూడాలిరా. నీ పెళ్ళ య్యాక మీరిద్దరూ కాశ్మీర్‌కే హనీమూన్‌కి వెళ్ళండి"

"ఏదో సామెత వుందంట. ఆలూలేదుసూలూలేదు కొడుకు పేరు

సోమలింగం అని.... అలా.... నాకింకా పెళ్ళి కాలేదు భార్యతో హనీ మూన్ ఎలా వెళతాను?"

"ఏం పెళ్ళి ప్రయత్నాలేమీ జరగడం లేదా?"

"ఆ....ఆ....ఆ ప్రయత్నాల్లోనే వున్నారు పెద్దలంతా."

"నువ్వు లేవా?"

"వాళ్ళ ప్రయత్నాలు లేకుంటే నాకు తప్పదనుకో ఇప్పుడు నాకా శ్రమ లేదుగానీ నీ బిజినెస్ ఎలా వుంది?

"బిజినెస్ బాగానే వుందిరా. బాధల్లానే నక్కకుండాలి ప్రతి క్షణం. పెళ్ళికి ముందు నా కేమీ అన్పించేది కాదు కానీ ఇప్పుడు చాలా విసుగ్గా వుంది.

"మా చెల్లెమ్మను అదృష్టవంతురాల్ని చేస్తున్నావన్న మాట."

"ఏ మదృష్టంలే దివ్య ఆ క్లినిక్‌లో నేను ఫ్యాక్టరీలో మా ఇద్దరికీ తెలవల్లేని జాబ్స్"

"జాబ్ ఏదయితేనేమిరా ఈ రోజు మారుతీ కారంటావ్ రేపు టయోటా అనగలవు. మేము అలా కాదుగా ప్రతి నెలా వచ్చే జీతం డబ్బులు మీదే ఆధారపడాలి."

"మనం హాపీగా వుండాలంటే మొదట స్వేచ్ఛ కావాలిరా. ఆ స్వేచ్ఛ కావాలంటే యిలాంటి బిజినెస్‌లు పనికిరావు."

"ఓ పని చెయ్యి నువ్వు చెల్లెమ్మ పి.ఎ గా వుండిపో. ఈ విసుగు నీ దగ్గరకు రాదు" నవ్వుతూ లేచాడు చంద్రకిరణ్.

"నీకు నవ్వులాటగానే వుంటుందిలే రేపు నీకూ పెళ్ళవుతుంది. క్లాస్ రూమ్‌లో స్టూడెంట్స్‌కి గుడ్‌బై చెప్పాలనుకుంటావు."

"అప్పుడు చెప్తానో లేదో కానీ ఇప్పటికి నీకు గుడ్‌బై చెప్పకుంటే లోపల చెల్లెమ్మ నన్ను తిట్టుకోగలదు. అమె దాకా ఎందుకు నువ్వే నన్ను తరిమేస్తావ్" అని తమాషాగా అని....

"వస్తానమ్మా" అని దివ్యకు చెప్పి వెళ్ళిపోయాడు.

దివ్య బలవంతం చేసినా భోజనానికి వుండలేదు చంద్ర కిరణ్.

"రేపు మీ దగ్గరకు నేను వచ్చి డిస్టర్బ్ చేస్తానని భయపడి ముందు జాగ్రత్త తీసుకుంటున్నావా?" అని నవ్వాడు స్వరూప్.

"రేపొస్తాగా" అంటూ వెళ్ళిపోయాడు.

తన పని ముగించుకుని దివ్యను తీసుకెళ్ళడానికి వచ్చాడు స్వరూప్

దివ్య ట్వీజర్ మిర్రర్‌తో పేషెంటు నోట్లోకి వంగి చూస్తోంది.

"వెళదామా?"

"పది నిముషాలు యీ పేషెంటు పళ్ళ క్లీన్ చేసేసి వస్తాను" తను కూర్చునే కుర్చీ చూపించింది భర్తను కూర్చోమన్నట్టు....

ఎలక్ట్రానిక్ స్కేలరీతో పేషెంటు పళ్ళ క్లీన్ చేస్తుంది దివ్య.

దివ్య కోసం ఎదురు చూస్తున్నాడు స్వరూప్.

అ పేషెంటును పంపేసి కదిలింది దివ్య.

ఆమె కన్‌సల్టేషన్ రూమ్ వెలుపలికి వచ్చేసరికి అరవై యేళ్ళ వృద్ధుడు పద్దెనిమిది సంవత్సరాల అమ్మాయి కూర్చుని వున్నారు.

"మీరు ఆఫీస్ రూమ్‌లో కూర్చోండి. వీళ్ళను పంపేసి వస్తాను."

"వెయిట్ చేయడం డామ్ బోర్ నేను అలా వెళ్ళి పదినిముషాల్లో వచ్చేస్తాను రెడీగా వుండు."

"అలాగే అని భర్తను పంపేసింది.

ఎన్నడూ లేనిది ఆమెకూ త్వరగా పేషెంట్‌ని చూసి భర్తతో వెళ్ళిపోవాలనిపించింది.

"కూర్చోండి" ఇంటికెళ్ళిపోవాలని వున్నా ఆమె పెదాలమీద చిరునవ్వు చెదరలేదు.

"ఇదిగో యీ అమ్మాయి నా మనుమరాలమ్మా పేరు లలిత. పెళ్ళి చేయాలను కుంటున్నాము ఈ పిల్లకేమో చదువుకోవాలనుంది. మధ్య

తరగతి కుటుంబీకులం చదివిస్తే అంతకంటే పైన చదివినవాడ్ని తీసుకు రావడమంటే ఈ రోజుల్లో మాటలా చెప్పు తల్లీ!"

నవ్వింది దివ్య

ఆమెకిది అలవాటే! పేషెంటు వచ్చిన విషయానికి రావాలంటే ఇలాంటి ఉపోద్ఘాతాలు వినక తప్పదు.

"ఇప్పటికి అరడజను సంబంధాలు చూసాము. ఏ ఒక్కటీ కుదిరి రావలేదు. లలితను చూసిన పెళ్ళికొడుకులు మాకు నచ్చలేదు అంటున్నారు."

ఆ వృద్ధుడి కంఠంలో బాధ.

అప్పుడు తలెత్తి లలిత వైపు చూసింది దివ్య.

తెల్లగా, సన్నగా పొడవుగా వుంది ముందు పళ్ళు రెండు బాగా ఎత్తుగా వున్నాయి.

"పళ్ళు ఎత్తు అంటే తల్లీ ఏం రోజులో ఏమిటో మా రోజుల్లో అందానికి ఇంత ప్రాముఖ్యత యిచ్చే వాళ్ళు లేదు తల్లీ లేదు. ఏదో సాంప్రదాయమయిన కుటుంబంలో అమ్మాయి .గుణం చూసుకునే వాళ్ళమంతే. గుణం ప్రధానంకానీ అందం ఏం ప్రధానం....' అతని కళ్ళల్లో నీటి సుడులు గొంతులో మాటను ఆపేసాయి

ఇలాంటప్పుడే నర్స్ కమలకు డాక్టరమ్మను చూస్తే ఆశ్చర్యంగా వుంటుంది.

ఎలా వుంటారీమె యింత సహనంగా అన్పిస్తుంది. తన సబ్జక్ట్‌కు అనవసరమయిన యీ సోదినంతా ఎలా వింటారబ్బా అని కూడా అన్పిస్తుంది· అందుకే ఆ ముసలాయన వైపు తిరిగి అంది.

"డాక్టరమ్మ భోజనానికి వెళ్ళాలి. మీరెందుకొచ్చారో చెప్పండి" అంది.

"ఈ పిల్లకు ఆ పళ్ళు ఎత్తు లేకుండా చెయ్యి తల్లీ పదిహేను రోజుల్లో యింకో సంబంధం వాళ్ళు పిల్లను చూసుకోడానికి వస్తానన్నారు

"పళ్ళ ఎత్తు తగ్గిస్తాను కానీ పదిహేను రోజుల్లో వీలు కాదు కనీసం ఆరు నెలలు టైమ్ కావాలి."

"ఆరు నెలలా? ఎలా తల్లీ వాళ్ళాగుతారా? మీరు ఓర్పుగ చూస్తారని టౌన్‌లో చెపితే వచ్చాం. ఎలాగయినా పదిహేను రోజుల్లో తగ్గించేట్టు చూడమ్మా."

మెల్లిగా నవ్వి ఎక్స్‌ప్లెయిన్ చేసింది దివ్య.

"చూడండీ! మేము యీ పళ్ళ ఎత్తు తగ్గాలంటే క్లిప్స్ వేస్తాము. క్లిప్‌కి ఫోర్స్ ఎక్కువయితే చిగుర్లు కమిలిపోయే ప్రమాదం వుంది. అందుకని మెల్లి మెల్లిగా ఆ క్లిప్పు వల్ల ఎత్తు తగ్గుతుందేగాని అర్జంటుగా తగ్గాలంటే కష్టమయ్యా! తగ్గేట్లుంటే వేయడానికి మాకేం కష్టం చెప్పు."

"అలా అయితే మరలా వస్తాం తల్లీ యింట్లో ఆళ్ళమ్మ నాన్న ఏమంటారో" నిరుత్సాహంగా అని వెళ్ళాడు.

పది నిముషాల తర్వాత భార్య కోసం వచ్చిన స్వరూప్ కళ్ళ తేలవేసాడు.

వెయిటింగ్ రూమ్ నిండా పేషెంట్లు....

ఎయిర్ టోర్‌తో ఒక పేషెంటుకు సిమెంటు పెడుతున్న దివ్య తలెత్తి చూసింది. ఎదురుగా అసహనంగా నిల్చుని వున్న భర్త.

"వచ్చేసారా? కూర్చోండి."

"వీళ్ళంతా ఎప్పటికి అయ్యేది. నేను రెండు గంటలకిరోజు తప్పని సరిగా ఫ్యాక్టరీలో వుండాలి దివ్యా."

"మీరు పదిహేను నిమిషాలు కూర్చోండి. నేను వచ్చేస్తానండి."

సెకండ్లుముల్లు నిముషాల చుట్టూ తిరిగి ఒక గంటలో స్నేహం చేసాయి. అప్పటికి పూర్తయ్యారు పేషెంట్లు.

"వెళదాం పదండి."

"ఓ.కే. నిన్ను దింపేసి నేను వెళ్ళిపోతాను పద....పద."

"అదేంటి భోంచేయరా?"

"నువ్వు భోం చేసి పడుకో నేను నాలుగు గంటలకు వచ్చే స్తాను."

"మీరు భోంచేసి వెళుదురుగాని రండి" కారులో నుండి దిగని భర్తతో అంది.

"లేదు దివ్యా! ఐరన్ రాడ్స్ దింపి డౌన్‌లో పెట్టించాలంటే నాలు గవుతుంది. మనకోసం వాళ్ళు ఆగరుగా. నైట్‌కు ఇద్దరం కల్సి తిందాం అనేసి వెళ్ళిపోతున్న భర్తను చూసి అనుకుంది దివ్య–

తన టైమింగ్స్ భర్త కనుగుణంగా మార్చుకోవాలని అలా అను కున్న దివ్యకు నెల రోజులు గడిచినా అమలు పర్చడం కుదరలేదు. వచ్చే పేషంట్లను ఆపలేదు. వచ్చిన పేషెంట్లను తృప్తిగా పంపించే ప్రయత్నంలో కాలమెంత గడుస్తుందో అర్థం కావడంలేదు.

వరుసగా వారం రోజులు ఒంటిగంటకు తన పని పూర్తిచేసు కుని పట్టు విడువని విక్రమార్కుడిలా దివ్యకోసం వచ్చిన స్వరూప్‌కు నిరాశే ఎదురయింది. అందుకే మధ్యాహ్నం ఇద్దరు కల్సి భోంచేయను పిలవలేదు. సాయంత్రం తనపని ముగించుకుని వచ్చేసరికి దివ్య హాస్పి టల్‌కు వెళ్ళేది. ఆమె తన వర్క్ పూర్తయిందని ఫోన్ చేస్తే వెళ్ళి తీసుకువచ్చుకునే ఏర్పాటు చేసుకున్నారిద్దరూ.

"దివ్యా! అలా పేషేంటు నోట్లో నీకు చెయ్యి పెట్టాలంటే ఎల ర్జీగా అన్పించదూ" షేవ్ చేసుకుంటూ అడిగాడు స్వరూప్.

"అలా మొహంమీద బ్లేడు పెట్టుకోవాలంటే మీకు ఎలర్జీగా వుంటుందా?"

"నేను మగవాడినోయ్! ఈ డ్యూటీ నాకు తప్పదు" మీసం షేప్ సరిగా వుందో లేదో చూసుకుంటూ అన్నాడు.

"నేనూ పంటి డాక్టరమ్మనండీ అదీ నా డ్యూటీనే"

"ఇది నా ముఖం కాబట్టి ఏమీ అన్పించదు. మరి నీవేమో వచ్చి ప్రతి పేషెంటు నోట్లో అలా వేలు పెడుతూంటే నాకే ఏంటోల వుంది."

పకపక నవ్వింది దివ్య.

"అలా నా కెప్పుడూ అన్పించదే. వాళ్ళ బాధను నా చేతులతో తీసేస్తున్నందుకు తృప్తే తప్ప" అనేసి భర్త వైపు తిరిగిన దివ్య-

"అదేమిటండీ అలా కోసుకున్నారు. అబ్బ బ్లడ్‌వస్తుందిచూడండి" కంగారుగా అంది.

"సతీదేవీ! ఈ బ్లడ్‌కే కంగారుపడితే మీ పేషెంటు నోట్లోనుండి అంతంత రక్తం ఎలా చూస్తావ్?"

"సర్లెండి. యిలా ప్రతి పేషెంటు రక్తంచూసి నేను కంగారు పడితే నాకు హార్ట్ ఎటాక్ వచ్చేస్తుంది" అల్లిన జడ వెనక్కు వేసు కుంటూ అంది.

"ఇదిగో నువ్విలా రాకపోయావంటే నాకు ఇప్పుడే హార్ట్‌అటాక్ వచ్చేలా వుంది."

అతని చిలిపి తనం తెలిసిన దివ్య బుగ్గలు మందారాలయ్యాయి. ఆమె కళ్ళు వింత సోయగాలతో మెరిసిపోయాయి. ఆమె ముఖంలో ఉద్విగ్నతను కప్పి పుచ్చుకుంటూ భర్త దగ్గరకు నడిచింది.

"అబ్బ ఏవిటండీ! మీ సబ్బు నురగంతా అయింది ఇప్పుడే పౌడర్ పూసుకుని రెడీ అయ్యానా? మరలా ముఖం కడుక్కోవాలి" గారాలు పోయింది దివ్య.

"ముఖం కడుక్కోవాలా? ఇలారా నేను కడిగేస్తాగా. బాత్‌రూమ్ దాకా వద్దు. కష్టపడి నువ్వెళ్ళడమెందుకు?"

అతనికి దొరక్కుండా సింక్ దగ్గరకు నడిచింది..

★

చంద్రకిరణ్ పెళ్ళి సెటిల్ అయింది. ఆనందంగా వచ్చి పెళ్ళికి ఆహ్వానించాడు. చందూ తల్లి అనసూయమ్మకు దివ్యంటే చాలా ఇష్టం.

అందుకే ఆవిడ స్వయంగా వచ్చి నాలుగు రోజుల ముందు రావాలని డిన్నర్ పనులన్నీ మా ముసలివాళ్ళకు తెలియదని మా ఇంటి ఆడబడుచువి నువ్వేనని చెప్పి వెళ్ళారు.

చంద్రకిరణ్ కారు ఎక్కేవరకు స్వరూప్‌కి, దివ్యకి మీరు రాకుంటే నేను పీటలమీదేంకూర్చోనని పదేపదే చెప్పాడు. వాళ్ళ ప్రేమ పూర్వకమైన ఆహ్వానానికి ముచ్చటపడింది దివ్య.

★ ★ ★ ★

బంధు బలగంతో పెళ్ళిల్లు కిటకిట లాడుతున్నా చంద్రకిరణ్ తన రూమ్‌లో స్వరూప్ దివ్యల సూట్ కేస్‌లు పెట్టించి వాళ్ళకు కావల్సిన సదుపాయాలు చూస్తూ కబుర్లు చెబుతూ వాళ్ళ దగ్గరే గడిపాడు.

"నలుగు పెట్టే టైమయిందమ్మా పెళ్ళికొడుకుని రమ్మని చెప్పండి" ఎవరో ఒక పెద్దావిడ కేకేసి వెళ్ళింది.

"మీరు పదండన్నయ్యా! ముత్తయిదువలంతా మీకు నలుగు పెట్టడానికి ఎదురు చూస్తున్నారు?"

"ఎదురు చూసేది మా చెల్లెమ్మయివుంటే పరిగెట్టేవాడు-యింకా ఆ తరుణం రాలేదని పీడిబెంగ" స్నేహితుడిమీద జోక్ విసిరాడు స్వరూప్.

"మొదలు పెట్టావా? పీడు నన్నింక యీ రెండు రోజులూ తినేస్తాడు చెల్లెమ్మా నువ్వు నాకు సపోర్ట్ రావా?"

"ఏమీరాదు. దివ్య నా భార్య నా వైపే వుంటుంది"

"అలా అనకండి పాపం అన్నయ్యకు కవిత సపోర్టు వచ్చే వరకూ"

"మా చెల్లెమ్మా, కవితా పీడికి సపోర్టు రాదు. నావైపేవుంటుంది"

స్వరూప్‌కి స్నేహితుడిని పెళ్ళి అయ్యేవరకూ హాస్యం పట్టించాలని వుంది.

"అయితే దివ్య నావైపేనని అర్థం కదూ!"

"మా చెల్లెమ్మను థియేటర్‌లో చూసి పెళ్ళివరకు తెచ్చావు ఇప్పుడా పప్పులేమీ పెళ్ళిచూపులంటూ లేకపోయేసరికి ఆ రోజు నీమీద జోక్స్ వేయడం మిస్ అయ్యాను. కవితా నావైపే, దివ్యా నావైపే" స్వరూప్ దివ్యచెయ్యి పట్టుకున్నాడు.

"నా కోడలు రాగానే నిన్ను సపోర్టుకి రమ్మనడులేమ్మా దివ్యా వాడు" అనసూయమ్మగారు దివ్య అమ్మను నాన్నగార్ని వెంటబెట్టు కొచ్చి హాస్యమాడింది కొడుకుని.

"అమ్మకూడా స్వరూప్‌వైపే వెళ్ళిపోయిందాంటీ. మీరు అంకుల్ నావైపుండక తప్పదు. అనుకోకుండా త్వరగా కుదరడంతో అంకుల్ ఆంటీకి నా పెళ్ళి తెలియనుకూడా వీలు లేకుండా పోయింది. ఇద్ద రాంటీలు నా పక్షమే వుండుంటారు" స్వరూప్ దివ్య తల్లి వెనక్కి వెళ్ళి అన్నాడు.

"అదే నాకూ కొరతగా వుంది. మా చందూ అంటే పార్వతమ్మకి చాలా ఇష్టం" అనసూయమ్మ అన్నారు.

చందూ పెళ్ళి కుదరబోయేముందు పదిరోజుల క్రితమే స్వరూప్ అమ్మా నాన్న కాశీ, ఢిల్లీ, బదరీనాద్, హరిద్వార్ అలా టూర్ వెళ్ళారు టూరిస్టుతోటి. వాళ్ళు రానందుకు స్వరూప్‌కి స్వరూప్ తల్లిదండ్రులకు కొరతగా వుంది.

"దివ్యా! అమ్మా నాన్నకు టిఫిన్ ఇక్కడికే తెస్తాను. స్నానానికి వేడినీళ్ళు అరగంట తర్వాత పంపుతాను. ఈ లోపల మీరంతా కబుర్లు చెప్పుకుంటూ వుండండి" అంటూ లోపలికెళ్ళిపోయిన అనసూయమ్మను ఆపింది దివ్య.

"మీరుండండి పిన్నీ ఎన్ని పనులని చూసుకోగలరు. అమ్మకు నాన్నకు టిఫిన్ నేను తెచ్చిపెడతాను"

"నాతల్లే! ఈ ఇంటి ఆడబడుచువమ్మా నువ్వు" అని దివ్య రెండు బుగ్గలు తన చేతిలోకి తీసుకుని ముద్దుపెట్టుకుంది.

"అనసూయమ్మగారి కోడలదృష్టవంతురాలు. కన్నకూతుర్ని చూసుకున్నట్లు చూసుకుంటుంది కవితను."

"దివ్యలాటమ్మాయయితే చాలని వెయ్యిదేముళ్ళకు మొక్కుకున్నాను."

"దివ్యకంటే మంచమ్మాయని చెపుతున్నాడాంటీ పీకు" మరలా చందూని ఉడికించాడు స్వరూప్.

"హాస్యాలు తర్వాత మరలా రావుకాలం వస్తుంది. నలుక్కు పెళ్ళికొడుకుని తీసుకురండని మరలా తొందర చేసింది.

చంద్రకిరణ్ పీటలమీద కూర్చునికూడా స్వరూప్‌ని ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు. దివ్యను కూడా స్వరూప్ ప్రక్కన కూర్చునే వరకూ వదలిపెటలేదు.

మనస్సులో నవ్వుకుంది దివ్య. ఇంకెంతసేపు భార్య మెడలో మూడుముళ్ళు వేసేవరకే కదా ఆ తర్వాత చంద్రకిరణ్ స్థానంలో కవిత వుంటుంది భార్యకెంత విలువయిన స్థానం వుందో కదా అనుకుంది. దివ్య ప్రక్కన దివ్య తల్లి వచ్చి కూర్చుంది. వాళ్ళిద్దరూ కబుర్లలో వుండగా పెళ్ళికూతుర్ని తీసుకురండి అని పురోహితుడు తన బాణీలో అడిగాడు.

"అమ్మా దివ్యా నువ్వు వెళ్ళి సరదాగా పె ష్ట తీసుకురా" అనసూయమ్మ పిల్చింది.

అంతమందిలో వెళ్ళాలంటే కొద్దిగా జంకుగా వున్నా మర్యాద తెలియని అమ్మాయి అని అనుకుంటారేమో అని భయం మనస్సులో మెదిలి లేచి నిలబడింది దివ్య.

ఆ కళ్యాణమండపంలో పెళ్ళికూతుర్ని అలంకరించే దానికి ఒక గది ప్రత్యేకంగా వుంది. పెళ్ళికూతురు అలంకరణ ముగిసినట్లుంది కుర్చీలో కూర్చోనుంది కవిత.

పెళ్ళికూతుర్ని తీసుకు తమ్ముంటున్నారు పదండమ్మా అని కవిత దగ్గరకు దివ్యను తీసుకెళ్ళి పరిచయం చేసింది.

దివ్య కవితను చూడగానే అనుకుంది అన్నయ్యకి తగినజోడని. దివ్య చంద్రకిరణ్‌కి పెళ్ళిచూపులు లేకపోవడంతో మొదటిసారి ఆమెని చూసింది.

తల ఎత్తీ ఎత్తకుండా దివ్య వైపు చూసీచూడనట్లు చూసి మెల్లిగా నవ్వింది కవిత.

"అదేమిటి కవితకు బుగ్గచుక్క పెట్టటం మర్చిపోయారు"కాటుక భరిణ చేతిలోకి తీసుకుంటూ ఒకామె అంది.

"ఉహూఁ వద్దు నాకిష్టంలేదు" వారించింది కవిత.

"దిష్టిచుక్క పెట్టుకోకుంటే నీకు దిష్టి తగిలి ఏ జ్వరమో వస్తే మా అబ్బాయి ఇబ్బంది పడిపోగలడు పెట్టేసుకో" నలభై ఏళ్ళున్న ఒకామె సరదాగా అంది.

"దిష్టి పెట్టేవాళ్ళెవరయినా వుంటే సతీసుమతి సూర్యుణ్ని సూర్యోదయం కాకుండా ఆపినట్లు వాళ్ళాయన దిష్టి తగలకుండా ఆపు కుంటానని చెప్పాడు కాబోలు కవితకు" కవిత ఫ్రెండ్ ఆట పట్టిచ్చింది.

అసలు విషయం అదికాదు. కవితకు వాళ్ళాయనచేత మూడు ముళ్ళు వేయించుకోబోయే ఆనందంలో "యివన్నీ వద్దనిపిస్తుంది అర్థం చేసుకోరూ!" స్వర్ణకమలం సినిమాలో భానుప్రియను అనుకరించింది ఒక స్నేహితురాలు.

అప్పటికీ సిగ్గుపడలేదు కవిత.

మా ఆడబడుచు మా తమ్ముడు చంద్రకిరణ్ దగ్గర చాలదేమో నని సిగ్గంతా దాచిపెట్టుకుంటున్నట్లుంది" కవిత వదిన ఒక చురక వది లింది మెల్లిగా.

అక్కడున్న వాళ్ళంతా నవ్వారు కానీ కవిత చిరునవ్వయినా నవ్వలేదు. చీర నగలు సర్దుకుంటూ కూర్చుంది.

వీడియో ప్లాష్‌లు, బ్యాండ్‌మేళాలు వెంటరాగా పెళ్ళికూతుర్ని మంటపం దగ్గరకు తీసుకెళ్ళారు కవిత స్నేహితురాళ్ళు, కొంతమంది ముత్తయిదువలు కలిసి.

దివ్య మనస్సు చివుక్కుమంది.

అక్కడ ఆమె కెవ్వరూ తెలియదు.

అనసూయమ్మ కవితకు దివ్యను పరిచయం చేసి వెళ్ళిపోయింది. అక్కడున్న వాళ్ళల్లో ఇంకెవరూ ఆ అమ్మాయిని పట్టించుకోలేదు. కనీసం కవిత కళ్ళెత్తి రండి అని కూడా పిలవలేదు.

తనకు కాబోయే భర్త ప్రియమైన స్నేహితుడి భార్యని తెల్సి కూడా-ఒక్క నిముషం తర్వాత తనే సర్దుకుంది. పాపం భయపడుతున్నట్లుంది అనుకుంది దివ్య.

పెళ్ళి మండపంలో స్నేహితురాళ్ళ అల్లరి తారస్థాయికందుకున్నా కవిత ముఖంలో సిగ్గుదొంతరలు లేవు.

పెళ్ళి తంతు పూర్తయ్యేవరకూ చంద్రకిరణ్ ముఖం తేజస్సు, మనిషిలో ఉషారు, కళ్ళలో మెరుపు తగ్గలేదు.

కవిత మాత్రం తనచుట్టూ హాస్యోక్తులతో ఆనందిస్తున్న స్నేహితురాళ్ళే లేనట్టు మౌనంగా ఏ భావాలు తన ముఖంలో చూపకుండా వుండిపోయింది.

భోజనాల కార్యక్రమం పూర్తయ్యాక-

"వెళ్ళొస్తారా చందూ!" అన్నాడు స్వరూప్

"అదేంటి మిమ్మల్ని నేను ఈరోజెలా వెళ్ళనిస్తాననుకున్నారు?" వైపు తిరిగి అడిగాడు.

"రేపు మీరొచ్చేలోపల అక్కడ డిన్నర్ ఏర్పాట్లు చూద్దురు రండని పిన్ని పిల్చి వెళ్ళారు. నేను ప్రొద్దున్నే మీ వూరెళ్తున్నాను" దివ్య చంద్రకిరణ్ తల్లిదండ్రులను పిన్ని బాబాయ్ అని పిలుస్తుంది.

"నువ్వెళితే ఏడెందుకు?" నిష్ఠూరంగా స్నేహితుడి వైపు తిరుగుతూ అన్నాడు.

"ఈరోజు నా కంపెనీ నీ కవసరంలేదని నాకు తెల్సు. కానీ నన్ను వదిలెయ్. రేపు మీ దంపతులిద్దరికీ స్వాగతం చెప్తాగా.

కదలబోయిన ఆ జంటను ఆపాడు చంద్రకిరణ్.

"ఒక్క నిముషం ఆగండి కవితను పిలుస్తాను"

అప్పుడే కవితమీద ఏంత స్వతంత్రం అని అనుకోకుండా వుండ లేకపోయింది దివ్య.

"పాపం అలసిపోయిందిలే అన్నయ్యా! రేపు సాయంత్రం మేమిక్కడే వుంటాంగా మీరొచ్చేసరికి" అంది దివ్య.

"అంత స్వజాతి పక్షపాతం తగదు. ఏం చందూ అలసిపోలేదా?" స్వరూప్ భార్యవైపు తిరిగి స్నేహితుడి చెయ్యి పట్టుకుంటూ అన్నాడు.

ఇంతలో చంద్రకిరణ్ 'కవితను పిలుస్తున్నట్లు వార్త అందినట్లుంది కవిత వచ్చింది తల్లిని వెంటబెట్టుకుని.

"నా డియరెస్ట్ ఫ్రెండ్ స్వరూప్" అని దివ్య వైపు తిరిగి-

"నా చెల్లెలు దివ్య లేనికొరత తీర్చింది." అలా పరిచయం చేసాడా భార్యాభర్తల్ని చంద్రకిరణ్.

కవిత తలెత్తి చిన్నగా నవ్విందేకానీ అత్తగారు పరిచయం చేసారనికూడా అనలేదు.

'చెల్లెమ్మకూడా ఎం.డి.ఎస్.నే ప్రైవేట్ ప్రాక్టీస్‌లో సెటిల్ అయిపోయింది."

దానికీ నోరు తెరవలేదు కవిత.

వాళ్ళిద్దరి దగ్గర వీడ్కోలు తీసుకుని కదిలారు దివ్య, స్వరూప్.

"ప్రొద్దున్నే వచ్చేయండమ్మా మీకోసం ఎదురుచూస్తూ వుంటాను స్కూటర్ దగ్గరకొచ్చి అభిమానంగా చెయ్యి పట్టుకుని చెప్పింది చంద్రకిరణ్ తల్లి అనసూయమ్మ.

"అలాగే పిన్నీ ఎందుకు రాము. మేము వచ్చేసరికి మీరు నిద్ర కూడా లేవరు సరేనా"

దివ్య మాటలకు పొంగిపోయిందావిడ.

ఆమెకి వస్తామని చెప్పి స్కూటర్ స్టార్ట్ చేసాడు స్వరూప్.

"చందూ ఉండమంటే వాడ్ని వదలి రావాలనిపించలేదు. కాని అక్కడ కొత్త కదా ఎలా వుండడం?" ఇంటికొచ్చాక భార్యతో అన్నాడు స్వరూప్.

"ఏం మీకు అన్నయ్య వున్నారుగా నా కయితే కష్టంకానీ"

"నీకేం దివ్యా అత్తయ్యగారున్నారుగా"

"అమ్మ మనం యిటు రాగానే వెళ్ళిపోతుంది"

"అదేంటి అత్తయ్య మామయ్య ఇక్కడకు రాకుండానే వెళ్ళిపోతున్నారా?"

"నాన్నగారిక్కి వాయిదా వుందంట. తప్పని సరై వెళ్తున్నారు. రేపు మధ్యాహ్నానికి డిన్నర్ కొస్తామని చెప్పారు. నాన్నగారు మీకోసం వెతికారు వెళ్ళిపోతున్నామని చెప్పడానికి. మీరు కన్పించలేదట నన్ను చెప్పమన్నారు.

"అవును మధ్యలో నన్ను చందూ కర్చీఫ్స్ కోసం బజార్కి తరిమాడు. వాడి సూట్ కేస్లో కర్చీఫ్ పెట్టుకోవడం మర్చిపోయాడట." అనేసి—

"మామయ్య వాళ్ళకి ట్రాన్స్ఫర్ కాకుంటే సరదాగా వుండేది మనమూ వాళ్ళూ ఒకే ఊర్లో"

"అల్లుడు మర్యాదలు తరచూ జరగడం లేదని కొరతగా వుందా?"

"నువ్వు నా ప్రక్కన వుండగా నాకేమిటట కొరత" భార్యను దగ్గరకు తీసుకుంటూ ఆనందంగా అంటున్న భర్తను చూసి పొంగిపోయింది దివ్య

"దివ్యా! మన వీధి చుట్టుపక్కల్లోనే చందూకి యిల్లు వెతకాలి. మామయ్య వాళ్ళు వెళ్ళిపోయాక మరీ తోడులేకుండా పోయింది. యింక మన రెండు ఫామిలీస్ సరదాగా వుండొచ్చు."

"మీరు నిద్రపోరా రేపు ప్రొద్దున్నే వెళ్ళి మనం అక్కడ ఫంక్షన్‌కి అన్ని ఏర్పాట్లు చూడాలి" దివ్యకు తన భర్త అనుకున్నట్లు రెండు ఫ్యామిలీస్ కలిసేలా అన్పించడంలేదు.

కవిత తన స్నేహితురాళ్ళ హాస్యోక్తులకే రెస్పాన్స్ ఇవ్వడంలేదు. సిగ్గుపడడంలేదు. సిగ్గుపాళ్ళు తక్కువా? లేక దాన్ని ఎగ్జిబిట్ చేయడం ఇష్టం లేదా? లేక పెళ్ళి కూతురిగా టెన్షన్ పడుతోందా? అయినా పదహారేళ్ళ పసి వయస్సు కాదుగా పిరికితనంగా వుండడానికి? తన ప్రశ్నలకు జవాబు దొరకక ముందే నిద్రాదేవి ఒడిలోకి వెళ్ళిపోయింది దివ్య.

గోపాలరావుగారు వాకిట్లో కొచ్చి దంపతులిద్దర్నీ ఆహ్వానించాడు.

"రండయ్యా! మీ కుర్రకారు టేస్ట్‌లేమిటో మాకు తెలియదాయె చందూకి ఎలా ఇష్టమో అలా డెకరేట్ చేయించు. రాత్రికి ఏదైనా ప్రోగ్రాం పెట్టిస్తానంటే వద్దన్నాడు."

"ప్రోగ్రాం ఎందుకంకుల్. రెండు టివిలు మగ వాళ్ళ దగ్గర ఆడవాళ్ళ దగ్గర అరెంజ్‌చేసి చందూ పెళ్ళి కాసెట్ పెట్టేస్తే అందరూ ఇంటరెస్టింగ్‌గా చూస్తారు."

"అంతే నంటావా?"

"అబ్బాయి చెప్పిందే బాగుంది. రామ్మా దివ్యా రా లోపలికెళదాం. ఆ జ్యూస్‌లు కలపడానికేం కావాలో వ్రాసి మీ బాబాయ్ చేతికిస్తే తెప్పిస్తారు. మ్యాంగో జ్యూస్ అట! అదేమిటో నాకు తెలియదురా అంటే అంతా దివ్య చూసుకుంటుందిలేమ్మా అన్నాడు వాడు."

"పని చేయించుకోవడానికే అమ్మాయికోసం ఎదురు చూస్తున్నట్లున్నారే వాళ్ళకేదయినా టిఫిన్ కాఫీ పెట్టేదేమయినా వుందా? లేక రుచిగా వున్నాయంటూ దివ్య కలిపిన గంగాళం జ్యూస్ నువ్వే తాగేస్తావా?" [illegible] కింహారాయన.

"గంగాళం గ్లాసు తాగుతానో మీ మీద వసంతంగా పోసేస్తానో చూస్తుండండి" ఆవిడా ఏమీ తగ్గడం లేదు.

"మీ పిన్ని కింకా పిన్నబుద్ధులు పోయినట్లులేదు. మీ పిన్నిని ఎవ్వరూ వదలకండి రేపు ముంచేద్దాం" అన్నారాయన తమాషాగా.

"మా పిన్ని వైపు నేనుంటాగా బాబాయ్!"

"ఆఁ అలా చెప్పమ్మా. దివ్య ఎవరనుకున్నారు ఈ ఇంటి ఆడ బిడుచు మీద ఈగను కూడా వాలనివ్వదు."

ఆ కొద్ది కాలంలోనే దివ్య వాళ్ళ మనసుల్లో అంత దగ్గరతనాన్ని ఏర్పరచుకుంది.

చంద్రకిరణ్ కూడా స్వంత చెల్లెల్ని పిలిచినట్లు దివ్యా అంటాడు.

"రామ్మా రా! ఆడపిల్ల లేరనే కొరత నాకు నువ్వు తీర్చేసావు దివ్యా. అది నా అదృష్టం కాకుంటే ఏమిటి చెప్పు? మా చందూకి స్వరూప్ స్నేహితుడవ్వడం స్వరూప్‌కి నువ్వు భార్య కావడం నువ్వెవరో మేమెవరిమో మాలో నువ్వింత బాగా కల్సిపోవడం....యిలా కవిత కూడా మాలో కల్సిపోతే అదే చాలు యీ జీవితానికి."

"బలేదానివే పిన్నీ ఆ గొప్పంతా నాదయినట్లు మాట్లాడుతున్నారే అన్నయ్య నన్ను స్వంత చెల్లెలిగా, మీరు నన్ను కన్న కూతురిలా చూసుకోవడం లేదూ!" లోపలికి నడుస్తూ అంది దివ్య.

ప్రొద్దుటి నుండి సాయంత్రం వరకు అటు ఇటు తిరుగుతూ పని వాళ్ళకు పనులు పురమాయిస్తుంది దివ్య.

"దివ్యా! ఈ టేబిల్స్ కుర్చీలు ఇలాచెట్లమధ్య వుంటే తినేవాళ్ళకు కన్వీనియెంట్‌గా వుంటాయా? లేక మేడ మీద వరుసగా టేబిల్స్ వేయించి అటూ యిటూ కుర్చీలు వేయిస్తే సౌకర్యంగా వుంటుందం టావా?"

"చాలా అందంగా వేయించారండీ? మరలా మార్చట మెందుకు? చల్లగా కూడా వుందిక్కడ!"

"రాణిగార్కి నచ్చిందన్న మాట."

"రాజాగారు ఏం చేసినా నాకు నచ్చుతుంది."

"మరి ఈ పూల కుండీల విషయమేమిటట?"

గేటు కిరువైపులా గార్డెన్‌లో వున్న సిమెంటు తొట్లలో పెంచిన క్రోటన్స్ అన్నీ తెచ్చి అమర్చి అడిగాడు స్వరూప్.

"అరెం నేనిటువైపు చూడనేలేదు. అన్నయ్య వచ్చి యిది మా ఇల్లేనా అని అనుకుంటారు కాబోలండీ. ఎంటర్ కాగానే పల్లెటూరని పించదు. ఏ బృందావనంలోనో అడుగు పెట్టినట్లుంటుంది. ఆ ఘనత మీకే దక్కుతుంది."

"అబ్బో! బాగుంది అని చెప్పడానికి కూడా యిలా వేరే దార్లు వుంటాయన్న మాట."

"ఊం మీరే నాకిన్ని దార్లు నేర్పించారని మర్చిపోతే ఎలా? నేనొస్తానండీ చికెన్ 64 నేనే చేయబోతున్నాను" దివ్య కదిలింది.

"అది ఎప్పుడోగా చేసేది ఇప్పటి నుండీ లోపలికి పరిగెట్టాలా?"

పక పక నవ్వింది దివ్య.

"యిప్పుడు అన్ని సాసీలు వేసి కలిపి పెడితే తినబోయేముందు వేయించాలి."

చికెన్ 64 తిని అందరూ నిన్ను మెచ్చేసుకుంటూ వుంటే ఆ పొగడ్తలకు పొంగిపోయి నన్ను మర్చిపోతావేమో!

భర్తవేపు మురిపెంగా చూసి లోపలికి పరిగెట్టింది దివ్య.

అలా లోపలికి పరిగెట్టిన దివ్యను పదిహేను నిముషాల తర్వాత మరలా కేకేసాడు స్వరూప్.

చికెన్ 64లో కలర్ కలుపుతున్న దివ్య అదేచేత్తో స్వరూప్ దగ్గర కొచ్చింది.

"అంకుల్ ఆంటీ గంగాళంలో జ్యూస్ మీ మీద కుమ్మరిస్తానన్న దని దివ్య నాకు రంగు పూయడానికొస్తోంది. నన్ను రక్షించే బాధ్యత

మీదే అంకుల్ ఆసలే తెల్లచొక్కా తెల్లప్యాంటు భయపడుతున్నట్లు నటిస్తూ చందూ నాన్నగారి వెనక్కి వెళ్ళాడు స్వరూప్.

భర్త అలా చిన్న పిల్లవాడిలా సరదా పడుతుంటే దివ్యకు గిలి గింతలు పెట్టినట్లుంది.

"నన్ను మీరేగా పిల్చారు....మాంసంలో రంగు కలుపుతూ ఆ చేత్తో వచ్చాను" పెళ్ళయి యిన్ని రోజులయినా దివ్యలో సిగ్గు మాసి పోవడంలేదు.

ఆ సిగ్గే భార్యలో చూసుకోవడం స్వరూప్‌కిష్టం. అందుకే అవ కాశం వచ్చినప్పుడల్లా దివ్యను ఆట పట్టిస్తుంటాడు.

"మీ ఆయనకు తనేది చేసినా నువ్వు ఓ.కే అంటేనేగానీ తృప్తిగా వుండేలా లేదమ్మా రా....రా....ఆ లైట్ల సరాలంట ఎలా వేస్తే బాగుం టాయోనట చెప్పేసి వెళ్ళు. మొత్తానికి నువ్వు చాలా అదృష్టవంతురాలి వమ్మా బంగారంలాటి భర్త దొరికాడు." గోపాలరావుగారు దివ్యతో అన్నాడు.

"అదేమంకుల్ నేనదృష్టమంతుడ్నికానా అయితే" భార్యను క్రీ గంట చూస్తూ అడిగాడు.

"ఎందుక్కాదయ్యా! నువ్వూ అదృష్టవంతుడివే దివ్య అపరంజి బంగారు కదూ!"

"అయ్యో! ఇది అన్యాయం బాబాయ్ అప్పుడు నేను కలితీ ననేగా అర్థం. నేనే తక్కువయిపోయానా?"

"కల్తీ లేకుంటే బంగారు వస్తువుకు పటిష్టత లేదు. అది మర్చి పోతే ఎలా నువ్వు?"

"అబ్బాయి గోపాలం!" అంటూ ఓ పెద్దాయన రావడంతో అటు తిరిగాడు గోపాలరావుగారు.

దివ్య స్వరూప్ వెంట నడిచింది.

"ఎవర్రా గోపాల్ ఆ అమ్మాయి ముచ్చటగా వుంది. మనవా శ్శమ్మాయయితే కృష్ణకి మాట్లాడదామా!"

పక్కనే నవ్వాడు గోపాలరావుగారు.

"మన చందూ స్నేహితుడి భార్య దివ్యాన్నా"

ఆ మాటలు స్వరూప్ చెవ్విన పడనేపడ్డాయి.

"అమ్మో! నా పెళ్ళికిముందు నిన్ను యిలా ఫంక్షన్‌తో ఎవరయినా చూసి నచ్చి వాళ్ళ కోడలిగా చేసేసుకోనుంటే నా పరిస్థితి ఏమయ్యేది? నువ్వు లేకుండా నేనెలా బ్రతకడం?"

దివ్య మనసులో అనుకుంది. తనే కన్పించకుంటే యింకో అమ్మాయి తన స్థానాన్ని భర్తీ చేసేది తనతో యీ రోజన్న మాట ఆ అమ్మాయితోనూ స్వరూప్ అనేవాడే. అదిఅతని ప్రేమతత్వం. ఆమెతో అతనలా అనేసరికి వివశత్వం.

పారవశ్యంనుండి తేరుకుని తన భర్త అనుకున్న రీతిలోనే సరాలు దించితే బాగుంటాయని భర్తతో చెప్పి లోపలికి నడిచింది దివ్య.

ప్రొద్దుటినుండి సాయంత్రం లోపల స్వరూప్, దివ్యను దేనికో ఒక దానికి పిలుస్తూ వున్నాడు. దివ్య కూడా స్వరూప్ ఇంకా తనని పిలవలేదే అని ఎదురుచూస్తూ తృప్తిగా ఆనందాన్ని అనుభవించిందా రోజు దివ్య.

"ఇంకా నువ్వెళ్ళిస్నానంచేసి తయారవు దివ్యా! వాళ్ళొచ్చే టైమ్ ఆయింది. నువ్వే లేకుంటే యీ రోజు నాకేమీ తోచేదికాదు. అన్నిపనులు నువ్వు చూసుకోబట్టి నేను స్థిమితంగా వుండగలిగాను" అనసూయమ్మ ప్రొద్దుటినుండి దివ్యతో యిలా అంటూనే వుంది.

స్నానంచేసి వస్తున్న దివ్యకు ఎదురొచ్చింది ఆమె తల్లి.

"మీ అల్లుడు మీరు రాకుండా వెళ్ళిపోయారని బాధపడ్డారమ్మా. మీరు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోయారనికూడా"

"అబ్బాయి అంత మంచివాడు కాబట్టే మాకు నీ గురించి నిశ్చింత" అనేసి—

"మేము సోమశిల వెళ్ళినప్పటినుండి మీ రిద్దరూ వచ్చి రెండు రోజులయినా వుండలేదు. ఈ సంక్రాంతికయినా నాలుగురోజులు వచ్చి వుండండి- మీ నాన్నగారొచ్చి అబ్బాయికి చెప్తాడులే"

"ఆయనేమీ అనరమ్మా. ఇండియాఅంతా తిరిగేద్దామంటాడు సరదాగా. నాకే వీలవడంలేదు పేషెంట్లతో. వీలు చూసుకుని వస్తాం లేమ్మా."

దివ్య తయారయినంత సేపూ తల్లితో ఈకబురూ ఆకబురూ చెప్తూనే వుంది పాచికలర్‌కు క్రింషన్ అంచువచ్చిన మైసూర్ క్రేప్ సారీ కట్టుకుంది దివ్య. మంచి పచ్చలు రవ్వలు కలిపిన సెట్ పెట్టుకుంది. జడ నిండుగా జాజిపూలు పెట్టుకుంది.

ఏడున్నరయినా ఇంకా వీళ్ళు రాకపోవడమేమిటని ఆరాటపడసాగింది అనసూయమ్మ.

"అందరూ ప్రయాణం కావాలిగా. పెళ్ళి కూతుర్ని చేసి తీసుకురావాలంటే ఆలస్యమవుతుందిలే గాభరా పడకండి" అని సర్దింది దివ్య తల్లి.

"దివ్యక్కా! నిన్ను ఆ అన్న పిలుస్తున్నారు త్వరగా రమ్మని చెప్పాడు" పదేళ్ళ పాప వచ్చి చెప్పింది.

ఇంటి ముంగిటలోకి దివ్య అడుగు పెట్టగానే అబ్బుర పడింది. లైటింగ్ అరేంజ్‌మెంట్ చాలా నచ్చిందామెకు. గుమ్మానికి రెండు వైపులా రెండు బొమ్మలు అమ్మాయిలు పూలు కోస్తున్నట్లు చిన్నచిన్న బల్బులతో చూడముచ్చటగా వున్నాయి

ఇంటి దగ్గరనుండి ఇరవై అడుగులవరకు వైలెట్ బల్బులతో పందిరి వేసుంది. ఇంటిలోపల ప్రతి చెట్టుకు గ్రీన్ బల్బులు తళుక్కు-మంటున్నాయి మేడమీద ఎడ్జిల్లో మాత్రం ప్రమిదలు పెట్టినట్లే వున్న బల్బులు కాంతి నివ్వకపోయినా ఆ ఇంటికి అందాన్నిచ్చాయి. ప్రతి టేబుల్ ప్రక్కన ట్యూబ్‌లైట్ అదీ గ్రీన్ పేపర్‌తో చుట్టు పచ్చదనం పర్చుకున్నట్లుంది.

"నేను బృందావన్ గార్డెన్స్‌లో వున్న ఫీలింగ్ తెచ్చారుమీరు"

"నాకేమి ఫీలింగ్ నువ్వు తెచ్చావో తెల్సా"

"నాకెలా తెలుస్తుంది?" తన భర్త ఏం చెప్తాడో అని ఎదురు చూసింది దివ్య.

"నిన్ను తీసుకుని ఏకాంత ప్రదేశానికి వెళ్ళిపోవాలనుంది."

"స్టాప్....స్టాప్ ఇది చందూ అన్నయ్య డిన్నరని మర్చిపోతే ఎలా?"

"అలా మర్చిపోయేలా వనకన్యలా తయారయి వచ్చావుకదా! తప్పంతా నాదే అయినట్లు మాట్లాడ్డం అన్యాయం."

తను పెళ్ళయ్యాక ఇంతసరదాగా, తీరిగ్గాగడపటం ఇదే మొదటి సారి. ఎప్పుడెక్కడకు వెళ్ళాలనుకున్నాగడపబోయే ఆనందంకంటే తన ప్రాక్టీసు, పేషెంట్లే గుర్తువచ్చేవాళ్ళు-ఎన్నోమార్లు తన భర్తను డిజప్పాయింట్ చేసింది. ప్రొఫెషన్‌లో ఎంత తృప్తి వుందో అంతకు రెట్టింపు ఆనందంగా, తృప్తిగా వుందీరోజు. ఎలాగయినా వీలు చూసుకుని ఎప్పటినుండో చూడాలనుకుంటున్న కొడైకనాల్‌కి వెళ్ళాలనుకుని నిశ్చయించుకుంది దివ్య.

స్వరూప్ ఏదో అనబోతూండగా కారు హారన్ శబ్దాలు విన్పించాయి. పెళ్ళికూతురి తరపువారు ఇరవై కార్లలో వచ్చారు. గుమ్మం దగ్గర చిన్నపిల్లలు—అప్పుడే పెళ్ళయిన ఆడపిల్లలు గుమిగూడి పేర్లు చెప్పిస్తున్నారు.

"మన పేర్లు చెప్పించినరోజు గుర్తుందా?" గుసగుసగా అన్నాడు స్వరూప్.

"ష్....మగవాళ్ళంతా వచ్చేస్తున్నారు నేను లోపలికి వెళుతున్నా" అని అక్కడనుండి కదిలింది దివ్య.

"పోనీ వదినా! మా అన్న పేరు చెప్పక్కరలేదులే. అదిగో ఆకాశంలో వున్న ఆయన పేరేమిటో చెప్పు చాలు" చంద్రుణ్ని చూపిస్తూ అడిగింది ఆడబడుచు వరుసయిన పదహారేళ్ళమ్మాయి.

"దివ్యా! ఆ జ్యూస్‌లు అందరికీ పంపించు తల్లీ" అంటూ దివ్యను వెతుక్కుంటూ వచ్చింది అనసూయమ్మ

గ్లాసుల్లో జ్యూసులుపోసి స్ట్రాలువేసి ట్రేల్లో అమర్చుతూ ఆలోచిస్తోంది దివ్య-ఎంత మధురమైన అనుభూతి యిది. సిగ్గయితే మెల్లిగా అయినా చెప్పొచ్చుగదా. అంత మొండిగా నిల్చోవడమేమిటి? ఈ అమ్మాయి ఈ సరదా లన్నిటికీ విముఖత్వం చూపిస్తుందేమిటీ? త్వర త్వరగా ఈ సాంప్రదాయాలన్నింటినీ దాటేసి హాయిగా భర్తతో హనీమూన్‌కి పారిపోవాలనుకుంది కాబోలు అని నవ్వుకుంది దివ్య.

దేవుని గదిలోనుండి బయటకొస్తూ దివ్యను పలకరించాడు చంద్రకిరణ్.

"స్వరూప్ చేయించిన డెకరేషన్ చాలా బాగుందమ్మా దివ్యా"

"నీ స్నేహితుణ్ణే పొగుడుతున్నావ్. దివ్య కలిపిన జ్యూస్, చేసిన చికెన్ రుచి చూసావంటే నీ స్నేహితుడిగాలి తీస్తావ్" ప్రక్కనే వున్న అనసూయమ్మ అంది.

"థాంక్సమ్మా" అతని కళ్ళల్లో ఆత్మీయతాభావం.

వాళ్ళు మాట్లాడుకుంటుంటే జంటగా దేవుని గదిలోనుండి వచ్చిన కవిత అలాగే నిల్చోలేదు. వెళ్ళి వాళ్ళ బంధు వర్గంతో కలిసి కూర్చుంది.

డిన్నర్‌లో కలియ తిరుగుతున్న దివ్యను చూసి అందరూ ముచ్చట పడ్డారు.

"వస్తాం పిన్నీ" అందరికీ జాకెట్టు తాంబూలం పళ్ళు వేసిన కవర్లు అందించడం పూర్తయ్యాక ఎక్కడవాళ్ళక్కడ వెళ్ళాక అంది దివ్య.

"ఇలారా దివ్యా!" అంటూ దివ్యను ప్రక్కకు తీసుకెళ్ళి దిష్టి తీసేసింది అనసూయమ్మ.

దిష్టిమీద దివ్యకు నమ్మకం లేకపోయినా అనసూయమ్మ అభిమానాన్ని కించపర్చడం ఇష్టంలేక తీయించుకుంది.

దివ్యకు కంచిపట్టు చీర పెట్టి పసుపు కుంకుమ అందించింది ఆమె.

"ఇంత ఖరీదయిన చీర ఎందుకు పిన్నీ?" మొగమాటంగా నిలబడిపోయింది దివ్య.

"ఖరీదెంత పెట్టయినా చీర కొనుక్కోవచ్చు బజారులో. కానీ దివ్యా నీ ప్రేమను మేమెక్కడ సంపాయించగలమమ్మా?"

ఆమెకు తనమీద ఇంత ప్రేమ ఎందుకేర్పడిందోనని ఆశ్చర్యపోయింది దివ్య.

ఇక మాట్లాడలేకపోయింది దివ్య.

ఇప్పుడిదంతా ఏమిటాంటీ అంటున్న స్వరూప్‌ని వారించి స్వరూప్‌కి కూడా ప్యాంట్ షర్టుకూడా అందించిందామె.

పళ్ళబుట్ట, స్వీట్ బుట్ట కారులో పెట్టింది.

"వస్తూ వుండమ్మా! ఈరోజు నా ఇంటిలో లక్ష్మీకళ నట్టింట తాండవించింది తల్లీ నువ్వీ ఇంట్లో తిరుగుతుంటే" దివ్య చేయిపట్టుకుని కళ్ళనిండా నీళ్ళు నింపుకుని అంది అనసూయమ్మ.

"ఎందుకు రాము పిన్నీ వస్తూ వుంటాంలే"

"మీరు అప్పటిలా ఆడపిల్ల లేదని బెంగపడితే ఎలా? కవిత వచ్చేసిందిగా" అమ్మ అనసూయమ్మతో అంది.

"వచ్చినా మనదగ్గర వుంటున్నారా? వాళ్ళ ఉద్యోగాలతో దూరముగా వుంటున్నారాయె" నిట్టూర్చిందామె.

"వాళ్ళెక్కడున్నా సుఖంగా వున్నారనుకుంటే ఆనందంగా వుంటుంది" అన్నారు దివ్య తండ్రి.

"ఆనందమేగానీ కూతురు అల్లుడుగానీ, కొడుకు కోడలుగానీ దూరంగా వున్నా అప్పుడప్పుడు వచ్చి పదిరోజులుండి వెళుతుంటే మనస్సుకు తృప్తిగా వుంటుంది" ఈసారి దివ్య అమ్మ తన మనసులో బాధ వ్యక్తం చేసింది.

"ఇప్పుడు ఇదే కారులో సోమశిలకు రమ్మన్నా నేను రెడీ అత్తయ్యా రమ్మంటారా?" స్వరూప్ ముందుకొచ్చి అన్నాడు.

"నేనూ, కవితా, స్వరూప్, దివ్య అందరం కల్సి వస్తామంటే మీరు వెళ్ళిపొండత్రా అనేవరకు వుండి వస్తాం"

చంద్రకిరణ్ మాటలకు నొచ్చుకుంది దివ్య తల్లి. తన పొరపాటు గుర్తించి అంది.

"తప్పకుండా రావాలి చందూ! ఇప్పుడు మిమ్మల్ని డిస్టర్బ్ చేయడమెందుకని పిలవలేదు నేను"

"మీరు పిలవాలా ఆంటీ నా ఇంటికి నేను రావడానికి" చందూ ముఖంలో పెళ్ళికొడుకు కళ.

చాలా ఉత్సాహంగా వున్నాడు.

దివ్య తల్లిదండ్రి స్వరూప్ దివ్య అందరూ కారెక్కారు.

కారులో కూర్చున్నాక దివ్యకు కవితతో చెప్పకుండా వచ్చేనన్న విషయం స్ఫురణకొచ్చింది.

"ఒక్క నిమిషమమ్మా కవితకు చెప్పేసి వస్తాను. ఈ హడావిడిలో చెప్పకుండా వచ్చేసాను" గిల్టీగా అంది దివ్య.

"కారులోనుండి దిగబోయిన దివ్యనాపాడు చంద్రకిరణ్.

"నేను చెపుతాలే దివ్యా! మీరు పదండి ఇప్పటికే పన్నెండు అయింది"

"అసలు విషయం అదికాదులే, నువ్వెళ్ళి కవితతో కబుర్లలో పడ్డావనుకో గ్రీన్ సిగ్నల్‌కు ఆలస్యమవుతుందని వాడి భయం"

స్వరూప్ మాటలకు కారు బయట నిలబడి వున్న చంద్రకిరణ్ కారు లోపల కూర్చున్న స్వరూప్‌ని గట్టిగా గిల్లాడు.

కవిత, చంద్రకిరణ్‌తో హనీమూన్ ట్రిప్‌లో వుండగా ఇక్కడ స్వరూప్ వాళ్ళకోసం ఇళ్ళవేటలో పడిపోయాడు.

"దివ్యా! నువ్వు హాస్పిటల్ కెళ్ళే ముందు చందూకోసం చూసిన

ఇల్లు బావుందో లేదో కవితకు వంటింట్లో సౌకర్యంగా ఉందో లేదో చెపుదువు వస్తావా?"

"ఎందుకు రాను ఇప్పుడే వెళదాం పదండి"

"దివ్యా! ఈ బాత్రూమ్ చిన్నదయినా చాలా బావుంది కదూ! వెనకున్న నైట్‌క్వీన్ చెట్టు సువాసనలు. ఈ బాల్కనీలో చెయిర్స్ వేసుకుని కబుర్లు చెప్పుకోవచ్చు"

సందులో కవితకు ఓపిక వుంటే కూరగాయల పాదు వేసుకోవచ్చు.

ముఖ్యంగా దివ్యా! వాడు నేను ఒకే వీధిలో వుంటాము. అదే ఆనందంగా వుంది నాకు.

ఎన్ని ఇళ్ళు చూసినా నచ్చలేదు. కారణం నా మైండ్‌లో వాడు దూరంగా వుంటాడనుకుంటేనే బాధగా వుంది.

స్నేహితుడు దగ్గరగా వుండాలని కోరుకొంటున్న భర్తవేపు ఓ మారు చూసింది.

ఎందుకో దివ్యకు కవిత కలవదనే అనిపిస్తోంది.

"దివ్యా! వంటిల్లు ఎలా వుందో చెప్పలేదు నువ్వు"

"బాగుందండీ! బెడ్‌రూమ్‌కంటే వంటిల్లు పెద్దది కట్టారు"

"వుండాలిగా దివ్యా! డైనింగ్ టేబుల్ కూడా వంటింట్లోనే వేసుకోవాలి వాళ్ళు"

"డైనింగ్ టేబుల్ అంటే గుర్తువచ్చింది. వాళ్ళకి మనం ఇంటికి సరిపోయే వస్తువు ఏదయినా ప్రెజెంట్ చేద్దాం"

అన్నాడు స్వరూప్.

"మీ ఇష్టం. పిన్నిగారు నాకు ఖరీదయిన చీర పెట్టారు. వాళ్ళు వచ్చాక ఒకరోజు ఇద్దర్నీ భోజనానికి పిలిచి కవితకు మంచి చీర పెట్టి ఇంటికి కావాల్సిన వస్తువేదయినా తీసిద్దామా?"

దివ్య మాటలకు స్వరూప్ కాసేపు ఆలోచించి....

"అలా చేసేకంటే కాస్ట్లీ వస్తువిస్తే పోతుంది ఎప్పటికీ మన గుర్తుగా"

"నిజమేనండీ. మన పెళ్ళప్పుడూ అన్నయ్య డ్రస్సింగ్ టేబిల్ ఇచ్చాడు. అన్నయ్య పెళ్ళికి మనకు బట్టలు పెట్టారు. కలర్ టి.వి. తెచ్చిస్తే సరిపోతుంది"

"బదులుకు బదులని కాదు కానీ దివ్యా నా గుర్తుగా వాడిదగ్గర శాశ్వతంగా వుండే వస్తువు ఇవ్వాలనుంది ఆలోచించు"

"ఆలోచించ డానికేముంది! అన్నయ్యకు డైమండ్ రింగ్ ప్రెజెంట్ చేద్దాం. టి.వి.లాంటిది చెడిపోవచ్చు. కవితకు మంచి చీర పెట్టేద్దాం"

"నీ ఆలోచనే బాగుంది"

చంద్రకిరణ్‌కు ఇచ్చే ప్రెజెంటేషన్ ఏమిటాని నిర్ణయించుకున్నారా దంపతులు.

"అంత త్వరగా వచ్చేస్తారనుకోలేదు. కొడైకెనాల్ ట్రిప్ బాగా ఎంజాయ్ చేసారా?"

పదిరోజుల తర్వాత ఇంటికొచ్చిన స్నేహితుడ్ని ఆనందంగా పలకరించాడు స్వరూప్.

"కవితకు చలిగాలి తగిలితే ఎలర్జీ అట. జర్నీ కూడా పడదట. పాపం ప్రయాణంలో అంతా వామిటింగ్స్—అందుకే త్వరగా వచ్చేసాం" అన్నాడు.

"అయ్యో! ఒకసారి ఎలర్జీ టెస్ట్ చేయించేసెయ్యి"

"అన్నీ అయిపోయాయట! ప్రయాణాలు చేయకుంటే సరి. చలిగాల్లో తిరక్కుంటే నో ప్రొబ్లమ్"

స్నేహితుడంత తేలిగ్గా అంటుంటే అతని అడ్జస్టింగ్ నేచర్‌కి ఆశ్చర్యపోయాడు స్వరూప్. తనకు దివ్యతో కల్సి ఇండియా అంతా టూర్ వెయ్యాలని వీలైతే ఫారిన్ కంట్రీస్ కూడా తిరిగేయాలని ఆమెతో తన అనుభూతుల్ని పంచుకోవాలని ప్రతి క్షణం ఇద్దరూ కల్సి వుండాలనే తన కోరికల్ని చంపుకోలేకపోతున్నాడు. దివ్య తనే ప్రాక్టీస్‌లో మునిగి పోయి ఎక్కడకూ రాలేకపోతుంటే అసంతృప్తిగా ఫీల్ అయిపోతు న్నాడు. తను....తనూ చందూలాగా అడ్జస్ట్ కాగలిగితే....?

ప్రయత్నించాలి. తన కోరికలకు కళ్ళెం వేసి యింటి దగ్గర వున్నంత సేపయినా ఆనందంగా గడపాలి అని నిర్ణయించుకున్నాడు స్వరూప్.

"ఎప్పుడొచ్చారన్నయ్యా ప్రయాణం బాగా జరిగింది కదా! మీ కోసం ఈ వీధిలోనే ఒక యిల్లు చూసొచ్చాము సింగిల్ బెడ్‌రూమ్ హౌస్ అయినా అన్ని సౌకర్యాలతో బాగుంది" దివ్య హాస్పటల్ నుండి వస్తూనే చంద్రకిరణ్‌తో చెప్పేసింది.

"ఇక్కడుంటే నాకూ కవితకు చాలా దూరమయిపోతుంది కదమ్మా!"

స్వరూప్ ముఖం క్షణం మ్లానమయింది.

"నీకు స్కూటర్ వుందిగా చందూ కవితను వదిలేసి వెళ్ళొ చ్చుగా!"

"నా టైమింగ్స్ తన టైమింగ్స్ కుదరవంటోంది కవిత."

"ఇంకెక్కడ చూడను?" కాస్త నిరాశగా అన్నాడు.

"దర్గామిట్టలో కవిత వాళ్ళ నాన్నగారు మేమొచ్చేసరికే ఇల్లు తీసిపెట్టి అన్నీ సర్దేసారు" టీపాయ్ మీదున్న పేపర్ చేతిలోకి తీసు కుంటూ అన్నాడు చంద్రకిరణ్.

"నీ ఇల్లు అందంగా సర్దిచ్చి నీ రుణం తీర్చుకునే అవకాశం నాకు రాలేదన్న మాట." మనస్సులో బాధను పైకి కనిపించనివ్వకుండా నవ్వుతూ అన్నాడు స్వరూప్.

"వాళ్ళ కూతురికి వాళ్ళే అన్నీ అరేంజ్ చేసుకున్నారు. మనిద్ద రికీ శ్రమ తగ్గిపోయిందనుకుంటే సరి" తేలిగ్గా అన్నాడు చంద్రకిరణ్.

"అదికాదురా ఈ ఏరియాలోనే అయితే అందరం కల్సిమెల్సి వుండొచ్చు అనుకున్నాను."

స్నేహితుడు బాధపడుతున్నాడని అర్థం చేసుకున్నాడు చంద్ర కిరణ్.

"భలే వాడివిరా నేనేదో ఫారిన్ కంట్రీకెళ్ళి పోతున్నట్లు బాధ పడిపోతున్నావేమిటి? నేను నెల్లూరులోనే వుంటున్నాను. నువ్వు నన్నె ప్పుడు చూడాలనిపిస్తే అప్పుడు ఈ ఇంట్లో వాలి చెల్లెమ్మ వంట రుచి చూసి వెళ్ళిపోతుంటాను. వాళ్ళు అంత త్వరగా ఇల్లు చూసి అన్ని వస్తు వులు సర్దేస్తారనుకోలేదు నేను. సారీరా స్వరూప్!" బాధపడ్డాడు చందూ కూడా.

"కొడైకెనాల్ వెదర్ ఎలా వుందన్నయ్యా! నాకెప్పటి నుంచో కొడై, చూడాలనుంది. ఇంక నాకు దిగుల్లేదు. కవితను పదిరోజులు నా క్లినిక్ చూడమని వెళ్లొచ్చు" ఆ టాపిక్ మారుస్తూ అంది దివ్య.

"తప్పకుండామ్మా! ఎప్పుడెలతారో చెప్పండి."

"రేపే వెళ్ళిపోతాంరా చందూ! మా దివ్య గ్రీన్ సిగ్నల్ ఇచ్చిం దంటే నేను రెడీ" స్నేహితుడు పెళ్ళవగానే వాళ్ళ మామ చూసిపెట్టిన ఇంట్లోకి తనకి దూరంగా వెళ్ళిపోతున్నాడనే బాధను మర్చిపోయి ఉత్సా హంగా అన్నాడు స్వరూప్.

"ఏమిటీ అన్నయ్యను కవితను మనం భోజనానికి పిలవకుండానే కొడైకెనాల్ వెళ్ళిపోదామా" దివ్య ప్రశ్నించింది.

"అవును కదూ! రేపు నువ్వు కవిత వచ్చేయండ్రా హాయిగా నర్శింహ కొండకెళ్ళి పిక్చర్ కెళ్ళి రోజంతా గడిపేద్దాం."

"మరి అన్నం పెట్టరా?" చెయ్యి నోటి దగ్గర పెట్టి అడిగాడు చంద్రకిరణ్.

"ఎందుకు పెట్టము మధ్యాహ్నానికి క్యారియర్ తీసుకెళదాం."

"మంచి మర్యాదేనండీ మీది. మేము రేపొచ్చి కవితను భోజనానికి పిల్చి వస్తాం మన్నయ్యా ఆదివారం అందరం ఫ్రీగా వుంటాం కదా!"

"నీ ఇష్టమమ్మా మేమెప్పుడయినా రెడీనే. కానీ నో ఫార్మాలిటీస్. మీరు భోజనానికి పిలవడానికయితే రావొద్దు. మే మిద్దరం సన్‌డే వచ్చేస్తాము సరేనా!" అంటూ కదిలాడు చంద్రకిరణ్.

అతనలా వెళ్ళగానే భార్యను చుట్టేసాడు స్వరూప్.

"నిజంగా వెళదామా దివ్యా కొడైకెనాల్‌కి."

"అందులో అబద్ధమేముందండీ" భర్త ఆనందాన్ని చూస్తూ అంది.

"మరి నీ పేషెంట్లో?" క్వశ్చన్ మార్క్ ఫేస్ పెట్టాడతను.

"కవిత వుందిగా అప్పజెప్తాను."

"ఈ రోజే వెళ్ళిపోవాలనుంది నాకు" చిన్న పిల్లాడిలా అన్నాడు.

"నాకూ మీతో సరదాగా గడపాలనే వుంటుందండీ కానీ పేషెంట్లు దృష్టిలో డాక్టరమ్మ ఎప్పుడెళ్ళినా వుండదు అనే ఐడియా వస్తే నాకు ప్రాక్టీస్ వుండదు లాబ్ వర్క్ చాలా వుంది అది పూర్తయ్యాక వెళదాం."

"అదేదో త్వరగా చేసెయ్యి నేనూ నాన్నగార్ని ఇక్కడకు రమ్మని చెప్పి ఆ పనులన్నీ అప్పజెప్పేస్తాను."

"సర్లెండి మామయ్యగారు టూర్ నుండి వచ్చి యింకా అలసట యినా తీర్చుకోలేదు."

"నీకు లాబ్ వర్క్ అయ్యేసరికి నాన్నకు అలసట తీరుతుం దిలే."

"అంటే నేను లాబ్ వర్క్ అంత లేట్‌గా చేస్తానని మీ ఉద్దేశం."

"అందులో నా ఎస్టిమేషన్ రాంగ్ అయితే కావొచ్చుగానీ నీ

పేషెంట్లును వదలి అంత తొందరగా రాలేవన్న మాట మాత్రం వాస్త వమే కదా!"

"ఉహుం అదీ రాంగే చూడండి ఎంత త్వరగా మన ప్రోగ్రాం ఫిక్స్ చేస్తానో!"

భార్య ఆనందం ఆమె కళ్ళల్లో ఉత్సాహం ఆతనికి నూతనో త్సాహాన్నిచ్చింది

★ ★ ★ ★

"కవితా! చెల్లెమ్మ, స్వరూప్ మనిద్దర్నీ భోజనానికి పిల్చారు ఆదివారం వెళదాం. అక్కడ నుండి నర్శింహ కొండకెళ్ళి సాయింత్రం వరకు గడిపి ఫస్ట్‌షోకెళ్ళి వద్దాం."

మౌనంగా వుండిపోయింది కవిత.

"ఆ రోజు కొడైకనాల్‌లో కట్టుకున్నావు చూడు రోజ్‌కలర్ సారీ అందులో నువ్వెంత బాగున్నావో! ఆ చీరకట్టేసుకో."

"అంటే ఆ చీర కట్టుకోకుండా వేరే చీర కట్టుకుంటే బాగుం డునా?" అని హాస్యమాడలేదు భర్తతో కవిత.

"నాకు ఓపికుండదండీ ఇంకో మారెప్పుడయినా వెళదాం" పొడిగా అంది.

"పెళ్ళయిన కొత్త జంటనేగా వాళ్ళు పిలుస్తున్నారు. పోనీ నర్శింహం కొండకు పిక్చర్‌కు మానేద్దాంలే."

"ఏమిటోనండీ నాకు ఇంట్లో వుండడమే ఇష్టం....ఎక్కడి కెళ్ళా లన్నా ఇంటరెస్ట్ వుండదు" కవిత అలా అనడానికి చంద్రకిరణ్ దగ్గర సంకోచపడలేదు.

వాళ్ళు బాధపడకూడదు. భార్యనూ బాధపెట్టకూడదు అనే తత్వం చంద్రకిరణ్‌ది అందుకే భార్యతో యిలా అన్నాడు.

"మొదటిసారి వాళ్ళను డిసపాయింట్ చేయడం బాగుండదు. భోంచేసి వెంటనే వచ్చేద్దాం."

"అలాగే" అనగలిగింది మెల్లిగా కవిత.

పడుకుని ఆలోచించసాగాడు చంద్రకిరణ్.

స్వరూప్ తనకి దగ్గరగా వుండాలనుకోవడమే కాకుండా రెండు సంసారాలు కల్సిమెలగాలని ఇల్లు అక్కడే తీసుకోనున్నాడు. కవిత మనస్తత్వం దానికి విరుద్ధంగా వుంది....ఎలా? దీనికి పరిష్కారం ఎలా? దాని కతన్నికీ అప్పటికి జవాబు దొరకలేదు.

* * * *

కవిత వచ్చిందేగానీ మెయిన్ హాల్‌లో ఒక కుర్చీకి అతుక్కుపోయి బుక్ పట్టుకుంది

అన్నం తినగానే లేచి నిలుచుంది వెళ్ళటానికి.

అప్పటికే చంద్రకిరణ్ స్వరూప్‌కి సర్ది చెప్పాడు ఇంట్లో వాళ్ళ అమ్మ నాన్నగారు వచ్చున్నారని ఇంకోరోజు తీరిగ్గా మనం ప్రోగ్రామ్ వేసుకుందామని.

దివ్య కవితను అర్థం చేసుకోవటంలో పొరపడలేదని నిర్ణయించుకుంది.

స్నేహితుడి చేతికి రవ్వలుంగరం తొడుగుతుంటే ఇదేమిటి? అని చందూ అడ్డుచెప్పేదేగానీ ఆ అమ్మాయి నిశ్శబ్దంగా చీర-జాకెట్ అందుకొని వస్తామని చెప్పి కదిలింది.

ఈ అమ్మాయిక కలవదు అనుకున్నారా దంపతులిద్దరూ.

3 నెలలవరకు దివ్యకు కొడైకెనాల్ వెళ్ళటానికి వీలవలేదు.

3 నెలల తర్వాత స్వరూప్, కవితల దగ్గరకు బయలుదేరారు.

ముందే చెప్పేసింది దివ్య నేను కవితనడగను ఆ అమ్మాయి మొహంమీదే హర్ట్‌చేస్తుంది మీరన్నయనడగండి అని—

"రండి—రండి రాత్రికి ఇక్కడే భోంచేసి వెళుదురుగాని" ప్రేమపూర్వకంగా ఆహ్వానించాడు చంద్రకిరణ్.

"పనిమీద వచ్చారా! నువ్వు పర్మిషన్ ఇస్తే మేము కొడైకెనాల్ వెళ్ళాలనుకుంటున్నాము"

పెద్దగా నవ్వాడు చంద్రకిరణ్.

"చెల్లెమ్మకు హాస్పిటల్ పర్మిషనివ్వాలి నీకు బిజినెస్ పర్మిషన్ ఇవ్వాలి, మధ్యలో నా పర్మిషన్ ఎందుకు?"

"దివ్యకు హాస్పిటల్ పర్మిషన్ ఇవ్వాలంటే ఆ పదిరోజులు కవిత సహాయం కావాలి. అందుకు నువ్వు కవితకు పర్మిషనివ్వాలిగా?"

"అంటే దివ్య నీ పర్మిషన్ లేకుంటే మా ఇంటికి కూడా రాకూడదన్న మాట?

ఏం మా చెల్లెమ్మని అంత గ్రిప్‌లో పెట్టుకున్నావా?" స్నేహితుడి ఆట పట్టించాడు చంద్రకిరణ్.

"కవిత లేదాన్నయ్యా?"

పది నిముషాలయినా ఆమె బయటకు రాకపోయేసరికి దివ్యే అడిగింది.

"మీరొచ్చారన్న ఆనందంలో కవితను పిలవలేదుకదూ?"

"కవితా! దివ్యవాళ్ళు వచ్చారు ఇలా రా" అని పిలిచాడు.

అతని గుంభనకు ఆశ్చర్యపోయింది దివ్య-భార్యనిలా ఎంత కాలం దాచిపెట్టుకో గలరెవరయితే మాత్రం—

"ఎప్పుడు వచ్చారు?" అంది చిన్నగా నవ్వి కూర్చుంది కవిత.

గెస్ట్‌లు తనింటికొచ్చినట్లు లేదు తనొకరింటికి వెళ్ళి చిన్నగా నవ్వి కూర్చున్నట్లుంది

టి.వి లో ఏదో చిత్ర ప్రోగ్రామ్ వస్తుంటే దాన్ని చూస్తున్నట్లు కూర్చుందేగానీ దివ్యతో ఒక్క మాటకూడా మాట్లాడలేదు.

అప్పటికీ వుండబట్టలేక దివ్యే పలకరించుకుంది.

"మీరు హాస్పిటల్‌నుండి ఎన్ని గంటలకు వచ్చేస్తారు రోజూ?"

"అదేమిటమ్మా కవితను మీరు అని పిలవడమేమిటి?" చంద్రకిరణ్ దివ్యవైపు తిరిగి అన్నాడు.

దివ్య చిన్నగా నవ్వి వూరుకుంది

కవిత పెళ్ళయి మూడునెలలయినా వాళ్ళింతా కలిసింది యిది మూడవసారి మాత్రమే.

ఎప్పటికప్పుడు దివ్య ఆ అమ్మాయిని కలుపుకోవాలని శతథా ప్రయత్నిస్తున్నా కవిత కలవడంలేదు.

అలాంటప్పుడు ఆ అమ్మాయి పట్ల దగ్గర భావమెలా వస్తుంది?

'ఈ విషయం అతనికి తెలియకుండా వుందా?' అనుకుంది

తనడిగిన ప్రశ్నకు జవాబు రాలేదు.

ఇంక తనముంచి మాటలు ఎలా పెంచాలో తెలియక వూరుకుంది దివ్య

"ఈరోజు వర్క్ ఎక్కువై అలసటగా వుంది. వస్తాంరా నువ్వు ఫోన్ చెయ్యి రేపు నాకు"

భార్య అలా అసహనంగా దూర్చోవడం చూసి అన్నాడు స్వరూప్.

వెళ్ళొచ్చులే ఏమిటా తొందర పరాయి వాళ్ళింటికొచ్చినట్లు?"

"ఛ! ఛ! అవేం మాటలురా?"

"లేకుంటే ఏమిటి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోంచేసి వెళ్ళక"

"కవితా! భోజనం వడ్డించెయ్యి అందరికి"

అప్పటికి తలెత్తింది కవిత.

"మనం ఆలస్యంగా తింటాంకదా అని ఇంకా రైస్‌కుక్కర్ పెట్టలేదు.

ఆమెకు తన జవాబు ఎదుట మనిషిని హర్ట్‌చేస్తుందని కూడా తెలియలేదు"

దివ్యకింక ఒక్క క్షణంకూడా అక్కడుండాలనిపించలేదు.

"ఇప్పుడు శ్రమ తీసుకోకమ్మా" స్వరూప్ లేచి నిలబడి కవిత వేపు తిరిగి అన్నాడు.

అందుకు సమాధానంగా శ్రమేముందన్నయ్యా ఇందులో అన లేదు.

ఆ అమ్మాయి నోటిగుండా ఏ సంబోధనా రాదు స్వరూప్ పట్ల....

"కూర్చోరా! ఎలాగో మీ ఇద్దరికీ తీరి రాగలిగారు. భోంచేసి రాత్రికి వుండండి. కరువుతీరా కబుర్లు చెప్పుకుందాం" చంద్రకిరణ్‌కి వాళ్ళనిప్పుడే పంపాలని లేదు.

దివ్య మనసులో బాధపడింది.

కవిత కలిసిపోయే అమ్మాయయి ఉంటే ఈ రెండు కుటుంబాలు ఒకే వూరిలో వుండి ఇంత దూరంగా వుండేవికావు

అనుకున్న మాటే అనుకుంది ఇలా అబద్ధం చెప్పాల్సి వచ్చినం

"లేదన్నయ్యా! ఈరోజు సాయంత్రంనుండి తలనెప్పి ఎక్కు వగా వుంది. ఇంకోమారు వస్తాంలే"

"టాబ్‌లెట్స్ వేసుకొని వేడి టీ త్రాగితే ఐదు నిముషాల్లో తగ్గి పోతుందిలేమ్మా" అని భార్యవేపు తిరిగి....

"డ్రస్సింగ్ టేబుల్ డ్రాయర్‌లో టాబ్లెట్ వుంది" తీసుకురా" అన్నాడు.

కవిత లేచి నిలబడింది.

వెళుదురులే వుండండి అనే మాట కవిత నోటినుండి రాకపోడం స్వరూప్‌కి కూడా ఆమె అమర్యాదను ఇంకోసారి గుర్తుతెచ్చింది.

"దివ్యకు టాబ్లెట్ అవసరం లేదురా. రెండుగంటలు నిద్రపోతే తగ్గిపోతుంది. ఇప్పుడు కవితను శ్రమపెట్టకు"

చంద్రకిరణ్ దివ్యను నోరారా చెల్లెమ్మా అని పిల్చినట్లు కవితని స్వరూప్ పిలవలేకపోతున్నాడు.

అది స్వరూప్ తప్పుకాదు. కవిత ఆ అభిమానాన్ని స్వరూప్‌కి ఇవ్వడంలేదు.

"ప్లీజ్ అన్నయ్యా! కవితకు శ్రమ ఇవ్వొద్దు. టీ తాగినా టాబ్లెట్ వేసుకున్నా నాకు తగ్గదు. ఈ రోజుకి వదిలేయన్నయ్యా! ఈ తలనెప్పి వచ్చినప్పుడు తగ్గేవరకు అన్నంకూడా తినలేను నేను"

"ఒక్క కూరతో అయినా వేసుకుందాం రండి కబుర్లు చెప్పు" కుంటూ' అని కవిత నోటినుండి వచ్చి వుంటే దివ్యకు అబద్ధం చెప్పా ల్సిన అవసరం వచ్చేది కాదు.

"ఫ్రీక్వెంట్‌గా వస్తే జాప్యం చేయొద్దు ఫిజీషియన్‌ని కన్సెల్టు చెయ్యి దివ్యా" ఆదుర్దాగా అని స్వరూప్‌వేపు తిరిగి....

"ముందు దివ్యను డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళి తర్వాత యింటి కెళ్ళండి"

"ఏమీ అక్కర్లేదన్నయ్యా! రెస్ట్ తీసుకుంటే అదే తగ్గిపోతుంది."

"నీకు రెస్ట్ ఎక్కడిదమ్మా! కొంత టైమ్ నువ్వు నీ హెల్త్‌కోసం వాడుకోవాలి. పేషెంట్లు ఈ రోజు ఆగిపోతే రేపొస్తారు. ఆరోగ్యం పాడయితే వస్తుందా అనేసి అన్నట్లు మర్చేపోయాను అంటూ కవితను పిలిచి -

"స్వరూప్, దివ్య కొడైకెనాల్ వెళుతున్నారట కవితా! ఆ పది రోజులు నువ్వు దివ్య నర్సింగ్‌హోమ్ చూసుకోగలవా?"

"నాకు ప్రైవేట్ ప్రాక్టీసంటే అస్సలిష్టం వుండదు. అందుకే గవర్నమెంట్ జాబ్‌లో జాయిన్ అయ్యాను" కవిత భర్తకు జవా బిచ్చింది.

దివ్యకు అభిమానం దెబ్బ తిన్నట్లయింది.

"నాకు ఎక్స్‌పీరియన్స్ లేదుకదా పేషెంట్లకు ఒకటి వేయబోయి ఇంకోటి చేస్తే మరలా మీరే సఫర్ అవ్వాలి."

అవొచ్చు లేదా, లీవ్ దొరకదు ఎలా అనొచ్చు ఎదుటి వ్యక్తి హర్ట్ అవకుండా నేను చేయను అదే జవాబుని సున్నితంగా ఎలాగైనా చెప్పొచ్చుగదా! అని బాధ పడింది దివ్య.

"నీకు ప్రైవేట్ ప్రాక్టీస్ అప్పజెప్పి దివ్య ఫారిన్‌ట్రిప్ వెళుతుం దనుకున్నావా? ఇంటరెస్ట్ లేకపోవడానికి పదిరోజులు వెళ్ళ చాలు" మామూలుగా అన్నాడు చంద్రకిరణ్.

"నాకంత ఓపిక వుండదు. మీకు తెల్సుగా" అంది కవిత.

మౌనంగా వుండిపోయాడు చంద్రకిరణ్.

తన స్నేహితుడడిగిన చిన్న సహాయం చేయలేకపోయాననే అనే బాధ అతని ముఖంలో ప్రస్ఫుటమవుతోంది.

"వస్తానమ్మా" అనేసి కదిలాడు స్వరూప్.

దివ్య మనసులో ఎంత చిరాగ్గా వున్నా కవితవైపు తిరిగి వస్తా నన్నట్లు తల తిప్పి భర్త వెంట నడిచింది.

ఈమెకు గర్వమో, లేక తెలియనితనమో అదీగాక మర్యాద లేనితనమో, అర్థం కాలేదు దివ్యకు కారెక్కబోతూ అనుకుంది— ఎప్పుడూ కవిత సహాయం కోరకూడదు అని.

"సారీ అమ్మా కవితకుభయం జాస్తి గవర్నమెంటుహాస్పిటల్‌లో ఏది జరిగినా బాధ్యత వీళ్ళ మీదుండదట. అదే ప్రైవేట్ ప్రాక్టీస్ అయితే హండ్రెడ్‌కి నూరు పర్సంట్ బాధ్యత వుంటుందట. అందుకని ఇష్టం వుండదట. తన మనస్సు మంచిదే కానీ మాట్లాడ్డం చేతకాదు" నొచ్చుకుంటూ అన్నాడు.

తన భార్యను యీ మాత్రం కూడా బయట పెట్టుకోవడం అత నికి బాధగా వున్నట్లుందో, లేక ఏదీ పట్టించుకోని తత్వమో....!

"ఫర్వాలేదన్నయ్యా! ఇందులో మీరు ఫీల్ అవడానికేముంది. ముందుగానే పేషెంట్లకు చెప్పేస్తాను. వారం రోజులు నేనుండనని. క్లినిక్ క్లోజ్ చేసి వెళతాము"

"వస్తాంరా. గుడ్‌నైట్" అనేసి కారు స్టార్టు చేసాడు స్వరూప్. వాళ్ళింటిగేటు దాటగానే స్వరూప్ భార్యతో అన్నాడు—

"చందూని చూస్తే దిగులేస్తోంది దివ్యా! వాడికి కల్సిపోయే భార్య వచ్చుంటే చాలా బాగుండేది"

'మనతో కలవకపోయినా పరవాలేదు. అన్నయ్యతో కల్సిపోతే చాలు" అంది ...

"నాకా నమ్మకంకూడా లేదు దివ్యా! వాడు ఆమెను ప్రెస్ చేయలేక పోయాడంటే అర్థం ఏమిటి ఆమె మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకున్నట్లేకదా! బాడ్‌లక్ వాడి భవిష్యత్తిలా అవుతుందని నేనూహించలేదు" స్వరూప్ కంఠంలో బాధ.

ఇంటికొచ్చాకకూడా స్వరూప్ తన స్నేహితుడి దురదృష్టం గురించే భార్యతో చర్చించాడు.

అన్నం తింటున్నప్పుడు పరిశీలనగా భార్యవైపు చూసి—

"ఈ మధ్య నువ్వు చిక్కిపోయావు దివ్యా" అన్నాడు

నవ్వింది దివ్య.

"నవ్వుతావేంటి? ఆ నీకీకూరలు నచ్చకుంటే నచ్చిన కూరలు చేయించుకో దివ్యా"

కవిత బిహేవియర్‌కు ఎప్పటికప్పుడు ఆశ్చర్యపోయినట్లే భర్త అనురాగానికి అది ఎక్స్‌ప్రెస్ చేసే విధానానికి ఆశ్చర్యపోతూవుంటుంది దివ్య. ఇంత ప్రేమ ఈయనకు నామీద ఎలా వచ్చిందా? అనికూడా అనుకుంటూ వుంటుంది.

"నవ్వక ఏం చేయను? అదంతే" పెదాలమీదకు నవ్వు రానీకుండా బిగబట్టి అంది-

"ఏమిటో నాకేమీ అర్థం కావడంలేదు నీ భాష"

"అర్థమయ్యేలా తర్వాత చెప్తాగా"

"తర్వాతెందుకు ఇప్పుడే చెప్పు ప్లీజ్"

చెప్పాలనుకుంది కానీ సిగ్గుతో నోరు విప్పలేక పోయింది.

"ఏమిటీరోజు కొత్తరకంగా సిగ్గు పడుతున్నావ్" భార్యప్రక్కకు వచ్చి నిలబడి "ఊహుఁ నాకు చెప్పాల్సిందే! ఇప్పుడే, ఇక్కడే, ఈ క్షణంలోనే చెప్పాలి"అని ముద్దు చేసాడు.

ఇంకా సిగ్గుపడిపోయింది దివ్య.

"డాక్టర్లకికూడా ఇంత సిగ్గుంటుందా? అది నిన్ను చూసాకే అర్థమయింది నాకు."

"డాక్టరన్నాక పెళ్ళిలో సిగ్గుపడరా. ఇంక ఆరు నెలల్లో నేను తల్లిని కాబోతున్నామంటే సిగ్గుపడరా" తనకు తెలియకుండానే అనేసింది.

"కంగ్రాచ్యులేషన్స్ డియర్! ఇంత మంచివార్త ఇలానాచెప్పేది? పద....పద నీకేం ఇష్టమో లిస్ట్ వ్రాసిచ్చేయ్. నిముషంలో తెచ్చేస్తాను. ఈ సంతోషవార్త అత్తయ్యకు వ్రాసెయ్యాలి. నువ్వు వ్రాస్తావా? నన్ను వ్రాయమంటావా?" చటుక్కున వంగి భార్యను ముద్దుపెట్టుకున్నాడు.

అటు ఇటు చూసింది దివ్య.

"ఎందుకోయ్ భయం. నా భార్యను నేను ముద్దుపెట్టుకుంటున్నానేగానీ ఇంకేం తప్పు చేయలేదుగా."

ఈసారి లేచి పరిగెత్తింది దివ్య.

"ఏయ్ దివ్యా! జాగ్రత్త! అలా పరిగెట్టకూడదు నువ్విప్పుడు"

"అలా అని మీ కెవరు చెప్పారు?"

"అదిగో నీ పొట్టలో వుండే బాబు చెప్తున్నాడు"

"అల్లరి ఇంకా ఎక్కువయి పోయిందే మీకు?"

"ఎంతల్లరి చేసినా బాబు పుట్టేవరకేగా. అందుకని అప్పటివరకు నా అల్లరంతా భరించి నేను తెచ్చినవన్నీ తిని నాకో కొడుకుని ఇవ్వు అచ్చు నీరూపంతో కావాలి"

"అదేమిటీ మగపిల్లవాడికి నా రూపం ఎందుకు?"

"నాకంటే నువ్వందంగా వుంటావుగా అందుకేగా మొదటి పెళ్ళి చూపుల్లోనే నీ వల్లో పడిపోయాను నేను"

"ఓకే. ఓకే. ఇప్పుడిద్దరం ఒకే వల్లో వున్నాం. ఇంకో ఆరు నెల్లకు బుజ్జివల తయారు చేయాలనుకుంటే ఓహ్‌ ఆ రోజు ఎప్పు-

డొస్తుందా అని ఎదురు చూస్తున్నాను. నా చేతుల్లోకి తీసుకుని న బంగారు కొండను ఎప్పుడాడిద్దామా? అని వుందనుకో"

"అంటే ఇంక నావైపే చూడరా? అట్లయితే నాకు పిల్లలేవద్దు" గారాభంగా అంది దివ్య.

"నా గుండెల్లో మొదటిస్థానం నీదేగా. అది ఇంకెవ్వరికీ దక్కదు సరేనా?" జోక్స్ వదలి సత్యం చెపుతున్నట్లు చెప్పాడు.

"నేను తమాషా కన్నానండీ మీరేమిటీ...."

"నా మనస్సు ఇది అని చెపుతున్నాను"

"మీ గుండెల్లో నామీద ప్రేమకు డిక్షనరీలో కూడా పదం లేదండీ. ఆ విషయం నాకు బాగా తెల్సు మీకు చెప్పాలా?"

"ఇదిగో అమ్మాయ్! నువ్వింక రెస్టు తీసుకోకుంటే ఒప్పుకోను. హాస్పిటల్‌కు తీసుకెళ్ళయినా సరే రోజూ జ్యూస్ త్రాగాలి. వేళకు అన్నంతినాలి. ప్రతిరోజూ 'మధ్యాహ్నం మూడు గంటలు నిద్ర పోవాలి."

"మరి కోడైకెనాల్ ప్రోగ్రాంలో యిదంతా ఎలా జరుగుతాయి?"

ఉహుం ప్రయాణమే వద్దు జర్నీలు జర్క్స్ వుంటాయి. నీకు కష్టమౌతుంది నా చిన్నిబాబు భయపడ్తాడో ఏమో!

అతని మూడ్ చాలా బాగుంది.

"దివ్యా! యిలాటప్పుడు పెద్దవాళ్ళు దగ్గరుండాలంటారు? అత్తయ్యను రమ్మని కబురుపెట్టనా అవేమిటో కుంకుమపువ్వు ఇంకా ఏదేదో పెడతారు? తీసుకురానా? నువ్వు మాత్రం అప్పటిలా హాస్పిటల్ కంకితం అయితే ఒప్పుకోవడాలు లేవు. అబ్బ ఇంక ఆరునెల్లు గడిచే దెలా? మన బుజ్జిబాబుకి ఏం పేరు పెడదామంటావు?"

"ఏం పాప వద్దా?"

"వద్దనికాదు.... బాబయితేనే మనింట్లో వుంటాడు."

పాపయితే వుండదా?"

"వుంటుంది పెళ్ళి చేసేవరకు తర్వాత వుండదుగా అదీకాక వచ్చే అల్లుడు అమ్మాయిని కష్టపెట్టేవాడయితే ఆ దిగులూ వుంటుం దిగా...."

యింత ముందు నుండి ఈయనకు పిల్లల భవిష్యత్తు గురించి ఇంత ఆలోచన వుందా? అని అబ్బురపడింది దివ్య.

* * * *

16 క్యాలెండర్లు చిరిగిపోయాయి. ఈ లోపల ఎన్నో మార్పులు దివ్యకు పాప పుట్టింది. చిరుహాస అని పేరు పెట్టుకున్నారు. ఆ పాప పెద్దదయి ఇంటర్‌మీడియేట్ కొచ్చింది.

నాలుగు సంవత్సరాల తర్వాత చంద్రకిరణ్ గుంటూరు మార్పించుకున్నాడు. కవిత కొద్దిగాకూడా మార్పులేదు. ఆ అమ్మాయికి ట్రాన్స్‌ఫర్ అయిందని అతన్నీ మార్పించుకుంది. గుంటూరులో బంధు వర్గానికి దూరంగా భార్యతో ఆనందంగానే గడుపుతున్నాడు.

వాళ్ళకి ఒక పాప పుట్టింది. ఆ అమ్మాయి పేరు స్వప్న. వెక్త లోకి వచ్చింది. స్నేహితులిద్దరూ ఫోన్లల్లో లెటర్స్‌లో కలుసుకుంటు న్నారు. కవితతో కలివిడి లేకపోయేసరికి గుండెల్లో దగ్గరతనం వున్నా స్నేహితులిద్దరూ దూరంగానే వుండిపోయారు.

స్వరూప్ బిజినెస్ అంచెలంచెలుగా ఎదిగిపోయి ఎప్పుడూ బిజీ అయిపోయాడు. దివ్య తన ప్రాక్టీస్‌తో స్వరూప్ తన బిజినెస్‌తో మెకాని కల్‌గా జీవితాన్ని గడిపేస్తున్నారు. చిరుహాస పేరుకు తగ్గట్టే వుంటుంది. ఎప్పుడూ చిరునవ్వుతో గలగలపారే సెలయేరులా ఇంటి నంతా చైతన్యవంతం చేస్తూ వుంటుంది.

టౌన్‌హాలులో జరిగిన ఆర్ట్స్ ఎగ్జిబిషన్‌లో చిరుహాస 'నేటి మన్మధ' పెయింటింగుకు ఫస్ట్ ప్రైజ్ వచ్చింది చిరుహాసతో వచ్చిన స్నేహితురాళ్ళంతా చప్పట్లు కొడుతూనే వున్నారు. చిరుహాస ప్రైజ్ అందుకుని స్టేజి దిగి వచ్చేవరకు కంగ్రాచ్యులేషన్స్ హాసా! నీ సున్నిత మయిన వేళ్ళమధ్య నుండి వచ్చిన నేటి మన్మధకు ప్రైజ్ కొట్టేసావ్?

"అమ్మాయిలని వేయడం సులభంగానీ అబ్బాయిని ఇంతందంగా ఇంత సున్నితంగా వేయడం రియల్లీ గ్రేట్."

"నోర్మూసుకోవే పిచ్చి మొద్దూ! అమ్మాయిలు సున్నితంగా వుండాలని కోరుకుంటాంగానీ నీవన్నట్లు అబ్బాయిలు సున్నితంగా వుండడమేమిటీ? రేపు నువ్వు చేసుకోబోయే అబ్బాయి మంచి హాండ్ సమ్ పర్సనాలిటీగా వుండాలి గుర్తుపెట్టుకో" పావని అంది.

ప్రస్తుతం మనం చదివేది ఇంటర్ సెకండ్‌యియర్ మాత్రమే. ఇంకా ఎంట్రన్స్ వ్రాయాలి. ఎం బి బి యస్‌లో రాకపోయినా కనీసం బి డి ఎస్‌లోనయినా సీట్ సంపాదించాలి. అదయ్యాక మరలా ఎంట్రన్స్ వ్రాసి పిజి డిగ్రీకి ప్రాకులాడాలి. అవన్నీ నాటాకే అబ్బాయి ప్రసక్తి మన మధ్యకురావాలి" శాలిని అంది.

"అబ్బపూర్తయిందా తల్లీ పురాణం నేను దాన్ని ఇప్పుడే పెళ్ళి చేసుకోమన్నానా? ఏమిటీ? చేసుకునే రోజు అలాటి అబ్బాయిని చేసుకో అన్నానంతే అది తప్పా!" శాలినితో అంది పావని.

"మాకు రాకపోయినా మా ఫ్రెండ్‌వయిన నీకింత మంచి ఆర్ట్ వచ్చినందుకు చాలా గర్వంగా వుంది" ఒక స్నేహితురాలంది.

"వాళ్ళ డాడీ ఇంటరెస్టు అది....చిరుహాస నేర్చుకోవాలి అనగానే ఆయన బాగా సపోర్ట్ యిచ్చారు అది కూడా ఒక అదృష్టమేకదా!" శాలిని అంది.

"ఇలా మాట్లాడుతూ కాలం గడపడం కాదు. ఈ మారు చిరుహాసను వదిలేదు లేదు ఫస్ట్ ప్రైజ్ అందుకున్న శుభసందర్భంలో మనకంతా ట్రీట్ యివ్వాల్సిందే!"

"ష్యూర్ ష్యూర్" చిరుహాస నవ్వుతూ అంది.

కోకిలాలో బిరియానీ, వెన్నెలాలో ఐస్‌క్రీమ్, కావేరిలో నాగార్జున పిక్చర్ వీటిలో ఏదీ మిస్ అవడానికి లేదు సరేనా" తిండిపోతి త్రివేణి ఫోర్స్ చేసింది.

నీ ఎనర్జీ వేస్ట్ చేసుకోకు వాణి హాస మనతో ఇన్ని దగ్గర్లకు రాలేదు. వాళ్ళమ్మ నాన్న మనలో అరకులోయకు ఎంత బ్రతిమిలాడినా పంపార్రా? అంతమందిమి వెళుతూ మనతో లెక్చరర్స్ వస్తేనే పంపలేదు. ఇప్పుడు నెల్లూరు చుట్టేద్దామంటే పంపిస్తారా?

వాణి మాటలకు చిరుహాస ముఖం చిన్నబుచ్చుకుంది.

"వాళ్ళమ్మ నాన్నకు ఒక్కగానొక్క కూతురు వాళ్ళ భయం వాళ్ళది దానికి హాసను నిష్టూరమాడడమేమిటి? పాపం ప్రైజ్ వచ్చిన ఆస్కారం లేకుండా చేయకండి" మనుష్యుల్ని అర్ధం చేసుకోగల మనస్తత్వం గల శామిలి అంది.

"ఏమైందట మనమంతా వెళ్ళి హాయిగా ఎంజాయ్ చేసిరాలేదూ! అరకులోయ బొర్రాకేవ్స్ ఎంత బాగున్నాయి. ఆ ప్రకృతిలో పచ్చదనాన్ని అందరం కల్సి కబుర్లు చెప్పుకుంటూ ఎంతానందించాం.... అందరం కల్సి వెళ్ళి అడిగినా వాళ్ళమ్మ హాసను పంపలేదు మనం ఎంత హార్ట్ అయ్యామని.

"అబ్బ వూరోక్కండర్రా యిప్పుడు మన హాసను హార్ట్ చేయడం నాకేం నచ్చడంలేదు పదండి వెళదాం" శామిలి మరలా అంది రేపు మనకు కాలేజీ లేదుకదా! నేను ట్రీట్ యిస్తున్నాను మనమంతా లంచ్ కోకిలాలో తీసుకుని....

"స్టాప్....స్టాప్....కోకిలా బార్ అది మనవంటికి సరిపడదు గురులో తిందాం" పావని అడ్డొచ్చింది.

ఓ కె గురులో లంచ్ తీసుకుని వెన్నెలాలో ఐస్క్రీమ్ తిని కావేరిలో పిక్చర్ కెళదాం."

ఆబ్జెక్షన్ ప్లీజ్! నేను నాగార్జున్ పిక్చరుకు రామకృష్ణలో చిరంజీవి పిక్చర్కయితేనే వస్తాను."

"నో....నో.... నేను నర్తకిలో రాజశేఖర్ పిక్చర్కయితేనే వస్తాను ఇంకో స్నేహితురాలు గట్టిగా పలికింది.

"అబ్బబ్బ! మనం వెళ్ళేది ఎంజాయ్ చెయ్యడానికేగా ఏ పిక్చరయితే ఏం? ఏ జేస్తూ బలంగాలేని సుజన అంది.

"ఎంజాయ్ చెయ్యడానికేగదా హీరో అందంగా వుండాలని కోరుకోవడం."

"సినిమాలో ఏమి నీతి మనకందిస్తున్నారో అది ముఖ్యం కాని హీరో ఎవరయితే ఏం? అతను హావభావాలు కావాలిగానీ ఫలాన హీరోనే కావాలనే పట్టుదల ఏంటి? ఈ గొడవంతా తేలేది కాదు గానీ. టాస్ వేస్తాను బొమ్మ మెజారిటీ అయితే బొమ్మ కోరుకున్నవాళ్ళదే ఛాయిస్ బొరుసు పడితే బొరుసు కోరుకున్న వాళ్ళడిగిన పిక్చరుకు వెళదాం సరేనా!

"మనలో మూడు తెగలున్నాయి కదా! ఎలా వీలవుతుంది?" తన అనుమానాన్ని బయట పెట్టింది శ్రీవాణి.

"ఓ కే నేను రాజీ పడ్తానులే" రాజశేఖర్ ఫియాన్సీ సర్దుకుంది.

అందరి ఇష్టంమీద టాస్ వేసారు. చిరంజీవి సినిమాకే మెజారిటీ వచ్చింది

"ఇంత కష్టపడి మన ప్రోగ్రాం సెటిల్ చేసుకున్నామా? రేపు పొస సింపుల్‌గా ఒక ఫోన్ కొట్టేస్తుంది మా అమ్మ ఒప్పుకోవడం లేదు సారీ" అనే శ్రీవాణిని అందరూ కల్సి తిట్టేసారు.

గుడ్‌నైట్ చెప్పుకుంటూ ఎవరూళ్ళకు వాళ్ళు కదిలారు.

"డాడీ! మీరు టౌన్‌హాల్‌కు రాలేదుకానీ నన్నందరూ ఎంత మెచ్చుకున్నారో తెల్సా! నాకే ఫస్ట్‌ప్రైజ్ వచ్చింది ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో."

"కంగ్రాచ్యులేషన్స్. నాకు తెల్సు బేబీ తప్పకుండా నీకు ఫస్ట్ ప్రైజ్ వస్తుందని ఆ నైపుణ్యం నీలో వుంది గుడ్" కూతురందించిన షైండికప్పు చూస్తూ అన్నాడు చిరుహాస తండ్రి స్వరూప్.

అంతలోనే మూతి ముడిచింది చిరుహాస.

"డాడీ! నా ఫ్రెండ్సంతా నన్నల్లరి పెట్టారు తెలుసా!"

"ఎందుకు బేబీ"

"ఎందుకేమిటీ? మీరు మా కాలేజీ తరపున మా స్టూడెంట్స్‌తో మా లెక్చరర్స్ వస్తున్నా అరకులోయకు ఎక్స్‌కర్షన్‌కు పంపనందుకు"

"అందులో అల్లరి చేయడానికేముంది" అప్పుడే హాస్పిటల్‌నుండి వచ్చిన దివ్య కూతుర్ని అడిగింది

"మీకు నేనొక్కర్తినే కూతుర్నని నాకేమయినా అవుతుందని భయపడ్డారట."

"ఎగ్జాక్ట్‌లీ కరెక్ట్" దివ్య కూర్చుంటూ అంది.

"నీకు అరకువాలీ చూడాలనుకుంటే సమ్మర్‌లో తీసుకెళతానులే బేబీ మన ముగ్గురం వెళదాంలే."

తండ్రి మాటలకు సంబరపడిపోయింది చిరుహాస.

"అదేంకాదు నువ్వు ఎంట్రన్స్‌కు ప్రిపేర్ అయి ఎం.బి బి.యస్‌లో సీటు తెచ్చుకోకపోయినా ఫర్వాలేదు బి డి.యస్.లో సీటు తెచ్చుకోవాలి అప్పుడు వెళదాం."

"బెట్ మమ్మీ నేను తప్పకుండా బి డి యస్ లో సీటు తెచ్చుకుంటాను. నాకు నీలాగే ప్రాక్టీస్ చేయాలనుంది. మరి అప్పుడు కూడా ఈరోజు టౌన్‌హాల్‌కి రావడానికి తీరలేదన్నట్లు అంటే మాత్రం ఒప్పుకోను."

"మీ డాడీ విషయం నాకు తెలియదుగానీ నేను మాత్రం నీకు బి డి యస్ లో సీటు వచ్చిందని తెల్సినరోజే ఆ సంతోషంలో నాలుగు రోజులు క్లినిక్ మానేస్తాను."

పిళ్ళొద్దరి ఆనందంలో ఆసక్తిలేనట్టుగా అన్నాడు స్వరూప్.

"హాయిగా బి.ఎ. చదివేయ్ బేబీ! కావాలనుకుంటే ఎం ఎ చేసి లెక్చరర్‌వి అయిపోదువు"

"అదేం లాభం లేదండోయ్! మన హాస తప్పకుండా నా సీటు తీసుకోవాల్సిందే. అది పుట్టినప్పుడే నిర్ణయం చేసాను నేను."

"నువ్వే చెప్పు బేబీ! మీ అమ్మ ఏం సుఖపడుతోంది నువ్వు ప్రయిజ్ అందుకుంటుంటే చూడాలని ముచ్చటిపడ్డా రాలేకపోయింది."

"అమ్మలా నేనుండనులే డాడీ! ఒక వైపు ప్రాక్టీసు చేస్తూనే యింకో వైపు ఎంజాయ్ చేస్తాను"

"ఇప్పుడు మీ మమ్మీ ఎంజాయ్ చేయాలనుకోకుండానే వుందా పాపం అక్కడికెళ్ళాక అందులో కూరుకుపోయాక యింటిదగ్గర వేసుకున్న ప్రోగ్రాం అంతా మర్చిపోవాల్సిందే పాపం"

"పాపం ఎందుకు? నేను అక్కడ పేషెంట్లతో బిజీగా వుంటే మీరు మీ బిజినెస్‌లో బిజీగా లేరూ! దేంట్లో అయినా శ్రమ తప్పదు." దివ్య చిరుహాస చేతిలో కప్పు అందుకుంటూ అంది.

"మమ్మీ! నాకు ఫస్ట్ ప్రయిజ్ వస్తే అందరూ చప్పట్లు కొడుతుంటే మీరే గుర్తొచ్చారు తెల్సా"

"కంగ్రాచ్యులేషన్స్ హాసా! నువ్వు ప్రయిజ్ అందుకుంటుంటే చూడాలని చాలా ట్రై చేసాను హాసా! ఏదీ ఆ కేసు కాంప్లికేట్ కాకుంటే బాగుండేది. నీకు తెల్సుగా పేషెంటును వదిలేసి ఏ డాక్టరూ రాలేరని. ఈసారలా కాదు క్లినిక్‌కే వెళ్ళను ఆ రోజు సరేనా" కూతురు నొచ్చుకోకుండా అంది దివ్య.

"మమ్మీ! అరకులోయ ఎప్పుడెళదాం?"

"తప్పకుండా వెళదాం. నీకు ఎంట్రన్స్‌లో బి డి ఎస్‌లో సీటు రాగానే వెళ్దాం. చూడు హాసా ఎంత పట్టుదలగా ఆర్ట్‌లో నీ టాలెంట్ చూపిస్తున్నావో అలాగే ఎంట్రన్స్‌కి ప్రిపేర్ అవ్వాలి సరేనా?"

"ఓ.కే. మమ్మీ మాట తప్పకూడదు డాడీ నాకు సీటు రాగానే ముగ్గురం వెళ్ళాల్సిందే"

★ ★ ★ ★

"దివ్యా! బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ క్రింద ఆరునెలలు అమెరికా వెళ్తున్నాను నీకుకూడా పాస్‌పోర్ట్ వీసా తీసుకుంటున్నాను" సంతోషముగా అన్నాడు స్వరూప్.

"బిజినెస్ పని మీదనా? అమెరికాకా? అదీ ఆరునెలలా? నా కెలా వీలవుతుంది?"

"నీకు వీలవకపోవడమేమిటి? గవర్నమెంటు జాబ్ కాదుగా?"

"దానికోసం కాదు చిరుహాస కీ సంవత్సరం ఇంటర్ ఫైనల్ కదా! మనం లేకుండా ఎలా వుంటుంది" అమెరికా వద్దు ఏమీ వద్దు"

"అదెలా కుదుర్తుందోయ్. నేను తప్పక వెళ్ళాలి అందుకేగా నీకూ వీసాకి ప్రయత్నిస్తుండేది."

"ఏమీ అక్కరలేదు. అమెరికాకెళ్ళి ఎగస్ట్రా సంపాదించక్కర లేదు మీరు. మనకున్నది చాలుగే."

"బేబీని హాస్టల్‌లో వదిలేద్దాం–నీ ప్రాక్టీస్‌కు ఆరునెలలు గుడ్‌బై చెప్పేయ్"

అతని కళ్ళు కాంతిగా మెరుస్తున్నాయి. దివ్య తనతో వస్తే బాగుణ్నని వుంది.

"ప్రాక్టీస్ పోతే మరలా పికప్ అవడం కష్టం. అయినా చిరు హాసకు హాస్టల్ ఫుడ్ పడదులెండి"

"కష్టమయితే మనకొచ్చే నష్టమేమిటట. నువ్వేగా యిప్పుడు అన్నావ్ మనకున్నది చాలని, సంపాయించక్కర్లేదని"

"ఇంత చదువు చదివి గోళ్ళుగిల్లుకుంటూ ఇంట్లో కూర్చోవడం-"

"గోళ్ళెందుకు గిల్లుకోవాలోయ్ నన్ను గిల్లుకో నేను కాదంటానా?"

అన్నీ మర్చిపోయి నవ్వేసింది దివ్య.

"గుడ్....అలా నవ్వుతూ వుండాలి నువ్వు.....అందుకే ఆరునెలలు మనిద్దరం కల్సి అన్ని ప్లేసెస్ చూసి వద్దాం సరదాగా."

"చిరుహాస బాధ్యత తీరిపోతే అలాగే వెళదాం. ఇప్పటికి ఈ ఫారిన్ ట్రిప్ మానేయండి ప్లీజ్"

"ఏమిటి చిరుహాస అంటున్నావ్ మమ్మీ" కాలేజీనుండి వచ్చిన హాస తల్లితండ్రి వున్న దగ్గరకు వస్తూ అడిగింది.

"డాడీ యు ఎస్ ఎ వెళ్ళాలంట వద్దంటున్నాను నేను"

"భలేదానివి మమ్మీ! డాడీతో నువ్వూ నేనూ వెళ్ళిపోదాం. ఓ ష్మని." సంతోషంగా అంది.

"మరి నీ చదువు?"

"రెండు నెలల్లో చదివేయనూ?" ధీమాగా అంది చిరుహాస.

"డాడీ ఆరునెలలు అంటున్నారు."

"నేను హాస్టల్‌లో వుంటాలే మమ్మీ! నువ్వెళ్ళొని వచ్చేయి. మీ కోసం ఆ మాత్రం హాస్టల్‌లో ఫుడ్ భరించలేనా?"

"అలా చెప్పు బేబీ"

"ఏమిటది చెప్పేది. కావాలంటే అత్తయ్యను దీని దగ్గర పెట్టొచ్చు హాస్టల్‌లో కూడా అక్కరలేదు. కానీ అత్తయ్య వుంటే సినిమాలకు చెక్కేస్తుంది. కానీపదవననే భయంతో కదా నేను రాలేనంటుంది"

"ఏయ్! అబద్ధం చెప్పకు నువ్వు ప్రాక్టీస్ మానలేవురే"

"కరెక్టు డాడీ"

దివ్య మౌనంగా వుండిపోయింది. కానీ ఒక్కడూ వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లు తప్పనిసరై చేసుకుంటుంటే దిగులు పడిపోయింది.

★ ★ ★ ★

స్వరూప్ వెళ్ళేరోజు రానే వచ్చింది. ఆ క్షణంలో దివ్యకతనితో వెళ్ళిపోవాలనిపించింది ప్రాక్టీస్ కానీ, కూతురు చదువుకానీ గుర్తు రాలేదు.

కానీ అతను వెళ్ళేది ఫారిన్‌కంట్రీకి అనుకోగానే సరిపోదు కనెళ్ళాలంటే పాస్‌పోర్ట్ దగ్గరనుండి వీసా వరకు చాలా తతంగమే వుంది.

"వీలైనంత త్వరగా వచ్చేయండి ఆరునెలలంటే మిమ్మల్ని చూడకుండా నూటఎనభయ్ రోజులు గడపాలి." ఆమె కళ్ళల్లో నీళ్ళు పైకి రాకుండా శతధా ప్రయత్నిస్తూ అంది.

ఆమె ఎంత చిన్నగా అన్నా చిరుహాస చెవిని దాటిపోలేదు.

"ఉహుఁ నాలుగువేలా మూడువందలా ఇరవై గంటలని చెప్పు డాడీ మమ్మీతో.

తండ్రి ట్రయిన్ ఎక్కేవరకు తనకు కావాల్సిన వస్తువుల లిస్ట్ చెప్తూనే వుంది హాస

చిరుహాసను ట్యూషన్ దగ్గర దింపేసి ఇంటికొచ్చిన దివ్య మనస్సు శూన్యమై పోయింది.

మెడ్రాస్ వరకు వెళ్ళి సెండాఫ్ ఇవ్వాలనే తన కోరికను అన కట్టవేసాడు స్వరూప్. అక్కడనుండి ఒంటరిగా రావడం కష్టమని- స్వరూప్‌తో చాలామంది వున్నారు మెడ్రాస్ ఎయిర్‌పోర్ట్‌లో సెండాఫ్ ఇచ్చేందుకు. వాళ్ళున్నారుగా వాళ్ళతో వచ్చేస్తామని దివ్య ఎంత చెప్పినా వద్దొద్దు వాళ్ళకెన్ని పనులో అని వారించాడు.

దివ్యకు భర్త లేకుండా ఒంటరిగా ఆరునెలలుండలేననిపించింది. క్లినిక్ వెళ్ళేలోపల తనకేమీ తోచక టేప్ రికార్డర్ ఆన్ చేసింది. పది హేను నిముషాలు కూడా ఆ క్యాసెట్‌లో పాటలు వినలేకపోయింది. కాసేపు కళ్ళు మూసుకుని పడుకుంది. వాచ్‌లో నిముషాలముల్లు కదల టం లేదే అనుకుంది దాని పని సక్రమంగా నిర్వర్తిస్తున్నా.

పెళ్ళయినప్పటి నుండి ఇప్పటివరకు భర్తనొదిలిపెట్టి తనుండ లేదు. ఈరోజు ఆయనెళ్ళి గంటయినా కాకముందే ఆమెలో దిగులు ఆ రూమ్ నిండా పర్చుకుంది.

మూసుకున్న కళ్ళ వెనుక తమ వైవాహిక జీవితంలో జరిగి పోయిన రోజులు, నెలలు, సంవత్సరాల జ్ఞాపకాల పుస్తకంలో పేజీలు చకచక తిరిగిపోయాయి.

ఇంకా రెండు గంటలు గడపాలి తను హాస్పిటల్ కెళ్ళాలంటే- ముందే వెళ్ళి తను కూర్చున్నా సిస్టర్ కమల రాదు. పేషెంట్లు కూడా యింత త్వరగా రారు. ఎప్పుడూ భర్త తొందర చేసేవరకు క్లినిక్‌కి

టైమయిపోయిందనే హడావుడిలో పడిగెత్తడమే కానీ యింత సమయం ఊరికే కూర్చోవడం తెలియదామెకు. చిరుహాసను ట్యూషన్‌లో వదలక పోయినా బాగుండేదనుకుంది. ఎక్కడికయినా వెళ్ళాలనిపించలేదు. మెడ్రాస్ వెళ్ళే ఆ ట్రెయిన్‌ను కారులో వెళ్ళి గూడూరులో క్యాచ్‌చేసి భర్తను ఆమెనెకా పోకుండా ఆపేయాలనిపించింది అలాటి పిచ్చి ఊహ లకు గుడ్‌బై చెప్పి అరగంట తర్వాత తమ పెళ్ళి అల్బమ్‌కోసం వెతి కింది. కన్పించలేదు. కన్పించని వస్తువుమీద యింట్రస్ట్ పెరిగి పోతుం దేమో హాస్పిటల్ కెళ్ళేవరకు ఆ ఆల్బమ్‌తో కాలక్షేపం చేసి దిగులు మర్చిపోవాలనుకుంది

ఆఖరి ప్రయత్నంగా డ్రెస్సింగ్ టేబుల్ క్రిందనున్న షెల్ఫ్‌లో వెతకాలనుకుంది. ఆ షెల్ఫ్ తాళం వేసుంది. ఆ తాళం తన దగ్గరున్న తాళాల గుత్తిలో లేదు డూప్లికేట్ కీతో ఆ అర తెరిచింది. అందులో తనకు కావల్సిన ఆల్బమ్ లేదుగానీ ఆ అరనిండా దివ్యను ఆశ్చర్యంలో ముంచుతూ స్వరూప్ వ్రాసిన డైరీలు కొన్ని సంవత్సరాలవి పేర్చి వున్నాయి.

ఆమెకు భర్త డైరీలు వ్రాసే అలవాటుందనే విషయం ఇన్ని సంవత్సరాలు తెలియదు.

సభ్యత కాకపోయినా తనను గురించి ఏమి వ్రాసుకున్నారో అనే క్యూరియాసిటీతో సరదాగా పేజీలు తిప్పింది.

మే పందొమ్మిది-

ఆ పేజీ తమ పెళ్ళయిన మొదటిరోజులో ఒకరోజు కాశ్మీర్‌లో గడిపినరోజు తమ అనుభూతులు, ఆనందాలు భద్రపరుచుకున్నారోజు.

దివ్యలాంటి భార్య తనకు దొరకడం అదృష్టం. దివ్యతో నా భవిష్యత్తు ఆనందంగా గడిచిపోతుంది. కాశ్మీర్ అందాలనుమించి ఆ ట్రిప్ పక్కన దివ్య సాన్నిహిత్యం రెట్టింపు ఉత్సాహాన్నిచ్చింది. ఆమె ప్రేమలో కనేమైనా చేయగలడు. ప్రతి మగాడు నాలా పెళ్ళయిన కొత్తలో ఇంతే

గర్వపడ్డాడా? ఊహుఁ ఆ విషయం నాకు తెలియదు. నాకు తెల్సిందల్లా దివ్య నాకు భార్య కావడం నా అదృష్టం.

కాశ్మీర్‌లో గడిపిన అపురూపమైన అనుభూతుల్ని వ్రాసుకుని వున్నాడు అన్నిటిలో భార్య తృప్తిగా గడిపినట్లుంది.

దివ్య కానందమయింది భర్తకు తనమీదున్న ప్రేమకు సంతోషంగా పేజీలు తిప్పసాగింది.

ఇంకొక రోజు—

దివ్యతో ప్రతిక్షణం గడపాలనే కోరిక నాలో పెరిగి పోతోంది. కానీ తీరడంలేదు. కారణం దివ్య ప్రాక్టీస్. ఆమె కది ఆరవప్రాణం. నా కోసం, నా ఆనందం కోసం ఆమెను ప్రాక్టీస్ మానేయమని చెప్పాలనుంది కానీ చెప్పలేక పోతున్నందుకు వ్యధ.

నన్ను ప్రేమించే దివ్య కోసం నేను ఆనందంగా దివ్యతో గడపాలనుకుంటున్న మధుర క్షణాల్ని త్యాగం చెయ్యక తప్పదేమో!

జూన్ పదిహేను-

పేషెంటును తీసుకుని క్లినిక్‌లో కెళ్ళింది దివ్య. అతను వారం రోజులనుండి దివ్య క్లినిక్‌కు రోజూ వస్తున్నట్లు చెప్పింది దివ్య. ట్రీట్‌మెంట్ కేనా లేక యితనిలో ఏదయినా దురుద్దేశం వుందా? వారం రోజుల నుండి డ్రస్సింగ్ చేయించుకుంటూ ఈ ఒక్కరోజు చేయించుకోకుంటే అంత బాధగా వుందా? యిది నిజమైన మాటేనా?

దివ్య అందాన్ని చూడ్డానికి ఈ రోగ్ ఈ సాకుతో రావడం లేదు కదా! లేకుంటే నిద్రలేచి లేవకముందే యింటికే ఎలా వస్తాడు? ఇదంతా తన మనసులో బాధ.

దివ్య ఎంత ఆనందంగా వున్నా ఈరోజు తన మనస్సంతా వికలమయి పోయింది. తన గుండెల్లో రక్తం మరుగుతోంది. దివ్యను తను శంకించడం లేదు. ఆ క్లినిక్‌కి వచ్చే మగవాళ్ళ నైజాలమీద నా అపనమ్మకం. దివ్య కెలా తెలుపడం....?

తనలోని అశాంతిని దివ్య గమనించింది. తలనొప్పని చెపితేటిఫిన్ చేయకుండా నా దగ్గర కూర్చుండి పోయింది. నాకు తెల్సు దివ్య చాలా మంచిది. నేనేది చెప్పినా వింటుంది. నిదానంగా చెప్పాలి. దివ్య బాధ పడకుండా చెప్పాలి అలా అనుకున్న చాలా సేపటికి దివ్యను దగ్గరకు తీసుకోగలిగాను.

డైరీ చదువుతున్న దివ్యకు ఆరోజు స్పష్టంగా గుర్తు వచ్చింది.

"బ్రష్ చేసారా రండి....రండి టిఫిన్ చల్లారిపోతుంది."

"టిఫిన్ చల్లారిపోయినా ఫర్వాలేదోయ్ ఈరోజు మాత్రం నా మూడ్ చల్లారిపోవడానికి వీల్లేదు" ఆదివారం వస్తే స్వరూప్ చాలా హుషారుగా వుంటాడు

"మన ప్రోగ్రాం ఏమిటి?" కుర్చీలోంచి లేస్తూ అడిగింది దివ్య.

"ఏముందీ ఎవరూ డిస్టర్బ్ చేయని స్థలం మనకుందిగా గెస్టు హౌస్‌కు వెళ్ళిపోదాం."

"ఒకే అరగంటలో తయారయి వెళ్ళిపోదాం"

"అక్కడికెళ్ళాక తయారవుదువులే డియర్. ఈ లోపల మనిద్ద రం ఆదివారం ఎక్కడ సుఖపడిపోతామో అనే దుగ్ధతో ఎవరో ఒకరు రాకముందే పారిపోదాం."

"మీ కోరిక నేనెందుకు కాదనాలి వెళదాం పదండి" అలా అని తను అన్నదేకానీ తనకూ ఆదివారంరోజు తన భర్తతో కాలక్షేపం చేయాలనేది శోచమైన కోరిక.

"ఆ టిఫిన్ ఏదో పట్టుకొచ్చెయ్ అక్కడ తిందాం. లంచ్‌కి మనం వెళ్ళేదారిలో ఏదో ఒకటి తీసుకెళదాంగానీ నువ్వాలస్యం చేయకు. ఇదిగో అమ్మాయ్ కార్డ్సు తీసుకురావడం మర్చిపోకు. ఈసారి నువ్వు ఓడిపోతే నేనడిగింది ఇవ్వకపోయావో ఇక ఎప్పుడూ నీతో కార్డ్సు ఆడ నంతే."

ఆ రోజు తన భర్త మాటలకు తనెంత సిగ్గుపడి పోయింది. ఎప్పుడు కార్డ్స్ ఆడినా తన గెల్చేది. తనడిగిన కోర్కెను అతను కాదన కుండా తీర్చేసేవాడు. వచ్చిన ఓక్కల్లా అతను గెల్చినప్పుడే ఊహ అతని కోర్కె తీర్చడం తనవల్ల అయ్యేదికాదు. ఆదివారం ఆరురోజుల పడిన శ్రమను అతని ఒడిలో, అతని లాలనలో, అతని సమక్షంలో అతనందించే అనుభూతుల ఒరవడిలో, అతనుచేసే చిలిపి చేష్టలతో ఆదమరచి పోయేది

కారెక్కబోతున్న సమయంలో విజ్డమ్‌టుత్ రిమూవ్ చేసిన ఐదేళ్ళ అబ్బాయి వచ్చాడు. అతనికి వారం రోజులుగా క్లీన్ ఆయిల్ డ్రస్సింగ్ చేస్తుంది. తను ఎందుకు ఇన్‌ఫెక్ట్ అయి విపరీతమైన నొప్పిగా వుంటే—

"డాక్టర్‌గారూ! మీరు నిన్న పెట్టిన డ్రస్సింగ్ రాత్రి పడి పోయింది. చాలా నొప్పిగావుంది. ఈ రోజు మీరు ఆదివారం క్లినిక్ రారని తెల్సి భయమేసింది. రేపటివరకు యీ నొప్పి ఓర్చుకోలేక వచ్చాను" భయంగా జంకుతూ అన్నాడు పేషెంటు.

"ఒక్క నిముషమండీ" ఎక్కబోయిన కారు దిగుతూ భర్తతో అని అతన్ని నోరు తెరవమని చూసింది. అతని నోటిలో తను పెట్టిన డ్రస్సింగ్‌లేదు.

"మా కారులో ఎక్కండి. వేరే డ్రస్సింగ్ క్లిన్ ఆయిల్ వేసి చేస్తాను నొప్పి తగ్గిపోతుంది."

"మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను సారీ డాక్టరుగారూ!"

"ఏం ఫర్వాలేదు రండి"

"జస్ట్ తెన్ మినిట్స్ క్లినిక్ దగ్గర ఆగి వెళదామండీ" భర్తతో యధాలాపంగా అందారోజు కానీ తన భర్త ఉల్లాసమంతా ఈ సంఘట నతో చెదిరిపోయిందని తెల్సుకోలేక పోయింది.

అతన్ని క్లినిక్ లోపలికి తీసుకెళ్ళి క్లిన్ ఆయిల్‌తో నోటన ముంచి తీసి డ్రస్సింగ్ చేసింది.

"ఎంతలే బాబూ! ఇంకో అరగంటకు నొప్పి తగ్గిపోతుం. పూర్తిగా వారం రోజులు ఇదే డ్రస్సింగ్ ఇస్తాను ప్రతిరోజూరా" అంది తను.

"ఇంతనొప్పి ఎందుకొచ్చిందంటారు డాక్టర్‌గారూ! బెరుగ్గా అడిగ దతను.

నవ్వింది తను.

"నూటికి పదిమందికి యిలా యిన్‌ఫెక్ట్ అవుతుంది. బాడీలో రెసిస్టెన్స్ తక్కువ వున్నవాళ్ళకు పస్ చేర్తుంది. అందుకని నొప్పిగా వుంటుంది డోంట్‌వర్రీ."

"చాలా థాంక్సండీ! మాస్టర్‌గారు మీకోసం కారులో వెయిట్ చేస్తున్నారు సారీ డాక్టర్‌గారూ! మీకు శ్రమ యిచ్చాను" మరలా నొచ్చుకున్నాడు.

"ఇందులో శ్రమ ఏముందిలే బాబూ! ఇది మా డ్యూటీ" అనేసి కారు దగ్గరకు వచ్చి శ్రీవారిని తొందర చేస్తూ—

"పదండి....పదండి మరలా నన్నెవరయినా చూస్తే డాక్టరమ్మ క్లినిక్ ఓపెన్ చేసిందని వచ్చేస్తారు" ఫ్రంట్ సీట్లో కూర్చుంటూ అంది.

కారు గెస్ట్‌హౌస్‌కు వెళ్ళేవరకూ స్వరూప్ మౌనంగా వున్నాడు. ఆ మౌనం వెనుక అతనిలో అశాంతి. ఆ రోజు తన కర్థం కాలేదు.

కారు గెస్ట్‌హౌస్‌ముందు ఆగగానే వాచ్‌మెన్ పరిగెట్టుకుంటూ వచ్చాడు. సామాను లోపల పెట్టి. గీజర్ ఆన్‌చేసి ఫ్రిజ్‌లో మంచినీళ్ళ బాటిల్స్ కడిగి మంచినీళ్ళు పెట్టి, ఫ్రిజ్ ఆన్‌చేసి, ఇల్లు తుడిచి, బూజులు తుడిచి తన యజమానికి చెప్పి వెళ్ళిపోయాడు.

"సోమయ్య కారులో వున్న కార్డ్స్ తేవడం మర్చిపోయాడు. "ఆ కీస్ యిలా ఇవ్వండి నే తెస్తాను" తాళాలు కోసం చెయ్యి చాపి అడిగింది.

"పోన్లే దివ్యా! స్నానం చేసెయ్యి టిఫిన్ తిందాం" గాలికి రెప రెప కొట్టుకుంటున్న కర్టెన్లను ప్రక్కకుతోస్తూ అన్నాడు.

ఆశ్చర్యంగా భర్త వైపు చూసింది.

గెస్ట్‌హౌస్‌కు రాగానే ముందు తన భర్త చేసేపని సోమయ్య తెరిచిన కిటికీలను మూసివేయడమే.

చల్లటిగాలి వీస్తున్న రూమ్‌లోకి వస్తుంటే ఎంజాయ్ చేయకుండా కిటికీలు మూస్తారేమిటండీ" అని తనంటే-

"ఎంజాయ్ చేయడానికేగా అంత కష్టపడి తలుపులు, కర్టన్లు వేసేసి" కొంటెగా అనేవాడు.

"అంత కష్టపడేపని చేయడమెందుకు?"

"నోటితో చెప్పనా? లేక...."

"స్టాప్....స్టాప్" అరిచేది తను.

ముందు స్నానం చేయాలి ఆ తర్వాతే కార్డ్స్ అనే తన మాట లను పట్టించుకునేవాడు కాదు స్వరూప్.

"నో....నో డియర్. సిక్స్‌గేమ్స్ మనిద్దరం ఆడాలి. అందులో ఎవరు ఎక్కువ ఆటలు గెలిస్తే వాళ్ళేది చెపితే అది చేయాల్సిందే ఆ తర్వాత నీ ఇష్టప్రకారమో, నా ఇష్టప్రకారమో నీ స్నానం తేల్తుంది."

"మరీ సిగ్గులేదుబాబూ మీకు" అని తనంటే—

"సిగ్గులో నీ ముఖం చూసుకోవాలిగా నేను" అంటూ తన ముఖాన్ని అతని దోసిట్లోకి తీసుకునేవాడు.

అలాంటి స్వరూప్ దానికి విరుద్ధంగా డల్‌గా వుంటే బహుశా ఒంట్లో బాగలేదేమో అనుకుంది.

"ఏమిటలా డల్‌గా వున్నారు? ఒంట్లో బాగలేదా?"

"అదేంలేదు. తలనొప్పిగా వుంది అదీ కొద్దిగానే"

"చెప్పరేం. టాబ్లెట్ వేసుకుందురు. ముందు టిఫిన్ తినేయండి"

"నువ్వు స్నానం చేసెయ్యి దివ్యా! నేను కాస్సేపు పడు కుంటాను"

"స్నానానికి తొందరేముందిలెండి. మీకు తలనొప్పి తగ్గేవరకూ

నాకు దిగులుగా వుంటుంది లేవండి. టిఫిన్ చేయండి" తను అతనిచేతికి చపాతీప్లేటు అందించింది.

ఆ రోజు నిజంగానే స్వరూప్‌కి తలనొప్పి అనుకుందేగానీ అతని మనస్సులో ఇంత అల్లకల్లోలం వుందని వూహించలేక పోయింది-ఎంత తెలివితక్కువది తను.

ఆమె చేతులు డైరీలో పేజీలు త్రిప్పుతున్నాయి.

జూన్ ఇరవై అయిదు

కారిడార్‌లో కూర్చుని రేడియో వింటున్న నాకు స్వీట్ ప్యాకెటుతో వచ్చిన గళ్ళచొక్కా అబ్బాయి చప్పున గుర్తు పట్టేసాను అతనే. దివ్య చుట్టూ డ్రస్సింగ్ పేరిట తిరుగుతున్న రోస్-అతన్ని చూడగానే నా మనస్సంతా మండిపోయింది.

"ఎవరు కావాలి?" అతనివైపన్నా చూడకుండా అడిగాను.

"డాక్టరుగారు"

"ఎందుకు" అతన్ని కూర్చోమని చెప్పాలన్న యింగితం నాలో లేదు.

"స్వీట్ ఇచ్చి వెళదామని" నిల్చునే జవాబిచ్చాను.

"అక్కడ పెట్టి వెళ్ళండి" తనకు తెలియకుండానే మాటలో కఠినత్వం.

అతను కదల్లేదు. ఇక నావల్లకాక లోపలికెళ్ళి పోయాను.

"ఛీఛీ.... వెదవ మనుష్యులు. వాళ్ళకి బుద్ధి లేకుంటే దివ్యకుండక్కర్లా. వాడిని ఇంటికి రానివ్వడమేమిటి? ఈ మగవాళ్ళకు వాళ్ళమీద ఎంత ఆకర్షణ వుంటుందో దివ్యకేం తెలుసు-తన ఫ్రెండ్స్ ఎంతగొప్పగా చెప్పుకుంటుంటారు. ఆ అమ్మాయిని సినిమాహాల్లో తాకామని. ఈ అమ్మాయి వెళుతుంటే తన స్కూటర్ ప్రక్కనే పోనిచ్చి జడలాగామని.... అది ఎవరో అయితే పర్వాలేదు. తన భార్యను గురించి యింకొకరు అలా అనుకోకూడదు—అలా వీక్ అవకూడదు.

దివ్యతో చెప్పాలి ...వాళ్ళకు చనువివ్వడానికాదు. కాదు వాళ్ళతో ఒక్కమాటకూడా ఎక్కువ మాట్లాడ వద్దని చెప్పాలి వీళ్ళంతా వెళ్ళి డాక్టరమ్మ దగ్గరకెళితే మాకు టీ యిచ్చి మర్యాద చేసి నాతో మాట్లాడింది. ఆవిడకు నేనంటే చాలా ఇష్టం అని కూస్తే ఉహుఁ తనవల్లకాదు తను భరించలేడు. ఎలా? ఎలా? ఈ మానసికవ్యధకు పరిష్కారమార్గం ఏదీ ?

దివ్య కళ్ళు ఆ మాటర్ చదువుతున్నాయి కానీ, ఆమె మనసు ఆరోజు ఆ అబ్బాయి తనకు చెప్పిన కృతజ్ఞతలను నెమరువేసుకుంటుంది.

"స్వీట్స్ ఎందుకయ్యా!" తన కందిస్తున్న స్వీట్స్ బాక్స్ అందుకోకుండా అంది.

"నా తృప్తికోసం మాత్రమే డాక్టరుగారూ!"

"వద్దయ్యా! ఇంట్లో చాలానే వున్నాయి" మొగమాటంగా అంది.

"మీకు లేవని నేనంటానా? ఈ స్వీట్ల బాక్స్ నా ఆనందానికి చిహ్నం, అంతే! నిజంగా వూరుకాని ఊర్లో యిలా అనుకోకుండా ఇన్ఫెక్ట్ అయి, ఇక నాకీ నొప్పి తగ్గుతుందా అని భయపడిపోయాను.

మీ పుణ్యమా అని నొప్పి తగ్గించారు.

నాకు మిమ్మల్ని చూస్తుంటే దేముడెక్కడో లేడనిపిస్తుంది డాక్టరుగారూ!

నా కృతజ్ఞతలు ఎలా తెల్పుకోవాలో నాకు తెలియడం లేదండీ- మాది మద్రాస్ ప్రక్కన చిన్న వూరు.

మీరు, మాష్టరుగారు మద్రాసు వస్తే తప్పకుండా మా యింటికి రండి. నా భార్య ఎంతో సంతోషిస్తుంది" అంటూ అతని అడ్రస్ పేపర్ తన కందిసే-

ఆరోజు తనెంత సంతృప్తిగా ఫీల్ అయింది. ఒకరోగిని నొప్పి నుండి దూరంగా తీసికెళ్ళినందుకు అతను చెప్పే కృతజ్ఞతలు ఎంత గర్వంగా స్వీకరించింది-అలాటి కొండంత సంతృప్తి తన గుండెల్లో నింపిన ఆ పేషెంటు తన భర్త గుండెల్లో అగ్నిగోళాలను వెలిగించాడని ఈ రోజే తను తెలుసుకోగలిగింది.

ఆమె మనస్సంతా మండిపోతుంది.

నాలిక పిడచగట్టిపోతున్నట్లుంది. ఇంతలో ఫోన్ శబ్దం.

"హలో! నమస్తేమ్మా! పేషెంట్లు మీకోసం వెయిట్ చేస్తున్నారు."

"పేషెంట్లను పంపించెయ్యి కమలా, ఈరోజు బాగాతలనొప్పిగా వుంది. రాలేను."

"మీరు హాస్పిటల్‌కు రావడంలేదామ్మా" కమల గొంతులో ఆశ్చర్యం స్పష్టంగా తెలిసింది దివ్యకు.

తను ప్రాక్టీస్ మొదలుపెట్టినప్పటినుండి ఆ నర్సు తన దగ్గరుంది.

తన మనస్తత్వం ఏమిటో ఆమెకు బాగా తెలిసి, గాలి వాన వచ్చినా, స్ట్రయిక్ వచ్చినా, డాక్టరమ్మకు జ్వరం వచ్చినా హాస్పిటల్ మానేయదని తెలిసిన నర్స్ ఆశ్చర్యపోవడంలో వింత లేదనుకుంది దివ్య.

మరోమాట కవకాశం ఇవ్వకుండా ఫోన్ పెట్టేసింది దివ్య.

ఆమెకిప్పుడు బయట ప్రపంచంతో సంబంధం లేనట్లుగా వుంది.

వంటామెను పిలిచి తనకు తలనొప్పిగావుందని, ఎవర్నీ లోపలికి రానివ్వద్దనీ చెప్పి చిరుహాస వస్తే అన్నంతిని పడుకోమని చెప్పు అనేసి ఫ్రిజ్ దగ్గరకెళ్ళి వాటర్ బాటిల్ ఒకటి లోపలికి తీసుకెళ్ళి గది లోపల బోల్టువేసేసింది దివ్య.

ఒక్క గ్లాసు మంచినీళ్లు తాగి పడకమీద వాలింది.

ఆమె మనసంతా చిందరవందరగా వుంది.

కళ్ళు మూసుకుందేగానీ మనసంతా ఆ డైరీల్లో ఇంకా తన భర్త తనగురించి ఏమి వ్రాసాడో చదవాలనుంది.

డైరీలన్నీ కుప్పగా అస్తవ్యస్తంగా వున్నాయి. ఏ డైరీ ముందు చదవాలి, ఏ డైరీ వెనక చదవాలి అనేదికూడా లేకుండా ఏదో ఒక పేజీ తిరగేస్తోంది.

కానీ ఆమె చేతులలో డైరీపట్టుకునే శక్తికూడ లేదు. అరచేతులు చెమటతో తడిసిపోతున్నాయి.

ఆమె కళ్ళు డైరీల్లో అక్షరాలు చదువుతున్నాయి. మనస్సు ఆమె భర్త మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకుంటోంది. తను చదివినదంతా అతనికి తను ప్రాక్టీస్ చేయడం ఇష్టంలేని బాధ మాత్రమే!

తనేం చదువుతుందో అర్థం కాలేదు. తన భర్త మనస్తత్వాన్ని అద్దంలా చూపిస్తున్న ఆ అక్షరాల మాలను ఆకళింపు చేసుకోటానికి ప్రయత్నిస్తోంది.

ఆమె కాళ్ళక్రింద భూమి కదిలిపోతున్నట్లుంది. అనూహ్యమైన నిస్త్రాణ ఆమెను చుట్టేసింది. కళ్ళు మూసుకుంది-మూసుకున్న కళ్ళలో ఎన్నెన్నో జ్ఞాపకాలు-అందులో ఇదొకటి ఆ డైరీ అందుకుని మంచం మీద పడుకుంది.

జ్ఞాపకాల పుటలను వెనక్కి తిప్పి డైరీని, అందులో పేజీలను చదవసాగింది.

ఎప్పుడూ వర్క్ అయిపోగానే ఇంటికి వెళ్ళి స్నానంచేసి అతను బయట ఈజీచెయిర్‌లో కూర్చుని దివ్య ఫోన్‌చేస్తే వెళ్ళి తీసుకొచ్చే తకు చందూ అలా బయటకెళదాం రా అని పెట్టేసరికి వెళ్ళాను.

వాడు ఏడుగంటలకంతా వాళ్ళ పిన్ని ట్రెయిన్‌కు వస్తుందని రిసీవ్ చేసుకోవాలని వెళ్ళిపోయాడు.

ఇంటికెళ్ళడం ఇష్టంలేక దివ్య హాస్పిటల్‌తో దివ్యకోసం గంటలవరకు వెయిట్‌చేసే ఓపికా లేక దివ్య హాస్పిటల్ వెనుక వీధిలో వున్న చిన్నాయన కొడుకు మురళి ఇంటికి వెళ్ళాను. వాళ్ళింట్లో అడుగు పెట్టీ పెట్టగానే-

"వదినకు ఒక ఫ్రీ కేసు బెడద తప్పిందన్నయ్యా" అన్నాడు మురళి.

"మీ వదిన మీకు ఫ్రీగా ట్రీట్‌మెంటు చేయాలంటే బాధపడుతుం దని రీసెర్చ్ చేసావా ఏం?" కుర్చీలో కూర్చుంటూ అడిగాను.

"బెడద తప్పిందన్నాను కానీ, వదిన బాధ పడుతుందని అన్నానా?"

"మా దివ్యక్కను ఒక్కమాటంటే ఊరుకునేదిలేదు" అంటూ వచ్చింది మురళి భార్య శ్రీలక్ష్మి.

మురళి లేచి టేప్ రికార్డర్ వాల్యూమ్ తగ్గించి వచ్చి కూర్చు న్నాడు.

"ఇంతకూ ఫ్రీ కేసు ఎవరు?" ఫ్యాన్ స్విచ్ వేస్తూ అడిగాను నేను.

"ఇంకెవరూ ఎప్పుడూ హాస్పిటల్ చుట్టూ ప్రదక్షిణాలు చేసే నీ మరదలే."

"అదే వద్దంటాను. హాస్పిటల్ చుట్టూ తిరగడమంటే సరదా అనుకున్నావా? కొద్దిగా బాగున్నా హాస్పిటల్‌కు వెళ్ళినా పరమ చిరాకు నాకు" ఉక్రోషంగా అంది లక్ష్మి.

"బాబోయ్! తంటకం ఆపు, బుద్ధిలేక అన్నాను" భార్యముందు భయపడినట్లు నటిస్తూ నవ్వుతూ అన్నాడు మురళి.

"మీరే చెప్పండి బావగారూ! అదేమన్నా సినిమాహాలా సరదాగా వెళ్ళటానికి ఈయన యిలా అంటారేమిటి?" మూడువంకర్లు తిప్పి అంది.

"వాడికి నీ మీదున్న స్వతంత్రంకొద్దీ అలా ఉడికిస్తాడు

"అన్నయ్యకేమైనా టిఫిన్ పెట్టేదుందా? లేక మాటలతోనే మర్యాద చేస్తావా?"

టిఫిన్ తెస్తానంటూ లక్ష్మి లోపలికెళ్ళింది.

"పాపం లక్ష్మిని ఎప్పుడూ అల్లరి పట్టిస్తుంటావ్? అసలేమైంది లక్ష్మికి."

"ఏమీ లేదన్నయ్యా లక్ష్మి పుట్టింటికెళ్ళింది మూడు రోజులుండొస్తానంటూ. అక్కడ పన్ను నొప్పి ఎక్కువగా వుంటే డాక్టరు దగ్గర కెళ్ళిందంట. విజ్‌డమ్ టూత్ రిమూవ్ చెయ్యాలని చెప్పి ఆపరేషన్ చేసి లోపలి పన్నుతీసేసి కుట్లు వేసారట."

"విజ్‌డమ్ టూత్ రిమూవ్‌చేసే ఆపరేషన్ చేయించుకుని లక్ష్మి అప్పుడే అంత యాక్టివ్‌గా వుందే" కొద్ది ఆశ్చర్యం తొంగి చూసింది మాటల్లో....

"నయంలే ఆవిడ ముందనకు అదేమన్నా కిడ్నీ ఆపరేషన్. హార్ట్ ఆపరేషన్ అనుకున్నావా? నవ్వుతూ అన్నాడు మురళి.

"పదిహేను రోజులు రోజూ డ్రస్సింగ్ చేయించుకోవాలి కదా!"

"నొప్పిగా లేదా లక్ష్మి" అని అడిగాడు టిఫిన్ ప్లేట్స్‌తో వచ్చిన లక్ష్మిని చూసి.

"నొప్పా! ఏమీ అన్పించలేదు బావగారూ! ఆరోజు కాంపోజ్ వేసుకుని నిద్రపోయాను మరుసటి రోజు నొప్పిగా వుంటే టాబ్లెట్ వేసుకున్నాను. ఆరవ రోజు కుట్లు విప్పేసారు." మంచినీళ్ళ గ్లాసులు టీపాయ్ మీద పెడుతూ వుంది లక్ష్మి.

"వదిన్ని తీసుకుని నీ దగ్గరకు విచారింపుకు కూడా వచ్చేలా వున్నాడు అన్నయ్య ముఖం చూస్తుంటే" జోక్ వేసాడు మురళి.

ఇంక ఒక్క క్షణం అక్కడ నిలవాలనిపించక లేచి వచ్చేసాను.

అదే ఆపరేషన్ దివ్య చేస్తే అతను ఇరవై రోజులు వరసగా దివ్య చుట్టూ ఎందుకు తిరిగాడు? అవసరమైతేనే హాస్పిటల్‌కు వెళ్ళాలంటే చిరాకనే శ్రీలక్ష్మి గుర్తుకొచ్చింది.

దివ్యంటే అతనికేమైనా అట్రాక్షన్ వుందా?

ప్రతిరోజూ డ్రస్సింగ్ పేరిట దివ్య స్పర్శకోసం వచ్చాడా? అదే ఆపరేషన్ చేయించుకున్న శ్రీలక్ష్మి అబద్ధం ఎందుకు చెపుతుంది? ఎలా? ఎలా? దీనికి పరిష్కారం ఎలా?

తను సంపాయించే డబ్బు కాక పెద్దలు తనకు మిగిల్చిన స్థిరాస్తులు చాలు. తామిద్దరూ సంపాయించక పోయినా తమబిడ్డల భవిష్యత్తు బంగారు బాట చేయడానికి.

చెప్పాలి....దివ్యకు చెప్పాలి....తను.... తను దివ్యను అనుమానించడం లేదని....

దివ్య చుట్టూ వుండే మనుష్యుల మనస్తత్వం దివ్యకు తెలియదు. భర్తగా తను ఆమెకు తెలియ చెప్పాలి.

ఆడ పిల్లలంటే యీ సంఘంలో ఎంత అలుసో ఉదాహరణలతో చెప్పాలి.

ఆడపిల్ల స్పర్శ వాళ్ళలో ఎంత ఉత్తేజాన్నందిస్తుందో వాళ్ళ ఆనందాన్ని బయట తన ఫ్రెండ్స్‌తో ఎంత గర్వంగా చెప్పుకుంటారో దివ్యకు చెప్పాలి. చెప్పి దివ్యను తన ప్రాక్టీస్ ఓన్లీ ఫర్ లేడీస్ అని బోర్డు పెట్టమని చెప్పాలి—

అప్పుడు తను మనశ్శాంతిగా వుండగలడు. కానీ....కానీ....దివ్య తనను సంకుచితుడిగా, సంస్కారిగా అనుకుంటే ఊహూ అదీ అనుభవించలేను. ఆలోచనలను దులపరించుకుని అసహనంగా సెకండ్ షోకి ఒంటరిగా వెళ్ళాడేగానీ తనకు మనశ్శాంతి ఎక్కడిది?

ఈరోజు తను ఇంగితాన్ని కోల్పోతున్నాడా?

ఊహూ కాదు తన దివ్యను ఎవ్వరూ ఆ దృష్టితో చూడకూడదు. అంతే....

తన ఆలోచనల మధ్య దివ్యను హాస్పిటల్ నుండి ఇంటికి తీసుకెళ్ళాలని గానీ కనీసం ఒంటరిగా సినిమాకు ఆవేశంలో వచ్చేసినా ఒక్క ఫోను చేసి దివ్యకు ఆలస్యంగా ఇంటికి వస్తానని చెప్పాలని గానీ తోచలేదు.

ఇంట్లో అడుగు పెట్టి తనను దివ్య కళ్ళ నీళ్ళతో చుట్టేస్తే ఎన్నో పెడర్థాలకు దారితీసింది మనస్సు.

తన మనస్సు చుట్టూ ఎన్నో వేరే ఆలోచనలు చుట్టుకున్నాయి. దివ్యను ఎవరయినా ఏమయినా చేయలేదు కదా!

తను మగవాడే అయినా తనకా మనస్తత్వం లేకపోయినా తనకెందుకింత అపనమ్మకం ఈ మగవాళ్ళ మీద? బహుశా తన చుట్టూ వున్న వాళ్ళ అల్లుకునే కధలు తెల్సి తనిలా అయిపోతున్నాడేమో! ఏ ఆడపిల్లనయినా వంచుకోవాలి అనే తత్వంగల మగవాడు ముందు ఆడవాళ్ళే దూరంగా, బహుదూరంగా వుండాలని తననుకుంటే దివ్య అపార్ధం చేసుకుంటుందా?

తనకెంత అసహనంగా అన్పించింది. దివ్య ఏడుపు మానేసి నిజం చెపితే భరించే శక్తి లేనట్టు హాలులోనే కుర్చీలో కూలబడిపోయిన తనను అల్లుకుని దివ్య ప్రక్కనే కూర్చుని తనని తడుముకుంటూ ఆర్తిగా చూస్తుంటే తనెందుకంత నెర్వెస్‌గా ఫీల్ అయ్యాడు.

అన్నం వడ్డించాను రా బాబూ! పాపం పిచ్చిపిల్ల నీ కోసం నువ్వింకా రాలేదనీ....నీకేమైందోనని ఏడ్చేసింది. పెందలాడే హాస్పిటల్ నుండి వచ్చి-నీ కిష్టమని కొబ్బరన్నం నన్ను కూడా చేయనీకుండా దివ్వే చేసిన వయినం.

అరికాళ్ళ అరిగిపోయేలా వరండాలోనే నిల్చుని ఎదురు చూసిందంటూ అన్నం తిన్నంత సేపు మామ్మ చెవుతుంటే తనలోని రాక్షసత్వం మాయమయిపోయింది.

అప్పటి వరకు అగ్నిగోళంలా వున్న మనస్సు మంచు ముద్ద

యింది. ఆలస్యంగా వచ్చి తనెంతటి ఆనందాన్ని కోల్పోయాడో అర్ధ మయింది.

తన కోసం తన క్షేమం కోసం ఆరాటపడే భార్యకు తను కొన్ని గంటలయినా మానసికంగా ఎంత హింసించాడు. కారణం తను.... తన మనస్సులో వ్యధను దివ్యకు చెప్పుకోలేకపోవడమే.

నో....తను చెప్పలేదు. ఆడవాళ్ళకు మాత్రమే టిట్ మెంటు ఇవ్వు దివ్యా! అని చెప్పి ఆమె మనస్సు తను నొప్పించలేదు.

తన మరదలితో తనేమన్నాడు వాడు నీ భర్త కదమ్మా అందు కనే స్వతంత్రంగా అన్నాడులే అనలేదూ! మరి తనూ తన భార్యతో తన మనస్సులో మాట స్వతంత్రంగా ఎందుకు చెప్పలేక పోతున్నాడు. ధైర్యం చేసి చెప్పగలిగితే-

ఎందుకని? అని దివ్య తనని అడిగితే తన దగ్గరున్న జవాబు ఆమెకు తృప్తినివ్వదు తన భర్త తనని అనుమానిస్తున్నాడనే అనుకు నుంటుంది

ఊహుం ప్రశాంతంగా వున్న దివ్య మనస్సులో అల్లకల్లోలం సృష్టించకూడదు.

దివ్య కోసం....దివ్య ఆనందం కోసం తను సర్దుకోవాలి—తన మనస్సునెంతయినా మభ్యపెట్టుకోవాలి. స్వరూప్ ఆ డైరీ పేజీలో ఎక్ స్ట్రాగా నాలుగు పేజీలు అతికించి మరీ—

సుదీర్ఘంగా వ్రాసుకున్న ఆ డైరీలో పేజీలు చక చక తిరిగి పోయాయి. అందులో సారాంశం తన భర్త మరో రూపం దివ్యకు ఆ రోజు స్పష్టంగా గుర్తుకొచ్చింది.

మంగళ వారం, అమావాస్య కలిసి రావడంతో ఆ రోజు పేషెంట్లు తగ్గారు.

రోజులాగ భర్త తన కోసం ఎదురు చూసే అవకాశం యివ్వ కుండా తనే త్వరగా ఇంటికెళ్ళింది.

"మామ్మా! కొబ్బరన్నం చేస్తాను. కొబ్బరి తురిమి ఇవ్వు" అంది.

"నీకెందుకులేమ్మా శ్రమ హాయిగా స్నానం చేసి పడుకో ఒక్క రోజు పేషెంట్లు నీకు తెలివిస్తే" మామ్మ అంది.

"వద్దులేమామ్మా! ఆయనకిష్టమయినట్లు పాన్‌లు వేసి చేస్తాను."

దూరపు బంధువావిడ. ఎవరూ దిక్కులేక తన దగ్గరుంటానంటే వంటకు పెట్టుకుంది. దివ్యను ఏ పనీ చేయనీదావిడ.

దివ్య ఆమెను మామ్మా అని పిలుస్తుంది.

"వంటింట్లో హైరానా పడకుంటే టేప్‌రికార్డర్ వేసుకో కూడదూ" మామ్మ గొణుగుతూనే వుంది. తన్ని వారిస్తూనే వుంది. అయినా స్వరూప్‌కెలా వుంటే ఇష్టంగా వుంటే తింటాడో అలా ప్రిపేర్ చేసింది. ప్రొద్దున తెచ్చిన చికెన్ ఫ్రిజ్‌లో వుంటే తీసి చిల్లీ చికెన్‌చేసి హాట్ బాక్స్‌లో పెట్టింది. ప్రతిరోజూ హడావుడిగా హాస్పిటల్ నుండి వచ్చి స్నానం చేసేసి మామ్మ చేసే వచ్చీరానీ వంటలు రుచి చూసే తనకా రోజు పండుగలా అన్పించింది. తలస్నానం చేసి వైట్ కోటాకు ఎంబ్రాయిడరీ వర్క్ చేసిన చీర కట్టుకుంది. దారిలో కొనుక్కొచ్చుకున్న జాజి మల్లెలు తల్లో తురుముకుంది. బీరువాలోనుండి ముత్యాల సెట్ తీసి ఓపిగ్గా పెట్టుకుంది.

ఆరోజు తన చేతులమీదుగా తన భర్త కళ్యాన్ని సేవలు చేయాలని ఉవ్విళ్ళూరింది.

వార్డ్ రోబ్‌లో భర్తకోసం వైట్ ఎంబ్రాయిడరీ చేసిన లాల్చీ సెలక్టు చేసింది.

ఎప్పటిలా పైజమా చేతిలోకి తీసుకోలేదు.

మొదటి వెడ్డింగ్ డేకి ముచ్చటపడి కొన్న గ్లాసొక్కపంచె ప్రక్కన పెట్టింది.

డ్రెస్సింగ్ టేబిల్ మీదున్న పర్‌ఫ్యూమ్ తను స్ప్రే చేసుకుని భర్త బట్టలమీద స్ప్రేచేసి నవ్వుకుంది.

రోజూలా తన భర్త తనకోసం ఎదురుచూసే కంటే తను భర్త కోసం ఎదురుచూడ్డంలో చాలా ఆనందం వుందనిపించింది.

వరండాలో నిల్చుని ప్రతి క్షణం లెక్కపెడుతూ ప్రతి వైట్ ఫియెట్ తమదేననుకుంటూ అందులో తన భర్త దిగుతాడని తలుస్తూ, ఆ కారు దాటిపోయాక నిరాశ పడుతూ గంటసేపు ఎదురు చూసింది.

భర్త పదిగంటలయినా రాకపోయేసరికి నిరాశపడింది.

మరలా తన నిరాశకు తనే నవ్వుకుంది

ఎన్నిమార్లు పాపం తన పేషెంట్ల వత్తిడిలో అతను నిరాశ పడ లేదు!

అలా అనుకుంటూ ఇంకో గంట గడిపేసింది.

ఒక గంటసేపు టి.వి. పెట్టుకుంది కానీ స్వరూప్ రాలేదు.

పదకొండు గంటలయినా భర్త రాకపోయేసరికి భయపడి పోయింది. స్వరూప్ ఫ్రెండ్స్ ఇళ్ళకు ఫోన్ చేసింది. వాళ్ళ నెగటివ్ ఆన్సర్‌తో మనసంతా వణికిపోయింది.

వణికే మనస్సుకు స్వరూప్‌కేదయినా ఏక్సిడెంట్ అయిందేమో అనే అనుమానాన్నయితే అణిచివేయగలిగిందే కానీ, కళ్ళల్లోనుండి ఉబికి వచ్చే కన్నీటిని మాత్రం ఆపలేకపోతుంది.

"అయ్యో పిచ్చిపిల్లా! మగవాళ్ళకు సవాలక్ష పనులుంటాయి. అబ్బాయి అవసరంగా ఏదయినా వూరెళ్ళాల్సి వుంటుంది సాయంత్రం కూడ ఇంటికి రాలేదు. డాక్టరయివుండి ఇలా బెంబేలుపడిపోతారా? ఇలారా వచ్చి ఒక ముద్దతిని పడుకో" మామ్మ ధైర్యం చెప్పింది.

"వద్దులే మామ్మా! ఆయన వచ్చాక ఇద్దరం కలిసి తింటాం. నువ్వెళ్ళి తిను."

"నా తిండి కేమొచ్చిందిలే ఇప్పుడు నువ్వు నిద్రపోయేవరకు నీకు తోడుగా ఇక్కడే కూర్చుంటాను." కూర్చుంటూ అంది మామ్మ.

"ఎక్కడకెళ్ళుంటారంటావు మామ్మా" కళ్ళు తుడుచుకుంటూ మామ్మనడిగింది.

"ఆఁ అమ్మాయ్, మనిద్దరివీ మొద్దు బుర్రలే. ఆబ్బాయి స్నేహితుల బలవంతంమీద రెండో ఆటకు వెళ్ళుంటాడులే. ఇఁకెంత గంటలో వచ్చేయడూ!"

తను నిద్రపోయేవరకూ మేల్కొంటానన్న మామ్మ నేలమీద కొంగుపరచుకొని ఆదమరచి నిద్రపోయింది.

"ఊహుఁ ఒక్కరే తనని తీసుకెళ్ళకుండా పిక్చర్‌కు వెళ్ళరు. స్నేహితుల బలవంతంమీద వెళ్ళాల్సి వచ్చినా క్లినిక్‌కి ఫోన్‌చేసి నువ్వింటికెళ్ళు దివ్యా అని తనకు చెప్పివుండేవాళ్ళే. ఏదో అయి వుంటుంది" మరలా తన కనుకొలకుల్లోతడి ఇక ఒక్కోనిముషం గడిచే కొలదీ మనసంతా చీకటి అలుముకోసాగింది.

తను స్వరూప్ లేకుండా బ్రతకలేదు.

అమ్మో! అలాటి ఆలోచనే తనకు రాకూడదు.

స్వరూప్‌కేమీ కాదు—కాకూడదు. తల విదిలించుకుందే కానీ తన భయం తాలూకు మనస్సు తనమాట వినలేదు. తన గుండెల్లోనుండి దుఃఖం ఎగతన్నింది.

ఇంకొక్క నిముషం స్వరూప్ రాకుంటే మతిభ్రమించేలా వుంది. కారు ఇంటిముందాగడంలో కారు దగ్గరకు పరిగెత్తింది. కారు లాక్ చేస్తున్న భర్తను చుట్టేసి వెక్కి వెక్కి ఏడ్చేసింది. అతన్ని గర్వంగా పట్టుకుని లోపలికి నడిచింది.

గతస్మృతులనుండి తేరుకుంది దివ్య.

ఆమెకు యిన్ని సంవత్సరాలు తనతో జీవితాన్ని పంచుకున్న భర్త లోపలి రూపం కొరుకుడుపడడంలేదు.

ఇలా భర్త ఎలా ఎలా? వుండగలుగుతున్నాడు తన కిష్టంలేని జీవితాన్ని యింత ఓర్పుతో, తనని నొప్పించకుండా అతను చిత్రవధను అనుభవిసూ హే భగవాన్! ఎందుకిలా జరిగింది.

స్వరూప్ మానసిక వ్యధమాటున తనెంత తృప్తిగా జీవించింది మీకు దండాలమ్మా మీ మేలు జన్మలో మర్చిపోలేను అని మనస్ఫూర్తిగా చేతులెత్తి దండంపెట్టే పల్లెటూరివాళ్ళ మనస్సుల్లో నిర్మలత్వం ఈయన కెలా బోధపడుతుంది.

"ఈరోజు మీరీ పుచ్చిపోయిన పన్నుకి మందు వేయకుంటే నేను నొప్పితో చచ్చిపోయేవాడినండీ" అని తన కృతజ్ఞతలను వెల్లడిస్తుంటే-తను ప్రాక్టీస్ పెట్టినందుకు తన జీవితమే సార్ధకత పొందినట్లు తను ఫీలింగ్ తన భర్తకెలా తెలపాలి?

"డాక్టరుగారూ! మా అమ్మాయిని క్లిప్పులువేసి పళ్ళ ఎత్తు తగ్గించి మంచి సంబంధం వచ్చేలా చేసారు.

మా అమ్మాయికి బిడ్డ పుడితే మీ పేరే పెట్టుకుంటాం" అని అమాయకంగా తమ ఆనందాన్ని వెల్లడించే వాళ్ళ తృప్తిని దేంతోకొలిస్తే తెలుస్తుంది.

వాళ్ళ సంతృప్తిని తన గుండెల్లో దాచుకుని యింకా ఓర్పుగా ట్రీట్‌మెంటు పేషెంట్లకివ్వగలుగుతుందని స్వరూప్‌కెలా చెప్పి నమ్మించ గలదు?

అసలు తప్పు ఎవరిలోవుంది? భర్త ముభావాన్ని తలనెప్పి అని సరిపెట్టుకోకుండా ఆ గళ్ళచొక్కా కుర్రాడు డ్రస్సింగ్‌కు వచ్చినరోజు స్వరూప్‌ని నిలదీసుంటే తన మనసులో అనుమానాన్ని తన లాలనతో త్రక్కేవాడేమో!

ఆరోజు....ఆ అబ్బాయికి తను విజ్‌డమ్ టూత్ అడ్డంగా వుండి అందులోనుండి పస్ ఒక హోల్‌గుండా బయటకొస్తుంటే ఆ పేషెంటు బాధ ఓర్చుకోలేక తన దగ్గరకొస్తే తను సర్జరీచేసి అడ్డంగా వున్న పన్నును పెరికేసి కుట్లు వేసింది.

అతనికి బాగ ఇన్‌ఫెక్ట్ అయింది. ఆతవరోజు సూచర్స్ రిమూవ్ చేయుకోటానికి వచ్చిన అతన్నిచూసి ఆశ్చర్యపోయింది.

సూచర్స్ వూడిపోయాయి. లోపల బాగ గాయం ఏర్పడి పస్ తయారయింది. 'ఎందుకలా వుండిపోయావయ్యా' అని అడిగితే మీరు ఆరవరోజు రమ్మన్నారుకదా డాక్టరుగారూ! అని జవాబిచ్చే ఆతని అమాయకత్వానికి జాలేసింది.

"అంతనొప్పి వున్నప్పుడు డాక్టరు దగ్గరకు రావాలని తెలీదా పస్ తీసేసి, డ్రస్సింగ్ చేస్తూ అడిగాను"

"ఆపరేషన్ అయ్యాక అలాగే వుంటుందనుకున్నాను" నీరసంగా అన్నాడు.

"అలాగే ఎందుకుంటుందయ్యా! ఈరోజుకు ఏమీ వుండకూడదు. కొంతమందికి ఇన్ఫెక్ట్ అవుతుంది అదీ వందమందిలో పదిమందికి మాత్రమే!"

"మీరిచ్చిన మందులన్నీ వాడాను డాక్టరుగారూ!"

"మందులు వాడలేదని నేనన్నానా?

కొంతమంది నేను వ్రాసిచ్చిన మందుల చీటి భద్రంగా జేబులోనే దాచుకుంటారు. తిరిగి చెకప్కుకూడ రారు.

వాళ్ళకంతా ఇన్ఫెక్ట్ అవుతుందా?

రెసిస్టెన్స్ పవర్ లేని వాళ్ళకిలా జరుగుతూ వుంటుంది. రోజూ వచ్చి డ్రస్సింగ్ చేయించుకో. తగ్గిపోతుంది. భయం అక్కరలేదు."

ఎంతో ఓర్పుగా ఆ పేషెంట్కు ఎక్స్ప్లెయిన్ చేసిన తను.... తన భర్తకు ఒక సంఘటన చెప్పంటే ఈ అనుమానమే అతనిలో తలెత్తేది కాదు కదా!

అతనింత చిత్రహింసకు గురయ్యేవాడు కాదేమో!

ఎంత తను సమర్థించుకున్నా ఆమెకు ఈ రకమైన అనుమానం అతనిలో వచ్చినందుకే కించపడుతోంది.

ఏ ఆడపిల్లను చూసినా తన తల్లి, తన చెల్లి గుర్తుకొచ్చే బంగారు కొండలు ఎందుకు గుర్తురారు స్వరూప్కి.

వేళ్ళ మీద లెక్క పెట్టగలిగిన చెడ్డవాళ్ళే ఎందుకు గుర్తు రావాలి.

తన దగ్గరకు వచ్చే పేషంట్లు పన్ను బాధతో వస్తారు. బాధన తొలగించాలన్న ఉద్దేశంతో తను వాళ్ళ నోటిలో చెయ్యి పెడుతున్నా ఆ భావనే తనకు రాదు.

అలాంటిది స్వరూప్ ఎందుకలా తన మనుస్సును భూతద్దంలో చూస్తున్నాడు

ఇన్నేళ్ళ తన ప్రాక్టీసులో ఏ ఒక్కరూ స్వరూప్ ఊహించినట్లు తన్ని పట్టుకోవాలని, తన స్పర్శతో ఆనందాన్ని అనుభవించాలని కోరుకోలేదే ?

వాళ్ళ పైశాచికానందాన్ని నాపై చూపలేదే!

తనకు తారసపడని చెడ్డవాళ్ళు- స్వరూప్ ఊహల్లో ఎలా తారస పడ్డారు.

తన ప్రాక్టీస్‌లో కొండంత సంతృప్తిని వాళ్ళు అందించారే గానీ ఏ ఒక్కరూ తనని హట్ చేయలేదే?

అమాయకంగా ముఖంపెట్టి "డాక్టరమ్మా! నాకు తెలియదు నువ్వేం చేస్తావో. నా నొప్పి మాత్రం తగ్గిపోవాలి" అనే మనుష్యుల భాషలో తేడా వుండొచ్చేమో కానీ వాళ్ళు తన వైద్యంలో నమ్మకాన్ని మాత్రం త్రుంచుకోలేదు.

తను సీట్‌లో వున్నంత సేపూ వాళ్ళ హిస్టరీలు వినడం వాళ్ళ బాధను తుడిచేయడానికి ప్రయత్నించడమే గానీ వాళ్ళ వయస్సు, వాళ్ళ అందం, వాళ్ళ స్పర్శానుభూతులంటూ తనకు గుర్తురాలేదే? మరి స్వరూప్ ఎందుకంత వేదనను అనుభవించాడు.

ఆమె కణతలు పగిలిపోతున్నాయి.

ఆమెకి ఆ రోజు తనింటిలో వున్నట్లులేదు. తనకేమైపోతుందో తెలీని

తనను లాలించి, ఆదరించిన తన భర్త మరో మనస్తత్వం కీర్ణంచేసుకోలేకపోతోంది....

నో....

స్వరూప్‌కలాటి ఊహలు కూడా రావు. ఇవి స్వరూప్ డైరీలు కావేమో!

అతని దస్తూరి కాదేమో అనే పిచ్చి భ్రమలో మరలా డైరీ తెరిచింది–

స్పష్టంగా తన భర్త స్వదస్తూరీ మరలా పేజీలు తిరగేసింది. అలా గంటసేపు గడిచింది.

అతని పిరికితనాన్ని అక్షర రూపంలో ఎక్కించాడు. అంతా గజి బిజిగా వుంది.

ఎప్పుడిలా జరిగిందా! అనే జ్ఞాపకాల పొరలు తనకు రావడం లేదు.

డయిరీలో ఒక పేజీ ముందు కళ్ళు ఆగాయి.

మేధస్సు చక చక పనిచేసింది.

ఆ రోజు గుర్తుకొచ్చింది.

చిరుహాస పుట్టాక తను హాస్పిటల్‌లో వున్న రోజు- తొలిసారి తన ప్రేమ ఫలాన్ని తన భర్తకు అందించిన రోజు– ఆమె జ్ఞాపకాలు కళ్ళ ముందు నిలిచాయి.

"పాప ఎలా వుంది?"" ఆ రోజు భర్త కళ్ళలోకిచూస్తూ అడిగింది తను.

"బంగారు బొమ్మలా వుంది, అచ్చం నీ నోరే. అదిగో ఆ కళ్ళు కూడా నీవే."

"ఏం కాదు. అన్నీ మీ పోలికలే....అమ్మాయికి తండ్రి పోలికలు వస్తే అదృష్టమట తెల్సా!"

"మన పాపకేం– నీ పోలికలొస్తే అదృష్టవంతురాలు కదా పిచ్చీ! నువ్వు మీ అమ్మ పోలికేనే. మరి నీ అదృష్టానికేమి కొరవ చెప్పు"

"నేను చాలా అదృష్టవంతురాల్నండీ! అప్పుడప్పుడు అనుకుంటూ వుంటాను నా అంత అదృష్టవంతురాలు ఈ భూమ్మీద ఎవరూ లేరని. కారణం ఏమని అడగరేం?"

"ఊఁ నువ్వే చెప్పు" పాపను జాగ్రత్తగా పడుకోబెడుతూ అన్నాడు.

"మీరు నాకు భర్తగా దొరకడం– భర్తకు నిర్వచనం మీరే. నిజం చెపుతున్నాను భర్తంటే మీలాగే వుండాలి. ప్రతి ఆడపిల్లకు మీలాటి మన సెరిగిన భర్త దొరికితే ఈ భూమ్మీద ఆడపిల్లల కన్నీరే పడదు– మీ చేతుల్లో వున్న నా బిడ్డకు కూడా మీలాటి విశాల హృదయమున్న భర్తే దొరకాలి. అంతకంటే నేను కోరుకునేదింకేమీలేదు"

"వెల్ వెల్."

వెనకగా చేరి వీళ్ళ సంభాషణ వింటున్న దివ్య స్నేహితురాళ్ళు ఇద్దరూ చప్పట్లు కొట్టారు పాపని అందుకుంటూ. వాళ్ళచేతిలోని స్వెట్టర్ షాల్ పాప మీద వుంచి అన్నారు–

"చూడమ్మా పాపా! ఇరవయ్ ఆరేళ్ళ వయస్సు వచ్చిన స్నేహితు రాలుండే దానికో మంచి మొగుడ్ని వెతికి పెడదాం అని మీ అమ్మకేమైనా వుందా? ఈ రోజు పుట్టావు అప్పుడే మీ అమ్మ నీకు పెళ్ళి ప్రయత్నాలు చేసేస్తుంది. పుట్టగానే నువ్వెంత అదృష్టవంతురాలివయ్యావో చూడు" హాస్యమాడింది సంధ్య.

"పోవోయ్ బడాయి ! నీకెన్ని మ్యాచ్‌లు నేను చెప్పలేదూ ! కొట్టిపారేసి ఇప్పుడిలాటి చెత్త జోక్స్ వేస్తున్నావా?" పాపను వాళ్ళ చేతి కందిస్తూ అంది తను.

"ఆఁ ఎవరో కంచుకొండల్ని తెచ్చి చేసుకోదంటే ఎలా ? మీ ఆయనలాటి బంగారుకొండలు దొరికితే చెప్పు చేసుకుంటాను" మరలా నవ్వుతూ అంది సంధ్య.

"దివ్యా! మీరు కబుర్లు చెప్పుకుంటూ వుండండి. నేను కూల్ డ్రింక్స్ పంపిస్తాను" లేచాడు స్వరూప్.

"స్వరూప్‌గారూ! మీరు కూల్ డ్రింక్స్ యిక్కడిస్తే మా ఆఫీసర్ అక్కడ మా అలస్యానికి హాట్ హాట్ తిట్లనిస్తాడు బాబోయ్! టైమ్ అయిపోయింది. మరలా ఓ రోజు వస్తాం" అంటూ చేతిలో వాచ్ చూసుకుని ఇద్దరూ పరిగెట్టారు.

"పాప పెద్దదయి నా ప్రాక్టీసు తీసుకుంటే నేనూ వీళ్ళలా క్లినిక్‌కి టైమయిందంటూ పరిగెట్టక్కరలేదు. ప్రతిక్షణం మీ దగ్గరే గడపొచ్చు" తలకు కట్టిన గుడ్డను విప్పుకుంటూ అంది తను.

"అప్పటికి నాకూ బిజినెస్ వద్దంటావ్" పాప బుగ్గమీద వాలిన ఈగను తోలుతూ అన్నాడు.

"అలా అన్నానా· ఈసారి బాబు పుడితే వాడు మీ బిజినెస్ అంతా చూసుకుంటాడని అర్థం"

"ఒద్దు దివ్యా ఇంకో కాన్పు వద్దు. నిన్నటి నుండి నువ్వు పడ్డ శ్రమ చూసాక ఈ పాప ఒక్కతే మనకు చాలనిపిస్తోంది."

"అది ప్రసూతి వైరాగ్యమండోయ్ శ్రీవారూ! మరలా బాబు కావాలని మీరే అడుగుతారులే" నవ్వుతూ అంది తను.

"నిజంగానే వద్దు దివ్యా. నీకంటే నాకు పిల్లలు ముఖ్యం కాదు. ఎలాగో నీ శ్రమకు బంగారు బొమ్మ పుట్టింది. అది చాలు మనకు."

"అలా అయితే పాపను తప్పకుండా బి.డి.యస్. లోనే చేర్చి, ఎమ్.డి.ఎస్. అల్లుడ్ని తెచ్చుకుని నా ప్రాక్టీస్ అంతా ఇచ్చేస్తాను."

"దివ్యా నీకు కోపం వస్తుందేమో కానీ ఆడపిల్లకు మంచి వంటలు రావాలోయ్! అందుకని హోమ్‌సైన్స్ బి.ఎస్.సి.లోనే చేరుద్దాం."

పక పక నవ్వింది తను.

"హోమ్‌సైన్స్ బియస్సీల కంటే నేనే బాగా వంట చేస్తానండోయ్ మన అల్లుడు దేని వంటలకు భయపడి పారిపోయి వచ్చి అత్తయ్యా! నాకు భోజనం వడ్డించేసెయ్యి మీ అమ్మాయి పోట్లాట కొచ్చేలోపల అంటాడు.

పాపం అల్లుడంత బాధపడడం ఎందుకు లెండి. మన పాప న ట్రైనింగ్‌లో మంచి వంటలు నేర్చుకుంటుంది గానీ, బి.డి.యస్. చ విద్దాం" ఇంకా నవ్వుతూనే అంది.

"బిడియస్ చేస్తే నా అల్లుడు కష్టపడడా?"

"ఎందుకు కష్టపడతాడు ఎం.డి.యస్. చేసి సర్జరీస్ చేసుకుంటూ నా కూతుర్ని కష్టపడకుండా చూసుకుంటాడు."

"అలా ఎందుకనుకోవాలి నువ్వు....భార్య పళ్ళుపికుతుంటే సుకుమారమైన భార్య చేతివేళ్ళు కందిపోతాయేమో అని ప్రక్కనే వుండి ప్రతిక్షణం బాధపడుతుందేమో" స్వరూప్ మాటలకు పెద్దగా నవ్వింది తనారోజు.

"అంటే నా వేళ్ళు కందిపోతున్నాయని మీరు బాధపడుతున్నారన్నమాట. చాలండీ ఈ అదృష్టం ఈ జన్మకే కాదు పది జన్మలకు సరిపడా చాలు."

ఆ రోజు తను ఎంత తన్మయత్వంలో తన భర్తను పొగిడింది. ఎంత స్ఫూర్తిగా తన భర్త నీడను వెయ్యి జన్మలకు కోరుకుంది. కానీ జరిగేదేమిటి?

అతన్ని తను కష్టపెడుతోంది అనే విషయం తెల్సుకోలేక పోయింది.

జిజ్ఞాసతో ఆ రోజు స్వరూప్ ఎలా ఫీల్ అయ్యాడో చదవాలని డైరీలోకి తల దూర్చింది దివ్య.

ఊహుఁ ఎంతో ప్రయత్నించినా కూడా యీ రోజు కూడా తన మనస్సులోని భావాల్ని దివ్య ముందు పరచలేని బలహీనుడే అయ్యాడు. ఏమనుకుంటుంది దివ్య తన గురించి ఎంతో నమ్మకంగా, ఎంతో నిర్మలంగా ఎంతో అమాయకంగా అంది తన విశాలహృదయుడు. కానీ తనెందుకిలా తన హృదయాన్ని అనుమానాలతో హింసిస్తున్నాడు....? నిజంగా తను పడే మనోవేదనంతా అవసరమైనదేనా?

ఈరోజు పాప టాపిక్‌తో తన మనస్సులోని మాట బయట పెట్టా లనుకున్నాడు.

"ప్రాక్టీస్ చేసొచ్చి పాపను చూసుకోలేవు. నువ్వెంత కష్టపడ్డం నేను చూడలేను. ఒక్క సంవత్సరం పాప పెద్దయ్యేవరకు హాయిగా ఇంట్లో రెస్ట్‌తీసుకో" అని చెప్పాలనుకుంటే ఇలా జరిగిందేమిటి? దివ్యకు తన మీదున్న ప్రేమను, విశ్వాసాన్ని, తనెందుకిలా చెరిపేసు కుంటు న్నాడు?

అలా అనుకుంటే తన మనస్సెందుకిలా చేదు తిన్నట్లయి పోతోంది?

దివ్య ప్రాక్టీస్‌లో ఏ వెధవో తన దివ్యకేమైనా చేస్తే....ఈ భయమే తన వెన్నులో నుండి గుండెవరకు ప్రాకి అందులో నుండి ప్రవహించే రక్తం గుండా శరీరమంతా ప్రాకింది ఎలా? ఎలా? ఈ సమస్య నుండి బయటపడడం ఎలా?

డైరీల్లో పేజీలు తిరిగిపోతూనే వున్నాయి. ఒక పేజి దగ్గర ఆగి పోయింది దివ్య.

ఆరోజు సంఘటన గుర్తుకు తెచ్చుకుంది.

"ఏమ్మా! ఇంట్లో స్వరూప్‌లేడా?" చంద్రకిరణ్ వస్తూనే అడిగాడు దివ్యను.

"పిలుస్తాను కూర్చోండన్నయ్యా!"

"ఏమిటట సుదినం. త్వరగా చెప్పేయ్" తనూ ఒక కుర్చీ లాక్కొని చంద్రకిరణ్ ప్రక్కనే కూర్చుంటూ అడిగాడు స్వరూప్.

ముగ్గురూ కూర్చున్నారు.

"నాకు మ్యాచ్ సెటిలయిందిరా."

"చెప్పవేం....కంగ్రాచ్యులేషన్స్, అమ్మాయి అందంగా వుందా?" చంద్రకిరణ్ కళ్ళల్లో మెరుపు చూస్తూ అడిగాడు స్వరూప్.

"ఊఁ నా కళ్ళకు బాగానే వుంది మరి" జవాబిచ్చాడు చంద్ర కిరణ్.

"అది చాలు మా కంతా నచ్చాలని రూల్ లేదు. ఇంతకూ కట్నం ఎంత?" స్నేహితుడ్ని సూటిగా అడిగే చనువుంది స్వరూప్‌కి.

"ఊహుఁ కట్నం తీసుకోవడంలేదు!"

"అబ్బో! యింకేం ఆదర్శ యువకుడు అని హెడ్డింగ్ పెట్టేసి పేపర్‌లో వేయించేస్తాను" హాస్యమాడాడు స్వరూప్.

"అంత ఆదర్శమైన యువకుడ్ని ఏమీ కాదులే ఆమె ఎం డి ఎస్ చేసి గవర్నమెంట్ జాబ్ చేస్తోంది."

"అయితే నాకు తోడు వస్తోందన్న మాట. ఎప్పుడయినా నాలుగు రోజులు టూర్ వెళ్ళాలంటే తనకి నా హాస్పిటల్ అప్పజెప్పొచ్చు అన్నట్టు ఏం పేరన్నయ్య"

"కవిత" అని ముసి ముసిగా నవ్వాడు చంద్రకిరణ్.

"మంచి పేరు." అనేసి తను లేచి నిలబడి అంది.

"హాస్పిటల్‌కు టైమయ్యింది మీరిద్దరూ మాట్లాడుకోండి. నేను రిక్షాలో వెళతాను."

"ఎందుకమ్మా నేను వస్తాను పదండం"టూ లేచి నిలబడ్డాడు.

వద్దని వారించి తను హాస్పిటల్ కెళ్ళింది.

ఆరోజు తనకు బాగా గుర్తుంది సాయంత్రం స్వరూప్ అన్నాడు-

"చందూ బాగా హాపీగా వున్నాడు. ఈ మ్యాచ్ సెటిల్ అయినందుకు."

"అయితే మీకింతే సాయింకాలం కంపెనీ పోయినట్టే.

"ఉహుఁ కాదు ఒక్క సాయింకాలం కూడా నన్ను మిస్ కాడు."

"పోదురూ బడాయి పెళ్ళయిన తర్వాత మీకంటే ఆ అమ్మాయే ఎక్కువయిపోతుందన్నయ్యకు."

"మరి నేనూ పెళ్ళయిన వాడ్నేగా ఇప్పటి వరకు చందూతో ఎలా స్పెండ్ చేసానంటావ్?"

ఆ రోజు తను చాలా బాధపడింది. సాయింత్రాలు ఓ పి మానేయాలన్నంతగా ఆలోచించింది కూడా. అది జరగని పని అని తెల్సికూడా!

"సారీ అండీ! నాకూ.... నాకూ చల్లటి సాయింత్రాలు మీతోనే గడపాలనుంటుంది కానీ...."

"కానీలు అర్ధనాలు పోయి చాలా కాలమయిపోయింది కానీ నువ్వు వెళ్ళి స్నానం చేసేసిరా భోంచేద్దాం" చాలా సరదాగా అన్నట్లు అన్నాడు.

దివ్యకారోజు అంత వ్రాసుకోడానికేముందో తోచలేదు. మరలా డైరీలోకి తల దూర్చింది.

దివ్య హాస్పిటల్ కెళ్ళగానే చందూతో అన్నాడు.

"ఎందుకొచ్చిన రిస్క్‌రా ఇంట్లో వుండే అమ్మాయిని చేసుకోక."

చప్పున తలెత్తి చూసాడు చందు.

"అదేం మా చెల్లెమ్మతో నీ లైఫ్ బాగలేదా? నిజం చెప్పు?" సూటిగా అడిగాడు చందూ.

తన తడబాటుని కప్పిపుచ్చుకుని అన్నాడు.

"నో....నో....దివ్య కాకుండా ఇంకెవరు నాకు తోడు వచ్చినా నేనింత సుఖపడలేనేమో అన్పిస్తుంది నాకు" తన తప్పును కప్పిపుచ్చుకుంటూ ఇచ్చిన జవాబుకి.

"మరి ఎందుకలా అన్నావు...." వదలకుండా అడిగాడు చందు.

"అబ్బె నా ఉద్దేశం అది కాదు చందూ. పాపం మనలా వాళ్ళూ శ్రమ పడతారు. అయినా ఇంటికొచ్చి మన కోసం ఎగస్ట్రా పని చేసి మనల్ని సుఖపెట్టాలనుకుంటారు."

"అంతేనా చంపేసావ్! హడలిపోయాను" కుర్చీలో వెనక్కు కూర్చుని కాళ్ళు జాపుకుని రిలాక్స్ అవుతూ అన్నాడు.

"ఎందుకు?"

"ఎందుకు అని చిన్నగా అడుగుతావేమిటి? దివ్య నాక్కాబోయే భార్య ఒకే ప్రొఫెషన్‌లో వున్నారు. అందులో కష్టనిష్టూరాలు నీకు ఇప్పటికి బాగా తెల్సుంటాయి. నువ్వు అడ్జస్టు కాలేనపుడు నా పరిస్థితీ అంతేకదా!"

"నో.. నో....అడ్జస్టు కాకపోవటానికి ఇందులో ఏముంది? కాకుంటే మనమే కొంత స్వార్ధపరులం. ఇంటికొచ్చేసరికి భార్య నవ్వుతూ ఎదురొస్తే బాగుణ్నని వుంటుంది"

"ఓ....సిల్లీ! మనంమాత్రం ఇంట్లో ఎంత సేపు స్పెండ్‌చేస్తాం. కాలేజీనుండి రావడం-ఇంటిలో ఒకకప్పు టీ త్రాగడం, మరలా అలా- అలా తిరిగేసి ఇంటికొచ్చేసరికి శ్రీమతి ఇంట్లో వుండదా?"

"అలా....అలా....తిరిగేప్పుడు భార్యతోనే తిరగాలనుండదా?" మనసులో మాట అనేసాను.

"తిరక్కుంటే ఆవిడ మన భార్య కాకపోతుందా? లైఫ్‌లాంగ్ కలిసే వుంటాం"

భావుకత తక్కువయిన తన స్నేహితుణ్ని చూస్తూ అన్నాను.

"జీవితాంతం కలిసే వుంటాం. రైటేగానీ ఇద్దరం కలిసి లంచ్ తీసుకోవడం వీలవదు. చల్లటి సాయంత్రాలు ఎక్కడకూ వెళ్ళలేక పోయినా కనీసం టెర్రస్ మీద కూర్చుని కబుర్లు చెప్పుకోవడం కుదరదు

అన్నిటికంటే ముఖ్యంగా వాళ్ళ ప్రొఫెషన్‌లో పదిరోజులు ఏ డ్యూటీలోనో గడపలేము"

"పోరా డబ్బుంటే డ్యూటీ-కొడైకెనాల్ మనింట్లోనే వెలుస్తాయి"

"ఓకే ఓకే....నేనలా అంటున్నానుగానీ పాపం గృహిణులు అంతా రోజులో ముప్పాతిక భాగం ఒంటరిగానేగా గడుపుతున్నారు?"

"కరెక్ట్! మనం లేట్‌గా వచ్చినా చిర్రుబుర్రులు, అలకపాన్పులు బెడద మనకుండదు" లేస్తూ అన్నాడు చందు.

"కానీ మిత్రమా! ఇలాంటి మర్యాదలు మాత్రం మిస్ అయి పోతాం. ఈరోజు వంటామె రాలేదు. దివ్య వెళ్ళిపోయింది. సోనికి టీ పెట్టకూడా ఇవ్వలేదు నేను"

"చెల్లెమ్మ ఇస్తానంటే నేనేగా వద్దన్నాను. డోంట్‌వర్రీ మైడియర్ ఫ్రెండ్! టీలు, టిఫిన్‌లకు హోటల్ వాళ్ళుండనే వున్నారు"

వెళ్ళిపోతున్న వాడివంక విచారంగా చూడ్డం తప్ప ఏమీ చెయ్య లేకపోయాను.

వీడు... వీడు పెళ్ళయ్యాక కూడా ఇంత ఉత్సాహంగా వుండ గలడా?

తన భార్య జాబ్‌లో ఎన్ని తన మనస్సును తొలిచే సంఘటనలు వున్నాయో తను ఎందుకు విడమర్చి తన ప్రియమైన స్నేహితుడికి చెప్పలేకపోయాడు? తన మానసిక వ్యధనెందుకతని ముందుపర్చలేక పోయాడు?

తననుభవించే చిత్రవ్యధను భార్యకు చెప్పి ఆమె మనసు నొప్పిం చడం ఇష్టంలేకపోయినా కనీసం అయినా ఎందుకు చెప్పలేకపోయాడు? చెప్పి అతన్నయినా ఇలాంటి మానసిక సంఘర్షణకు గురికాకుండా చేయా ల్సిన బాధ్యత తనకు లేకపోయిందా?

కాదు-కాదు తన భార్యచుట్టూ వుండే పేషెంట్లవల్ల ఆమెకేదైనా అవమానం, అపకారం జరుగుతుందేమో అనే క్షోభ అని అనుకుంటూ అనుభవించే తన క్షోభను చందూ ఇంకోలా అర్థంచేసుకుంటే?

అంటే....తను దివ్యను అనుమానిస్తున్నాడనో లేకుంటే దివ్య క్యారెక్టర్ లోపం లేకుంటే తన స్నేహితుడు కేవలం ఎవరో పేషెంట్ల చికిలిచేష్టలకు ఇంత బాధపడడు అని వేరేలా ఆలోచిస్తే తను భరించ లేడు.

అందుకే కాబోలు తను ఒక్క మాటకూడా చెప్పలేకపోయాడు.

తన మనసులో గూడుకట్టుకున్న ఈ వ్యధ తనతోనే అంతం అవ్వాలి.

ఆ సమస్యకు పరిష్కారం దొరక్కపోయినా తనిలాగే గుంజ
స... వుండాలి

ఎలా? ఎలా? దీనికి పరిష్కారం ఎలా? తనెందుకిలా పిచ్చివాడై
పోతున్నాడు? ఆ పిచ్చి ప్రకోపించి తను రాక్షసుడిగా మార్చే దివ్య
ఏమైపోతుంది?

తన ఇంగిత జ్ఞానం నశించిపోతే అందులోపడి దివ్య మాడిపోదూ
నో....అలా కాకూడదు. తన దివ్య సుఖపడాలి. అందుకే తను మనో
నిబ్బరాన్ని తెచ్చుకోవాలి.

అందుకే ఈరోజు ఎప్పుడూ లేనిది కోవెలకెళ్ళి తనకు శాంతి
ప్రసాదించమని వేడుకున్నాడు.

ఒక జీవం వున్న మనిషిగా తను జీవంలేని శిలతో మొరపెట్టు
కున్నాడు.

మనిషి మనసు ఎప్పుడెలా వుంటోందో తేలీని చిత్రమైనదికదా!

దివ్య కనుకొలుకులనుండి కన్నీటిచుక్కలు డైరీమీద పడగానే
ఉలిక్కిపడి ఆ కన్నీటి పుస్తకంమీద తుడిచి డైరీ మూసేసి గాఢంగా
నిట్టూర్చింది.

డైరీని అప్పటికప్పుడు మూసేయగలిగిందేగానీ మెదడులోని
సున్నితపు పొరలను వారించలేకపోయింది. వాటి పని అవి చురుగ్గా
చేస్తూనే వున్నాయి.

ఏమిటిది? ఎందుకిలా జరిగింది? తన ప్రమేయం లేకుండా
స్వరూప్‌ని ఎందుకిలా చిత్రహింసకు గురిచేసింది?

తను-తను అతనిపాలిట ఇన్ని సంవత్సరాలు శాపగ్రస్తురాలు
అయిందా? లేక అతనే తన జీవితాన్ని మనిబార్చుకున్నాడా. ఊహ
కానేకాదు.

ఆతని మనసు రెండుగా చీలిపోయింది.

తనదగ్గరెప్పుడూ స్వరూప్ కఠినంగా ప్రవర్తించలేదు. ఎంతో

సుకుమారంగా తనని చూసుకున్నాడు. ఎంతో సంతోషాన్ని తనకందించాడు.

తనకంటూ ఏమీ మిగుల్చుకోనట్టు అంతా తనభార్య, తన బిడ్డ కోసమే అన్నట్టు బ్రతికాడు. ఇంకా....ఇంకా సంపాదిస్తూ భార్యను, బిడ్డను తననీడలో ఏ కష్టమూ తెలియకుండా చూసాడు.

తనకంటూ కోరికలు లేనట్లు భార్యబిడ్డలు నోరుతెరిచి అడగకుండానే కోరికలన్నీ తీర్చాడు.

ఇవన్నీ....ఇవన్నీ తనకు తెలిసిన స్వరూప్ రూపంగానీ తన భర్తకింకో రూపం వుందని ఆ విషయం తనకు తెలియదని ఈరోజే తెలుసుకుంది.

తెలుసుకున్న తర్వాత కూడా తన భర్త ఆనందంకోసం తను ప్రాక్టీసు మానేయకుంటే తను మూర్ఖురాలే అవుతుంది.

"ఇన్ని సంవత్సరాలు తనకోసం, తన ఆనందంకోసం తన శాంతికోసం అతను అహర్నిశలు అశాంతిని దాచుకుని తనని సుఖపెట్టాడు.

ఇంకొక్క క్షణంకూడా తన భర్తని తను అశాంతిలో వుండనివ్వదు. తనకిష్టమయినదిగానీ, అది మంచిగానీ చెడుకానీ ప్రాక్టీస్ మానేయాలి.

మనసులో ఏ కోశానా అతను చిత్రహింస పాలవగూడదు. చిత్రహింసేకాదు చిన్న మనస్తాపంకూడా తనవల్ల గురికాకూడదు.

తన తలను ఎవరో దిమ్మెసలతో కొడుతున్నట్టుగా వుంది.

తన ప్రక్కనే అగ్నిపర్వతం బ్రద్దలయినంత సెగలు ఆమె శరీరాన్ని ఆవహించాయి.

ఆమె కళ్ళు గాజుగోళీల్లా వున్నాయి.

ఆమె మెదడు ఆలోచనలకు తట్టుకోలేనట్లు దిమ్ముగా వుంది.

అరగంట తర్వాత మనసుని కుదుటపర్చుకుంది దివ్య. తను ప్రాక్టీసు మానేసి తన భర్తను సుఖపెట్టాలనే నిర్ణయంతో ఆమెలో

ప్రశాంతత మెల్లిమెల్లిగా నెలకొంది. ఆమెలో చెలరేగిన తుఫాన్ అణిగి పోయింది

పెద్ద సైజులో వున్న డైరీలన్నీ మరలా లోపల పెట్టేసి తాళం వేసేసింది తను డైరీలు చదివినట్టుగానే అతని మనసు తెలుసుకొని ప్రాక్టీస్ మానేసినట్టుగానీ అతనికి చెప్పకుండా జాగ్రత్తపడాలనుకుంది.

తను పడిన ఆలోచనల అల్లకల్లోలం భార్యకు తెలిసిపోయిందే అనే గిల్టీ ఫీలింగ్ స్వరూప్‌లో రాకుండా వుండటానికే తన మనసులోనే డైరీల రహస్యం దాచేయాలనుకుంది.

"ఎందుకు ప్రాక్టీస్ మానేశావ్?" అనే ప్రశ్నకు జవాబు ఏమి చెప్పాలా అని ఆలోచించుకుని ఓ నిర్ణయానికొచ్చింది.

మూసిన కళ్ళు అలసిపోలేదుకానీ ఆమె గుండె అలసిపోయింది.

ఒంట్లో ఒక్క సి.సి. శక్తిలేనట్లు నీరసించిపోయింది. శక్తి లేని ఆ ఒంట్లో రక్తమంతా గడ్డకట్టినట్లయిపోయింది.

ఆమె నిస్సత్తువగా, నిస్తేజంగా పడకమీద వాలిపోయింది. ఎంత వద్దనుకున్నా ఆమె కాలోచనలు పాలిపోవడంలేదు. ఆమె కళ్ళనుండి కారిన కన్నీళ్ళు దిండును తడిపేసాయి. లేచి ఒక్క కాంపోజ్ మాత్ర వేసుకుంది "

"ఎందుకిలా జరిగింది? తనవల్ల తన ప్రియాతిప్రియమైన భర్త యింత మానసిక క్షోభకు గురి అయ్యాడా?

ఇన్ని సంవత్సరాల్లో ఏ ఒక్క రోజూ పెదవి విప్పి తనకు ఒక్కమాట చెప్పలేకపోయాడా?

అతని మనసుకు అంత చేరువ కాలేకపోయిన తను దురదృష్ట వంతురాలా?

లేక తను బాధపడితే చూడలేనంత అపురూపంగా చూసుకునే భర్త దొరికిన అదృష్టవంతురాలా?

కాంపోజ్‌మాత్రం మత్తులో తనేం ఆలోచిస్తుందో? తను అనుకున్న మాటలే మననం చేసుకుంటుందో తెలియని అవస్థలో ఎప్పుడో నిద్రాదేవి ఒడిలోకి జారిపోయింది దివ్య.

★ ★ ★ ★

ప్రొద్దున్నే తలుపు కాలింగ్‌బెల్ శబ్దానికి లేచింది దివ్య.

ఆమెకంతా అయోమయంగా వుంది. నిన్న తనుపడ్డ ఆవేదనంతా నిజంకాదు కల అయితే బాగుండుననిపించసాగింది.

కానీ తను పడుకున్నదీ, తను డైరీలు చదివిందీ-తన భర్తపడ్డ క్షోభ అంతా ప్రతి అక్షరం ఆమె మెదడులో ప్రింట్ అయిపోయాయి. నీరసంగా లేచింది.

తలుపు తియ్యగానే సుడిగాలిలా తల్లిని చుట్టేసింది హాస మమ్మీ!

"తలనొప్పి యింకా తగ్గలేదా? నీ కళ్ళంత ఎర్రగా వున్నాయేం మమ్మీ! నిన్ను చూస్తే నాకు భయం వేస్తోంది మమ్మీ!" అంది.

"రాత్రి తలనొప్పి సివియర్‌గా వచ్చింది. ఇప్పుడు తగ్గిపోయిందిలే హాసా!"

"రాత్రి తలనొప్పి అయితే నిన్న ప్రొద్దున్నుంచే నువ్వు పడుకున్నావేం మమ్మీ!" వంటామె చెప్పిందిగా.

దివ్యదగ్గర తన కూతురడిగిన ప్రశ్నకు జవాబు సిద్ధంగాలేదు. అందుకే వూరుకుంది.

"చెప్పు మమ్మీ, నాకేమిటో భయంగావుంది. నీకెంతో బాగా లేకుంటేగానీ, హాస్పిటల్ మానేయవు? అమ్మమ్మకు టెలిగ్రాం ఇస్తాను."

"పిచ్చి నాకేం కాలేదురా" దివ్య మనసు తేలికపడింది.

రాత్రంతా పడిన మనోవేదన చిరుహాస ప్రేమతో కొంత తుడిచి పెట్టినట్లయింది.

"లే మమ్మీ! రాత్రికూడా అన్నంతినలేదు నువ్వు రాత్రి నాలు సార్లు నీ దగ్గరకువచ్చి నిన్ను లేపడమెందుకని వెనక్కు వచ్చేసాన త్వరగా రెడీకా మమ్మీ టిఫిన్ తిందాం" బ్రష్‌మీద పేస్ట్‌వేసి అందిస్త అంది చిరుహాస.

★ ★ ★ ★

"హాస్పిటల్‌కు వెళ్ళలేదా మమ్మీ" లంచ్‌కొచ్చిన చిరుహాస తల్ల ఆ టైమ్‌లో ఇంట్లో వుండటం చూసి ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఊహుఁ"

"నీకేం బాగలేదో చెప్పు మమ్మీ. డాడీ వుంటే బాగుండేదిప్పుడు అంకుల్‌కు ఫోన్ చెయ్యనా డాక్టర్ని యిక్కడకు తీసుకురమ్మని"

"నాకు బాగుంది హాసా! నీకోసమే వెయిట్ చేస్తున్నాను భోంచేద్దాం పద" తన గుండెల్లో చెలరేగే భావాలు ఆ పసిపిల్లకు తెలియ నీకుండ జాగ్రత్తపడుతూ అంది దివ్య.

"మమ్మీ! నువ్వూ డాడీతో యు.ఎస్.ఎ. వెళ్ళాల్సింది" ఆరిందలా అంది చిరుహాస.

"మరి నువ్వు" నవ్వుతూ అడిగింది కూతుర్ని దివ్య.

"నేను నీలా డాడీకోసం దిగులుపడ్డంలేదు తెలుసా? మా డాడీ స్టేట్స్ కెళ్ళారని నాకు బోలెడు థింగ్స్ తెస్తారని మా ఫ్రెండ్స్‌తో సంతోషంగా, గర్వంగా చెప్పుకుంటున్నాను."

"నేనూ మా డాడీ వచ్చాక నా ప్రాక్టీస్ మానేసానని సంతోషాన్ని చూస్తాగా" అలా మనసులో అనుకుంది దివ్య.

ప్రాక్టీస్ మానేసి ప్రతిక్షణం భర్తకు ఏమేమి కావాలో చూసు కుంటూ, చిరుహాసను కాబోయే ఆదర్శ గృహిణిగా తీర్చిదిద్ది ఆ పసి పిల్లకు హోమ్‌సైన్స్ బి.ఎస్.సి.లో చేర్చి పెళ్ళయ్యాక తనలా కాకుండా చిరుహాస జీవితం ఆ పిల్ల భర్తకే ఆనందంగా అంకితమయ్యేలా అన్ని పనులు నేర్పించి తనూ కొత్తజీవితంలోకి అడుగుపెట్టి భర్తరాకకు

ఎదురుచూస్తూ అతని ఆనందాన్ని తన కళ్ళల్లో నింపుకుని అతను యింటికి రాగానే ఎదురెళ్ళి సాయంకాలపు చల్లదనాన్ని అనుభవిస్తూ టీ, టిఫిన్ తింటూ కబుర్లు చెప్పుకుంటూ ఆనందంగా గడపాలి.

అలా అనుకోగానే దివ్య మనసు సంతృప్తి చెందింది.

భర్త రాకకోసం ఎదురుచూడ్డంతో కాలం గడిపేసింది. ప్రాక్టీస్ మానేసింది.

★ ★ ★ ★

"ఏమిటి మమ్మీ! ఏమిటోగా వుంటున్నావు?- ప్రాక్టీస్ మానేసా వెందుకంటే నవ్వేస్తావు. నేను స్నానంచేసి వచ్చేవరకు ఇలాగే కూర్చుని వున్నావ్?

అసలెందుకిలా డెసిషన్ తీసుకున్నావ్ మమ్మీ! డాడీ స్టేట్స్‌కి వెళ్ళకపోయినా బాగుండేది. పోనీ డాడీతో నువ్వెళ్ళినా బాగుండేది- కనీసం డాడీ వచ్చాక ప్రాక్టీస్ మానేసినా నువ్వింత డల్‌గా వుండే దానివికాదు మమ్మీ."

"వయస్సయిపోతుంది కదా హాసా! ఓపిక తగ్గిపోయింది. ఏం. నేనింట్లో వుంటే నీకు బాగలేదా?"

"నీకు వయస్సయిపోయిందా? భలే దానివే మమ్మీ! నలభై అయి దేళ్ళలోపే వయస్సయిపోతే మరి నాన్నమ్మ అంత ఉషారుగా ఎలా వుంది? ఈ క్షణం నాన్నమ్మను సినిమాకు రమ్మంటే ఉత్సాహంగా వచ్చేస్తుంది అదేంకాదు నీ ఓపిక ఈ వయసులో నాకు లేదు. మమ్మీ.... మమ్మీ నేను బి.డి.యస్.లో చేరతాను" ఎంట్రన్స్‌లో బి.డి.ఎస్.సి వచ్చాక పదవసారి తల్లినడిగింది చిరుహాస.

"మీ డాడీ వచ్చాక అడిగి చేరుదువులే"

"ఇదిగో మమ్మీ, నేను తప్పకుండా బి డి. ఎస్. లో చేరేది ఖాయం. అప్లికేషన్ ఫారం తెప్పించి పెడతాను" ఘరలా అడిగింది చిరుహాస

"ఆడపిల్లలకు బి.డి.ఎస్. సూట్‌కాదులేమ్మా హాసా! హాయిగా హోమ్‌సైన్స్ బి ఎస్.సి. చదువుకో" సంక్షిప్తంగా ఉన్నాయామాటలు.

"ఎందుకింత సడన్ ఛేంజ్ మమ్మీ నీలో. డాడీ వెళ్లేవరకు నన్ను బి.డి.యస్.లో చేర్చాలని ఇంటరెస్ట్ చూపించిన నువ్వు డాడీ వెళ్ళాక నన్ను ఎంట్రన్స్‌కు కూడ వద్దన్నావు. నేనే పట్టుబట్టి ఎంట్రన్స్ వ్రాసి బి.డి.ఎస్.లో సీట్ తెచ్చుకుంటే నువ్వు సంతోషపడక పోగా ఆ కోర్సే వద్దంటున్నావు? ఎందుకలా మారిపోయావో చెప్పు మమ్మీ."

నిట్టూర్చింది దివ్య.

ఉహుఁ తను చెప్పలేదు.

"ఏం మమ్మీ నీకిన్ని సంవత్సరాల ప్రాక్టీస్‌లో సంతృప్తి లేదా?" నిలదీసింది చిరుహాస.

తను కోరుకుంటే పేషెంట్ల ముఖాల్లో తనపట్ల సంతృప్తికానీ.... కానీ తనెంత అమాయకంగా వుండిపోయింది. ఆ అమాయకత్వం అంటే-అంటే తన భర్త మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకోలేక పోవడంతో భర్తను మానసికంగా ఎంత కృంగదీసింది. తన భర్తకు తను ప్రాక్టీస్ చేయడం కాదు....కాదు తన దగ్గరకు వచ్చి మగ పేషెంట్లకు తాను తాకుతూ ట్రీట్‌మెంటు ఇవ్వడం అతనికిష్టంలేదని తెల్సుకోగల్గి వుంటే ఎప్పుడో తన భర్త మనస్సుకు శాంతి చేకూరుస్తూ ప్రాక్టీస్ మానేది. ఆయన శ్రమ తనకిష్టమైన ప్రాక్టీస్ మాన్పించేంత గొప్పది. తనకు తన భర్త ఆనందం ముఖ్యం. దాన్ని అధిగమించి పేషెంట్ల ముఖంలో తనపట్ల సంతృప్తి తనకానందాన్నివ్వదు. కానీ జరిగింది ఏమిటి?

తన ప్రవర్తనతో భార్య కష్టపడకూడదనే మంచితనంతో, భార్యకు చెప్పే ధైర్యంలేక ఎన్నోరాత్రులు ఎడముఖం పెడముఖంతో కాకపోయినా ఏదో తెలియని అసంతృప్తితో, ఆవేదనతో తనను సంపూర్ణ

మైన మనస్సుతో ఆదరించలేకపోయిన ఆయన గురించి ఏమని చెప్ప గలదు?

"ఏమైనా సరే నేను బి.డి.యస్.లో చేరాల్సిందే" తన మనసులో మాటను నిర్భయంగా బయట పెట్టింది.

ఆ తండ్రికి యీ పిల్ల ఎలా పుట్టిందబ్బా! యిలా ముఖంమీద తన కోరికలు తెల్పే కూతుర్ని చూస్తుంటే తన భర్త డైరీలు చదివినప్పటి నుండి ముచ్చటపడుతోంది దివ్య. ఇదే మనస్తత్వం తన భర్తకుండుంటే ఎప్పుడో తన ప్రాక్టీస్ మానేసి వుండేది....

అలా అని తనిప్పుడు అనుకుంటుందేమో! ప్రాక్టీస్ చేయాలని ఉత్సాహం వురకలు వేసే టైమ్‌లో తనను ప్రాక్టీస్ చెయ్యొద్దు అని తన మనస్సులో కోరిక చిరుహాసలా ఆయన బయట పెట్టుంటే తన ఫీలింగ్స్ అప్పుడు యిలా వుండేవి కావేమో!" గాఢంగా నిట్టూర్చింది దివ్య.

"డాడీ పదిరోజుల్లో వచ్చేస్తున్నారు మమ్మీ. నువ్వు ఇకనయినా ఉత్సాహంగా వుంటావా లేదా?"

మరలా అబ్బురపడింది చిరుహాస స్ట్రయిట్ పార్వర్డ్‌నెస్‌కు.

ఎదురుచూసిన రోజు రానే వచ్చింది. స్వరూప్ ఫారిన్ నుండి వచ్చేసాడు.

ఎయిరోడ్రామ్‌లోనే తల్లి ప్రాక్టీస్ మానేయడం—ఈ ఆరునెలలు మమ్మీ డల్‌గా వుండడం చెప్పేసింది.

ఇంటికి రాగానే ఫ్రెండ్స్ అంతా వదిలి వెళ్ళాక చిరుహాసకు తెచ్చిన పగడాలు, ముత్యాలు హాస ముచ్చటపడి తెమ్మన్న వాకీటాకీ, దివ్యకు చీరలు, హాసకు డ్రస్సెస్, దివ్యా వాళ్ళమ్మకు ఎలక్ట్రికల్ ఆటో మాటిక్ కుక్కర్, దివ్య నాన్నగార్కి ఎలక్ట్రికల్ షేవర్, స్వరూప్ తల్లికి వాల్ డెకరేషన్ క్లాక్, సిక్స్ చేంబర్ కట్టర్—తండ్రికి వి.సి.పి. అన్నీ చూపించి కూతురు ముఖంలో ఆనందాన్ని గంటసేపు చూస్తూ వుండిపోయాడు స్వరూప్.

తన కొడుకు క్షేమంగా తిరిగి వచ్చినందుకు తల్లిదండ్రుల ముఖములో ఆనందం కూడా కనిపెట్టాడు స్వరూప్. తన కోసం యింతమంది ఆరాటపడ్తున్నందుకు గర్వించాడు కూడా.

"దివ్యా! వేడిగా ఒక కప్పు కాఫీ టెర్రస్‌మీదకు తీసుకురా" దివ్య కతని మనస్సర్థమయింది తనతో కాస్సేపు గడపాలని అలా చెప్పాడు.

భార్య అందించిన టీ అందుకుంటూ అడిగాడు.

"ఎందుకు ప్రాక్టీస్ మానేసావు దివ్యా"

ఆమె నవ్వి సరిపెట్టాలని చూసింది. ఆరునెలలుగా తల్లి,తండ్రి అత్తమామ, బంధుజనం, స్నేహ బంధం అందరూ అడిగిన ప్రశ్నే అది.

స్వరూప్ వూర్కోలేదు. ఆమె ప్రక్కగా జరిగాడు. అతనికి భార్య ప్రాక్టీస్ మానేయడం ఆనందంగా వుంది. యింక ఎప్పటికీ దివ్య తన సన్నిధిలోనే గడుపుతుంది అనుకుంటే సంతృప్తిగా వుంది. కానీ దివ్య ప్రాక్టీస్ ఎందుకు మానేసిందో తెల్సుకోవాలనే కోరిక బలంగా వుంది.

"మనిద్దర్నీ ఆరునెలలు విడదీసిన ఈ ప్రాక్టీస్‌మీద విసుగొచ్చి మానేసాను" భర్త కళ్ళల్లోకి చూస్తూ అంది.

"ఇప్పుడొచ్చేసాగా క్లినిక్‌కు వెళ్ళు" అతనూ ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"క్లినిక్‌కి వెళ్ళాలని ఆసక్తిగా లేదండీ. నన్ను బలవంత పెట్టకండి'

"ఆసక్తిగా లేదా? నీ ఆసక్తి నాకు తెలియదా? నువ్వు మనస్సు విప్పడం లేదు."

మనసులోనే నవ్వుకుంది దివ్య.

ఈనాడు అయినా ఈయన మనసు విప్పాడు గనకనా తను

మనస్సు విప్పి చెప్పడానికి. అసలు మీ డైరీలు నేను చదివానండీ అని అతన్ని గిల్టీగా మార్చి లాభమేమిటి?

"వయస్సొచ్చేస్తుంది కదా నా కంత ఇంట్రస్ట్ వుండడంలేదు"

"కాదు నిజం నాకు తెలుసు."

ఆమె తృళ్ళిపడింది. మరలా సర్దుకుంటూ నవ్వి అడిగింది.

"ఏమిటా నిజం"

"నువ్వు ప్రాక్టీస్ చెస్తే ఇంట్లో నాకన్నీ సవ్యంగా జరగడం లేదని"

మరోసారి నవ్వుకుంది దివ్య.

"ఇప్పుడయినా నిజం చెప్పకూడదూ ఈయన తన మనస్సులోది చెప్పి తన భారం దించుకుని నా భారం దించకూడదూ!" నిట్టూర్చిం ది.

"కరెక్టు జీవితకాలంలో సగం ప్రొఫెషన్ లైఫ్‌కి అంకిత మయ్యాను. ఇక మీకు అంకితం కానివ్వండి."

మనస్ఫూర్తిగా ఆనందించాడు. అయినా మరలా అన్నాడు.

"అలా అలవాటైపోయిన నీకు యింట్లో బోర్ కొడుతుందేమో దివ్యా!"

"మీ మాటలతో, హాస చతురతతో నాకేం బోర్ కొట్టదు" తన బాధనంతా దిగమ్రింగి చిరునవ్వుతో సమాధానమిచ్చింది.

ఒక్కమారు తను పేషెంట్ల మనస్తత్వాల గురించి ఒక్కొక్కరికి ఒక ఆపరేషన్ చేస్తే ఎంత త్వరగా హీల్ అవుతుందో ఇంకొకరి ఇన్ ఫెక్షన్ అయి అదే ఆపరేషన్ యిరవై రోజులుకూడా డ్రస్సింగ్‌లుచేస్తున్న హీల్ కాకపోవడం గురించి అన్నీ....అన్నీ విడమర్చి చెప్పాలనిపిం చింది కానీ అందువలన తనకొచ్చే లాభం ఏమిటి? తన భర్త మనస్సు మార్చడానికి ప్రయత్నం చేయడమే అవుతుంది కానీ ఆయన్ని సంతోష పెట్టడమేలా అవుతుంది? ఉహూఁ తను చెప్పలేదు. చిరుహాసలా తనూ

తన మనస్సులోని భావాలు భర్తలాగే బయటపెట్టలేదు. అలా అనుకున్న దివ్య "క్రిందకెళదాం పదండి. హాస మీకోసం నిన్నటినుండి ఎదురు చూస్తోంది" అంది.

"నువ్వు ఎదురు చూడలేదా?" భార్య చెయ్యి పట్టుకుని లేచి నిల బడుతూ అడిగాడు.

"మీరెళ్ళిన మరుసటి నిముషంనుండి మీకోసం ఎదురు చూస్తూనే వున్నాను."

"దివ్యా! ఆరునెలలు నువ్వులేకుండా నేనెలా గడిపానో చెప్ప లేను. ఒక్కోరోజు పరిగెత్తుకుంటూ నీ దగ్గరకొచ్చేయాలనిపించేది" అంటూ జేబులోనుండి భార్యకోసం తెచ్చిన ప్రజెంటేషన్ తీయగా సుడి గాలిలా వచ్చింది చిరుహాస.

వెంటనే ఆ ప్యాకెట్ జేబులోకి తోసేసాడు స్వరూప్.

"డాడీ! నాకు బి.డి.యస్.లో సీటు వచ్చింది. మమ్మీ చూడు నాకు ఆ స్టడీస్ సూట్ కావంట. హోమ్‌సైన్స్ బి.ఎస్.సి.లో జాయిన్ అవమంటోంది."

"మీ అమ్మ చెప్పినట్లు హాయిగా హోమ్‌సైన్స్ బి.ఎస్.సి.లో జాయిన్ అయిపోమ్మా" కూతురి చేతిలోని వాకీటాకీ తీసుకుంటూ అన్నాడు.

నో డాడీ నేను బి డి యస్ లోనే చేరతాను "నాకు బి డి యస్‌లో సీట్ వచ్చిందంటే కంగ్రాచ్యులేషన్స్ చెలిగ్రాం ఎందుకు కొట్టారుమరి" కోపంగా అడిగింది.

"కోపం తెచ్చుకోకమ్మా బేబీ.... ఓ కె నీ యిష్టప్రకారమే చేరుదువులే."

ఆశ్చర్యంగా భర్తవైపు చూసింది దివ్య.

ఇతను తన మనస్సులో అసంతృప్తిని మూటగట్టుకుని ఎదుటి వాళ్ళకు తృప్తినిస్తారెందుకు? ఈయన తన మనస్సులో మాట ఎందుకు

చెప్పలేకపోతున్నారు? ఎవరి మనస్సుల్లో మాట. వాళ్ళు స్వతంత్రంగా చెప్పుకోగలిగితే యింత మనస్తాపం వుండేదికాదు కదా! అలా అను. కున్న దివ్య వీపుమీద కొరడాతో కొట్టినట్లు ఉలిక్కిపడింది.

తను....తను చేసిందేమిటి? తన భర్త మనస్సు తెల్సుకునికూడా తన మనస్సులో భావాలు స్పష్టంగా ఎందుకు చెప్పలేకపోతుంది తనలో బలహీనత తలచుకొని భర్తను తప్పుపట్టడమెందుకు?

అలా అనుకున్న దివ్య మనస్సు శాంతపర్చుకుని అంది.

"స్నానం చేయరా?" క్రిందకు దిగి వస్తూ అడిగింది దివ్య.

స్నానమెందుకు? ఇదిగో యీ పర్ఫ్యూ వుంటే చాలు అంటూ భార్య చీరమీద స్ప్రే చేసాడు.

"డాడీ! పర్ ఫూమ్‌నాకే" సంతోషమంతా చిరుహాస ముఖంలో వుంది.

"ఓ కె బేబీ నీకే" అంటూ యిచ్చేసి ఒక చిన్న ప్యాకెట్ ఎవరూ చూడకుండా లోపలికి పట్టుకెళ్ళాడు. అది అమెరికన్ డైమండ్స్ పొది. గిన నెక్లెస్ భార్య కోసం ఏరి కొన్నాడు దాన్ని అందరి ముందు భార్య. కివ్వాలని లేదు. ఏకాంతంగా భార్య మెడలో తనే స్వయంగా అలంక రించాలనుందతనికి. చిరుహాస మమ్మీ ప్రాక్టీసు మానేసిందని చెప్పి నప్పుడు చాలా ఆశ్చర్యపోయాడు ఆనందించాడు కూడా.

తను సంపాదించేది చాలు....ఇంక....ఇంక దివ్య క్లినిక్‌కు వెళ్ళ దనుకుంటే ఆనందంగా వుంది. ఇన్ని సంవత్సరాల తన అసంతృప్తి ఆమె ముందు పర్చకుండానే తనకు తనే విసుగొచ్చి మానేసానని దివ్య చెప్పటం ఇంకా ఆనందంగా వుంది. మనస్సు దూది పింజలా హాయిగా వుంది.

తన డెరీలు దాచిన దగ్గర ఆ నెక్లెస్ దాచి రాత్రికి యివ్వాలను కున్నాడు తాళంతీసి అందులో ఆ బాక్స్ పెట్టబోయి షాక్ తిన్న

వాడిలా చెయ్యి వెనక్కు తీసుకున్నాడు. ఎన్నో సంవత్సరాల తను పదిలంగా రహస్యంగా దాచుకున్న డైరీలు తను పెట్టిన రీతిలో లేవు అలా అని సర్ది పెట్టిలేవు. అతనికి జరిగింది తెలియడానికి అర నిముషం కూడా పట్టలేదు.

తన డైరీలు చదివిన దివ్య ప్రాక్టీసు మానేసింది ఎంతో యిష్ట మయిన ప్రాక్టీసు మానేసింది

అతను క్షణం ముగ్ధుడైపోయాడు. ఆమె ప్రేమ భావానికి దాసుడై పోయాడు.

తను మనసులో బాధ పెట్టుకున్నాడని ఆమె మనస్సు చంపు కుంది. ఆ సత్యానికి కిన్నుడయ్యాడు. తన మనస్సేమిటో తెలిసీ ఒక్క మాట కూడా పరుషంగా మాట్లాడని భార్య మంచితనానికి అత నిలో గిల్టీ ఫీలింగ్ ఏర్పడింది.

అప్పటివరకు దివ్య ప్రాక్టీసు మానేసినందుకు అతననుభవించిన ఆనందం ఆవిరయిపోయింది.

దివ్య తనకోసం ప్రాక్టీసు వదులుకుని ఈ ఆరు నెలల్లో ఎంత ఆనందాన్ని, శాంతిని పోగొట్టుకుందో ఈ క్షణమే తన కర్థమయింది. రాగానే బేబి మమ్మీ ఈ ఒక్క మన్త్స డల్‌గా వుంది డాడీ అంటే తన కోసం బెంగ పెట్టుకుందనుకున్నాడే కానీ దివ్య మనస్సర్థంచేసుకోలేక పోయాడు తను వాంఛించిదదికాదు ఆమె ఆనందంగా వుండాలి. తన భార్య సుఖంగా వుండాలి. తను భయపడింది ఆమె అనవసరంగాఅందరి నోళ్ళలో నానకూడదని అదీ పలురకాలుగా- అంటే అపవిత్రంగా.

తను....తనెంత అపరిపక్వంగా ఆలోచిస్తున్నాడు ఎవరో ఏదో అనుకోవడానికి తన భార్య పవిత్రతకు సంబంధం ఏవిటీ? తనలో యీ బీజం ఎందుకు నాటుకుంది? నాటుకుందే అనుకో ఎందుకింత ప్రబలి పోయింది.

తను కాలేజీలో వర్క్ చేసేప్పుడు తనకి స్టాఫ్ మెంబర్స్ మాటలు బుర్రలో అతుక్కుపోయాయా? నీరజ విషయంలో అందరూ

తనను ఏమన్నారు? అదొక గొప్పగా ఫీల్ అవమనలేదూ! అంటే అర్థం అమ్మాయి స్పర్శ ఏ మగాడ్నయినా వెర్రెత్తిస్తుందనా? అందుకేనా తను తన భార్య విషయంలో అంతగా భయపడ్తుండేది?....

అలా భయపడేవాడు దివ్యను చూసిన తర్వాత ఒక్క రోజులో తన ఆలోచనలకు. తన అయిష్టానికిగుడ్‌బై చెప్పి దివ్య ఆకర్షణలోకి జారిపోయి పెళ్ళికెందు కొప్పుకోవాలి? ఆరోజు తెలియదా తనకు దివ్య ప్రాక్టీస్ చేస్తున్నట్లు? తెల్సు కానీ....కానీ రోజులు గడిచేకొలదీ సంవత్సరాలు తిరిగేకొలదీ తనలో భయం పెరగసాగింది. శ్రీకళగారితో మంచి తనం వున్నా ఎంతవమానం పాలయింది. గుర్తొస్తే దివ్య అలా కాకూడదని అనుకునేవాడు తన కెదురయిన రాజేష్ ఏమన్నాడు.

సంసార పక్షంగా వున్న స్త్రీలో వున్న లాలిత్యం నిర్మలత్వం-పవిత్రత ఉద్యోగాలు చేసే ఆడవాళ్ళలో వుండదన్నాడు. వాళ్ళు అపవిత్రులు కాకపోయినా ఉద్యోగరీత్యా మగవాళ్ళ మధ్యలో మెలుగుతుంటే ఆ దగ్గర తనం మగవాళ్ళని రెచ్చగొడుతుందనే విషయం ఆడవాళ్ళ కర్థంకాదు అన్నాడు.

ఉద్యోగం చేసేవాళ్ళలో మంచివాళ్ళు గుట్టుగా సంసారం చేసుకునే వాళ్ళలో చెడ్డవాళ్ళు ఎందుకుండరు? అదంతా వాళ్ళ వాళ్ళ మనస్తత్వాల్లో వుంటుంది కానీ ఉద్యోగంచేసే ఆడవాళ్ళే మంచి వాళ్ళు కాకుండా ఎందుకుంటారు?

రాజేష్‌కి దివ్య ప్రాక్టీసు చేస్తుందనే విషయం తెలియక ఆ సంభాషణ పొడిగించాడు కానీ తన మనస్సుకు గట్టి దెబ్బ తగిలించి వెళ్ళిపోయాడు. వాడు వాగితే తన బుద్ధేమైంది. దివ్యకు చెప్పాలితనకు దివ్యమీద హండ్రెడ్ పర్సంట్ అనుమానంలేదని చెప్పాలి. వచ్చే పేషెంట్లలో పలురకాల మనస్తత్వాలు కలవాళ్ళుంటారని అందుకే తను వ్యధ చెందాడని చెప్పాలి. తన భార్య తనను కుసంస్కారి అనుకోకుండా విడమర్చి చెప్పాలి....అలా నిర్ణయించుకున్నాక అతను స్నానానికి కదిలాడు.

రాత్రి పది గంటలకు అతను కోరుకున్న ఏకాంతం దివ్యలో దొరికింది.

"దివ్యా! నీకోసం నేనేం తెచ్చానో చెప్పుకో" గుప్పెట్లో ప్యాకెట్ వుంచుకుని అడిగాడు.

"నా కోసం మీరొచ్చారు యింకేం కావాలి అయినా పగడాలు ముత్యాలు తెచ్చారుగా" ఆమెకు భర్త సాన్నిధ్యం అన్ని విచారాల్ని వెనక్కు నెట్టింది.

"నీ కోసం ఏరియా అమెరికన్ డైమెండ్ నెక్లెస్ తెచ్చాను ఇలా చూడు ప్యాకెట్‌లో నుండి తీస్తూ అన్నాడు.

లైట్ల వెలుగులో ఆ దండ రంగు రంగుల సోయగాలతో మెరిసి పోయింది. దివ్యకు దండ అందం ఎంత బావున్నా అంతకు మించి అతను తన కోసం ఏరి తెచ్చిన అతని ప్రేమ ఎంతో నచ్చింది.

"చాలా బాగుంది దివ్యా నీ మెడవల్ల ఈ దండకందం వచ్చింది. నా చేతిలో వున్నప్పుడింతందంగా లేదీ దండ"

"చాల్లెండి" సిగ్గుపడింది దివ్య.

"నీకు యింట్లో సంతోషంగా వుందా దివ్యా."

"ఊ" అంతకంటే మాట్లాడలేకపోయింది.

"నీకు తోచకుంటే మరలా ప్రాక్టీసుపెట్టుకో దివ్యా" అతని పెదాల చివర నుండి భార్య బాధపడకూడదను అని వచ్చే మాటలేగాని గుండెల్లో నుండి రావడం లేదు.

"తోచక పోయేదేముంది. హాసకు తెలియనివి చెప్పడం-హాస విడి లించడం ఆ తర్వాత టి వి ముందు కూర్చుంటే డిష్ యాంటెన్నా వాళ్ళిచ్చే సినిమాలు బోలెడు. వంటింట్లో పని బోలెడు" నవ్వుతూ అంది.

స్వరూప్‌కి తన మనస్సులో మాటలు చెప్పాలని వున్నా తన భార్య అంత తృప్తిగా వుండేటప్పుడు మరలా ఇవన్నీ రేపి ఆమె

మనస్సు కష్టపెట్టడ మెందుకని చెప్పాలనుకున్న మాటలు పెదవి దాటి బయటకు రావడానికి ధైర్యంరాక ఆమెను దగ్గరకు తీసుకుని లైటార్పేసాడు.

★ ★ ★ ★

"డాడీ! నాకు బి. డి. ఎస్ లో సీటొస్తే అరకువాల్ చూపిస్తానన్నారు ఎప్పుడెళదాం?" టిఫిన్ తింటూ తల్లి నడిగింది చిరుహాస.

"ఇప్పుడేగా డాడీ వచ్చారు తర్వాత వెళదాంలే' దివ్య ఇంకో దోస్ కూతురి ప్లేట్లో వడ్డిస్తూ అంది.

"అలాగే బేబీ! రేపంతా ఎవరో ఒకరు నాకోసం వస్తారు సో తప్పకుండా ఎల్లుండి వెళదాం"

ఆనందంతో ఎంగిలి చెయ్యి అనికూడా మర్చిపోయి తండ్రికి-చెయ్యందించి "మమ్మీ డాడీ మాట నిలబెట్టుకున్నారు. నువ్వూ నీమాట నిలబెట్టుకోవాలంటే నన్ను బి డి యస్‌లో జాయిన్ చెయ్యాలిమరి"

"అక్కడనుండి వచ్చాక మీ రిద్దరూ డిసైడ్ చేసుకుందురులేబేబీ"

"నేవెళ్ళి కారు మెకానిక్‌కి అప్పజెప్పివస్తాను. లాంగ్ జర్నీకదా చిన్న రిపేర్సేమయినా వుంటే సరిచేస్తాడు."

భర్తవైపు నిశితంగా చూసింది దివ్య. కూతురుతో కూడా ఎందుకు తన మనస్సులో మాటచెప్పలేకపోతున్నారీయన. ఆమె ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది.

"యింత త్వరగా ప్రయాణం పెట్టుకుంటే ఎలా? అరకులో రూమ్ బుక్ చేసుకోవద్దూ."

"మమ్మీ! నాకు కోపం వచ్చేస్తుంది. ప్రతిదానికీ అడ్డం చెప్పేస్తున్నావు. నీకు ప్రాక్టీసుకూడా లేదుగా మమ్మీ. డాడీచూడు బిజినెస్ వ్యవహారాలు బోలెడున్నా వస్తున్నారు"

దివ్య ముఖం క్షణంసేపు మ్లానమయింది.

అది కనిపెట్టేసింది చిరుహాస.

"అరకు వారీనుండి వచ్చాక మరలా ప్రాక్టీస్ స్టార్ట్ చెయ్యిమమ్మీ! ఇంట్లో నీకేం తోస్తుంది చెప్పు. అదీగాక మన సింహపురి ప్రజలు ఒక మంచి డాక్టరమ్మను కోల్పోవడం యీ నెల్లూరు వాసిగా నేను భరించ లేకుండా వుంది" తల్లి భుజాలు పట్టుకుని వూపుతూ అల్లరిగా అంది దివ్య.

"ఇప్పుడే గుప్తాకి రూమ్ బుక్ చేయమని చెపుతాను. అతను లేక పోయినా అతని ఫ్రెండ్ శివప్రసాద్ వున్నాడు. మనకేం ట్రబుల్ వుండదు. ఆర్ ఎమ్ బి గెస్ట్ హౌస్‌లో వుండొచ్చు అక్కడనుండి అనంతగిరి వెళ్ళి అక్కడ స్టే చేసి అర్లీమార్నింగ్ బొర్రాకేవ్స్ చూసి వై జాగ్‌లో ఒన్‌డేవుండి వచ్చేద్దాం" ప్రోగ్రామ్ చెప్పాడు స్వరూప్.

"డాడీ! మరి నా పెయింటింగ్స్ అంత త్వరగా పూర్తవుతాయా?" ప్రశ్నార్ధకంగా అడిగింది చిరుహాస.

"డొంట్ మైన్ ఎంతసేపు గీసుకుంటావులే బేబీ పోనీ యింకో రోజుందాం."

"డాడీ! ఈ జర్నీలో నాకు కంప్లీట్‌గా డ్రైవింగ్ నేర్పించే య్యాలి"

"అందుకే నాకు కారు జర్నీ అంటే భయం. చెపితే వినిపించు కోరు"

భయంగా ముఖం పెట్టింది దివ్య.

"ప్రక్కన ఎక్స్‌పర్ట్ డ్రయివర్, డాడీ వుండగా భయమెందుకు మమ్మీ!"

"అంతదూరం ఒక్కరే డ్రయివ్ చేయడం టైరియిల్ అవుతుంది హాసా!"

"అదా నీ భయం. అయితే సగం దూరం నేను డ్రయివ్ చేస్తాలే మమ్మీ" తల్లి మెడచుట్టూ చెయ్యివేసి గారంగా అంది చిరుహాస.

★ ★ ★ ★

"అన్నీ సర్దుకున్నారుకదా ఇక బయలుదేరుదామా?"

ఒక్కసారి కారు బానెట్ ఎత్తి రేడియేటర్‌లో వాటర్ చెక్ చేసుకుంటూ అడిగాడు స్వరూప్.

"నేను రెడీ డాడీ—మమ్మీ ఇంకా బయటకు రాలేదు" తండ్రి ప్రక్కనే నిల్చుంటూ అంది చిరుహాస.

"అమ్మీ అన్నీ అప్పగింతలు పెట్టిరావాలిగా. ముందు నువ్వు కారెక్కు" తొందర చేసాడు కూతుర్ని స్వరూప్.

"మమ్మీకూడా వచ్చేసింది" సంబరంగా అంటూ ముందు సీట్లో కూర్చుంది చిరుహాస.

"నువ్వూ ముందుకురాదివ్యా!" భార్య బాక్‌డోర్ తెరుస్తుంటే ఆప్యాయంగా అన్నాడు

"లాంగ్ జర్నీకదా! మీకు డ్రయివింగ్‌కి కన్వీనియంట్‌గా వుండదేమో!" సందేహంగా నిలబడిపోతూ అంది దివ్య

"అంతగా యిరుకనిపిస్తే నేను వెనక్కి వెళ్ళిపోతాలే మమ్మీ రా" తండ్రి పక్కకు జరుగుతూ పిల్చింది చిరుహాస.

టేప్‌రికార్డర్‌లో సాంగ్స్ వింటూ దివ్య కూతురికి డ్రయివింగ్ నేర్పిస్తూ స్వరూప్—డ్రయివింగ్ నేర్చుకుంటూ చిరుహాస గుంటూరు చేరారు.

"చందూకి సర్‌ప్రైజ్ యివ్వాలిప్పుడు" సంతోషంగా అన్నాడు స్వరూప్.

"ఒక్క గంటపైన వుండొద్దుడాడీ అంకుల్ వాళ్ళింట్లో డామ్ బోర్. ఆంటీ అస్సలు మాట్లాడదు. ఏమిటో నా కస్సలు నూపిరాడదు" అంది చిరుహాస.

"ఆంటీ ఎలావుంటే ఏమ్మా! అంకుల్‌కి మీ డాడీఅంటే ప్రాణం"

"ఒప్పుకుంటాను మమ్మీ! కానీ వీళ్ళెందుకొచ్చారా? అన్నట్లుంటుందాంటీ. వాళ్ళ జత ఎలా కలిసిందోకానీ స్వప్నకూడా వాళ్ళ మమ్మీలాగ ముభావంగా వుంటుంది."

ఆలోచిస్తోంది దివ్య. సినిమా హాల్‌లో కాకతాళీయంగా కవితను చూడ్డం-అదే మ్యాచ్ చంద్రకిరణన్నయ్యకు రావడం-ఆనందంగా ఒప్పుకోవడం కళ్ళకు కట్టినట్లుందింకా.

అన్నయ్య ఆనందపడి పోవడమేనా తనూ ఆనందించలేదూ. ఒకే! ప్రొఫెషన్ అమ్మాయి తనకు తోడుగా వుంటుందని ఎక్కడి కయినా తను వెళ్ళాలనుకుంటే నాలుగురోజులు తన క్లినిక్‌ని అప్పు చెప్పొచ్చని కవిత ప్రాక్టీస్ పెడితే తను హెల్ప్ చేయొచ్చనుకోలేదూ! కానీ జరిగిందేమిటి? అతని పెళ్ళితో తనకామ్మాయి దగ్గరవడం ఎలా వున్నా తన భర్తకు చంద్రకిరణన్నయ్య దూరమై పోయాడు.

కారు గుంటూరులో అరండల్ పేటలో 2 వ వీధి వైపుకుదూసుకు పోయింది. స్వరూప్ మనస్సు స్నేహితుణ్ణి కల్సుకోబోతున్నందుకు ఆనందంగా వుంది.

కారు దిగుతున్న స్నేహితుణ్ని చూసి పరిగెట్టుకుంటూ వచ్చాడు చంద్రకిరణ్. అతని ముఖంలో ఆనందం.

"ఎన్నో సంవత్సరాలయినట్లుందిరా నిన్ను చూసి" అనేసి-

"ఏమ్మా హాసా! ఒక్కసారికూడా ఈ అంకుల్ గుర్తు రాలేదా నీకు."

"వచ్చారంకుల్ కానీ డాడీ లేరుగా"

"ఎప్పుడొచ్చావ్? అక్కడ విశేషాలేంటి? ఆ వెదర్ నీకు గిట్టిందన్నమాట"

"ఏం మమ్మల్ని లోపలికి రానివ్వరు?"

"సారీరా! మిమ్మల్ని చూసిన ఆనందంతో మర్యాద గుర్తుకు రాలేదు"

"మనమధ్య మర్యాదలేమిటన్నయ్యా"

"నీ ప్రాక్టీస్ ఎలా వుందమ్మా?" దివ్య వైపు తిరిగి పలకరించాడు చంద్రకిరణ్.

"అమ్మ ప్రాక్టీస్ మానేసిందంకుల్"

"ఈః రోజు ఏప్రిల్ ఫస్టు కాదులే హాసా! నన్ను ఫూల్‌ని చేయ డానికి!"

"నిజంగానే దివ్య ప్రాక్టీస్ మానేసిందిరా."

"అదేమిటమ్మా! ఒంట్లో బాగాలేదా?" ఆదుర్దాగా అడిగాడు చంద్ర కిరణ్.

అతను అలా అడగడంలో ఆ ఆదుర్దాలో దివ్య పట్ల అతని అభిమానం చాటింది.

దివ్యకు సంతోషంగా అన్పించింది.

ఎంత దూరాన వున్నా ఎన్ని రోజులకు కల్సుకున్నా వాళ్ళపట్ల అభిమానం దగ్గరగానే వున్నందుకు.

"కవితా!" లోపలికి కేకేసాడు.

"తను ప్రాక్టీస్ మానేసినందుకు ఎక్స్‌ప్లనేషన్ ఎలా యివ్వాలా అనుకుంటున్న దివ్య వెంటనే అంది.

"కవిత లోపలున్నట్లుందిలే అన్నయ్యా....! మేము లోపల కెళుతూ.

బాత్‌రూమ్‌లో నుండి స్నానం చేసి వస్తున్న కవిత వీళ్ళను చూసి ఒక చిన్న చిరునవ్వు విసిరి లోపలి కెళ్ళింది.

"ఏమిటి మమ్మీ! ఆంటీకి మరీ మర్యాద తెలియదు ప్రతిరోజూ వచ్చే మా ఫ్రెండ్‌ని చూసి కూడా నేను ఆనందపడిపోయి దగ్గర కెళ్ళి పలకరించుకుంటాను అలాటిది ఆంటీ రెండు సంవత్సరాల తర్వాత చూసి కూడా ఎప్పుడొచ్చారనయినా అడగదేం?" మెల్లిగా తల్లితో అంది.

"ఉష్! మాట్లాడకు" అంతకంటే మెల్లిగా మందలించింది కూతుర్ని దివ్య.

లోపలికెళ్ళి తన చేతిలోని తడి టవల్ స్టాండ్ మీద వేసి నుదుట బొట్టు పెట్టుకుని వీళ్ళ దగ్గర కొచ్చింది కవిత.

"బాగున్నావా?" ఆ ప్రశ్న వేయాల్సింది కవితే అయినా దివ మొదట పలకరించుకుంది.

చిన్నగా నవ్వింది సమాధానంగా కవిత.

"స్వప్న ఎక్కడుందాంటీ?" ఈ మారు చిరుహాస అడిగింది.

"పిక్చర్ కెళ్ళింది" కుర్చీ లాక్కుని తనూ కూర్చుంటూ చెప్పింది కవిత.

"కంగ్రాచ్యులేషన్స్‌మ్మా హాసా! నాకు చాలా సంతోషంగా వుంది" కవిత తల మీద చెయ్యివేసి తన సంతోషాన్ని వ్యక్తం చేసాడు అప్పుడే అక్కడ కొచ్చిన చంద్రకిరణ్.

"కవితా! మన చిరుహాసకు బి.డి.ఎస్‌లో సీటొచ్చిందంట. అప్పుడు కూడా చిరుహాసను గ్రీట్ చెయ్యలేదు. చిన్నగా నవ్వి వూరుకుంది. ఆమె ధోరణి తెల్సినా ఎప్పటి కప్పుడు వింతగా వుంటుంది ఆ తల్లీ కూతుళ్ళకు.

ఆమె ముందు తల్లి ఆ కోర్సులో చేర్చనంటుంది అని చెప్పడానికి ఇష్టపడలేదు చిరుహాస.

"థాంక్స్ అంకుల్" అంది నవ్వుతూ.

"ఉత్తి థాంక్స్‌తో సరిపెట్టేస్తే వూరుకునేది లేదు. నాకు మంచి పార్టీ యివ్వాలి" చిరుహాస ప్రక్కనే కూర్చుంటూ అన్నాడు.

ఆ టైమ్‌లో స్నేహితుడు ముఖం కడుక్కోవడానికి బాత్‌రూమ్ ...

చిరుహాస నోరు తెరిచి ఏదో చెప్పబోయింది ఇంతలో కవిత.

"స్వప్నకి కాంప్లాన్ అయిపోయింది. మీరు బజార్ కెళితే తెచ్చి పెట్టండి. ఆమె మాంగో ఫ్లేవర్ తప్పితే మరింకేమీ తాగదు."

"అలాగే కానీ ఈ రోజు హాస్పిటల్‌కు శెలవు పెట్టెయ్యి అందరం కల్సి చాలా రోజులు అయింది" భార్య వైపు తిరిగి అన్నాడు.

ఇలా అని విన్న తెల్సుంటే బాగుండేది. ఈ రోజు నేనొసాన...

మీ కోలీగ్ లీవ్ పెట్టింది ఇప్పుడు నేను మానేస్తే ఎలా?" చంద్రకిరణ్ వైపు తిరిగే అంది కానీ దివ్య వైపు కంటి చివరినుండి కూడా చూసి మాట్లాడలేదు.

"మనిద్దరం వెళ్ళి పర్మిషన్ తీసుకుని వస్తాం పద" భార్యను తొందర చేస్తున్నా ఆమె కదల్లేదు.

"కవితను వెళ్ళనివ్వండన్నయ్యా పిలయ్యుంటే లీవ్ పెట్టే అవకాశాలుంటే మీరంత దూరం చెప్పాలా?" అంది దివ్య.

దానికి ఏమీ జవాబు చెప్పలేదు కవిత టీ పెట్టి అందరికీ అందించింది.

"స్వరూప్ టీ త్రాగడు కవితా!" అని అనలేదు చంద్రకిరణ్.

కవిత రెడీ అయి వెళుతూ పొడిగా ఓ చిరునవ్వు నవ్వి "వస్తాను" అంది.

దివ్యలో ఆశ్చర్యం అంచులు దాటింది. మర్యాద కోసం మీరూ హాస్పిటల్‌కి రండి. త్వరగా వచ్చేద్దాం అనలేదు అదీ కాకుంటే ఏమీ అనుకోవద్దు వుండలేకపోయాను అని కూడా నొచ్చుకోలేదు.

"ఆంటీ లేకుంటేనే ఈ ఇంట్లో స్వతంత్రంగా వుంది కదూ మమ్మీ" చంద్రకిరణ్‌తో అరగంట కబుర్లు చెప్పి లోపలికి వచ్చిన చిరుహాస తల్లితో అంది.

చిన్న పిల్ల కాబట్టి చిరుహాస పైకి అంది కానీ అంతకు ముందే మనసులో ఆ మాట అనుకుంది దివ్య.

"ఇంక మే మొస్తాంరా. కవిత వస్తే చెప్పు."

"ఫోంచేయకుండా వెళ్ళడమే. ఇంత కాలానికి కల్సుకున్నాం కదా! కనీసం నా దగ్గర రెండు రోజులయినా నీకు గడపాలని లేదూ!" నిష్టూరమే అయినా ఆ కంఠంలో ప్రేమ తొణికిసలాడుతోంది.

"అంకుల్! మీరు నెల్లూరుకు మార్పించేసుకోకూడదూ! మనమంతా ఒకే దగ్గర వుండే వాళ్ళం" చిరుహాసకు చంద్రకిరణ్ వాళ్ళ

నెల్లూరొస్తే ఆంటీ స్వప్న కలవకపోయినా అంకుల్‌తో సరదాగా గడపొచ్చని ఆశ.

"అన్నట్లు మీరు నెల్లూరు కొచ్చేయొచ్చుగా. ఈ ప్లేస్ అంత నచ్చిందా? నీకు" స్నేహితుడి వైపు చూస్తూ అడిగాడు స్వరూప్.

"నచ్చడానికి నచ్చకపోవడానికి ఏముంది? ఎక్కడున్నా అదే డ్యూటీ నే మార్చుకోవాలనుకుంటే ఎప్పుడో మార్పించుకు నుండేవాడ్ని కానీ కవితకు నెల్లూరుకు రావడం ఇష్టం లేదు. అక్కడందరూ తెల్సిన వాళ్ళు డ్యూటీ చేసొచ్చి మరలా గెస్ట్సని కంపెనీ ఇవ్వాలంటే ఓపికుండదు అంటుంది."

ఆమె మనస్తత్వం తెల్సిన దివ్య, స్వరూప్ ఆ టాపిక్‌ని పొడిగించ లేదు

ఒక్క నిముషం మీరు కబుర్లు చెప్పుకుంటూ వుండండి అంటూ లేచి వంటింట్లోకి వెళ్ళాడు.

అందరికీ సరిపడా భోజనం వున్నట్టులేదు. వెంటనే క్యారియర్‌తో తిరిగొచ్చాడు.

స్వరూప్ ఎంత వారించినా వినకుండా క్యారియర్ తీసుకుని స్కూటర్ ఎక్కాడు.

ఇక వినడని నిర్ధారణ చేసుకుని స్వరూప్ ఆలాగే కారులో వెళ్ళి తెచ్చుకుందాం పద అంటూ కారు స్టార్టు చేసాడు.

దివ్యకేమీ తోచక పెరట్లో కెళ్ళింది.

అక్కడ మళ్ళు ఒకవైపు, బీర పాదు మరో వైపు వంగ బెండ చెట్లు మడులు ఒకవైపు.

మరోవైపు కనకాంబరాల చెట్లు, సన్నజాజి పందిరి చూస్తుంటే చూడాలనిపించేంత శుభ్రంగా వుంది.

కాస్సేపు అక్కడే వుండి లోపలికొచ్చి వి.సి.ఆర్ చూస్తున్న కూతురు ప్రక్కన కూర్చుంది.

అక్కడున్న ప్రతి వస్తువు నీట్‌గా సర్ది వుంది. వి.సి.ఆర్. ప్రక్కన వున్న క్యాసెట్లో స్టాండ్‌లో క్యాసెట్లన్నీ పొందిగ్గా అమర్చి వున్నాయి.

టీపాయ్ క్రిందున్న పేపర్ల దొంతర చెక్కు చెదరకుండా వుంది. మూలగా వున్న ఫ్లవర్‌వాజ్‌లో తాజా పూలు.

ఇల్లు ఇంత కళాత్మకంగా అమర్చుకోడానికి, ఇంటి పెరట్లో అన్ని చెట్ల పెంపకానికి వుండే ఓర్పు నేర్పు ఇంటి కొచ్చిన అతిధితో మాట్లాడటానికి, కనీస మర్యాదలు చేయడానికి ఎలా లేకపోతుంది. ఇలాంటి వ్యక్తులు జీవితంలో ఎంతయినా సుఖపడతారు కాబోలు అని నిట్టూర్చింది కవితను తల్చుకొని దివ్య....

క్యారియర్ తెచ్చి డైనింగ్ టేబుల్‌మీద పెట్టి వంటింట్లో గరిటెలుకోసం, ప్లేట్లకోసం వెతుకుతున్న చంద్రకిరణ్‌కు సహాయపడింది దివ్య.

చిరుహాస టేబుల్‌మీద అన్నీ సర్దింది.

వంటింట్లో వున్న కోడిగుడ్డు కూరకూడా తెచ్చి టేబుల్‌మీద పెడుతూ....

"రామ్మా దివ్యా కూర్చో రా వడ్డించేస్తాను సరదాగా కబుర్లు చెప్పుకుంటూ తిందాం" చిరుహాసను ప్రక్కనే కూర్చోబెట్టుకుంటూ స్నేహితుణ్ని దివ్యని పిలిచాడు.

"మీకెందుకన్నయ్యా ఈ శ్రమ? మేము హోటల్‌లో తినేసి వెళ్ళమా?"

"అలా అనకమ్మా! నేను మీకు అన్నం పెట్టకుండా ఎలా పంపుతాననుకున్నావు?"

"వొక్కసారి మామ్మ వంట కల్సి రుచి చూడాలనిపించినట్లుంది వీడికి అవునా చందూ!"

"అమ్మో! మరీ అంత భయంకరమైన ఫుడ్‌కాదులేమ్మా భయపడ

కుండా తినేయొచ్చు" అంటూ బిరియానీ చికెన్ సిక్స్టీ ఫైవ్, పెరుగు పచ్చడి వడ్డించాడు.

"మీరు కూర్చోండన్నయ్యా నేను వడ్డిస్తాను మీరిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ తిందురుగానీ" అంది దివ్య.

"అంకుల్! స్వప్న వుంటే నాకు కంపెనీ బాగుండేది"

"పిక్చర్‌నుండి వచ్చే టైము అయిందిలే హాసా వచ్చేస్తుంది. ఐనా వీడికి ఒక్క టెలిగ్రామ్ తను వస్తున్నట్లు ఇవ్వాలని తోచకపోయిందను కోవాలి"

ఇలాటి తిండి పెడుతున్నాననే గిల్టీ ఫీలింగ్ అతని గొంతులో.

"ఇప్పుడేమయిందట! అందరం కలిసి అరకు వెళదాంపద. ఎలాగూ స్వప్నకు హాలిడేస్‌కదా! కవితను కూడా సెలవు పెట్టించేస్తే సరి—సరదాగా వుందాం" బిరియానీ నోట్లో పెట్టుకోబోతున్న స్వరూప్ తలెత్తి అన్నాడు.

చంద్రకిరణ్ జవాబివ్వబోతుంటే కవిత వచ్చింది.

వస్తూనే....

"ఏమండీ! మాధురీదేవి ఈరోజు కన్‌సల్టేషన్ రూమ్‌లో కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నారట. పేషెంట్లని పిలవమంటారా? అని అటెండర్ అడిగితే పదినిముషాలాగు యిది వ్రాసేసాక పిలుస్తాను అన్నారట. అటెండర్ పదినిమిషాల తర్వాత లోపలికెళితే మేడమ్ టేబుల్‌మీద తల వాల్చి చనిపోయిందట.

హార్ట్ అటాక్ అంటున్నారు.

అందరూ డెడ్‌బాడీని తీసుకుని వాళ్ళింటికెళ్ళారు నాకెళ్ళాలని పించక వచ్చేసాను" అని.

పోనీలే భర్తతోనయినా కబుర్లు చెపుతోంది అనుకుంది దివ్య.

"రండి మీరూ భోంచేద్దురు" దివ్యకు ఆమెకు లేని స్థబ్దత గుర్తు వచ్చింది.

"డెడ్‌డాడీ దగ్గర యిప్పటివరకున్నాను కదా! నంచేసి తింటాను" అనేసి లోపలికెళ్ళిపోయింది.

దివ్యతోపాటు స్వరూప్ కూడా ఆ అమ్మాయి అమర్యాదకరమైన మనస్థత్వానికి తన స్నేహితుడు దురదృష్టానికి చింతించాడు.

"కవితకు కొన్ని సెంటిమెంట్స్ ఎక్కువ" భార్యను వాళ్ళేదో అనుకుంటున్నారనే ఫీలింగ్ అతనిలో.

ఇంతలో స్వప్న వచ్చిందక్కడకు.

"ఎప్పుడు వచ్చారాంటీ? అంకుల్ మీరు ఫారిన్‌నుండి ఎప్పుడు వచ్చారు? హాసా! ఎం।టన్స్ వ్రాసావుకదా! ఏమయింది?"

"ఇప్పుడే వచ్చాం. నాకు బి.డి.ఎస్.లో సీటు వచ్చింది" అందరి ప్రశ్నలకు చిరుహాస జవాబిచ్చింది.

రెండు సంవత్సరాలు పెద్దదయిన చిరుహాసను అక్కా అని పిలిచేంత దగ్గరతనం స్వప్న కోరుకోలేదెప్పుడూ,

"అయితే పార్టీ ఇవ్వాలి నువ్వు తప్పదు" నవ్వుతూ అని ప్రక్కనున్న కుర్చీలో కూర్చుంది.

"నువ్వు, ఆంటీ, అంకుల్ మాతో అరకులోయకు రండి నేను మీకు పార్టీ ఇస్తాను"

"ఆదేంటాంటీ అరకువాలీ వస్తేనే పార్టీ ఇవ్వడమేమిటి? ఇక్కడ రాత్రికి మీరు పార్టీ యివ్వాల్సిందే" ఏ మూడ్‌లో వుందో స్పోర్టివ్‌గా అంది.

"నీకు హాలిడే సేకదమ్మా? పార్టీకోసమని సరదాగా అందిలే చిరుహాస నీ కంపెనీ లేదని వచ్చినప్పటినుండి అంటోంది. అందరం అరకువాలీ వెళదామా?"

"అలాగే ఆంటీ కానీ మమ్మీ డాడీ ఒప్పుకోవాలిగా?" వాళ్ళ డాడీ వేపు చూస్తూ వుత్సాహంగా అంది.

"నేను రెడీ మీ మమ్మీ ఏమంటుందో?" ఫోంచేస్తూ అన్నాడు చంద్రకిరణ్.

"మమ్మీ! మమ్మీ ప్లీజ్! ఒక్కసారి ఇలా రావా?" తల్లిని పిలిచింది స్వప్న.

స్నానానికి వెళ్ళబోతోందిలా వుంది. బట్టలు చేతిమీద వేసుకొని వచ్చింది కవిత.

"ఆంటీ వాళ్ళు అరకు వెళుతున్నారు మనల్నీ పిలుస్తున్నారు వెళదామా మమ్మీ!"

"ఇప్పటికిప్పుడెలా వీలవుతుంది స్వప్నా?" భర్తవేపు చూసి కూతురికి జవాబిచ్చింది.

"అదీ నిజమే. మీరు వస్తానంటే రేపటివరకు ఆగుతాము. హాస్పిటల్‌కి వెళ్ళి సెలవుపెట్టి వస్తే అందరం సరదాగా వెళదాము" దివ్య కవితతో అంది.

"నాకింట్లో వుండడమే సరదా" కొట్టినట్టుందా జవాబు.

అదిరిపోయి ఆమెవంక చూసింది దివ్య.

ఆమె అలా జవాబిచ్చినందుకు ఏకోశానా ఆమె కళ్ళు గిల్టీగా లేవు.

చంద్రకిరణ్‌వేపు చూసింది.

అతనికదేమీ పట్టనట్లు స్నేహితుడివేపు తిరిగి కబుర్లు చెపుతున్నాడు.

స్వప్న బుంగమూతి పెట్టింది.

అప్పటికప్పుడే ఆ అమ్మాయి ముఖంలో కోపం, విసుగు.

"మమ్మీ ఎప్పుడూ ఇంతే" విసురుగా లోపలికెళ్ళిపోయింది. తల్లికి తగ్గ కూతురనిపించుకుంది.

అదేమీ పట్టనట్టు కవిత లోపలికెళ్ళిపోయింది స్నానం చేయడానికా్కాబోలు.

భోజనాలు పూర్తయ్యాక ట్రేలో వక్కపొడి, అరటిపండ్లు తెచ్చి పెట్టాడు చంద్రకిరణ్.

ఇతనికి మంచి భార్య వచ్చుంటే ఎంత బాగుండేది ఇంకొక్కసారి అనుకుంది దివ్య.

వెళ్ళేప్పుడు దగ్గరకొచ్చింది కవిత.

"స్వప్న ఏదాంటీ?" చిరుహాసకు ఎప్పుడెక్కడనుండి బయట పడదామా అనుంది కానీ మ్యానర్స్ సేక్ వెళ్ళేప్పుడు ఏదో ఒకటి మాట్లాడకుంటే బాగుండదని అడిగింది.

కవితకు విన్పించినట్లు లేదు మౌనంగా వుంది.

"వస్తానురా రాత్రికి వైజాగ్‌లో స్టేచేసి రేపు అరకుకు వెళతాం"

"ఆ వుండేదేదో ఇక్కడే వుండొచ్చుకదా" అతనికి కవిత మన స్తత్వం తెలిసినా స్నేహితుడు తన దగ్గరుండాలనే కోరికతో కొద్దిపాటి నిష్ఠూరంతో అన్నాడు.

"ఇక్కడకు వచ్చింది నిన్ను చూడాలనే కదరా! రాత్రికి ఇక్కడున్నామనుకో ప్రొద్దున్నే లేచి ప్రయాణమయినా అరకు వెళ్ళేసరికి లేట్ అవుతుంది. తెలియని రూట్ కష్టం కదా నువ్వే చెప్పు."

"నిజమేననుకో. అయినా చెప్పుల్లో కాళ్ళు పెట్టుకుని వచ్చారు. ఒకరోజు నా దగ్గరుంటే ఎంతో తృప్తిగా వుండేది నాకు" చంద్రకిరణ్ మరలా అన్నాడు.

"అంకుల్, చెప్పులేసుకోకుండా మీరు రండి. ఎన్ని రోజులుంటారో చూస్తాను. అసలు నెల్లూరిని మరిచిపోయారు మీరు" నవ్వుతూ అంది చిరుహాస.

"మీ ఆంటీకి ప్రయాణం పడదమ్మా! మొదట్లో అలాగే తీసుకెళ్ళేవాడ్ని. నా సరదాకొలదీ కానీ పాపం ఒకటే వామిటింగ్స్. పెట్రోల్ వాసన పడక బాగా సఫర్ అయ్యేది. అందుకే ప్రయాణాలు మాను

కున్నాం" భర్త అలా అంటున్నాకూడా ఒక్కమాట కూడా మాట్లాడ లేదు కవిత.

కారు దగ్గరకెళ్ళాక డాష్‌బోర్డులో వున్న రింగ్‌వాచ్ తీసి,

"స్వప్నని పిలువమ్మా, అది సరిపోతుందో లేదో చూస్తాను" వెళ్ళేప్పుడు కవితను పలకరించకుంటే స్నేహితుడు చిన్నబోతాడని అడిగాడు స్వరూప్.

"ఆమె అలిగింది. అన్నంకూడ తినకుండా పైన పడుకుంది. ఇప్పుడు పిల్చినా రాదు" ఆ అమ్మాయి నోటిగుండా స్వరూప్‌ని అన్నయ్యా అనిగానీ, స్వరూప్‌గారూ అనిగానీ అనడం ఎవ్వరూ విన లేదు.

మాట్లాడే రెండు మాటలయినా ఎవర్నీ సంబోదించకుండా ఎలా మాట్లాడగలదా? అని విస్తుబోతుంటుంది దివ్య.

"చాలా బాగుందిరా" అమెరికన్ డైమెండ్ పొదిగిన వుంగ రంలో వాచ్‌ని పరిశీలిస్తూ అన్నాడు చంద్రకిరణ్.

"ఇదిగో నీకోసం ఇది" స్నేహితుడి కందించాడు స్వరూప్ పొలరాయిడ్ కెమెరా.

"పట్టుచీరిచ్చినమ్మ పీటకోడుకూడ ఇవ్వాలనే సామెత మర్చి పోయావా? నేనెక్కడ తీసుకురాను ఇంత ధరపెట్టి ఫిల్మ్."

"అబ్బ! ఆగరా యిచ్చే లోపల అంత దండకం చదివేస్తే ఎలా?"

కవర్‌లోనుండి పది ఫిల్మ్స్‌తీసి అందించాడు.

"అమెరికా కెళ్ళికూడా గుర్తుపెట్టుకుని తెచ్చినందుకు నాకు చాలా సంతోషంగా వుందిరా" కెమెరావేపు చూడకుండా స్నేహితుడి కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు చంద్రకిరణ్.

"ఏడ్చేవులే నువ్వు గుర్తు లేకుంటే నాకింకెవరు గుర్తుంటారు" అలా అంటున్న స్వరూప్‌కి సడన్‌గా గుర్తు వచ్చింది.

కవితకు తనేమీ తీసుకురాలేదని భార్యవేపు చూసాడు.

ఇవేమీ గమనించకుండా చంద్రకిరణ్ లోపలికెళ్ళి కెమరాలో ఫిల్మ్ లోడ్ చేసుకొచ్చి ఎవ్వరికీ చెప్పకుండ మొదటిఫోటో తీసాడు.

కారుదగ్గర నిల్చుని దివ్య స్వరూప్ ఏదో మాట్లాడుకుంటున్నారు.

ఆ ఫోటో చూడగానే పైకి ఆనందాన్ని వ్యక్తం చేసింది.

చిరుహాస మనస్సులో స్నేహితుడి అభిమానానికి ఆనందించాడు స్వరూప్.

"అంకుల్, మీరు ఆంటీ ప్రక్కన నిల్చోండి నేను తీస్తాను" చిరుహాస కెమెరా అందుకుంటూ అంది.

"ఫోటో తీస్తుంటే కనీసం సర్దుకునికూడ నిల్చోలేదు కవిత.

తనను కాదన్నట్లు నిల్చుంది. చంద్రకిరణ్ ప్రక్కకువెళ్ళి నిలుచున్నాడు"

అంత త్వరగా తమ ఫోటో చూసుకుంటున్న ఆనందంగాకూడ ఆ అమ్మాయి ముఖంలో లేదు.

"స్వప్నని పిలవండంకుల్ మీ ముగ్గురి ఫోటో ఒకటి తీసి మా దగ్గరుంచుకుంటాం" అప్పటివరకు ఎప్పుడెప్పుడు కారెక్కుదామా అని ఎదురుచూసిన చిరుహాస ఉత్సాహంగా అంది.

"పాపం స్వప్నని ఎక్కడకూ తీసుకెళ్ళడం పడడంలేదు. పసిపిల్ల కదా బాగా డిసపాయింట్ అయింది.

పిల్చినా కోపంతో రాదు. మీరెళ్ళాక మరలా పిక్చరుకి తీసుకెళ్ళి కోపం పోగొట్టాలి."

చంద్రకిరణ్‌వేపు ఒక్క నిముషం అలాగే చూసింది దివ్య.

ఎదుటి వ్యక్తిని నొప్పించకుండా ఎలా మాటాడాలో తెలిసిన వ్యక్తి—తనవాళ్ళను కించపరుచుకోకుండా ఎలా సమర్ధించాలో ఎరిగిన మనిషి—

ఇంత మంచి మనస్సున్న ఇతనికిలాటి భార్య శాపంలా వచ్చింది మనసులోనే నిట్టూర్చింది.

పరాయిదైన తనే ఇంత బాధపడుతుంటే తన భర్త తన స్నేహితుడి జీవితం తల్చుకుని ఇంకెంత బాధపడుతున్నాడో కదా! అని వాపోయింది.

తను ఆలోచనల్లో వుండగా ఆరు ఫోటోలు తీసారు చిరుహాస చంద్రకిరణ్ కలిసి.

అవన్నీ చూసి ముచ్చటపడి తనకి కావాల్సిన తన స్నేహితుడి కుంటుంబం ఫోటోలు వుంచుకుని తనవి మాత్రం రెండిచ్చాడు.

వీళ్ళు కారు ఎక్కగానే కవిత లోపలికెళ్ళిపోయింది. కానీ చంద్రకిరణ్ కారు కనిపించనంత దూరం చెయ్యి వూపుతూనే వున్నాడు.

స్నేహితుడిదగ్గర కొచ్చేప్పుడున్న ఆనందం స్వరూప్ మనసులో ఇప్పుడు లేదు

మనసునిండా తెలియని భారం.

జీవితంలో ఆడవాళ్ళకయినా, మగవాళ్ళకయినా పెళ్ళి టర్నింగ్ పాయింట్ అవుతుంది.

వచ్చే పార్టనర్ మంచి మనిషయితే జీవితం ప్రశాంతంగా వుంటుంది.

లేనప్పుడు అశాంతమయమవుతుంది.

"ఏమండోయ్ శ్రీవారూ! ఒక చిన్నమాట."

"కారు డ్రయివింగ్ చేస్తూ ఆలోచించకూడదండోయ్. ఇదొక ప్రాథమిక సూత్రమండోయ్" చెవిలో గుసగుసలాడింది దివ్య.

"ఇలా....ఇలా....ఎప్పుడయినా కవిత తన స్నేహితుడితో సరదాగా మాట్లాడుతుందా?" అనుకున్నాడు మనసులో స్వరూప్.

"మీకే డాడీ, మమ్మీ చెప్పేది?" కూతురు మాటలతో ఈ లోకంలోకి వచ్చాడతను.

కారు ఇరవయి కిలోమీటర్లు వెళ్ళేవరకు అతన్ని స్నేహితుడి ఆలోచనలు వదల్లేదు

"డాడీ! ఇక్కడ బాగా ఎండలు వున్నాయి కదూ!"

"మన నెల్లూరులోకూడా తక్కువేమీ లేవుగా హాసా?"

"ఏమిటో డాడీ! గుంటూరులో ఎండలో, లేక అంకుల్ వాళ్ళింటిలో ఊపిరి సలపనట్లుండడంతో అలా వుందో అర్థం కాలేదు నాకు.

అయినా డాడీ! అంకుల్ దగ్గర నాకెంతో చనువున్నా ఆంటీ అలా వుండేసరికి అంకుల్‌తో కాసేపు సరదాగా వుండాలనిపించినా వుండలేకపోయాను

"అంకుల్ తరఫు వాళ్ళెవరొచ్చినా అంకులే మర్యాదలు చేసుకునేలా వున్నారు" కూతురు మాటలు నిజమనిపించాయి స్వరూప్‌కి

స్వరూప్ మనస్సులోనే ఆశ్చర్యపోతున్నాడు. చందూ ఆమెతో ఎలా అడ్జస్ట్ అవుతున్నాడా? అయ్యాడా? అని.

తను, చందు కల్సి ఒకటిన్నర సంవత్సరం ఒకే రూమ్‌లో స్వతంత్రంగా వున్నా ఈ రోజు ఒక్క గంటపైన తనెందుకు చందూ దగ్గర వుండలేక పోయాడు సృష్టి వైచిత్రం అంటే ఇదే కాబోలు. ఎవరి జీవితాల్లో వాళ్ళు అడ్జస్ట్ అయిపోతారు కాబోలు.

స్వరూప్ మనస్సులో మాట చిరుహాస పైకే అనేసింది-

"డాడీ! అంకుల్ మరీ అలా ఆంటీకి దాసుడవడమేమిటి? ఆంటీ వస్తానంటే మనతో ప్రయాణం అవడానికి సిద్ధపడినవాడు ఆంటీ రానన గానే ఆగిపోయాడేమిటి?"

"చందూ మొదట్నుండి అడ్జస్టింగ్ నేచర్ బేబీ!"

"అవొచ్చుడాడీ! మీరు కాఫీ తప్ప టీ తాగరని అంకుల్‌కి బాగా తెల్సు. మరి ఆంటీ టీ తెచ్చినప్పుడు కాఫీ తెమ్మని చెప్పొచ్చుకదా!"

"భార్యను కష్టపెట్టడ మెందుకని వాడి తత్వం. అది మంచిదే కదా!" కారు స్లోగా పోనిస్తూ అన్నాడు.

"డాడీ! ఎప్పుడో ఒకమారేకదా మనం వాళ్ళింటి కెళతాం. అప్పుడు ఆంటీ మన మనస్సు కష్టపెడితే అంకుల్‌కి బాధేయదూ!"

"మీ ఆంటీ నిన్నేం కష్టపెట్టింది?" నవ్వుతూ అడిగాడు స్వరూప్.

"వెళ్ళగానే మీరు అంకుల్‌తో కూర్చున్నారా? నేను మమ్మీ లోపలికెళితే మమ్మల్ని చూసికూడా పలకరించకుండా లోపలికెళ్ళి వచ్చింది. పలకరింపుగా ఓ నవ్వు నవ్వింది అంతే."

"మన చేతివేళ్ళన్నీ ఒకేలా వున్నాయా బేబీ!"

"కాదనను డాడీ! మనం రోజూ వచ్చే మనిషిని కూడా ఎదురెళ్ళి పలకరిస్తాం. రెండు సంవత్సరాల తర్వాత వాళ్ళింటి కెళితే అదా ఇచ్చే మర్యాద. ఎం. డి. యస్ చదివింది అంత మానర్స్ తెలియకుంటే ఎలా?"

"తప్పు అలా అనకూడదు. అంకుల్‌కోసం కదా డాడీ వాళ్ళింటి కెళ్ళింది? ఆమె మనస్తత్వమే అంత మాట్లాడాలంటే బెరుకేమో!"

"ఓ. కే. మమ్మీ ఒప్పుకుంటాను. మనస్తత్వమే అంతయినప్పుడు ఆమెకు బెరుకు ఎక్కువయినప్పుడు ఆంటీ మనింటికొచ్చినప్పుడు స్వప్న కాఫీ తాగుతారా? టీ తాగుతారా? అనే కనీస మర్యాద తెలీకపోవడ మేమిటి"

"మర్యాద తెలీకపోవడమని మనమెందుకనుకోవాలి. ఆ సమయానికి ఇంట్లో కాఫీ పౌడర్ లేకపోవచ్చు, టీ పెట్టేసాక పాలు అయిపోయుండొచ్చు.. సంసారమన్నాక ఎన్నో లోటుపాట్లు వుండకుండా వుంటాయా?" పసిపిల్లల మనస్సులో విషబీజం నాటకూడదని అంది.

"అలా అయితే ఆరోజు స్వప్నని అడిగి మరీ హార్లిక్స్ కలిపించి ఇవ్వాలా మనింట్లో. అప్పుడు మనింట్లో హార్లిక్స్ వుందా లేదా ఆలోచించిందా ఆంటీ. అసలు ఎం. డి. యస్ చేసి అలా వంటింటి కంకితం అయిపోవడమేమిటి. అలా మొక్కుబడిగా గవర్నమెంట్ జాబ్ చేయడమేమిటి? అదే నేనయితే మమ్మీలాగ బిజీ ప్రాక్టిషనల్ నయిపోను." ఆ

పసిపిల్ల బుర్రనిండా బి. ఎస్. యస్ చేసి ఎం. డి. యస్ చేయాలనే దృఢ మైన కోరిక.

చిరుహాస మాటలకు ఆ తల్లిదండ్రులిద్దరూ ఆలోచనల్లో మునిగి పోయారు స్వరూప్ మనస్సునిండా దివ్య. దివ్య ఆలోచనలనిండా స్వరూప్ వున్నాడు.

కారు వైజాగ్‌లో ఆగింది ఆ రాత్రి అక్కడ రెస్ట్ తీసుకున్నారు.

"చందూ తృప్తిగానే వున్నట్లుంటాడుకదూ దివ్యా!" పడుకో బోతూ అడిగాడు.

"అన్నయ్యగారు భార్య మనస్తత్వానికి అలవాటు పడిపోయారు" అంది దివ్య.

ప్రొద్దున్నే లేచి అరకులోయకు ప్రయాణమయ్యారు.

కారు పాడేరు సమీపానికొచ్చేసరికి వాతావరణంలో మార్పు.

"అదిగో ఆ మేఘాలు చూసారా రోడ్డుమీదెలా పారాడు తున్నాయో!" చిక్కటి యూకలిప్టస్ చెట్లలో, అడవిపూల వాసనతో, ఆహ్లాదకరమైన చల్లటి గాలులతో అలిసిపోయి పరిగెడుతున్న మేఘాలను చూపుతూ అంది చిరుహాస.

"ఆ గ్లాసెస్ పైకెత్తేయ్ హాసా! చలిగాలి రివ్వున లోపలికొస్తోంది" షాల్ కప్పుకుంటూ అంది దివ్య.

"చలేంటి మమ్మీ!" నాకయితే కారు దిగిపోయి అ చెట్లలో పరి గెట్టాలనుందనుకో."

"ఓ గంట పరిగెట్టావంటే నీకే విసుగొస్తుంది"

"ఏంకాదు. జీవితాంతం ఈ కొండల్లో, ఈ వాగుల్లో, ఈ అడ విలో వుండి పొమ్మన్నా వుండిపోతాను"

"ఎందుకుండవు. డన్‌లప్ లేందే నిద్రరాదు, ఐస్‌వాటర్ త్రాగ కుంటే దాహం తీరదు, నాలుగురకాల కూరలు, డైనింగ్ టేబిల్‌మీద లేకుంటే అన్నం తిన్నా ఆకలి తీరదు. వారానికి రెండు సినిమాలు

చూసి, రెండు పెయింటింగ్స్ వేసుకోండే తోచదుగా నీకు" కూతురివైపు నవ్వుతూ చూస్తూ అంది దివ్య.

"ఇక్కడ ఈ అందమయిన ప్రకృతిలో చెట్టుక్రింద పడుకునేదే తొందరగా నిద్రొచ్చేస్తుంది మమ్మీ! ఐస్ వాటర్‌కంటే చల్లగావుండే ఈ కొండకోనల్లో పారే నీళ్ళు త్రాగితే దాహం తీరిపోదూ! అదిగదిగోమమ్మీ ఆ చెట్లవైపుచూడు ఎన్నిరకాల పండ్లో! నీకు నోరూరడంలేదూ అవన్నీ తింటే అకలట్టే ఎగిరిపోతుందిలే. ఇక మన కళ్ళముందుండే ఆ జలపాతం, ఆ కొండ, ఈ చెట్లు పెయింటింగ్ బోర్డుమీదకెక్కిచ్చేస్తే కాలం ఇట్టే గడిచిపోదూ!"

"దీన్నిక్కడ వదిలేద్దామండీ"

భార్యవైపు, కూతురివైపు చూసి చిరునవ్వు నవ్వాడు స్వరూప్.

ఈ మారు అమ్మమాటలకు ఉడుక్కోలేదు చిరుహాస.

కారు డ్రయివింగ్ నేర్చుకోవడం మానేసి కారు బయటకు చూస్తూ ఆనందిస్తోంది.

ఒకవైపు సన్నటి పసుపు పచ్చటి పూలున్న పొలాలు-యింకో వైపు తలెత్తితే చిటారుకొమ్మ కన్పించనంత పొడవుగా తలలూపుతున్న యూకలిప్టస్ చెట్లు-మరోవైపు టేకుచెట్లు వాటి వెనుక పొగడపువ్వుల సువాసనలు—మధ్యమధ్యలో చిన్నచిన్న జలపాతాలు రాళ్ళ మీదుగా నురుగలు గ్రక్కుకుంటూ, సుళ్ళు తిరుగుతూ పారుతున్నాయి.

ఆ ప్రకృతిమాత ఒడిలోకి వచ్చి ఆడుకుంటున్న మేఘాలు కొంతదూరం సన్నటి చల్లటి వానజల్లులతో రోడ్డు తడిచిపోతే మరికొంత దూరం మేఘాలచాటునుండి బయటకొచ్చి తొంగి చూస్తున్న సూర్యభగవానుడి నులివెచ్చటి కిరణాలు రోడ్డుమీద పొరాడుతున్నాయి.

ఒక్క నిముషంకూడా కనురెప్ప వాల్చకుండా ఆనందిస్తున్న చిరుహాస కారు సడన్ బ్రేక్‌తో ఆగడంతో ఉలిక్కి పడింది.

పాడేరు సమీపంలో రోడ్డు కిరువైపులా కుప్పలు పోసిన కూరగాయలు, పండ్లు, పెద్ద గుమ్మడికాయలు....చిన్న చిన్న సోయాబీన్

గింజలబుట్టలు. చింతపండు గుట్టలు, మిరపకాయల రాసులు, వంకాయలు, టమేటాలు, పచ్చిమిరపకాయలు, రంగురంగుల హరివిల్లులా వుందక్కడ వాతావరణం.

"హుకుంపేట సంతలా వుంది" కావిళ్ళతో మోసుకువచ్చి అక్కడ అమ్ముకుంటున్న మనుషులను చూస్తూ అంది దివ్య.

"ఇన్ని ఎలా అమ్మగలరు డాడీ! రేపటికి మిగలవా?"

"లేదమ్మా బేబీ! అలా మిగిలే పనయితే వాళ్ళంత కష్టపడి పండించి మోసుకొస్తారా? వాళ్ళకిజీవితం అలవాటుకదా! అమ్ముడుపోతా యనుకుంచేనే ఈ వ్యాపారం చేస్తున్నారు."

పసివాళ్ళు, పెద్దవాళ్ళు అనే తేడా లేకుండా ఆడవాళ్ళంతా తెల్లటి ముతక చీరలు జాకెట్టుగాకూడా దాన్నే తిప్పి కట్టుకునివున్నారు. ముక్కుకు మొరబైన ముక్కెరలు, చెవ్వులకు పెద్ద వ్రేలాడే కమ్మలు పెట్టుకుని యాసగా మాట్లాడుతున్నారు.

కాస్సేపు ఆగుదామా? ఏమైనా కొనుక్కుంటావా బేబీ!

చిరుహాస అంగళ్ళవైపు ఇంటరెస్టింగ్ చూస్తుంటే అడిగాడు స్వరూప్.

కొనుక్కోవాలని లేదుగానీ డాడీ, అదిగో అక్కడ నిల్చుని వుందే ఆ పాపను ఆ పాప ముందున్న తెల్లటి సోయాబీన్ గింజల బుట్టను పెయింటింగ్ చేయాలనుంది.

"వాళ్ళేమైనా అంటారేమో!" తన భయాన్ని వ్యక్తం చేసింది దివ్య.

వాళ్ళేమనరులేమమ్మీ! నువ్వు డాడీ అలా తిరిగేసిరండి అంతలో నేను స్కెచ్ గీసుకుంటాను" కారులో వుండే పెయింటింగ్ సామగ్రి తీసుకుంటూ అంది.

"ఒద్దులే హాసా! నువ్వు వేసుకో మేము కారులో కూర్చుంటాము"

తల్లి మాటలకి పకపక నవ్వింది చిరుహాస.

"పాంచాలి, జాన్సీలక్ష్మీబాయి, రుద్రమదేవి, ఇందిరాగాంధీలు పుట్టిన ఈ దేశంలో నిలబడి నువ్విలా అనడం నాకు నచ్చలేదు మమ్మీ! కదూ డాడీ."

"ఇదంతా మనకు తెలియని స్థలంకదా బేబీ కిడెంచి మేలించమన్నారు పెద్దలు. నువ్వు స్కెచ్ గీసుకున్నాక అందరం కలిసి ఒక అరగంట అలా తిరిగేద్దాం" స్వరూప్ హాస మనస్సు నొప్పించకుండా స్కెచ్ గీసుకోమన్నాడేగాని అతని భయాలు అతన్ని ఎప్పుడూ వదలవన్నట్లు హాసకేమీ హాని జరగకుండా ప్రక్కనే కూర్చున్నాడు

ఇంతలో ఒకబ్బాయి వచ్చి చిరుహాసను చిరుహాస బిగిస్తున్న డ్రాయింగ్‌బోర్డు వైపు ఆసక్తిగా చూస్తూ. చిరుహాస కతిసమీపంలో నిల్చున్నాడు

"బేబీ! మనం ఆరకు వెళ్ళేసరికి ప్రొద్దుపోదు అక్కడ నీ కిష్టమున్నంత సేపు వేసుకుందాం. యిక్కడ వద్దులే అని తనే పెయింటింగ్స్ సామాగ్రి అంతా ఆ కారులో సర్దేసాడు.

తన భర్త భయం తెల్సిన దివ్య అబ్బురపడలేదుగానీ చిరుహాసలో మాత్రం నిరాశ అయినా క్రొత్త ప్రదేశానికి వెళ్ళే తొందరలో మర్చిపోయి ఆ ప్రకృతివైపు చూస్తూ తండ్రితో అంది.

"డాడీ! ఆకాశరాజు మీ అన్యోన్య దాంపత్యానికి మీ మీద పన్నీరు జల్లుతున్నాడు అబ్బ! పన్నీరు చెంబులంత పెద్ద వెండిచెంబో" ఆకాశంలోని వెండిమయ్యిలను చూపుతూ.

"మీ పెళ్ళప్పుడు నేనూ యింత పెద్ద బంగారు పన్నీటిచెంబుతో మీ యిద్దరిమీద పన్నీటి జల్లులు కురిపిస్తాలే"

"డాడీ....డాడీ....జల్లేసి తీసుకెళ్ళిపోతావా లేక ఆ బంగారు చెంబు నాకిచ్చేస్తావా?" తండ్రి ఒళ్ళో ఒదిగి పడుకుంటూ అంది చిరుహాస.

"నా ఆస్తంతా నువ్వేతల్లీ! కూతురిని గుండెలకు హొదువుకు తల మీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడు స్వరూప్.

మాటల్లోనే వర్షపు తుంపర పెద్దదయిపోయి జోరున కురవ సాగింది హడావుడిగా కారులో అన్ని సామానులు సర్దేసి కూర్చు న్నారు.

"అబ్బ మమ్మీ! భలేగా వుంది కదూ!" చలికి వణుకుతూ తల్లి నానుకుని కూర్చుని అంది చిరుహాస.

"కారు స్టార్ట్ అయ్యాక దివ్య టవల్‌తో చిరుహాస తల తుడి చింది అదే టవల్ లాక్కుని తండ్రి తల తుడిచింది చిరుహాస. ఆ పిల్లకు యిలా తల్లి దండ్రుల మధ్యలో కూర్చుని అందమైన ప్రకృతి చూస్తూ ప్రయాణం చేయడం చాలా త్రిల్లింగ్‌గా వుంది.

కారు అరకులో ఎంటరయింది.

గెస్ట్‌హౌస్ దగ్గర కారాపి శివప్రసాద్ కోసం వాకబుచేసారు. అతను అవసరమైన పనిమీద వెళ్ళాల్సి వచ్చి గోపీనాధ్ అనే అతనికి తన ఫ్రెండ్ వస్తే అన్ని సౌకర్యాలు సమకూర్చమని చెప్పి తను వుండ లేకపోతున్నందుకు స్వరూప్‌కి లెటర్ వ్రాసిచ్చి వెళ్ళాడు.

రెండు పోర్షన్లగా విభజించిన ఆ చిన్న గెస్ట్‌హౌస్ ముందు రక-రకాల బంతులు, అరచేతి వెడల్పున్న రంగు రంగుల రోజా పూలు దోసెడు సూర్యకాంతి పూలు, చిన్ని చేమంతులు అతిధులను ఆహ్వానిస్తు న్నట్లు చెట్ల కొమ్మల మధ్యలో వూగుతున్నాయి.

కారు దిగగానే లోపలికెళ్ళిపోతున్న తల్లిదండ్రులననుసరించ కుండా ఆ తోటంతా కలియతిరిగేసింది చిరుహాస

'అలాగే నిల్చో బబి! ఒక స్నాప్ తీస్తాను."

"ఉహుఁ ఇక్కడ ఈ గార్డెన్‌లో తీయడం గొప్పకాదు డాడీ.... మనింట్లో యిలాటి గార్డెన్ మీరు పెంచి అందులో నన్ను వుంచి షాట్ తీయాలి.

"ఆంధ్రాలో ఇలాటి అందమైన పూలతోట పెంచాలంటే సూర్యా రావు పర్మిషన్ యివ్వడులే బేబీ! నువ్వు ఆ పసుపు రోజ్ ఫ్లవర్ కోస్తు న్నట్టు నిల్చో" కూతుర్ని తొందర చేశాడు స్వరూప్.

"ఓ కె డాడీ! నీ సంతోషాన్ని నేనెందుకు కాదనాలి" అంటూ మంచి పోజ్ యిచ్చేసింది.

ఆ కెమరా యిలా యిచ్చేసి మీరిలా రండి డాడీ ఒక స్నాప్ తీస్తాను "

"మీ మమ్మీని కూడా రానీకే బేబీ యిద్దరం కల్సి తీసుకుంటాం

"మమ్మీ! నీది గార్డెన్ షిఫాన్ ఎల్లోకలర్ సారీ కట్టుకుని, బ్లాక్ సెట్ పెట్టుకుని రా మమ్మీ ఎల్లో రోజ్ దగ్గర ఫోటో తీస్తాను.... అప్పుడే అక్కడకొచ్చిన దివ్యతో అంది చిరుహాస

"అలాగేకానీ మీ డాడీని కూడా ఎల్లో కలర్ షర్ట్ ఎల్లో ప్యాంటు వేసుకొని రమ్మను."

"తెలుగుదేశాన్ని కించబర్చకోయ్ శ్రీమతీ!"

"నేనెక్కడ కించబర్చాను సపోర్ట్ చేస్తూ మిమ్మల్ని అడ్రస్ వేసుకుని రమ్మంటుంటే.

"మా డాడీ వైట్ప్యాంట్, వైట్ షర్ట్ వేసుకున్నారు యిదిగో యిక్కడున్న తెల్లటిక్ ళిక్ బంతుల చెట్లల్లో కూర్చొబెట్టి ఓ ఫోటో తీస్తాలే మమ్మీ."

"మ్యాచింగ్ బాగానే వుంది కానీ హేర్ నల్లగ వుండిపోయింది ఎలా?" హాస్యమాడింది దివ్య. ఆమె కిప్పుడిప్పుడే యిలాంటి వాతావరణంలో ఉత్తేజం వస్తోంది.

"అబ్జెక్షన్ ప్లీజ్."

"ఏం డాడీ?"

"మీ మమ్మీ ఏమో వచ్చిన తెల్ల వెంట్రుకలకు డై వేనేస్తూ సైడ్లో రోజ్ కలర్ రోజా పువ్వలంకరించి బాలా కుమారిలా ఫోటో తీయించుకోవడం నేనేమో ఒక్క వెంట్రుకయినా తెల్లబడని జుత్తుకు వైట్ కలర్ వేయించుకోవడమా ఉల్లాసం అతని ముఖంలో స్పష్టమౌతోంది.

ఓ కె డాడీ నేను మీ యిద్దరికీ రాజీ చేస్తాను. మమ్మీ కూడా వైట్ డ్రస్ వేసుకుని, ముత్యాల సెట్ పెట్టుకుని వైట్ రోజ్ పెట్టుకుని మీ ప్రక్కన నిల్చుంటుంది. యిద్దరి తలలూ నల్లగానే వుంటాయి సరేనా?

"మీ అమ్మ ప్రతి విషయానికీ భయపడుతుందిగదా! మరి ముత్యాలసెట్, పగడాలసెట్ ఇంకా బేబీ ఎన్ని రంగుల సెట్లు తెచ్చిందీ! యిప్పుడు మన మాటలు విని ఎవరయినా దొంగవచ్చి మన ముగ్గుర్నీ తన్నేసి యీ అరకులో పడేసి ఆ నగలన్నీ తీసుకెళితే ఏం చేస్తుంది."

"అబ్బా! ఏం మాటలండీ వాడు తన్నేవరకు నేను చూస్తూ వుంటానా అన్నీ వలిచి వాడి దోసిట్లో పోసేయనూ! మీకంటే ఆ నగలు ఎక్కువా ఏంటి నాకు" ఉడుక్కుంటున్నట్లుంది దివ్య.

"మమ్మీ! సీరియస్ అయిపోకు. నీ వాడి చూపులకు భస్మమయి పోతాం నేను డాడీ."

"తప్పు దిద్దుకో బేబీ! మీ అమ్మ ప్రేమ చూపులకు మనం ఆయుష్షు పెంచుకుంటాం గానీ భస్మం మాత్రం కాము."

"సర్లే....పదండి రెడీ అయి అలా తిరిగొద్దాం" తొందర చేసింది దివ్య.



* * * *

"ఇది మిర్యాల చెట్టంట మమ్మీ" ఓ చెట్టుకు అల్లుకున్న ఆకులు చూపిస్తూ అంది చిరుహాస.

"అరెఁ తమాషాగా వుంది" ఆ చెట్టువైపే చూస్తూ అంది దివ్య.

"మిర్యాలు పండే సీజన్ అయితే యింకా తమాషా వుండేది కదూ మమ్మీ" అంటూ తల్లిని ఆ చెట్టు మొదట్లో నిల్చోబెట్టి ఫోటో తీసింది చిరుహాస.

"డాడీ! డాడీ! ఈ మామిడిచెట్టు చూద్దురు రండి ఎన్ని అంట్లు తొడిగారో"

ఆ పెద్దమామిడి చెట్టుకొమ్మలను చెక్కి యింకో కొమ్మను పెట్టి తాడుతో కట్టేసి దాన్ని మట్టితో కప్పి ప్లాస్టిక్ కాగితం దానిచుట్టూ కప్పేసుంది అలా....ఆ చెట్టునిండా అంట్లు తొక్కున్నాయి.

ఇలా అంట్లు కట్టబట్టే త్వరగా చెట్టు పెద్దదవుతుంది. ఎక్కువ ఉత్పత్తి అవుతుంది.

"ఏమండీ! యివి సుగంధద్రవ్యాల చెట్లట" ఆ చెట్టుకు మొదట్లో కట్టిన నేమ్‌బోర్డు వైపు చూస్తూ అంది దివ్య.

"ఇంత పెద్ద చెట్లనుకోలేదు నేను" ఆశ్చర్యపోయింది చిరుహాస. తను తినే చిన్న లవంగాలు యింత పెద్దచెట్టు కుంటాయంటే—

"అందుకే ఈ అరకులో ఈ పద్మాగార్డెన్స్ చాలా ఫేమస్. ఈ చెట్లు రేర్‌గా వుంటాయి కదా!" ప్రక్కనే ఆడుకుంటున్న పిల్లలవైపు చూస్తూ అన్నాడు స్వరూప్

ఆ పిల్లలంతా ఆట మానేసి చిరుహాస కట్టుకున్న బ్లాక్ జాకెట్‌ను మార్చి మార్చి చూస్తూ నిలబడిపోయారు.

"చిరుహాస వెనక్కి తిరగగానే పిల్లలంతా చిరుహాస చీరను తాకి పారిపోతూ చీర భలే బాగుంది. చీరకట్టుకున్నామె ఇంకా బాగుంది" అంటూ కోరస్‌లా పాడుకుంటూ పరిగెట్టారు.

ఒక్కక్షణం చిరుహాస గుండెల్లో గర్వం తారట్లాడింది. మనసు నిండా సంతృప్తి.

ఆ పిల్లలు కనుమరుగయ్యే వరకు అలాగే నవ్వుతుంటూ నిల్చింది చిరుహాస.

★ ★ ★ ★

అరకు అందాల్ని స్వరూప్ కెమెరాలో భద్రపరిస్తే చిరుహాస మనసులో భద్ర పర్చుకుంది.

కారు అనంతగిరి వైపు పరుగులు తీస్తోంది. అరకు కంటే అది హైట్ ప్లేస్. చిన్న చిన్న జలపాతాల్లా కొండలపైనుండి తెల్లటి

నురుగుతో పారి క్రింద కాలవల్లో పరిగెడుతున్నాయి. అక్కడక్కడ కొండలు అడ్డుగా నిల్చి దారి సరిగ్గా కన్పించకుంటే 'జాగ్రత్తండి' అనంటోంది దివ్య.

"కారక్కడ ఆపండి డాడీ! లోయ చాలా బాగుంది. మమ్మీ! తమాషాగా లేదూ! ఆ మబ్బులన్నీ ఆ లోయను నింపేస్తే పాలతో నిండిన పాత్రలా లేదూ!"

ఇరవై సంవత్సరాల క్రితం కాశ్మీర్‌లోయల్లో మేఘాలను చూసి నప్పుడున్న థ్రిల్లింగ్ ఆమెలో లేదిప్పుడు. ఆమె మనస్సంతా కూతురి వయస్సు చుట్టూ వుంది. ఆమెకు ఇంక చిరుహాసను చదివించాలనిలేదు. మంచి వ్యక్తి చేతుల్లో పెట్టాలనుంది. ఆమె మనస్సునిండా తన కూతురి భవిష్యత్తే, ఆ భవిష్యత్తు బంగారు బాటలా వుండాలని కోరికే.

చిరుహాస మనస్సలా లేదు పరవళ్ళు తొక్కుతోంది, తృళ్ళు తోంది. ప్రతి స్టెప్‌లో ఆ ప్రకృతి అందాలు ఆమెను ముగ్ధురాల్ని చేస్తు న్నాయి. తల్లిచెయ్యి, తండ్రి చెయ్యి పట్టుకుని ఊపేస్తూ తన మనసు లోని ఆనందాన్ని వ్యక్తం చేస్తోంది.

★ ★ ★ ★

అనంతగిరి గెస్ట్‌హౌస్ ముందు కారాగింది. కారులో సామాను లోపలుంచి బెడ్‌మీద వాలింది దివ్య.

ఇంతలో సుడిగాలిలా పరిగెత్తుకుంటూ వచ్చింది చిరుహాస.

"మమ్మీ అదిగో ఆ బంకుల్లో చింతపండు కె.జి. రెండురూపాయ లట రా మమ్మీ చూద్దాం. జనవరిలో అయితే రూపాయికే వస్తుందట."

"చీకటి పడబోతోంది హాసా! యిప్పుడెందుకులే ప్రొద్దున్నే వెళ దాంగా

"డాడీ! మీరయినా రండి మమ్మీ ముఖం కడుక్కునే లోపల వచ్చేద్దాం"

"ఈ చలిలో ముఖం కడుక్కోవడం కూడానా?" షాల్ వంటి నిండా కప్పుకుంటూ అంది దివ్య.

"పోనీ ఆ రగ్గు కప్పుకుని వెచ్చగా పడుకోమమ్మీ. మేము అర గంటలో వచ్చేస్తాం."

కూతురి ఉత్సాహానికి ఆనకట్ట వేయడం ఇష్టంలేక భార్యతో కబుర్లు చెప్పుకుంటూ ఉండాలనే కోరికకు ఫుల్‌స్టాప్ పెట్టి లేచి నిల్చున్నాడు స్వరూప్.

దివ్య ఆలోచిస్తోంది.

చిరుహాస లాగ తనెందుకుండలేదు– మనస్సులో కోరిక వెంటనే బయటపెట్టేస్తుంది చిరుహాస. అదే తనయితే మనస్సులో చింతపండు అంగళ్ళకు వెళ్ళాలని వున్నా ఎదుటి వ్యక్తి అడ్డుచెపితే యిక ముందు కడుగేయలేదు.

చిరుహాస లాగ తన మనసులోని ఖావాల్ని, కోరికల్ని బయటకు వ్యక్తం చేయడమే మంచిది. ఎప్పటికప్పుడు తన కూతురి మనస్తత్వానికి తన మనసులోనే మెచ్చుకుంటుంది దివ్య.

"మమ్మీ! అనంతగిరి జ్ఞాపకార్థం మేమిద్దరం నీకిస్తున్న ప్రజెంటేషన్ ఇది" మోయలేక మోస్తూ తెచ్చింది పదికేజీల చింతపండు బుట్టను చిరుహాస.

"చింతపండు మనకక్కడ దొరుకుతుందిగా ఇక్కడ నుండి మోసుకెళ్ళాలా?"

"చిన్నపిల్ల సరదా పడింది కొనిచ్చాను. గింజలేని పండు కె.జి. మూడురూపాయల కిచ్చారు."

"ఇక్కడనుండి చింతపండు తీసుకెళ్ళి మన ఊళ్లో అమ్ముకున్నా పదేళ్ళలో లక్షాధికార్లమయిపోతామే" ఆ బుట్టను ఓ ప్రక్కగా పెడుతూ అంది దివ్య.

"ఏం మమ్మీ! నువ్వు ప్రాక్టీస్‌లో సంపాదించిన దానికంటే ఈ బిజినెస్‌లో ఎక్కువ సంపాదించలేవని ఘంటా పదంగా చెపుతున్నాను. సో. మరలా ప్రాక్టీస్ మొదలెట్టేయ్ అర్జంటుగా. నేనూ నీ లైన్‌లోకొచ్చి

నీకు సహాయంగా వుంటాను మమ్మీ! ఇక్కడో గమనిక నా డబ్బులు నావే."

స్వరూప్ గిల్టీగా ముఖం పెట్టాడు.

"చూడు డాడీ! మమ్మీ సరదాకు కూడా సరేననడం లేదు. నేను మాత్రం ఎమ్.డి.ఎస్ చేసి ప్రాక్టీసు పెట్టేసి బోలెడు సంపాదించేస్తాను"

"నీకెందుకు హాసా అంత రిస్క్. మీ ఆయన సంపాదించే డబ్బు మేము సంపాదించిన ఆస్థి వుండగా" దివ్య భర్త ఫీలింగ్స్ గమనిస్తూ అంది.

"రేపు మా ఆయన నన్ను అర్థంచేసుకోలేక వెళ్ళిపొమ్మన్నా డనుకో అప్పుడు డబ్బుండి సుఖపడలేనుగా ప్రాక్టీస్ వుంటే బోలెడు కాలక్షేపం."

చ. అవేం మాటలే అలాంటి చంచల మనస్తత్వంగల వాళ్ళని మేమెందుకు నీకు చేస్తాం.

ఆ టాపిక్ నచ్చనట్లు లేచి నిలబడ్డాడు స్వరూప్.

"ఎక్కడకు డాడీ నేనూ వస్తాను"

"ఇక్కడ మనం ఆర్డర్ చేస్తేనే భోజనం"

"అలా అయితే తండూరి చికెన్ ఆర్డరివ్వండి డాడీ"

"ఇదే మన్నా ఫైవ్ స్టార్ హోటలనుకున్నావా ఇక్కడ ఒక కుక్ వుంటాడంతే."

"చికెన్ కర్రీ చేయమంటాలే" స్వరూప్ కదిలాడు.

"ఇలాటి చోట నాన్‌వెజిటేరియన్ తింటే డయేరియా పట్టు కుంటుంది. వెజిటేరియన్ ఆర్డరివ్వండి. వెళ్ళేప్పుడు విజయవాడలోనో వైజాగ్‌లోనో స్టే చేస్తాకదా ఫైవ్‌స్టార్ హోటల్‌లో హాసకేం కావాలంటే అది ఆర్డరివ్వొచ్చు."

"పొయింటేవీ జేబీ ఆ కోడిని టైమ్ లేదంటూ ఉడకనివ్వరు. కారం ఎక్కువ వేస్తారు. మనం ఎక్కువ తినకూడదని. రుబ్బుడు పత్రంలో మట్టి కడక్కుండా మసాలా రుబ్బేస్తారు. ఆకాశాన్నంటేఆయిల్ ధరలకు భయపడిపోయి తిరగమూత మానేస్తారు. దరిమినా మీ మమ్మీ చెప్పినట్లు మన కడుపులో త్రిప్పుడు మొదలవుతుంది. ఇంకో రెండు గంటల్లో మోషన్స్కూడా ప్రారంభమవుతాయి. నీ కిష్టమయితే నో అబ్జక్షన్ చికెన్ ఆర్డరిస్తాను."

"వద్దొద్దు....మనం వచ్చింది ప్రకృతి అందాలను చూడడానికి గానీ ప్రతి పది నిముషాలకు బాత్రూమ్ చూడడానికి కాదు. వెజిటేరియన్ మీల్స్ ఆర్డర్ చేసేయండి."

ప్రొద్దున్నే మంచు విడవక ముందే లేచింది చిరుహాస.

ఆ విశాలమయిన పెంకుల గెస్ట్హౌస్కు సీలింగ్ వేసినా చిరుహాస పెట్టుకున్న వాచ్ గ్లాసులోకి మంచుపోయి టైమ్ సరిగ్గా కన్పించలేదు.

ఆ చలిలో మెయిన్ గ్లాస్డోర్ తీయగానే రివ్వున మంచు చిరుహాసను చుట్టేసి ఆమె వినుగ్గా ప్రయాణం చేసి ఆ రూమ్ నిండా మేఘాల మంచు నిండిపోయింది.

"అయ్యో హాసా! జలుబు చేయదూ? ముందా తలుపు వేసెయ్యి" నిద్రమత్తు వదలకుండా అంది దివ్య.

"మమ్మీ! ఓన్లీ టెన్ మినిట్స్ బయటకెళ్ళి చూసొస్తాను ప్లీజ్!"

"నీ ఒంటి కసలే చలిగాలి పడదు పడుకో—మరలా వెళుదువు."

"వెళ్ళి చూడనీ దివ్యా మరీ అంత సుకుమారంగా కూడా పెంచకూడదు."

"కరెక్ట్ డాడీ!" అంటూ విశాలమయిన వరండాలోకి అడుగు పెట్టిందే కానీ ఆ చలికి చిరుహాస ఒంటి మీదున్న నైటీ తట్టుకోలేక పోయింది.

"ప్లీజ్....మమ్మీ నా షాల్ యిలా పడేయవా?"

దివ్య నిద్ర మత్తు వదిలించుకుని ఓపిగ్గా లేచి కూతురికి స్కార్ఫ్ చెవ్వుల మీదుగా తెచ్చి మెడ క్రిందకు కట్టి షాల్ భుజం చుట్టూ కప్పి తనూ ఓ రగ్గు కప్పుకుని ఆ వరండాలో గువ్వ పిట్టలా కూతురు అటు యిటు తిరగడానికి వెళుతుంటే చూస్తూ కూర్చుంది.

ఆ చలికి తట్టుకోలేక వెళ్ళిన అయిదు నిముషాలకే తిరిగొచ్చేసింది చిరుహాస.

ఏడు గంటలకు బ్రొర్రా కేవ్స్‌కి కదిలారు.

ఆ కొండ దిగి మెలికలు తిరుగుతూ కారు వెళుతుంటే మేఘాలు అలలు అలలుగా విడిపోతూ కొన్ని కల్సుకుంటూ కొన్ని మంచుతెరలు విడీవిడని కొండలు అందాలు అద్భుతంగా వున్నాయి.

కారు అద్దాలన్నీ మంచుతో నిలడిపోయి తెల్లటి పొగ జారినట్లైపోయాయి.

అద్దాలు దించితే చలి రివ్వున ముఖాన్ని తాకుతోంది.

"డాడీ! అన్నిటి కంటే ఈ జర్నీ చాలా థ్రిల్లింగ్‌గా వుంది కదూ!"

చిరుహాసను ఎవ్వరితో ఎక్కడకూ పంపడానికి యిష్టపడేది కాదు.

దివ్య అలా అని ఆ పిల్లను తను స్వరూప్ కల్సి ఏ అందమైన ప్రదేశాలకు తీసుకెళ్ళి తిప్పడానికి టైమ్ దొరికేది కాదు.

అందుకే చిరుహాస ప్రతి సీనరీ చూసి ఆనందిస్తోంది. బ్రొర్రా కేవ్స్ సమీపించే కొద్దీ రోడ్డు రాళ్ళతో నిండిపోయింది. కారు మెల్లిగాపోనిచ్చి ఒక దగ్గర ఆపాడు స్వరూప్.

కారు ఆగగానే అరడజను మంది 16 సంవత్సరాల వయస్సు నుండి ఇరవై ఐదు సంవత్సరాల వయస్సున్న మగ పిల్లలు కారుని చుట్టేసారు.

"పది హేను రూపాయలిప్పించండి సర్ మీకు బొర్రా గుహంతా చూపిస్తాను కాగడా వెలిగించి" అన్నారు.

"పిళ్ళంతా ఐదు రూపాయలకే అందరికీ చూపిస్తారు! సార్ మీరు ఇదే యివ్వండి"

"ఇలా! సీతిగా ఐదురూపాయలు ఆ సార్ దగ్గర తీసుకుంటేనే. ఆ తినేదేమిటో మనకు ఒంటికి పడదు." అతని మాటలు యాసగా వున్నాయి అలా అనేసి ఆ కుర్రాడు ఎదురుగా వున్న ఒక యింట్లోకి దూరాడు.

అతని వయస్సు ఇరవై ఐదు లోపే వుంటుంది.

ఆ మారుమూల పల్లెలు అతని అందమైన వ్యక్తి. అతని కున్న బంగారు ఛాయ రంగు ఎదుటి వ్యక్తిని అతని చూడకూడదనుకున్నా చూసేలావుంది.

చిరుహాస చాలా ఆశ్చర్యంగా అతను వెళ్ళిన వైపు చూస్తోంది. ఒంటి మీద బన్నీను లుంగీ మాత్రమే వున్న అతనిలో అంత అందం ఎలా దాగుందో అర్థకాలేదు.

అతను దూరిన ఇల్లు పనికిరాని పంచలా వుందే కానీ కాపురం వుంటున్న యిల్లులా లేదు.

సీసాలో కిరోసిన్ తీసుకుని కాగడా కర్ర చేతిలో పట్టుకుని ఐదు రూపాయలకే బొర్రాకేవ్స్ చూపిస్తానంటూ వచ్చిన ఒకబ్బాయికి కారులో ఎక్కించుకున్నాడు స్వరూప్.

ఒక ఫర్లాంగ్ దూరం కారు కదిలాక యిక అక్కడ నుండి కారు వెళ్ళే దారి లేక ఆగిపోయింది.

అర ఫర్లాంగ్ అక్కడ నుండి ఎత్తుకి ఆ రాళ్ళల్లో ఎక్కారు.

"నోరు ఎండిపోయింది మంచినీళ్ళు కావాలి" చిరుహాస అంది.

"ఈడ నీళ్ళు తియ్యగా వుంటాయి. తెస్తాను ఈడే నిలుచోండి" డబ్బా ఒకటి రోడ్డు ప్రక్కగా వుంటే అందుకుంటూ అన్నాడు.

కాగడా బ్బాయి అతనే గైడు.

"వద్దొద్దు ఆ డబ్బాలో తెస్తే యిన్ఫెక్షన్ రాదూ!" దివ్య వారించింది.

గైడు ఆశ్చర్యంగా ముఖం పెట్టి అన్నాడు.

"మేమంతా ఈ నీళ్ళేగా తాగేది ఎందుకొద్దు అంటుంది .. ర సాని"

అతనికి ఇన్ఫెక్షన్‌కు అర్థం బోధపడలేదు.

"ఎంత ఒక్క నిముషం మీరిలా కూర్చోండి కారులో నుండి వాటర్ బ్యాగ్ తెచ్చేస్తా."

"వద్దంటే డాడీ ఈ రాళ్ళల్లో వెళ్ళలేరు" చిరుహాస మాటలుగాలిలో కలిసిపోయాయి.

స్వరూప్ పరిగెడుతున్నట్టుగా కారు దగ్గరకు వెళ్ళిపోయారు.

చిరుహాసకు తల్లి దండ్రుల ప్రేమ అలవాటయిందే అయినా ఎప్పటి కప్పుడు మనస్సు చిత్రంగా ఆర్ద్రమవుతుంది.

తండ్రి తెచ్చిన మంచినీళ్ళు తాగి మరలా కొద్ది దూరం నడిచే సరికి కేవ్స్ మెట్లు కన్పించాయి.

గుహలోకి అడుగు పెట్టిన చిరుహాస ఆ చీకటిలో మలచినమెట్లను వింతగా చూస్తోంది.

"అదేమంత సిత్రం కాదు సిన్నమ్మా యిదిగో యీ శివలింగం మీద ప్రతి పదినిముషాలకు ఒక నీటి బొట్టు లెక్కన పడుతుంది. అలా నీటి బొట్లు పడి పడి యీ శివలింగం పెద్దదవుతూంది.

"నిజమా?" ఆశ్చర్యంగా అడిగింది దివ్య.

"నిజమే దొరసాని! ఆ స్థంబం కూడా అలా పెరిగిందే మా కెరికయ్యేనాటికి అంత పెద్దదిగా లేదు" నీటి బొట్లు పడుతున్న వేరే స్థలములో వున్న ఒక స్థంబాన్ని చూపిస్తూ చెప్పాడు.

పోయింది దివ్య. చిరుహాస ఉత్సాహాన్ని కాదనలేక భార్యచేతిని తన చేతి లోకి మెల్లిగా నడిపించసాగాడు స్వరూప్.

"పడతావేమో హాసా! అంత ధైర్యం పనికికాదు" ఆ బురదలో కూడ త్వరత్వరగా నడిచి ముందు కెళుతున్న కూతుర్ని హెచ్చరించింది

"ఈ సొరంగం ఎంత దూరముంటుంది" గైడ్ నడిగాడు స్వరూప్.

"అంతు ఎరికలేదు సామీ పోతూనే వుంటుంది"

"ఒకే దారుంటుందా?"

"అలాగనేమీ వుండదు. ఈ సొరంగంలో ఒకోక్కమారు మేమే బయటకు దారి తెలిసిరాక ఇక్కడిక్కడే తిరుగుతూ ఎప్పటికో బయ టకు రాగలుగుతాము."

ఆ మాట వినీ వినకముందే దివ్య కేకేసింది.

"హాసా! ముందు కెళ్ళకు వెనక్కు వచ్చెయ్యి తప్పిపోగలవు" ఆమె కంఠంలో భయం చోటుచేసుకుంది.

చిరుహాస పక పక నవ్విన నవ్వుతో ఆ గుహ ప్రతిధ్వనించింది

"హో మమ్మీ! నువ్వు అంత చదివి ఇంత పిరిగ్గా ఎలా వుంటారో నా కర్థం కాదు.

"ఇక్కడ నేను తప్పిపోవడమేమిటి మమ్మీ! అంత అధైర్యమైతే ఎలా?" అరచింది చిరుహాస తల్లిదండ్రులకు ఇరవై అడుగుల ముందులో వుండి.

"భయపడాల్సిన టైములో ధైర్యంకూడా హానికరమే బేబీ! గైడ్ న్నాడు. ఈ సొరంగంలో ఒకోక్కమారు పిళ్ళే దారి తెలియక తడబడ తారంట. వచ్చెయ్యి"

అసంతృప్తిగా వెనక్కు తిరిగి తల్లిదండ్రుల కంటే ముందుగా ఆ చీకటిలోనుండి వెలుగులోకి వచ్చేసరికి అలసటగా అనిపించి ఒక రాయిమీద కూర్చుంది.

ఆ రాయిక్రింద నీళ్ళు సుడులు తిరుగుతూ పెద్ద కాలువలోకి పారుతున్నాయి.

ఆ కాలువ పక్కగా బాగ క్రిందిగా ఒక చెట్టు నరుకుతున్న అందమయిన కుర్రాడ్ని చూడగానే చిరుహాసలో అలసట అసంతృప్తి స్థానంలో ఉత్సాహం ఉరకలు వేసింది.

కొంత రిస్కు అయినా చెప్పులుతీసి చేతితోపట్టుకుని ఆ రాళ్ళలో జారకుండా నెమ్మదిగా అడుగువేస్తూ క్రిందకు దిగింది.

ఆ అబ్బాయిని స్కెచ్ గియ్యాలనే కోరిక ఆ అమ్మాయిని అంత శ్రమపడయినా ఆ స్థలాన్ని చేరుకునేలా చేసింది.

"నీ పేరేంటి?"

కట్టెలు కొడుతున్న ఆ అబ్బాయి ఉలిక్కిపడ్డాడు.

"నా పేరా?" అల్చిప్పల్లాంటి కళ్ళు ఎత్తి అడిగాడు.

"అవును"

ఆ పురాణకాలంలో చెప్పుకునే మన్మధుడు ఇంత అందంగా వుండేవాడు కాబోలు అని మన్మధ రూపాన్ని ఇతనిలో చూసుకుంది చిరుహాస.

ఆ అమ్మాయికి ఇంత అందమయిన అబ్బాయి పేరు అచ్చిరి కావడం అతనిలా కట్టెలు కొట్టుకోవడం ఏమీ నచ్చలేదు.

"నువ్వు చదువుకోలేదా?" అతన్ని మాట్లాడించే ప్రయత్నంలో అంది.

"కొద్దిగా వచ్చు."

"అంటే"

"నా పేరు, మా అమ్మా అయ్యల పేర్లు రాయడం వరకు వచ్చు."

"ఏం బడికెళ్ళి చదువుకోకూడదా?"

"ఆ బడిలో మాస్టారు మాకు సదువు సెప్పడు."

"వేరే బడికెళ్ళి చదువుకోవచ్చుగా?"

నవ్వాడు.

"ఏరే బడి ఏడుంటాది?" అతను కట్టెలు కొడుతూనే మాట్లాడుతున్నాడు.

"ఈ చుట్టుపక్కల లేదా?"

"ఉన్నదొక్కటే సిన్నమ్మా."

"విశాఖపట్టణం వెళ్ళి చదువుకోవచ్చు కదా?"

"మా పొట్టలు నిండడానికే మాకు పైసలుండవు. అయినా యీ పుట్టిగెడ్డ వదిలి మేమెక్కడికెళతాం."

"చదువుకుంటే బోలెడు సంపాయించుకోవచ్చు. అప్పుడీ కట్టెలు కొట్టే కష్టం తప్పుతుంది కదా!"

అతను జవాబుగా నవ్వేసి—

కట్టెలన్నీ పేర్చుకోవడానికి పెద్ద చెట్లతీగను లాగి మెలికచుట్టి ఎంటిలా తయారుచేసి కట్టెలన్నీ మోపుగా కట్టేశాడు.

చిరుహాస కళ్ళు ఆ ప్రకృతిని చూడ్డంలేదు.

చెవులు పైనుండి బేబీ అని అరుస్తున్న తల్లిదండ్రుల పిలుపును వినడంలేదు.

కాళ్ళు ఒక్కడుగయినా వెనక్కు వేయడంలేదు.

ఆమె దృష్టంతా అందంగా శిల్పి చెక్కిన శిలాప్రతిమను చూసి నట్లు అజిరిని చూస్తోంది.

ఆమెకు వెంటనే అతని అందాన్ని తన కళానైపుణ్యంతో కాన్వాస్‌మీద తెక్కించాలనుంది. అది ఎంత సఫల మవుతుందో తెలి యదుగానీ ఆ ఆలోచన రాగానే అజిరిని అడిగేసింది.

"నీ బొమ్మ కాగితంమీద వేస్తాను నిల్చుంటావా?"

"నా బొమ్మ వేయడమెందుకు?" అతని మాటలు యాసగావున్నా మాట స్పష్టంగా వుంది.

చిరుహాస అతనడిగిన ప్రశ్నను గురించి ఆలోచిస్తోంది.

అంటే బొమ్మవేయడం అనే కళ అతని దృష్టిలో వ్యర్థమన్న ట్లుగా వుంది. ఎంత చిత్రం-ఆ చిత్రకళకోసమే తను ఇతన్ని చూడ గానే ముగ్ధురాలై పరిగెట్టింది అతనికిది అనవసరపు కాపయాపనలా అనిపిస్తుంది. కాస్త నిరుత్సాహపడి మరలా సర్దుకుంటూ అంది.

"నీ బొమ్మ కాగితంమీద చూసుకోవచ్చు."

"నా బొమ్మ రోజూ ఈ నీళ్ళ నీడలో చూసుకుంటాను."

అదేమీ ఆసక్తికరమైన విషయం కానట్టు మోపు నెత్తి నెత్తు కున్నాడు.

"డబ్బులిస్తాను. నీ బొమ్మ గీసుకోనిస్తావా?"

"డబ్బులు తీసుకుంటే ఏదయినా పని చేసిపెట్టాలిగానీ వూరికే తీసుకోవచ్చా?"

అతని నిజాయితీకి రెండవసారి ముచ్చటపడింది ఆమె.

"ఇదీ పనే. నా దగ్గర రెండు గంటలసేపు నిల్చోవాలి. నేనిచ్చే డబ్బులకు ఏమైనా కొనుక్కోవచ్చు."

"ఏముంటాయి డబ్బులిచ్చి మేము కొనుక్కునేవి-ఉప్పు కిరసనాయలేగా?"

"కొరవలి" ఆశ్చర్యపోతూ అడిగింది.

"మేము పండించుకునేవి ఏరేవాళ్ళకిచ్చి ఆళ్ళవి మేమట్టుకొచ్చుకుంటాం."

"మరి బట్టలు"

"ఇక్కడకు ఏడాదికొక్కసారి బట్టలుతెచ్చి అమ్ముతారు. కూలి చేసి సంపాయించిన డబ్బులతో కొంటాము"

"కూలి ఎవరిస్తారు మీకు?"

"సర్కారోళ్ళు అప్పుడప్పుడు వస్తారు. వాళ్ళ పనులు చేయించుకుంటారు"

"ఎంతిస్తారు? ఇంతమందికి ఎలా చాల్తాయి?"

"చాలకేం చేస్తాయి. ఏడాదికొకసారి అందరం తలా రెండు బన్నీన్లు, రెండు అడ్డపంచలు కొనుక్కుంటాం"

"మీరెక్కడికయినా వెళ్ళాలంటే చొక్కా కావద్దా"

"మేమెక్కడికీ వెళ్ళం మాకేంపని"

చిరుహాసకు కలలో వున్నట్లుంది. లేకుంటే ఈ యుగంలో ఇలాటి ప్లేస్ కూడా వుందా?

ఇంత అనాగరికంగా బతుకుతున్నారా? ఇది సంభవమేనా?

చిరుహాస ఆలోచిస్తూ వుంది. అతను వెళ్ళిపోయాడు. స్వరూప్,

దివ్య మెల్లిగా ఆ కొండరాళ్ళను తప్పించుకుంటూ దిగి కూతురు దగ్గిర కొచ్చారు.

"అలా చెప్పకుండా వస్తే ఎలా? ఎంత భయపడిపోయాము" గొంతు నొప్పిపుట్టేలా పైనుంచి అరిచాము విన్పించేలా.

చిరుహాస తల్లికేమీ జవాబు చెప్పలేదు. ఆమె మనస్సునిండా అజిరి. ఆమెకు అతన్ని చూసినప్పటినుండి తన ఆర్ట్ నైపుణ్యమంతా కాన్వాస్‌మీద చూపించి అతని ఫిగర్ వేయాలనుకుంది.

"డాడీ! డాడీ! వెళ్ళిపోతున్నాడే అతని స్కెచ్ గీసుకోవాల నుంది."

"మనకు కారు దగ్గర కన్పించినగైడు ఐదురూపాయలే యివ్వ మన్న పిల్లాడుకదూ!" అజిరిని చూసిన స్వరూప్ అడిగాడు.

అతని బొమ్మ గీసుకోవడమేమిటి? అందుకోసం ఇక్కడకు రావాలా? నెల్లూరులో ఏ మనిషినో మోడల్‌కి రమ్మంటే రాకపోయారా" ఆ కొండ రాళ్ళలో దిగిన అలుపు ఆమెకింకా వదలలేదు.

"మమ్మీ! ఈ అనాగరిక ప్రదేశంలో అతని రూపం చూస్తుంటే నా కెందుకో అతని ఫిగర్ పెయింట్ చెయ్యాలనిపిస్తుంది."

"దానికతను ఒప్పుకోవాలిగా"

స్వరూప్‌కి అతను త్వరగా వెళ్ళిపోతే బాగుణ్ణని పించింది.

"ప్లీజ్ డాడీ! మీ రడగండి"

"ఆతనెవరో, ఏమిటో వద్దులే బేబీ బాగుండదు" స్వరూప్ ముందుకు ఒక్క అడుగుకూడా వేయకుండా అన్నాడు.

"ఆ వేసుకునే బొమ్మేదో మీ డాడీది వెయ్యి. ఆ అబ్బాయికంటే మీ డాడీ ఎక్కువసేపు నిలబడగలరు"

"బేబీ! నాకు ఎప్పటినుండో నువ్వు నా ఫికర్ వేస్తుంటే చూడా లని వుంది. ఏదీ ఆ కోరిక నా బిజినెస్ గొడవల్లో తీరనేలేదు. నేని ప్పుడు తీరిగ్గా వున్నాకదా! నా స్కెచ్ గీసుకో" కూతుర్ని నొప్పించ కుండా తన భావాలకు రూపాన్నివ్వకుండా అన్నాడు.

"గెస్టుహౌస్‌లో మీ స్కెచ్ గీసుకుంటాను డాడీ! ప్లీజ్ డాడీ. అతనికి చెప్పి రెండుగంటలయినా ముందు నిల్చోమను డాడీ" చిరుహాస తండ్రి అజిరిని పిల్చేవరకు వదలలేదు.

అయిష్టంగా ముందుకు నడిచాడు స్వరూప్ కూతురు కోరికని కాదనలేక.

దివ్యకు తన భర్త మనస్తత్వం ఇంకా బోధపడలేదు.

ఇన్ని డొంకతిరుగుడు మాటలు మానేసి నా కిష్టంలేదు నువ్వు తన్ని మోడల్‌గా తీసుకోవడం అని ఎందుకు చెప్పలేకపోతున్నారు?

తన కిష్టంలేని పనులు చేస్తున్నా అతనెందుకు ఖండించలేక పోతున్నాడు. పైకి నవ్వుతూ మానసికవ్యధ ఎందుకు భరిస్తున్నారు?

ఆమె ఆలోచనల కంతరాయంగా చిన్న గులకరాయి చెప్పులోకి వెళ్ళి ఆమె పాదాన్ని తాకింది.

"అబ్బా!" అంటూ ఆగిపోయి చెప్పులోనుండి ఆ రాయినితీసేసింది. అరికాలిలో కొద్ది రక్తం.

"ఏమయింది దివ్యా!"

"ఏమీలేదు. ఈ గులక గుచ్చుకుందంతే"

"అంతే ఏమిటి రక్తం వస్తుంటే" అనేసి కారు డాష్ బోర్డులో కాటన్ స్పిరిట్‌ని బాసల్నా పౌడర్ వుంది పట్రా బేబీ" అన్నాడు.

"భలేవారే ఇప్పుడేమయింది మనం వెళ్ళిపోదాం పద బేబీ! నాకేమిటో భయంగా వుందిక్కడ."

"డాడీ వుండగా మనకేం భయం"

"మీ డాడి ఒక్కరూ ఏం చేయగలరు పదిమంది మనపైకి వస్తే"

"పో మమ్మీ! ఆ అబ్బాయి వెళ్ళిపోయాడు" అని దిగులుగా ముఖం పెడితే అది చూడలేని స్వరూప్ అజిరిని కల్పుకున్నాడు.

"నీ పేరేమిటి?"

"ఈ కట్టెలు అమ్ముతావా?"

"ఊహుఁ మా ఇంటికి తీసుకెళతాను. మా అమ్మ సంగటి చేయా
ంచే కట్టెలు కావాలిగా"

"ఇప్పుడింక ఏం పనిచేస్తావు? ఖాళీగానే వుంటావా?"

"అంటే?"

"పనేంలేదా అని?"

"ఎందుకు?"

"మా అమ్మాయి అదే ఇప్పుడు నీతో మాట్లాడిందే తనుబొమ్మలు
ాలా బాగా వేస్తుంది. నువ్వు ఒక్కగంట నిలబడగలిగితే నీ బొమ్మ
 సుకుంటుందంట" అడిగాడే కానీ అతను కాదంటే బాగుణ్ణనివుంది.
ాతుర్ని నొప్పించకుండా వెళ్ళిపోవచ్చు.

"నా బొమ్మే కావాలా. మా నిన్నాడిబొమ్మ వేసుకోండి" అతని
ాటల్లో మర్యాద.

అంతలో చిరుహాస వచ్చి అజిరి నడిగింది.

'నువ్వు ఎక్కువసేపు నా దగ్గర నిల్చోనక్కర్లేదు. రెండుగంట
ుంటేచాలు."

అతనేమనుకున్నాడో ఏమో–

"సరే ఈ కట్టెలు మా ఇంట్లో ఇచ్చేసి వస్తాను. మరలా నేను
ెరుకుపంట నరుక్కోవాలి"

"థాంక్యూ....థాంక్యూ వెరీమచ్"

అతను వెళ్ళినంత వేగంగా మరలా వచ్చాడు.

ప్రక్కనే బెడ్‌షీటు వేసి దివ్యను తన ప్రక్కనే కూర్చోబెట్టు
ని——

"ఓ. కే. బేబీ! ఇప్పటికయినా నువ్వు ఫిగర్ ఎలా గీస్తావో
ాడాలనే కోరిక తీర్తుంది" అనే మాటలతో మన మనస్తత్వాన్ని కప్పి
ెట్టాడు.

అడవిలో అణగిపోయిన అందం అనే టైటిల్‌తో అజిరి కట్టెలు కొడుతూ వున్నట్లు వెయ్యాలనుకున్న ఆలోచన వెనక్కి నెట్టేసింది చిరుహాస.

సూట్‌లో ఇతను అందం ఎంత అద్భుతంగా వుంటాడో తన కాన్వాస్ మీద చూపించాలనుకుంది. తన నిర్ణయానికి తిరుగులేదన్నట్లు కారు దగ్గర అతన్ని నిల్చోబెట్టి డ్రాయింగ్ బోర్డు ఫిక్స్ చేసింది.

రెండు చేతులు కట్టుకుని ఒక కాలు ముందుకు జరిపి రెండు బానెట్ మీదకు శరీరాన్ని వంచి విదాసంగా నిల్చోమని చెప్పిందే కానీ అతనికలా నిల్చోవడం చేతకాలేదు.

అతన్ని తాకి నిల్చోబెట్టటానికి చిరుహాస సంకోచించింది. అందుకే ఎలా నిల్చోవాలో తను నిల్చుని చూపించింది.

తెలివిగలవాడులా వున్నాడు ఒక్కసారి చిరుహాస నిల్చుని చూపగానే అలాగే నిల్చున్నాడు.

తలెత్తి అతనివైపు నిశితంగా చూసింది చిరుహాస. ఇతనికి మంచి సూట్ వేసి, షూ వేసి, క్రాఫ్ సరిగ్గా దువ్వితే మేకప్‌లో వున్న సినీ హీరోకంటే అందంగా వుండడూ.

ఆమె మనస్సు అతనా దుస్తుల్లోనే అంతా అందంగా వుండడం చూసి అబ్బురపడుతోంది. డ్రాయింగ్‌బోర్డుమీద తన చేతిని చక చక కదుపుతోంది.

అతను చిద్విలాసంగా నవ్వుతూ నిలుచున్నాడు.

రెండు గంటలసేపు బాహ్య ప్రపంచంతో సంబంధం లేనట్టు చిరుహాస అతన్ని చూస్తూ స్కెచ్ వేసుకుంది.

ఆ రెండు గంటల్లో అతనిపట్ల చిత్రంగా చిరుహాస మనసులో దగ్గర భావం.

అతను దగ్గరకొస్తూ అడిగాడు.

"నా బొమ్మ మీకెందుకు?"

"చూసుకోవడానికి" హాస్యంగా అంది చిరుహాస.

"చూసుకుని...." అమాయకంగా అడిగాడతను.

మనోహరంగా నవ్వింది చిరుహాస.

పెయింట్ అంటే ఒక ఆర్ట్. ఏ అందమైన ప్రదేశం చూసినా, అందమైన మనుష్యుల్ని చూసినా పెయింట్ చేయాలనిపిస్తుంది. ఇది ఒక హాబీ. నా మనస్సుకి సంతృప్తి అంతే!

అతనికామె మాటలు బోధపడ్డాయో లేదో కానీ,

"నేను వెళ్ళొచ్చా!" అని మాత్రం అడిగాడు.

"ఇప్పుడెళ్లొచ్చు. మరలా నీ పనయ్యాక రెండు గంటలు రాగలవా?" అతని కళ్ళల్లోకి ఆసక్తిగా చూస్తూ అడిగింది.

"మరలా ఎందుకు?"

"నీ బొమ్మ పూర్తిచెయ్యాలి గదా!"

అతను చిరుహాస వేసిన గీతలువేపు ఆసక్తి కనిపించీ కనిపించకుండా చూసాడు.

"అలాగే"

అతను వెళ్ళిపోయాక గుర్తుకు తెచ్చుకుంది చిరుహాస—అతనికివ్వాలనుకున్న బిస్కెట్ ప్యాకెట్ కారులోనే వుండిపోయిందని.

"అజిరీ!" తనకు తెలియకుండానే పెద్దగా అరిచింది. కానీ ఆ గాలిలో అతనికామ్మాయి పిలుపు అందలేదు.

కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న దివ్య, స్వరూప్ అజిరి వెళ్ళిపోవడం చూసి చిరుహాస దగ్గరకు వచ్చి—

"ఇక వెళదామా?" అన్నారు.

"మీ రెళ్ళండి డాడీ! ఈవెనింగ్ వరకూ ఇక్కడే వుండి యీ ఫిగర్ పూర్తి చేస్తాను."

"ఏమిటీ, మేము అనంతగిరికి వెళితే నువ్విక్కడిపీ వుంటావా?" కళ్ళింతవి చేసుకుని అంది దివ్య.

"పోనీ, అందరం ఇక్కడే వుందామనుకో బేబీ, మరి భోజనం"

"కారులో బిస్కెట్ ప్యాకెట్ వుంది. నేను తినేసి మంచినీళ్ళు తాగేస్తానులే డాడీ! ఇక్కడ అజిరి వున్నాడుగా నాకేం భయం! మీరక్కడెక్కడయినా టిఫిన్ దొరికితే తినేసి సాయంత్రానికి రండి."

ఎంత కూల్‌గా చెప్పగలిగింది.

బేబీది పసి వయస్సు-ఒంటరిగా ఉన్నప్పుడు ఎవరేమైనా అవకాశం కోరకొస్తే ఉహుఁ అతను తన ఆలోచనలకు స్వస్థి చెప్పాడే కానీ కూతుర్ని ఒంటరిగా వదిలిపోవడానికి ఇష్టపడ్డంలేదు.

"చాల్లే నోర్మూసుకో. ఈ అడవి మనుష్యుల మధ్య ఒక్కతివీ వుండాలన్న ఆలోచన నీకెలా వచ్చింది. పోదాంపద డాడీ అన్నట్లు వచ్చాక వేసుకుందువు."

"అలాకాదు మమ్మీ, మూడ్ ఆఫ్ అయిపోతే మరలా కుదరదు. ప్లీజ్ డాడీ అమ్మను తీసుకెళ్ళండి."

తన తండ్రిభయాలు తెలియని పసిపిల్ల ఈయన్నే అడుగుతుంటే నవ్వొచ్చింది.

"అయితే మేమూ ఇక్కడుంటాంలే వేసుకో."

"మీకు భోజనం" తల్లిదండ్రుల ఆకలి గుర్తువచ్చింది చిరు హాసకు.

"ఒక్కపూట తినకపోతే ఏమీ అవదులే" అంటూ బిస్కెట్ ప్యాకెట్ ఓపెన్‌చేసి మంచినీళ్ళ గ్లాసుతో ప్రక్కన పెట్టింది

ఆ ప్రేమకు తలవంచి—

"పదండి డాడీ, నేనూ మీతో వస్తాను వచ్చాక వేసుకుంటాలే అంది."

తలమీద బరువు దించినట్లనిపించింది స్వరూప్‌కి.

కిరోసిన్‌లో ముంచిన కాగడా చేతిలో పట్టుకుని మీకు గుహ చూపిస్తానంటూ ఒకబ్బాయి వచ్చాడు.

"మేము చూసేసి వస్తున్నాం. తినేదానికి ఏమైనా కావాలి. ఎక్కడ దొరుకుతాయో చెప్పు చాలు" స్వరూప్ మౌనంగా వుంటే దివ్య అడిగింది.

"నేరుగా ఎల్లండి, ఆడ సెరుకుతోట వుంది. అడిగితే ఒక గడ ఇస్తారు."

"చెరుకు కాదు. మాకు టిఫిన్ కావాలి" ఈసారి చిరుహాస అడిగింది.

"ఏమో. అవంతా మాకు ఎరికలేదు" ఆ అబ్బాయి వెళ్ళిపోతూ అన్నాడు.

కొంతదూరం నడిచేసరికి అతను చెప్పిన చెరుకుతోట కనిపించింది.

ముగ్గురూ నవ్వుకున్నారు దాన్ని చెరుకుతోట అని చెప్పినందుకు.

అన్నీ కలిపి వంద చెరుకుగడలుకూడా లేవు. ఆ చెరుకుతోటలో మనిషి లేడు

స్వరూప్ ముందుకు నడిచాడు.

ఆ ప్రక్కనే జొన్నతోట. అందులో అజిరి కొడవలితో ఆ జొన్నతోట కోస్తున్నాడు. పట్టుదలగా కోస్తే రెండు గంటల్లో పూర్తవుతుంది.

"డాడీ! ఇంత కొత్తిపంటతో ఎలా బ్రతుకుతారు" వీళ్ళని చూడగానే కొడవలి ప్రక్కనపెట్టి దగ్గరకొచ్చాడు అజిరి.

"మాకు తినేదానికేమయినా దొరుకుతుందా ఇక్కడ?"

"ఊహుఁ" తల అడ్డంగా తిప్పాడు.

"పోన్లే, సాయంత్రం అనంతగిరి గెస్ట్‌హౌస్‌లో ఒకేమారు భోంచేద్దాం జెబీ! నువ్వు బిస్కెట్ ప్యాకెట్ తినేసేయి. అందరం

అక్కడకే కెళదాం పదండి. ప్రొద్దుపోకముందే ఇక్కడనుండి వెళ్ళిపోదాం."

అరగంట తర్వాత అంతా తిరిగి టిఫిన్ దొరకదని నిర్ధారణ చేసుకుని అజిరి తోటదగ్గరకు వచ్చి స్వరూప్ అన్నాడు.

"అజిరీ! కొద్దిసేపు నువ్వు మా దగ్గరకు వస్తే నీ ఫిగర్ పూర్తవుతుంది. మేము త్వరగా వెళ్ళిపోతాం. అక్కడికెళ్ళాక తింటాములే, ఒక్కపూటకు లేకుంటే ఏమీ ఫర్వాలేదు" ఈమారు చిరుహాస అడిగింది.

"మా ఇంటికి రండి, మా అమ్మకు చెప్పి జొన్నరొట్టెలు చేయించి పెడతాను."

భార్యా భర్తలిద్దరూ ఒకరి ముఖంవేపు ఒకరు చూసుకున్నారు.

"జొన్నరొట్టె కారం మీరు తినరా?"

ఆశ్చర్యంగా అడిగాడు అజిరి.

"అంత శ్రమెందుకులే, సాయంత్రానికి వెళ్ళిపోతాం."

"శ్రమేముంది. జొన్నలు దంచుకుని పిండిచేసి పెట్టుకుంటాం మేము."

"ఈ జొన్నలు మీకు సంవత్సరమంతా సరిపోతాయా?"

"సరిపోవు. మేము యింకోదగ్గర సజ్జలు పండించుకుంటాం" అనేసి—

"ఒరే సురిపీ, ఇలారా" అని కేకేసాడు.

పన్నెండేళ్ళ సురిజీ పేరుగల కుర్రాడు వచ్చాడు ఆ పిల్లాడి ఒంటిమీద గోసెమాత్రమే వుంది.

"వీడు మా సిన్నోడు" అనేసి.

"యీల్లకు తినడానికి జొన్నరొట్టెలు సేయమని అమ్మతో సెప్పు. నేనీపంట కోసేసి బిగీన వచ్చేస్తా" అన్నాడు.

దివ్య వద్దు అని చెప్పేటంతలో సురిపీ పరిగెట్టుకుంటూ వెళ్ళిపోయాడు. అడవి మనుష్యులు అని భయపడ్డ వీళ్ళలో ఎంత మర్యాద మొదటిసారిగా అనుకుంది దివ్య.

బలిష్టంగా వున్న అతని శరీరం చెమటలు కారుతోంది. చకచక పంటను కోసి పడేస్తున్నాడు.

"మీకు ఎండలు ఎక్కువగా వుండవుకదా యీ పంట ఎలా పండుతుంది. ఇప్పుడు వర్షం వస్తే ఈ జొన్నలు పాడవుపోవూ!" ఆసక్తిగా చూస్తూ అడిగాడు స్వరూప్.

"కొద్దిగా మసకబారుతాయంతే. అయితే జొన్నరొట్టె బాగానే వుంటాయి" పంట కోసేసి అక్కడే వదిలేసి ముఖం తుడుచుకుని వస్తున్న అతని వైపు వింతగా చూసింది దివ్య.

"అలా కోసిపడేస్తే ఎవరయినా తీసుకెళ్ళరా?" దివ్యకు వాళ్ళ వేషభాషలు, వాళ్ళ జీవితం వింతగా వుంది.

"ఉహుం ఇది మా పంట ఎవరో ఎలా అట్టుకెళ్ళిపోతారు?" అది అసంభవం అన్నట్లుంది అతని కంఠం.

"అంటే ఇక్కడ దొంగతనాలు జరగవనుకుంటా" భర్తతో అంది దివ్య.

"అలాగే అనుకోవాలి మనం" స్వరూప్‌కి కూడా ఆశ్చర్యంగానే వుంది.

ఆ చిన్న పంచలో కెళ్ళగానే అజిరి అమ్మ సాదరంగా ఆహ్వానించింది అందర్నీ. ఆమె ఏడు గజాల ముతకచీర కట్టుకునుంది. ఆ చీరనే జాకెట్టుగా మల్లించి దోపుకుంది. చెవ్వులకు వెండి దిద్దులు, కాళ్ళకు వెండి కంటెలున్నాయి.

"మా జొన్నరొట్టెలు, ఎర్రకారం బావుంటాయి తిందురుగాని రండి."

ఆమె మాటలుకూడా యాసగా వున్నాయి.

చిరుహాస వద్దంటున్నా రెండు గోనెసంచులు రెండు తెచ్చి పర్చిందామె.

ఆమె ఆతిధ్యానికి అజిరి ప్రేమపూర్వకమైన అహ్వానానికి ముచ్చట పడ్డారు.

ఆమె జొన్నరొట్టెలు కాల్చింది.

"మీ రెక్కాడోళ్ళమ్మా. ఈడకు సాలామంది వస్తూ వుంటారు. మీలాగ మా ఇంటికెవరూ రాలేదు" ఆమె కళ్ళల్లోకి పొగ పోయినట్లుంది కళ్ళు నులుముకుంటూ అడిగింది.

"మాది నెల్లూరు. ఇక్కడంతా చూసిపోదామని వచ్చాము"

"మావోడు చెప్పాడు. మీ బిడ్డ మా అజిరి బొమ్మ గీసుకుందటగా"

జొన్నరొట్టెలు తినడానికి ఆకులు కోసికొచ్చాడు అజిరి. ఆ ఆకుల్లో రొట్టెలు పెట్టి ఎఱ్ఱకారం వేసి అందించిందామె.

గ్లాసులో నీళ్ళుపోసి అందిస్తూ అన్నాడు అజిరి.

"మీరు గొప్పోళ్ళు మా ఇల్లుచూసి నవ్వకండి.

అప్పటివరకు ఆమెనే చూస్తున్న దివ్య ఆ ఇంటి కప్పువైపు చూసింది.

అదొక గుడిసెలాకూడా లేదు. పది బూరగకొమ్మలు. పది తాడిసకొమ్మలు, పది టెంకాయ ఆకులు, ఇంకా పేర్లు తెలియని ఆకులతో కప్పబడి వుంది.

"ఎందుకు నవ్వుతాం అజిరీ! మీరిచ్చే యీ జొన్నరొట్టెలు, మీ అభిమానానికి గుర్తు థాంక్యూ."

"అజిరి తర్వాత ఎంతమంది పిల్లలు మీకు?" దివ్య మాట మార్చింది.

"సురిపి ఒక్కడే. ఆడపిల్లలేనందుకు యాతనే మాకు"

"తింటానికే సరిగ్గాలేని వీళ్ళకు సంతానంమీద ఎంత మమకారమో కదా!" అనుకుంది దివ్య.

"నూనె ఎక్కడ కొనుక్కుంటారు?"

"సీమనూనా?"

"వేరుశెనగనూనెను సీమనూనె అంటారు కాబోలని మరలా అడిగింది.

"ఆఁ....ఆఁ అ నూనె కూరల్లో వేసుకుంటారే అది"

"సీమనూనె బుడ్డిలో మాత్రమే పోస్తాము. కూరలోవేస్తే వాసన రాదు."

అదికూడా తెలియదా అన్నట్లు ముఖం పెట్టింది అజిరి అమ్మ.

దివ్యకు అప్పటి కర్థమయింది సీమనూనంటే కిరసనాయలని.

"ఆ నూనెకాదు, వేరుశనగనూనెగానీ, మప్పులనూనెకానీ మీరు కూరలో వేసుకోరా?"

"అదేమిటి? మా కెరుకలేదు. కారంపొడి, వెల్లుల్లి నంజుకుని తింటాం. లేదంటే ఆకు కోసుకుని కారంలో కలిపి దంచుకుని తింటాం"

"అంటే....అంటే వీళ్ళు కూరలే చేసుకోరా మమ్మీ" చిరుహాస అడిగింది.

"కూరలంటే ఏమిటి?" ఆమెకు విన్పించింది కాబోలు దివ్య నడిగింది.

"మీరు మాంసం తినరా?"

"ఎందుకు తినము. ఏటమాంసం కోసి ఉప్పేసి ఎండకేత్తాం. ఆ ముక్కల్ని నిప్పుల్లో కాలిసి తింటే సాలా కమ్మగా వుంటాయి"

"కాల్చుకుని తింటారా?" ఆదిమానవులు గుర్తొచ్చి చిత్రంగా అడిగాడు స్వరూప్–

"మీకు తెల్వదా అయ్యో! వుంటే మీకు కాల్చిపెట్టేదాన్ని."

"పోసి. ఇడ్లీ, వడ, పూరీలు చేసుకోరా!"

"అవేంటి ఎలా వుంటాయి?" అజిరి అమ్మ వింతగా అడిగింది.

"మినుములు, గోధుమలు తెలియవా మీకు?"

"ఊహుఁ మాకు సజ్జలు, జొన్నలు తెల్సు"

"మీరు అన్నం వండుకోరా?"

"సంకటి చేసుకుంటాం అన్నం"

"రోజూ వండుకోవడం చాలా కరీటవుద్ది. మేము పెల్లిల్లు చేసుకునే సంబరంలో చెరకురసం పోసుకుని వండుకుంటాం"

"రోజూ రొట్టయితే తింటారా?" పెళ్ళిళ్ళల్లో స్వీట్స్‌లాగ పొంగలి అన్నం చేసుకుంటారు కాబోలని అనుకుంటూ అడిగింది దివ్య.

జొన్న సంగటి కాసుకుంటాం" జొన్నరొట్టె కాలాక ఆకులో పెడుతూ అందావిడ.

"పెళ్ళిళ్ళలో కట్నాలివ్వరా"

"అంటే" అర్ధం కానట్లు చూసింది.

"ఆడపిల్ల తల్లిదండ్రులు మగపిల్లవాడికి డబ్బు యివ్వరా?"

"మాకు పైసలెక్కడొస్తాయి తల్లీ"

"మరి పెళ్ళికి బట్టలు కొనుక్కోరా?"

"ప్రతి ఏడాదీ కొనుక్కుంటాంగా-ఆరోజే బట్టలు కొనుక్కోవడ మెందుకు?"

"ఈ రోజుల్లో యిలాటి స్థలాలు కూడా వున్నాయా?" ఆశ్చర్యపడి గింది దివ్య

"మీ కొడుకు పెళ్ళి చేయాలంటే ఎక్కడకెళ్ళి అమ్మాయిని వెతుకు తాడు"

"ఎక్కడికో ఎందుకెళతాం? మా గెరిల్లాల్లో ఆడకూతుర్ని మా మగబిడ్డకు సేసుకుంటాం"

"గెరిల్లాలంటే" దివ్యకు వాళ్ళ ఆచారాలు, వాళ్ళ పద్ధతులు అన్నీ తెల్సుకోవాలనే ఉత్సాహంతో అడిగింది.

"మా తెగ కాకుండా వేరే తెగ"

"పెళ్ళికి డబ్బు అవసరం లేదని చెప్పావనుకో మరి కాన్పుకి హాస్పిటల్‌కెళ్ళి డాక్టరు దగ్గర చూపించుకోవాలంటే డబ్బు అవసరం కదా!" దివ్య ఆమెను ప్రశ్నిస్తూనే వుంది.

"మా ఇల్లల్లోనే ప్రతి ఒక్క ఆడకూతురు పురుడు పోసుకుంటుంది."

"ఏదయినా జబ్బు చేస్తే ఎలా?" ఈ మాట స్వరూప్ అడిగాడు.

"ఏమి జబ్బులొస్తాయీ వస్తే పసర్లు పోసుకుంటాం. వాతం కమ్మితే లేకపోతే యింకేమయినా పెద్ద జబ్బులొస్తే అనంతగిరి అస్పత్రికి మోసుకెళతాం" రొట్టెలు వాళ్ళకోసం కూడా చేసేసిందావిడ.

"మోసుకెళ్ళడమేమిటి?" అర్ధం కాలేదు దివ్యకు.

"ఇంకెలా ఎలతా మాసుపత్రికి. ఒకసారి నాకు మా సిన్నోడు పుట్టాక జబ్బు చేస్తే అజిరి వాళ్ళయ్యే నన్ను వీపు మీద ఏసుకు వెళ్ళాడు.

"అంటే వీళ్ళకు బస్ ఫెసిలిటీ కూడా లేదన్న మాట" ఈమాట స్వరూప్ ఆశ్చర్యపోయాడు.

"ఇక్కడ నుండి అసంతగిరికి మనిషిని మోసుకెళ్ళాలంటే కష్టం కదా!" దివ్య అడిగింది.

"ఏం కష్టముండదు. మీరంటే కార్లలో తిరిగే వాళ్ళు. మేము మా రెక్కల కష్టం మీద బ్రతికేవాళ్ళం. అజిరి అయ్యకు జబ్బుచేస్తే అజిరే మోసుకెళ్ళాడు."

అజరి బలిష్టమయిన శరీరం వైపుకోసారి చూసింది చిరుహాస.

"నీకు కష్టమనిపించలేదా అజిరీ!" చిరుహాస అడిగింది.

"నాకేమనిపించలేదమ్మాయిగారూ!"

అతనికి యింత అనాగరిక ప్రదేశంలో కూడా బహువచనంతో మనిషిని మర్యాదగా పిలవాలనే జ్ఞానం ఎలా వచ్చిందో అర్థం కాలేదు.

"మీరు వెండి కంటెలు, కమ్మలు అవి ఎక్కడ కొనుక్కుంటారు?"

"మా పూర్వీకులిచ్చినవే యివి మేమెక్కడ కెళ్ళి అట్టుకు రాగలం పైసలుండవు మాకాడ."

అనేని సత్తుగ్లాసుల్లో నీళ్ళందించింది.

ఆ నీళ్ళలో వేళ్ళు పెట్టి పట్టుకొనుచ్చి నామెను చూసి దివ్య అంది.

"నాకేమిటో భయంగా వుందండీ. బేబీ బిస్కెట్స్ తినేస్తుందిలే అసలే దానికి కారం పడదు."

"ఏమీ అవదు....అన్ని రకాల వంటలు రుచి చూడడం బాగుంటుంది."

"పిండి ఏ మురికి నేలలో దంచారో ఏమో ఇన్ ఫెక్షన్ అటాక్ అవుతుందేమో ఒక్క పూటకు మనం తినకుంటే ఏమయిపోతాం?" నసి గింది దివ్య.

"అంత ప్రేమగా పిల్చి పెడుతున్నారు యిప్పుడు వద్దంటే ఆమె బాధపడుతుంది. ఆమె కోసమయినా మనం తినాలి అలా నీ కిష్టం లేనప్పుడు ముందే చెప్పుండాల్సింది" చిన్నగా అన్నాడు స్వరూప్.

"ఆమె ఆ పెనము శుభ్రంగా కడిగిందో లేదో!"

"నీ కన్నీ అనుమానాలే మమ్మీ! పాపం వాళ్ళు ఎంతో అభిమా నంగా పెడుతున్నారు. అని తల్లితో అనడానికయితే అన్నది కానీ ఆ ఆ కొరివి కారంతో నంచుకుని ఒక చిన్న జొన్న రొట్టె ముక్క తిని.

"అబ్బో! చాలా కారం డాడీ!" అనేసింది.

"జొన్నరొట్టె మాత్రమే తిను బేబీ!"

చిరుహాస రొట్టె ముక్క తుంచి నోట్లో పెట్టుకుంది కానీ అది మ్రింగుడు పడలేదు. ఊసేయడం బాగుండదని పక్కనే వున్న సత్తు గ్లాసు ఎత్తి నీళ్ళు నోట్లో పోసుకుని మ్రింగేసింది.

స్వరూప్ దివ్య ఎలాగో ఒక జొన్నరొట్టె తినగలిగారు.

పది రూపాయల కాగితం అజిరి అమ్మకందించాడు స్వరూప్.

"వద్దొద్దు ఏడనుండో వచ్చి మా ఇంట్లో తిన్నారు అది మాకు సంబరంగా వుంది" మొగమాట పడిందామె.

అజిరి ముందుకొచ్చాడు.

"మీరు ఏమి తిన్నారని మాకు పైసలిస్తున్నారు. చిన్నమ్మ తాకనే లేదు. మాకు యింత కంటే ఏమి సేసి పెట్టాలో సేతకాదు" నొచ్చు కున్నాడు.

ఎంత బలవంతం చేసినా ఆ అమ్మా కొడుకులిద్దరూ స్వరూప్ దగ్గర డబ్బు తీసుకోలేదు

* * * *

నువ్వు కూడా రొట్టెతినేసి రా అ

"మీ బొమ్మ పూర్తిచేసి ఎలుగుంటగానే అనంతగిరి కెళ్ళండి. చీకటి పడితే ఈడ రోడ్డు గతుకులు మిట్టలు తెలియదు."

అతని ఆలోచనా విధానికి ముచ్చట పడ్డాడు స్వరూప్.

కారు దగ్గరకు రాగానే బిస్కట్ తీసి అజిరి కందించింది చిరు హాస.

వద్దు....మీరు తినండి. మీకు మా రొట్టె ఇష్టపడలేదు.

"బిస్కెట్లు చాలా బావుంటాయి తెల్సా రుచిచూడు." బలవంతం చేసింది హాస

రెండు బిస్కెట్లు తీసుకుని ఇంక చాలు అన్నాడు.

ఫర్వాలేదు తీసుకెళ్ళి మీ తమ్ముడికి కూడా యివ్వు.

ఆడిప్పుడే జొన్న రొట్టెలు తిని ఆకలి తీర్చుకున్నాడు. మీకాకలి వేసినప్పుడు తినడానికి అట్టిపెట్టుకోండి.

మంచి సంస్కారి వ్యక్తిత్వమున్న మనిషి.... ఎందుకిలా అనాగరికపు ప్రపంచంలో బ్రతుకుతున్నారీళ్ళు యింత స్ఫురద్రూపి అందగాడు, సమర్ధుడు యిలా కట్టెలు కొట్టుకుంటూ, జొన్నలకోత కోస్తూ చెమటోడుస్తూ కనీసావసరాలకు కూడా డబ్బు లేకుండా ఈ జీవితం ఏమిటి? దగ్గరలో వున్న వైజాగ్‌లో వీళ్ళెందుకు తమ బ్రతుకుల్ని పండించుకో కూడదూ?

"మీరంతా విశాఖ పట్టణం వెళ్ళి ఎందుకు చదువుకోలేదు?" మరలా అడిగింది.

"చదువుకుంటూ వుంటే మాకు భుక్తి గడిచేదెలా?"

"చదువుకుంటే యిలా కష్టపడి సంపాదించుకునే కంటే ఎక్కువ డబ్బు వస్తుంది దాంతో మీరు సుఖంగా వుండొచ్చు."

ఉద్యోగం అంటే పని కాదా?

మగాడంటే కష్టపడాలి.

అతని మాటల్లో సోమరితనం వుండకూడదన్నట్లు ధ్వనించింది.

ఆ సంభాషణని త్రుంచేస్తూ స్వరూప్ తొందర చేసాడు.

"అజిరీ నువ్వు నిల్చో....మా జేబీ నీ బొమ్మ పూర్తి చేస్తుంది'
తండ్రి అలా అనగానే హాస కార్లో నుండి స్టాండ్ డ్రాయింగ్ పేపర్ తీసింది.

స్వరూప్ దివ్య ప్రక్కనే చూస్తూ కూర్చున్నారు.

సాయింత్రం ప్రొద్దువాలే వరకు అజిరి బొమ్మ వేస్తూనే వుంది చిరుహాస.

అప్పటికి అజిరిలో ఆసక్తి వచ్చింది.

కారు నానుకుని అజిరి ఫుల్ సూట్‌లో హాండ్‌సమ్ పర్సనాలిటీగ వున్నాడు. అతని శరీరం మీద ఆ బట్టలు అతని అందాన్ని మెరుగుల దిద్దాయ్.

అజిరిని తన బొమ్మ అలా ఆకాగితం మీద కొత్త బట్టల్లో వింతగా వుంది.

"ఇలాటి బట్టలు కుట్టించుకోవాలంటే ఎన్ని రోజులు కూలికెళ్లాల నేను. అతను అమాయకంగా అడిగాడు.

"మా వూరు రాకూడదూ! అలాటి బట్టలు నేను కుట్టిస్తాను"

అతను నవ్వాడు ఆ నవ్వులో వస్తానన్నట్టూ లేదు తానన్నట్టూ లేదు.

"నీ బొమ్మ బాగుందా!" స్వరూప్ అజిరిని అడిగాడు.

సిగ్గుపడిపోయాడు అజిరి.

"పోనీలే అన్నం తినకుండా సాధించావు. బాగా వేసావు" దివ్య మనస్ఫూర్తిగా కూతుర్ని మెచ్చుకుంది.

"థాంక్స్ అజిరీ! నువ్వు కో ఆపరేట్‌లో చెయ్యకపోతే యింత త్వరగా వేయగలిగేదాన్ని కాదు."

"థాంక్స్ అంటే...."

"మా సంతోషాన్ని తెలిపే పదం" స్వరూప్ విపులీకరించాడు.

కారు స్టార్టు అవబోతుంటే చప్పున గుర్తు వచ్చింది స్వరూప్‌కు తన బట్టలు ఒక జత కారులో ప్లాస్టిక్ కవర్‌లో వున్నట్లు. అది తీసి అజిరి కందించాడు తన కూతురి ఆనందానికి ప్రతిఫలంగా.

"వద్దు వద్దు" తొట్రుపాటుగా అన్నాడు అజిరి.

"మా జ్ఞాపకార్థం వుంచుకో" దివ్య ఆ అబ్బాయితో అంది వాటిని చేతిలోకి తీసుకుని వెంటనే.

"థాంక్స్" అన్నాడు.

అతని తెలివికి ఆ ముగ్గురు అబ్బురపడ్డారు.

ఇంత తెలివిగల వ్యక్తి యిలా యిలా అడవిలో బ్రతుకుతున్నందుకు బాధేసింది చిరుహాసకు.

అనంతగిరి గెస్ట్‌హౌస్‌లో రాత్రి పడుకోబోయే ముందు అజిరిని ఫుల్ సూట్‌లో ఊహించుకుంది చిరుహాస. అతని నొసలుమీద గాలికెగిరే ఓ వెంట్రుక అతని పసిమిరంగు ఛాయ, కొటేరేసినట్లున్న ముక్కు, వెడల్పాటి ఛాతీ, అతని నచ్చిన సంస్కారం.

"మమ్మీ! మమ్మీ!" తల్లి ప్రక్కగా వెళ్ళి పడుకుంటూ పిల్చింది.

"నిద్రరావడం లేదా హాసా?"

"అజిరిని మనూరికి తీసుకెళదాం మమ్మీ! అతనలా అడవిలో కట్టెలు కొట్టుకుంటూ బ్రతకడం నాకు నచ్చలేదు."

ఆశ్చర్యంగా చూసింది దివ్య.

"మనతో అజిరెందుకొస్తాడే పిచ్చీ!"

"ఎందుకు రాకూడదదూ!"

"వాళ్ళమ్మ నాన్నలను వదిలి మనతో ఎందుకొస్తాడు? వచ్చి ఏం పని చేస్తాడు?"

"పనెందుకు చెయ్యాలి బాగ చదువుకుని ఉద్యోగం చేస్తాడు."

"నిద్ర పట్టకుంటే టేప్‌రికార్డర్ పెట్టుకో పిచ్చిమాటలు మాట్లాడకుండా."

"మనలో పై చదువులకు అమ్మను నాన్నను వదిలి ఫారిన్ వెళ్ళడం లేదూ" మొండిగా అంది.

"అది వాళ్ళిష్టపడి వెళ్తున్నారు. తల్లిదండ్రులే తమ బిడ్డల భవి.

ష్యత్తు బాగుండాలని పంపిస్తున్నారు దానికి దీనికి పోటి ఏంటి?" ప్రక్కకు తిరిగి పడుకుంటూ అంది దివ్య.

"నువ్వు తీసుకెళ్దాం అన్నా వాళ్ళమ్మ నాన్న పంపరుగా పడుకో."

"అజిరిని ప్రయోజకుడుగా తీర్చిదిద్దుతామంటే వాళ్ళమ్మ, నాన్న ఎందుకొప్పుకోరు?"

"నువ్వు అడవిలో వుండిపోతానంటే మేమొప్పుకుంటామా! వాళ్ళు అంతే అడవిదాటి పంపడానికి ఇష్టపడరు."

"నేను అడవిలో వుంటే ఏమొస్తుంది. అదే అజిరి మనతో వస్తే ఎంతో నేర్చుకుంటాడు. అజిరి చాలా తెలివిగలవాడు మమ్మీ. లేకుంటే థాంక్స్ అనే పదం అంత త్వరగా మన దగ్గర నుండి నేర్చేసుకున్నాడు చూడు."

"పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేసి నిద్రపో ప్రొద్దున్నే లేవాలి" కళ్ళు మూసుకుంటూ అంది.

అప్పటివరకు నిద్రపోడానికి ప్రయత్నిస్తున్న స్వరూప్ చిరు హాసతో అన్నాడు.

"వాళ్ళు రారులే బేబీ. పూర్తి ఆలోచించి బుర్రపాడు చేసుకోకు"

"పోనీ వస్తే తీసుకెళ్దామా డాడీ" నూతనోత్సాహంగా అడిగింది చిరహాస.

"అలాగేలే బేబీ పడుకో."

"మరి అజిరి వాళ్ళమ్మ, నాన్నల దగ్గరకు రేపెళ్ళాలి కదా!"

"అలాగే అన్నాను కదా!" అతనికి తెల్సు అది జరిగేపని కాదని.

వాళ్ళు అజిరిని తమతో పంపరు ఆ మాత్రం దానికి కూతుర్ని నిరాశపర్చడం ఎందుకని అలా జవాబిచ్చాడు.

"నా విషయంలో అంత ఆవేదనని భరించి యిప్పుడిలా మాట్లాడుతున్నారేంటి? అని ఆశ్చర్యపోయింది దివ్య

ప్రొద్దున్నే లేచి లేడిపిల్లలా గెంతింది చిరుహాస. తల్లిని, తండ్రిని లేపి తనే సామానంతా సర్దేసింది.

కూతురు ఉత్సాహానికి అనకట్ట వేయలేదు స్వరూప్.

"మరీ చంటిపిల్లలా బిహేవ్ చేయక హాసా" కోపంగా అంది దివ్య.

"కోప్పడకు దివ్యా! వాళ్ళు పంపరులే" బకెట్ ఎత్తి నీళ్ళు పోసు కుంటూ అన్నాడు స్వరూప్.

"పంపించినా మనం తీసుకెళ్ళేదిలేదు అనవసర శ్రమ ఎందుకు?" చిరాగ్గా అంది దివ్య.

"అనవసర శ్రమేం కాదు. ఒక తెలివిగల మనిషిని తీర్చిదిద్దితే మనకెంతో తృప్తి" అంది తన దగ్గరుండే చనువుతో చిరుహాస.

"తృప్తి పడాల్సిన వాటికి మనం తృప్తిగా వుంటే చాలు. యిలా ప్రతి ఒక్కరినీ ఉద్ధరించగలమా?" ఈ ప్రయాణం పెట్టుకోకపోయినా బాగుండేదనిపిస్తున్నట్లు ముఖం పెట్టింది దివ్య.

అమ్మా, కూతురు వాదనతో కారు బ్రొరా హేవ్స్ ముందు ఆగింది.

"వెళ్ళు బేబీ నువ్వే అడుగు వాళ్ళమ్మను" అతను ప్రశాంతంగా అన్నాడు.

దివ్య విసుగ్గా ముఖం పెట్టింది భర్త ప్రవర్తనకు.

ప్రొద్దున్నే వచ్చి వాళ్ళనుచూసి ఆశ్చర్యపోయారు అజిరి కుటుం బంలోని సభ్యులు

"రండి దొరా! నిన్న మీరు మా ఇంటికొచ్చి మా రొట్టె తిన్నారవి నా ఆదది సంతోషపడి పోనాది" అజిరి తండ్రి కాబోలు కారు దగ్గరకు వచ్చి చేతులు నులుముకుంటూ నిల్చున్నాడు.

"అజిరిని మాతో పంపండి బాగ చదువు చెప్పించి మంచి ఉద్యో గం యిప్పిస్తాం. అప్పుడు మీరూ రావచ్చు అక్కడకు" వెంటనే అనే సింది చిరుహాస.

"అడినాదిలి నేనెలా వుంటాను సిన్నమ్మా. అడు లేకుంటే మాకు ఎలా జరుగుద్ది" నవ్వుతూ అంది అజిరి అమ్మ.

"ఏటో సిన్నమ్మ సెప్పేది మాకు తెలవలా" అజిరి నాన్న కారు లోకి వంగి స్వరూప్ వైపు చూస్తూ అన్నాడు.

కారు దిగాడు స్వరూప్. దివ్య మాత్రం బిగుసుకుపోయి కారు సీటుకు అతుక్కుపోయింది.

"మీ అజిరి మంచి తెలివి గలవాడు. మా నెల్లూరుకు మాతో పంపండి. మాలాగ మంచి బట్టలు, మంచి చదువు చెప్పిస్తాము. మీకు మా అడ్రస్ యిస్తాము. మీరెప్పుడు చూడాలనుకున్నా రావొచ్చు."

"మా కాడ అంత దూరదేశం రావడానికి పైసలెలా వస్తాయిచే సిన్నమ్మా."

అతను మెత్తబడ్డం చూసి చిరుహాస వెంటనే అంది.

"చార్జీలకు మేము డబ్బులు పంపిస్తాం. అజిరి తెలివిని ఈ అడవిలో నాశనం చేయొద్దు" చెప్పిందే చెపుతుంది చిరుహాస.

"మనకేం ఖర్మండీ వాళ్ళనింత బ్రతిమిలాడ్డానికి. దీనికేమైనా పిచ్చి పట్టిందా ఏం? మీరు మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు యిలా వుండడ మేమిటిటీ?" భర్తను దగ్గరకు పిల్చి కోపంగా అంది దివ్య.

"దివ్యా! వాళ్ళు పంపరు గదా! ఇంకో ఐదు నిముషాలు ఊరు కున్నావంటే మన ముగ్గురం వెళ్ళిపోతాం. నాకు మాత్రం ఇష్టమా చెప్పు" స్వరూప్ మెల్లగా అన్నా చిరుహాస చెవిలో పడ్డాయా మాటలు.

తర్వాత తండ్రికి నచ్చచెప్పొచ్చులే అని అజిరి తల్లివైపు తిరిగింది.

"మీ అజిరి మాలాగ గొప్పగా తయారవడం నీ కిష్టంలేదా?" తర్వాత మీరంతా మాలాగ మంచి బట్టలు వేసుకుని మంచి యింట్లో మా వూరుకొచ్చి ఉండొచ్చు. ఈ చాలీచాలని బ్రతుకుల్లో ఉండక్కర లేదు."

"ఏటో మీరేటేటో సెప్తున్నారు కానీ మేము ఈ గడ్డ వదిలి ఏడకూ రాము. మాకీ మట్టిలోనే బతుకయినా సావయినా" ఆమె కొద్దిగా కూడా అజిరిని వాళ్ళతో పంపడానికి ఇష్టపడలేదు.

"ఆవిడ చెప్పేది నిజమే కదా! మనం నెల్లూరు వదిలేసి వేరే ఊరికి వలసపోగలమా?" దివ్య మాటల్ని కట్ చేసింది చిరుహాస.

"ప్లీజ్ మమ్మీ నువ్వూరుకో నేను వాళ్ళని ఒప్పిస్తాగా" అనేసి అజిరి తండ్రి దగ్గర కెళ్ళింది.

అజిరిలో ఏ భావమూ లేదు తల్లి దండ్రులు పంపిస్తే వచ్చేలా పంపకుంటే వుండిపోయేలా వున్నాడు.

"మీరు గొప్పోళ్ళు మేము పేదోళ్ళం మీ వాడికి అక్కడేదయినా కొరతొస్తే నష్టపోయేది మా బ్రతుకులే సిన్నమ్మా నాకూ ఆ పెదసి సూస్తుంటే అప్పుడప్పుడూ మీ కార్లు మా దగ్గరకు వస్తుంటే నా బిడ్డా ఆ కార్లతో తిరిగితే సూడాలనిపిస్తుంది కానీ రెక్కాడితేగాని డొక్కాడని బతుకులు మావి" అతనికి కొద్ది కొద్దిగా తమ బిడ్డను వాళ్ళతో పంపితే బాగుణ్ణనే అభిప్రాయం కలుగుతున్నట్లుంది.

ఆ అవకాశాన్ని జారవిడుచుకోదల్చుకోలేదు చిరుహాస.

"మా వల్ల మీ అజిరికి లాభం కలుగుతుందే కానీ నష్టం కలగదు మమ్మల్ని మీరు నమ్మండి."

"ఏరా అజిరీ వీళ్ళతో ఎల్తావా?"

"అడు నన్నొదిలి ఎల్లడుగాక ఎల్లడు" అజిరి అమ్మ ముందు కొచ్చి కొడుకు భుజంమీద చెయ్యి వేస్తూ అంది.

"అజిరి ఏమీ మాట్లాడలేదు."

"ఏరా ఆ గొప్పింటోల్లతో ఎలతావా? అజిరివైపు తిరిగి అడిగాడు అతను.

ఈమారు వెళతానన్నట్టు తలూపాడు అజిరి.

ఆ ముగ్గురూ గుడిసె లోపలికెళ్ళారు ఎలా నచ్చజెప్పుకున్నాడో భార్యను ఒప్పించి తీసుకొచ్చాడు అరగంట తర్వాత.

"వద్దులే పాపం ఆమె కిష్టంలేదు. ఆమె నెందుకు కష్టపెట్టడం" వెంటనే దివ్య కారుదిగి వాళ్ళ దగ్గరకు వచ్చి అంది.

"మా రాజుల నీడలో మా అజిరి బాగుపడతాడని వుంటే నాకూ సంబరమే తల్లీ కాకుంటే మేము ఈ మట్టిని నమ్ముకొని బతికేవాళ్ళం అందుకే మా ఆడది మొండికేసింది. ఆడు దద్దాగా వుండే పనయితే

మాకూ యిష్టమే. యింత దయగా మీరు పిలుస్తా వుంటే పంపిస్తేనే న
బిడ్డడు బాగుపడతాడని నా బుద్ధికి తోస్తా వుంది తల్లీ!"

"ఏమ్మా! మీ అజిరిని ఇష్టమయితేనే పంపించు. మా బలవంతం
ఏమీ లేదు" దివ్యకు ఆవిడ వద్దంటే బాగుణ్ను అన్నట్లుంది. దివ్య
ముఖంలో విసుగు స్పష్టమవుతోంది.

"అడిని సూడాలంటే పైసలు పంపిస్తానని సిన్నమ్మ సెప్పిందిగా
ఇంక నాకేటి దిగులు తోలుకెల్లండి" అంది.

ఈ మారు దివ్యకు కోపం వచ్చేసింది. పసిపిల్ల అదేదో కుర్ర
తనం కొద్దీ పిచ్చిగా వూహిస్తే ఈయన బుద్దేమయింది అన్నట్లు భర్త
వైపు చూసింది.

"వాళ్ళు అజరిని పంపిస్తావనుకోలేదు దివ్యా! అజిరి కూడా
మనతో రావడానికి ఇష్టపడతాడనుకోలేదు నేను. ఇంత బలవంతం చేసి
యిప్పుడు తీసుకెళ్ళకపోతే ఏం బాగుంటుంది చెప్పు. చదువు చెప్పించేది
యీ వయస్సులో అతను నేర్చుకునేది జరిగేపనికాదులే నువ్వు భయ
పడకు నాకు ఏదో ఒక పనికి సహాయంగా వుంటాడు" ప్రక్కకు తీసు
కెళ్ళి భార్యకు నచ్చచెప్పాడు స్వరూప్.

ఆ సంభాషణ చిరుహాస చెవిని దాటిపోలేదు.

కారులో అజిరి స్వరూప్ యిచ్చిన చొక్కా ప్యాంటు తీసుకుని
కూర్చునుంటే అతని ముఖవర్చస్సు యింకా పెరిగినట్లనిపించింది. రెప్ప
వేయడం మర్చిపోయి అతన్నే చూస్తూ కూర్చుంది చిరుహాస. మగ
వాళ్ళలో యింత అద్భుతమైన రూపం గలిగినవాళ్ళుంటారా? అని
ఆశ్చర్యపోతూంది.

అజిరి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. అతనికి కారు ప్రయాణం
కొత్త. అతని మనస్సులో భావాలు ముఖంలో తెలియనివ్వడంలేదు.

కారు వైజాగ్ చేరింది. అందరూ దిగి హోటల్‌లో అడుగు
పెట్టారు. త్రీస్టార్ హోటల్‌లో హాలు చిరు వెలుగుతో నిశ్శబ్దంగావుంది.
వెస్టర్న్ మ్యూజిక్ తగ్గు స్థాయిలో విన్పిస్తోంది. అది ఎయిర్ కండిషన్
హాలు.

"రా ఆ సింక్ దగ్గర చెయ్యి కడుక్కుందాం" పిల్చింది అజిరిని చిరుహాస.

ముందు సింక్ దగ్గర టాప్ తిప్పి చెయ్యి కడుక్కుంది చిరుహాస

అజిరి కూడా అలాగే చెయ్యి కడుక్కుని టాప్ తిప్పేసాడు.

అతని తెలివికి అబ్బురపడింది చిరుహాస..

అందరికీ దోసెలు తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళాడు సర్వరు

చిరుహాస దోసె అందించేవరకు అందుకోలేదు అంది.

అందరూ ప్లే లో చెయ్యి పెట్టాక అతనూ దోసెమీద చెయ్యి పెట్టాడు దోసె తినడం ప్రారంభించాడు.

అతని కళ్ళు స్వరూప్ చేతిమీద వున్నాయి. స్వరూప్ చేతులు సాంబారులో ముంచి దోసె తింటుందే అజిరి కూడా అలానే దోసెను ముక్కగా తుంచి సాంబారులో ముంచి తినసాగారు. కాస్సేపటికి చట్నీలో ముంచి తినడం తెలుసుకున్నాడు.

"దోసె బాగుందా?"

బాగుందని తలూపాడు.

"ఇంకొకటి తింటావా?"

వద్దని తల అడ్డంగా తిప్పాడు.

"కాఫీ కానీ, టీ కానీ తాగుతావా అజిరీ!" అప్పటివరకు మవునంగా వున్నా ఆ క్షణంలో ఆ అబ్బాయి వాళ్ళింట్లో అందించిన అతిధి సత్కారం గుర్తొచ్చినట్లు అడిగాడు స్వరూప్.

"డాడీ! మనం అజిరిని అజయ్ అని పిలుద్దాం ఏం అజితీ నీకిష్టమేనా?"

అతను ఇష్టమే నన్నట్లు తలూపాడు. అజిరి ఎక్కువగా మాట్లాడటం లేదు కాఫీ కావాలనీ అనలేదు వద్దనీ చెప్పలేదు. అందరికీ నెగలుకక్కే ఇన్‌స్టాంట్ కాఫీ తెచ్చి టేబిల్‌మీద పెట్టి వెళ్ళాడు సర్వరు.

ఒక కప్పు అజిరి కందించింది చిరుహాస. ఆ కప్పునలాగే పట్టు
కుని స్వరూప్ ఎలా త్రాగుతున్నాడో గమనించాడు. స్వరూప్ తా
నట్లే కొద్ది కొద్దిగా కాఫీ సాసర్‌లో పోసుకుని తాగేసాడు. యిదంతా
చిరుహాస దృష్టిని దాటిపోలేదు.

అజిరి అలా ఏమీ మాట్లాడకుండా వుంటే చిరుహాసకు బాధేసిం
ఆ అడవిలో అతనిదే పై చేయిలా ఆ ఇంటికి యజమానుడిలా అన్ని
బాధ్యతలు నిర్వర్తించేవాడులా తనకు తీరికే లేనట్లు కట్టెలు కొట్టు
కుంటూ, తల్లికి సహాయం చేస్తూ వున్న యితను సర్వస్వతంత్రాన్ని
పోగొట్టుకున్నట్లు కూర్చోవడంతో—వెంటనే తన మనస్సుని ఆ ధోరణి
నుండి మార్చుకుంది చిరుహాస. అజిరిని క్షణంలో అజయ్‌గా పేర
మార్చింది రేపటి నుండి తన శిక్షణలో అజయ్ పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని
సంతరించుకునేలా అతని తెలివికి పదును పట్టేయాలి అని నిర్ణయించు
కుని ఒక మంచిపని చేయబోతున్నందుకు సంతోషించింది.

"మీ జొన్నరొట్టె బాగుందా? మా మసాలాదోసె బాగుంద
అజయ్. ఆమెకు అతని కొత్త తీరిపోయేలా మాట్లాడాలనుంది.

"మసాలా దోసే బాగుంది" అతనికింకా చెప్పాలనే వుందికానీ
ఆ భావం వ్యక్తం చేయడం రానట్లు వూరుకుండిపోయాడు.

దివ్య ముఖంలో ఆవేదన స్పష్టమవుతోంది. తల్లితో యిప్పుడేవి
మాట్లాడినా కోప్పడుతుందనే విషయం తెలిసాక చిరుహాస తల్లితో
మాట్లాడే సాహసం చేయలేదు.

"కూరగాయల విత్తనా లెక్క దమ్మతారు మమ్మీ తెచ్చిస్తే
అజయ్ వేస్తాడట."

"కూరగాయలు బజారులో చౌకగా దొరుకుతున్నాయిలే అతని
కెందుకు శ్రమ" అజయ్‌పట్ల అయిష్టత దివ్య ముఖంలో స్పష్టంగా
కన్పిస్తోంది.

ఆ విషయం పట్టించుకోనట్లు....

"డాడీ కోసం ఆ కారు డ్రయివరు ఒకతను వచ్చాడు. పర మేశ్వరం అంకుల్ బాగ తెలుసట. కావాలంటే ఆయనకు ఫోన్ చేసి నా గురించి కనుక్కోండమ్మా" అన్నాడు.

"ఇప్పుడు మనకు డ్రయివర్ ఎందుకు? డాడీ చెప్పారట నా డ్రయివర్‌నే పంపమని."

"డాడీ చెప్పలేదులే మమ్మీ, అయినా ఎక్కడ కెళ్ళాలన్నా డాడీకి శ్రమ ఇవ్వాల్సి వస్తుంది. డ్రయిర్ వుంటే మనమే వెళ్ళొచ్చు డాడీ. బాధ పడతాడని గిల్టీగా వుండదు నాకు."

"డాడీ ఒక్కడేనా బాధపడకూడదంది నేను బాధపడొచ్చా?" కాస్త వ్యంగ్యంగా అడిగింది కూతుర్ని దివ్య.

తల్లి మాటల్లో అర్ధం తెలిసింది చిరుహాసకు.

"మమ్మీ! నిన్నెప్పుడయినా నేను బాధపెట్టానా?" గోముగా అంది.

"నాకిష్టంలేని పని అని తెల్సినా అది నువ్వు చేయడం నన్ను బాధపెట్టినట్లు కాదూ!"

"నన్ను బి. డి. ఎస్. లో చేర్చనంటావ్ అంతేగా? సరే నీ ఇష్టం. ఏ కోర్సులో చేరమంటావో కూడా నీవే చెప్పమ్మా."

"మాట మార్చకు హాసా! ఇప్పుడు అజిరిని ఈ ఇంటికి తీసు కొచ్చినందువల్ల ప్రయోజనం ఏమిటి? నన్ను బాధపెట్టి అతన్ని ఉద్ధ రించాల్సిన అవసరం ఏముంది నీకు."

అజిరిని తీసుకొచ్చిన పదిహేను రోజుల తరువాత కూతురితో మనసులో మాట మాట్లాడగలిగిందామె.

అప్పటివరకూ చిరుహాసలో మౌనంగానే వుండిపోయింది.

చిరుహాస తల్లి ప్రక్కన కూర్చుని తల్లితో అంది.

అంత అందమైన అబ్బాయి తెలివిగలబ్బాయి అలా బ్రతుకు తుంటే జాలేయలేదూ మమ్మీ నీకు. మనసులో మాట చెప్పు మమ్మీ."

"ఎవరి జీవితాలు వాళ్ళవి. మనం ఎంతమందినని ఉద్ధరించ గలం?"

"ఇందులో ఉద్ధరించేదేముంది మమ్మీ! మనకు తెలిసిన విజ్ఞానాన్ని అజయ్‌కి చెప్తాము. అందుకు బదులుగా అతను నీకు బజారు పనులు, చెట్లపనులు చేసి పెడుతున్నాడుగా."

"ఏ పనిమనిషి చేయదు అలాటి పనులు?" దివ్య మాటల్లో విసుగు

"నిజంచెప్పు మమ్మీ! అజయ్ వచ్చాక మీతోట కళ కళ లాడ్డం లేదూ!

నీకే పనిమనిషయినా ఇలా స్వంత ఇంటి మనిషిలా చెట్లు చూశారా? బజారునుండి ఇంత చౌకగా, మంచి కూరగాయలు తెచ్చారా? కనీసం నెలకు అయిదువందలు రూపాయలు లేందే తోటమాలి వస్తాడా? ఆ డబ్బు మనం ఖర్చు పెట్టడం లేదుగా అజయ్ కోసం."

"డబ్బు ప్రసక్తి తీసుకురాకు హాసా! నేనెప్పుడూ డబ్బుకి ప్రాధాన్యత యిచ్చిన మనిషిని కానని నీకు బాగా తెలుసు" ముఖంలో బాధ స్పష్టంగా కనిపించింది చిరుహాసకు.

"సారీ మమ్మీ! డబ్బుతో కొనుక్కోలేనివి చాలా వుంటాయనే ఉద్దేశంతో అన్నాను కానీ, నిన్ను బాధ పెట్టాలని కాదు.

కోట్లు ఖర్చు పెట్టినా నీ ప్రేమ నాకు ఇంకెక్కడయినా దొరుకుతుందా మమ్మీ!

దొరకదు. మనిషి కొనుక్కోలేనివి అతిబీదవాళ్ళకి దొరకొచ్చు. కోట్లు వుండి దానికోసం ఎంత తిరిగినా దొరక్కపోవచ్చు.

జీవితంలో ఈ సహాయం మన దృష్టిలో చాలా స్వల్పమే కావొచ్చు.

ఆ సహాయాన్ని ఎదుటి మనిషికి అందించకుండా డబ్బుతో పొందవచ్చు మమ్మీ!

కానీ మన చిన్న సహాయం ఒకోక్కప్పుడు ఎదుటి మనిషికి జీవితాంతం మరచిపోలేనంత మహోపకారం కావచ్చు. ఇప్పుడు మనం

అజయ్‌కి నాలుగక్షరాలు నేర్పించి ఈ సంఘంలో ఒక మంచి వ్యక్తిగా నిలబెట్టగలిగిననాడు మన జీవితం సార్ధకం కాదంటారా మమ్మీ."

నీ జీవితానికో సార్ధకత కావాలంటే ఇంకా ఎన్నో మంచి పనులు చెయ్యి నేను కాదనను.

అలా అనాధాశ్రయానికి వెళ్ళు, రోజూ వెళ్ళి తల్లిదండ్రులు కొరవయిన బిడ్డలు-బిడ్డలతో నిరాకరింపబడిన తల్లిదండ్రులు ఎంతో మంది వున్నారు.

వాళ్ళకు, నీకు తోచినంత సహాయం చెయ్యి మన ఆర్థికస్థోమతను బట్టి వాళ్ళకి బట్టలు ఆహారం అందించు. నీ ఒంట్లో శక్తున్నంతవరకూ వాళ్ళకి సేవలు చెయ్యి."

"ఆ సహాయం నానుండి వాళ్ళెప్పుడూ పొందుతూనే వున్నారుగా మమ్మీ!

వాళ్ళంతా శాపగ్రస్థుల్లా ఏకాకుల్లా మిగిలిపోయిన వాళ్ళు, వాళ్ళకు తిండి బట్ట ఇవ్వడం మినహా ఏమీ చేయలేము.

ఇంక పుట్టిన పాపలంటావా?

వాళ్ళకి తగిన విద్యా సౌకర్యం మదర్ థెరిసా మంచి మనసుతో సాగుతోంది. ఉదతా భక్తితో వేసే సహాయమే అవుతుంది మనం ఇచ్చే ఏదయినా.

అజయ్ విషయం అలా కాదు మమ్మీ!

ఈ ఎలక్ట్రానిక్ యుగంలో అతని తెలివి భూస్థాపితం అయిపోయినట్లు ఆ అడవిలో అనాగరికంగా వుండిపోయాడు. ఆ అబ్బాయి తెలివిని మనం పదును పెడితే ఆ మేధస్సుతో ఎంతటి విజ్ఞానాన్నయినా సంపాదించగలడు?"

"ఏం అక్కడ చాలామంది పిల్లలు ఇలాటి దశలోనే వున్నారుగా. అందరినీ తీసుకొచ్చి ఒక ఉచిత పాఠశాల ఏర్పాటు చేసి అందర్నీ విజ్ఞానవంతులుగా తీర్చిదిద్దవచ్చుగా. అప్పుడు నీ జీవితానికి సార్ధకత ఇంకో మెట్టుపైన వుండేదిగా."

"మమ్మీ! ఈ జీవితంలో మనిషికి మనిషికి మధ్య అభిమానం, మనిషికి మనిషికి మధ్య ప్రేమ, మనిషికి మనిషికి మధ్య ద్వేషం పుట్టి నట్లే ఇలాటి కోరికా పుడుతుందేమో లేకుంటే ఏమిటి ఆ అబ్బాయినే మంచి వ్యక్తిగా తీర్చిదిద్దాలని నాకెందు కనిపించింది. కొన్నిటికి కారణా ఉండవు" నిర్దయగా అంది చిరుహాస.

కారణాలు లేకపోతే పోయింది కానీ దానివల్ల వచ్చే పరిణామా లకు ఇది కారణం కాకూడదు.

చిరుహాస తల్లి లేచి వంటింట్లోకి నడచిపోవడం చూసి నిశ్శబ్దంగా వుండిపోలేదు.

"మమ్మీ! నువ్వన్నదేమిటో నా కర్థంకాలేదు. ప్లీజ్ మమ్మీ అర్థ మయ్యేలా చెప్పవూ."

"అర్థం కాకపోవటానికి ఇందులో ఏముంది? ఒకరిచేత వేలెత్తి చూపించుకోవడం నాకిష్టం ఉండదు?"

"ఎం.డి.యస్ చేసిన నువ్వేనా మమ్మీ ఇలా మాట్లాడుతున్నావు? ఎవరో ఏదో అనుకుంటారనుకుంటే మన మొక్క పనికూడా సాధించ లేము మమ్మీ.

నేను చేసే యీ మంచిపని సంఘం దృష్టిలో తెలివి తక్కువగా నేరం పరగణింపబడితే దానికి నేను దోషినెలా అవుతాను మమ్మీ!"

"సంఘాన్ని వదిలేయి హాసా! రేపు నిన్ను చేసుకోబోయే వ్యక్తి దృష్టిలో ఇది తప్పవుతుందేమో ఆలోచించావా?"

"మంచిపని చేసే ఒక్క మనిషి వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోలేని మనిషి నీడ నా కవసరం లేదు మమ్మీ."

"అలా ఎందుకనుకోవాలి-నీ మనస్సులో అజయ్‌పట్ల ఏ దురుద్దే శమూ లేకపోవచ్చు.

అతన్ని మంచి వ్యక్తిగా తీర్చిదిద్దాలనే మంచి మనస్సు నీకుం డొచ్చు కానీ అది నువ్వయినా చిన్నపిల్లవయి వుండాలి. లేక అత నయినా చిన్నవాడయి వుండాలి. అదీ కాకుండా నువ్వు మగపిల్లాడివైనా అయి వుండాలి."

"అంటే మమ్మీ! ఒక ఆడ ఒక మగ మధ్య ఎలాటి మంచికీ ఆస్కారం వుండకూడదంటారా?"

"ఉండొచ్చు కానీ కొన్ని ఈ సంఘంలో మనుష్యులు అర్థంచేసుకోలేరు

"మమ్మీ! ఈ సంఘంలో మనుష్యులు దేన్నర్థం చేసుకోగలుగుతారంటావు?

మగ ఆడ స్నేహాన్ని చెడుగా అంచనా వేసేవాళ్ళు వితంతు వివాహాన్నెందుకు హర్షించడంలేదు? పెళ్ళయి భర్తను కోల్పోయి ఆర్థికమైన ఇబ్బందులతో సంఘంలో వున్న చీడపురుగుల వెకిలి చేష్టలతో, ఒంటరిగా వుందనే ధీమాతో ఆ అమ్మాయిని అల్లరిపెట్టయినా తన దారికి తెచ్చుకోవాలనే పైశాచిక ప్రవృత్తితో వున్న మగవాళ్ళ మనస్తత్వంతో అలసిపోయి తనకంటూ ఒక నీడను సంపాదించుకుని పవిత్రమైన వివాహబంధానికి కట్టుబడి తన జీవితాన్ని సుఖంగా మలుచుకుంటుంటే మాత్రం ఆచారం కాదని నోళ్ళు వెళ్ళగ్రక్కుతున్నారు.

వీలయినంతవరకు ఆ పెళ్ళి జరగకుండా చేయటానికి ప్రయత్నిస్తున్నారు.

అదిమాత్రం తప్పుకాదు యీ సంఘానికి.

అదే ఆ వితంతువు ఈ అటుపోట్లకు తట్టుకోలేక విధి వక్రించి ఆ నరరూప రాక్షసులకు వంగిపోతే ఆనాడు ఆ పిల్లను నడిబజారులో నిలబెట్టి నిందిస్తున్నారు.

ఆ నిందల వెనుక వీళ్ళ హస్తం వుందని తెలుసుకోగలుగుతున్నారా?

ఆనందంగా మగపిల్లలకు రెండో పెళ్ళి చేసినట్లు ఆడపిల్లలకు చేయగలుగుతున్నారా?

నిన్న ఎదురింటావిడ నీతో ఏమంది?

కనురెప్ప చాటున ఏదో జరుగుతుంటే పసివయస్సు కదా, భర్త చనిపోయిన పిల్ల అని చూసీ చూడనట్లు వూరుకుంటే ఇప్పుడాపిల్లా అతన్ని పెళ్ళిచేసుకుని ఇంటికొస్తుందా?

నా కూతుర్ని ఇంకెవరు పెళ్ళిచేసుకుంటారు అని యేడుస్తుందా?

ఆడబిడ్డ ఆనందంగా జీవితాన్ని గడపబోతున్నందుకు ఆ అమ్మాయిని మనసారా ఆశీర్వదించాల్సిందిపోయి, నాలుగేళ్ళ తనకూతురి పెళ్ళి గురించి మాట్లాడుతుందా?

పెళ్ళి చేసుకుంటే తప్పు. తప్పుచేస్తే చూసీ చూడకుండా వుండడం తప్పుకాదు. అవునా మమ్మీ!

ఇది ఒక చిన్న ఎగ్జాంపుల్ మాత్రమే.

ఈ సంఘంలోని మనుష్యులు తప్పు ఒప్పుల గురించి కూలంకషంగా ఏం మాట్లాడినా మనమేం పట్టించుకోనక్కరలేదు" అంది.

"నీది చిన్న వయసు హాసా! ఆవేశంగా ఉపన్యాసం చెప్పేవరకు బాగానే వుంటుంది.

రేపు నువ్వుచేసేపనికి నలుగురు వేలెత్తి చూపిస్తే నీ భవిష్యత్తుకి మరక పడుతుందని నా భయం హాసా!

తెలివితక్కువతో అపనిందలు పాలవుతారేమోనని ఆలోచన పోయింది నాకు."

"మమ్మీ! వాళ్ళకు నేను చేసే ఈ మంచిపని తెలివితక్కువగా అనిపిస్తే దానికి మనం దోషులమెలా అవుతాం చెప్పమ్మా?

ఎవరో ఏదో అనుకుంటారనుకుంటే ఒక్క పనికూడా మనం సాధించలేం.

జీవితంలో ఎదగాలన్నా, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలన్నా పిరికితనం వుండకూడదు.

ఇంకొక విషయంకూడా మమ్మీ!

చెడ్డపనులు చేయటానికి ధైర్యం చేయడం ఎంత తెలివితక్కువతనమో మంచిపని చేయడానికి పిరికితనమూ అంతే తెలివితక్కువతనమవుతుంది. ఒకరికి ద్రోహం తలపెడితే నలుగురూ అనే మాటలను భరించలేం అనుకోవాలిగాని, ఒక మంచిపని చేసేప్పుడు నలుగురు అభాండాలు వేస్తారనిమాత్రం అనుకోలేదు మమ్మీ."

"అందరూ నీవుచేసే మంచి పనిని హర్షించరు హాసా! అదే నా బాధ."

"అర్థం చేసుకోలేని మనుష్యుల గురించి నువ్వెందుకు మమ్మీ యింత బాధపడడం, దిగులు పడడం."

"ఎవరికోసమో దిగులుపడేంత ఉదార హృదయం కాదులే హాసా నాది, నా దిగులంతా నీ భవిష్యత్తు గురించే. ఇదీ ఒక రకమైన స్వార్ధమే."

తల్లి అలా అనేసరికి చిరుహాసలో ఆలోచనా తరంగాలు ఒకదాని వెంట ఒకటి పరుగులు తీసాయి.

"మమ్మీ! ఇంత చిన్న విషయాన్ని నువ్వు భూతద్దంలో చూసి భయపడతావు గానీ యిప్పుడు నా భవిష్యత్తు కేమయిందనీ. డాడీతో, నీతో కల్సి పిక్చర్ కెళ్ళి చాలారోజులయింది. ఈ రోజు అందరం కల్సి వెళదాం మమ్మీ! నువ్వు, డాడీ ఫారిన్‌లో తెచ్చిన లైట్‌లట్ కలర్ శారీ కట్టుకోమమ్మా! నేను పింక్ ఎంజ్‌లైట్ బ్లూ చూడీదార్ వేసుకుంటాను" అంటూ టాఫిక్ మార్పించింది చిరుహాస.

"అజయ్" చెట్లకు ఎరువు వేస్తున్న అజయ్‌ని పిల్చింది చిరుహాస.

"అమ్మాయిగారూ"

"అదే ఆ పిలుపే వద్దన్నాను. చిరుహాసా అని పిలవలేవూ"

"వద్దొద్దు! ఎవరెంతలో వుండాలో అంతలోనే వుండాలి. ఇప్పటికే అమ్మగార్కి నామీద ఎందుకో కోపం" ముఖం చిన్న బుచ్చుకుని అన్నాడు.

చిరుహాసకు చప్పున ఏమి జవాబివ్వాలో తోచలేదు.

"చూడు అజయ్! నువ్వ అనవసరంగా అనుమానాలు పెట్టుకోకుండా చక్కగా చదువుకో. డాడీకి చెప్పి నీకు ప్రైవేట్స్ ఏర్పాటు చేయిస్తాను"

అజయ్ మౌనంగా నిలబడిపోయాడు.

అతని మౌనం వెనుక అతని మేధస్సుకందని ఎన్నో ప్రశ్నలు. ఏ ప్రశ్నకూ జవాబు తెలియదు. కానీ అతని తెలియని తనాన్ని బహిర్గతం చేసుకోవడం ఇష్టం లేదన్నట్లుగా మౌనంగా వుంటున్నాడు. ఎదుటివ్యక్తి ప్రతి చర్యను నిశితంగా పరిశీలించి దాన్ని అతను ఆచరిస్తున్నాడు. అడవిలోనుంచి వచ్చిన మనిషిలా కాకుండా తనకు తారసపడే సంఘటనకు కలిగే ఆశ్చర్యాన్ని గుండెల్లోనే దాచుకుంటున్నాడు. ఇదంతా చిరుహాస అతన్ని పరిశీలిస్తూ గమనించ సాగింది

"హాసా!"

"వస్తున్నా మమ్మీ"

"ఏం చేస్తున్నావక్కడ?" దివ్య ముఖంలో ఆందోళన స్పష్టంగా వుంది.

"అజయ్ చెట్లకు ఎరువు వేస్తుంటే ఏ చెట్టు కెంత వేయాలో చెప్తున్నా" చప్పున అబద్ధం చెప్పింది.

"ఎప్పుడయినా ఆ చెట్ల గురించి పట్టిందానీకు. ఈ రోజు నువ్వు అజయ్‌కి చెప్పడానికి" ముఖం చిట్లించి అంది దివ్య.

చిరుహాస దగ్గర తల్లి అడిగిన ప్రశ్నకు జవాబులేదు.

"ఎందుకు మమ్మీ నీకంత విసుగు అజయ్ అంటే?"

"హాసా! నువ్వు చిన్నపిల్లవేం కాదు ఆ ప్రశ్న అడగడానికి" విసురుగా లోపలికెళ్ళిపోయింది దివ్య.

* * * *

"ఏమండీ! మన హాసకు మంచి సంబంధం చూడండి పెళ్ళి చేసేద్దాం"

"అప్పుడే ఆ పసిపిల్లకు పెళ్ళేమిటి?"

"ఎలాగూ దాన్ని ప్రొఫెషనల్ కోర్సులో చేర్పించబోవటం లేదుగా" దివ్య ఆగి అంది.

"అలా అని అప్పుడే పెళ్ళి చేయాలని రూల్ లేదుగా. వుండనీ

దివ్యా! ఇంకో మూడేళ్ళు మన బిడ్డగా ఈ ఇంట్లో కళకళ లాడుతూ తిరగనీ."

"దాని ధానాలు చూస్తుంటే అప్పుడప్పుడు నాకు భయంగా వుందండీ ఎవర్నో ప్రేమించేసి మీ అల్లుడ్ని, నన్ను ఆశీర్వదించండి అంటూ వసుందేమోనని."

"నీకు శ్రమ తగ్గిపోయిందనుకుంటే సరి" నవ్వుతూ చెప్పాడు స్వరూప్.

"మీరేనా అలా అంటుంది. మీ కూతుర్ని మనకంటే గొప్పఇంట్లో యివ్వాలని, మన బేబీ దేనికి కొరతలేకుండా జీవితం గడపాలనీ ఇలా-ఎన్నెన్నో చెపుతుంటారురా."

"నిజమే! తండ్రిగా బేబీపట్ల నా కోరికలు. అవి కావని నేననడం లేదే."

"ఆ కోరికలు మన హాస వేరే ఎవర్నో చేసుకుని వస్తే మీకెలా తీర్తాయి."

"తీరవు. కానీ దివ్యా! మనం మన బిడ్డ సుఖమేగా కోరుకుంటు న్నాము. బేబీ అలాంటిపని చేయదు. చేసినా మనం అప్పుడు మన బేబీ సుఖం కోరుకోవాలి మన కున్నంతలో బేబీ ఆనందంగా వుండాలని కోరుకోవాలి. నేను సంపాదించేది, నువ్వు సంపాదించింది అంతా మన బేబీ కోసమే."

"ఏమిటోనండీ! మనం హాసనిలా పెంచాల్సింది కాదేమో అని ప్రతిక్షణం అన్పిస్తోంది నాకీ మధ్య."

"ఏమయింది దివ్యా! మన బేబీ పద్ధతుల్లో ఏదయినా మార్పొచ్చిందా?"

"అహఁ అలాంటిదేంకాదు. మనిద్దరం హాసకు కొంత కట్టుబాట్లలో పెంచాల్సిందనిపిస్తోందిప్పుడు. ఎవరికయినా ఈ సంఘంలో మెలగాలంటే ఓర్పు, లౌకికం అవసరం. మనకిష్టమైన రీతిలో మనం బ్రతకాలనుకుంటే ఎలా? ఇంత స్వేచ్ఛ యివ్వాల్సింది కాదేమోనన్పిస్తోంది"

"విషయం చెప్పకుండా ఇలా మాట్లాడితే నాకెలా బోధపడ్తుంది చెప్పు"

"ఏమీ లేదండి ఇప్పుడు అజయ్‌ని తెచ్చుకుని ఇంట్లో పెట్టుకుంటే నలుగురనే నాలుగురకాల మాటలెందుకు పడాలంటే లెక్కచేయదంచేసింది. చిన్నప్పుడు దాని మాటలకు ముచ్చటపడ్డ మాట వాస్తవమే కానీ యీ రోజు నాకెందుకో భయం వేస్తోంది."

"భయం ఎందుకు దివ్యా!"

"చేతులు కాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదండీ అది విజయ్‌ని విజ్ఞానవంతుడిగా తీర్చిదిద్దడం మంచిపనే కావచ్చేమో కానీ సంఘం మాత్రం హర్షించదు. ఆ విషయం చెపుతుంటే దానిబుర్రకెక్కదేమింటీ" అంటూ తల్లీ కూతురు మధ్య జరిగిన సంభాషణని చెప్పింది భర్తకు దివ్య.

"ఇంతేనా? నేనింకా ఏవిటో అనుకున్నాను. వాళ్ళది ఉడుకురక్తం కదా! మనమిప్పుడు మన పిల్లలకు నీతిపాఠాలు చెప్పినట్లే రేపు వాళ్ళు వాళ్ళ బిడ్డలకు తప్పకుండా బోధిస్తారిలాగే చరిత్ర చరణం."

"అదెప్పటి విషయమో కదా! ఇప్పుడిది ఆ పిల్లాడి ఆకర్షణలో పడుతుందేమోనని నా భయం. ఆ పిల్లాడు అందగాడు. దీని దృష్టిలో అతన్ని విజ్ఞానవంతుడిగా చేయాలనే ఆరాటంలో అతన్నిష్టపడుతుందేమోనని భయం పోవడంలేదు నాకు. అప్పటికీ నేను మందలిస్తూనే వున్నాను."

దివ్య చెప్పే మాటలు అలసిపోయి నిద్రపోయిన స్వరూప్ చెవులో పడలేదుకానీ చల్లగాలికి తల్లిదండ్రుల రూమ్ ముందు కారిడార్లో కూర్చుని వున్న చిరుహాస చెవులో మాత్రం పడ్డాయి. తల్లి భయాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించక పోగా ఏవో కొత్త ఆలోచన

* * * *

"అజయ్! ఈ పనులమీద శ్రద్ధ నువ్వు చదువుమీద పెట్ట

నాన్నగార్కి చెప్పాను. నీకు చదువు చెప్పడానికి మాష్టార్ని మాట్లాడ మని."

అజయ్ కళ్ళెత్తి చిరుహాస వైపు చూసాడు. ఆ చూపులో కృత జ్ఞత. ఈ అమ్మాయి కెందుకు తనమీద ఇంత అభిమానం అనే భావన.

నెలరోజులు గడిచిపోయాయి. ట్యూషన్ మాస్టార్ని పంపిస్తానన్న తండ్రి తన పనుల్లో నిమగ్నమయిపోయి ఆ మాటే మర్చిపోయాడు చిరుహాసకు తెల్సిన మాస్టర్లంతా గుంపులుగా చిన్న పిల్లల్ని చేర్చి ఇంటి దగ్గర ట్యూషన్లు చెప్పకునే వాళ్ళే—

ఆ చిన్న పిల్లల్లో అజయ్‌ని కూర్చోబెట్టడం తనకే యిష్టం లేక పోయింది.

తనే చెప్తేపోలా అనే ఆలోచన వచ్చింది కానీ తల్లి ఒప్పుకోదని భయపడింది. ఆ భయాన్ని మించి అజయ్‌ని యీ సంఘంలో ఒక గౌరవమైన వ్యక్తిగా తెలివి గలవాడిగా తీర్చిదిద్దాలనే కోరిక.

"అజయ్! నీకు నేను పదాలు వ్రాయటం చదవడం నేర్పిస్తాను. ఇంకా నీకు ఇంగ్లీషు కూడా నేర్పిస్తాను నేర్చుకుంటావా?"

తలెత్తి సంశయంగా చూసాడు.

"మీరు చదువుకోండమ్మాయిగారూ. మీ రెందు కంత కష్టపడ తారు."

"మా కిప్పుడు శెలవలే పూర్తిగావున్నాను నీకు ఓపికున్నంత సేపు నేర్చుకో."

"వద్దులెండమ్మాయిగారూ! అమ్మగార్కి కోపం వస్తుంది."

"నీకే సంకోచం వద్దు కానీ ఎన్ని మార్లు చెప్పినా అమ్మాయి గారూ మీరు అంటావేమిటీ నిన్ను నేను నువ్వు అని పిలవడం లేదూ!"

"మీ రనడంలో తప్పులేదు. నేనలా పిలవకూడదు."

"ఎందుకని?"

మీకు జవాబు చెప్పే తెలివి నాకు లేదు.

"నాకు జవాబు చెప్పే తెలివే కాదు నాన్నగార్కి బిజినెస్‌లో సహా

యము చేస్తూ సలహాలివ్వగల తెలివి నీలో వుంది. కాబట్టి బుద్ధిగా నేను చెప్పిన పాఠాలన్నీ నేర్చుకో."

"మీ ఇష్టం."

★ ★ ★ ★

తండ్రి అతనికి తన ప్యాంట్లు చొక్కాలు చాలానే ఇచ్చారు. చొక్కా సరిపోయింది గానీ ప్యాంటు పొట్టయింది.

చిరుహాస అతన్ని పొట్టి ప్యాంటులో చూశాక అతను లేని సమయంలో అవి తీసుకుని తనే స్వయంగా టైలర్ దగ్గరకెళ్ళి అబద్ధమాడింది.

"పొట్టయితే ఎవరికయినా పడేసే మహారాజులు మీరు. విప్పి అతుకులేయమంటున్నారేమిటమ్మా" అడిగాడు అతను.

"మా రోటరీ క్లబ్‌లో డ్రామా జరుగుతుంది అందరూ పొడవు వాళ్ళు అందుకని మా నాన్న పొడవుగదా! వేసుకోకుండా అక్కడ పడేసిన ప్యాంట్లు ఇస్తే పొడవు చేయించే బాధ్యత కూడా మా మీదే పెట్టారు. వాళ్ళ డ్రామా అయిపోయాక ఎవరికయినా యిచ్చేస్తారట డాడీ."

ఓపిగ్గా పట్టి విప్పి లోపల వేరే క్లాత్‌వేసి మడిచి కుట్టి యిచ్చాడు. అతుకు కన్పించకుండా బాగా కుట్టాడు. అవి తెచ్చి అజయ్ పెట్లో అతనొచ్చే లోపల పెట్టేసింది.

అజయ్‌కి అవి తనకోసం ఆరాటపడి చిరుహాస పొడవు చెయ్యించిందనే విషయమే తెలియదు.

ఒక్క ప్యాంటు మాత్రం పొట్టికాబోలు అనుకున్నాడంతే. అది తెల్సుకోగల్గుంటే అతనికి చిరుహాస అంత శ్రద్ధ ఎందుకు తీసుకుంటుందో తన మీద చూపించే ఆసక్తి అర్థమయ్యేది.

చిరుహాస అతని మీద ఆసక్తి చూపి ప్రతి రోజూ ఎ.బి.సి.డిల నుండి పదాల సంఖ్యల వరకు నేర్పించింది.

తెలివి గలవాడయితేనేమి? గ్రాస్పింగ్ పవర్ ఎక్కువ వున్నందు

వల్లయితేనేమి? ఒక్కసారి చిరుహాస చెప్పగానే అజయ్ వెంటనే నేర్చేసుకుంటున్నాడు.

అతని చురుకయిన బుర్రను చూసి ఆశ్చర్యపోతున్న చిరుహాసకు తండ్రి వచ్చి అక్కడ నిలబడింది కూడా తెలియలేదు.

"ఏం బేబీ! నేను ట్యూషన్ మాస్టార్ని మాట్లాడలేదని నువ్వే ప్రయివేట్ చెప్పేస్తున్నావా? వెరీగుడ్ అయిడియా ఓ.కే బేబీ ప్రొసీడ్" అనేసి వెళ్ళిపోయాడు స్వరూప్.

తండ్రి తననలా ప్రోత్సహించే సరికి చిరుహాసలో యింకా ఎక్కువ ఉషారు వచ్చింది.

ఆమెలో నూతనోధ్యాయం ప్రారంభమయింది అతి సమీపంలో వుండి అజయ్‌ను చూస్తుంటే ఆ మనస్సు తనలో వుండదని మొండికేస్తోంది.

అతను ఆమె కళ్ళల్లోకి చూసి వాఖ్యాలు అప్పజెపుతుంటే అతని కళ్ళల్లో ఆమె కళ్ళు కల్సుకున్నపుడల్లా చిరుహాసలో ఒక విధమయిన ఆకర్షణ మొదలయింది.

అజయ్ అనే పిలుపు గుండెలోతుల్లో నుండి వచ్చే ఆప్యాయతతో బయటకు వినిపిస్తోంది.

ఆమె పెదాల నుండి కాదు గుండె లోతుల్లో నుండి వస్తోంది. ఆమె చెప్పే పాఠాలతో అతనికి విజ్ఞానం వస్తుంటే చిరుహాసకు అతని మీద ప్రేమ ప్రవాహంలా పొంగుకొస్తోంది అది ఆమెకే అర్ధం తెలియని ప్రేమ.

దాన్ని ప్రేమ అంటారని కూడా తెలియని పసితనపు ఆకర్షణ కూర్చున్నా, నిల్చున్నా పడుకున్నా అజయ్ గురించి అనంతమయిన ఆలోచనలు.

ప్రేమ తొలిమెట్టు దాటి రెండవ మెట్టు మీద పాదం మోపింది చిరుహాస.

అజయ్‌కి నేర్పించాలనే పట్టుదల స్థానంలో అతని ఎదురుగా ఎంత సేపయినా గడపాలనే కోరిక.

అజయ్‌కి ఒక్కోసారి పాఠం చెప్పలేక పోయేంతగా ఆమెను పరవశం చుట్టేసేది. అతన్ని తీసుకుని ఏ దూర తీరాల్లోకో వెళ్ళిపోయి గంటలు రోజులు సంవత్సరాల తరబడి అతని ప్రక్కనే కూర్చుని కబుర్లు చెప్పుకోవాలనిపిస్తోంది.

ఆమె మనస్సుకు కళ్ళెం వేసి అతనికి తెలుగు పుస్తకం చదివేలా చేసింది.

ఇంగ్లీషు పదాలకు వాఖ్యాలలోకి తెచ్చి వాడుక భాషలో చిన్న చిన్న ఇంగ్లీషు పదాలు ఎక్కువగా వాడి అతని కర్థమయ్యేలా సులభ రీతిలో అతనితో చెప్పిస్తోంది.

అతను ఎంతో శ్రద్ధగా టి.వి చూసి డిష్‌లో వేసే సినిమాలు చూసి ఈ సంఘంలో మనుష్యుల మనస్తత్వాన్ని చిత్రంగా కనిపెట్ట సాగాడు. అతనికి అర్ధం కాని దగ్గర చిరుహాస నడిగి తన సందేహాల్ని తీర్చుకుంటున్నాడు.

★ ★ ★ ★

అజయ్‌కి పాఠం చెప్పేవేళలో తల్లి పైకి రాకుండా చాలా జాగ్రత్తలు తీసుకునేది. తల్లి స్నానానికెళ్ళబోయే ముందు అజయ్‌ని పైకి పంపేది. తల్లి స్నానం చేసి రెడీ అయి ఇక చిరుహాస కోసం వెతుక్కుంటుందనే సమయంలో కొంత హోంవర్క్‌లాగ అజయ్‌కిచ్చి క్రిందకు వచ్చి తల్లితో పదినిముషాలు గడిపి మరలా అజయ్ దగ్గర కొచ్చి పాఠాలు నేర్పేది. అలాగే ఆ రోజు కూడా తల్లి దగ్గరకు వచ్చి గడుపుతున్న సమయంలో అమ్మాయిని ఫ్రెండ్స్ చుట్టేసారు.

"ఆంటీ! మా స్నేహితురాలు ఇల్లు వదిలి రాని వ్రతమేమయినా చేస్తోందా?"

"కొద్దిరోజులు ఎంట్రన్స్ ఎగ్జామ్స్ అంది. ఇంకొన్ని రోజులు అరకులోయ ప్రోగ్రాం అంది మరిప్పుడేమయిందట?"

"నన్నడుగుతారేం మీ ఫ్రెండ్ ఎదురుగానే వుందిగా అడగండి" అనేసి "వుంఠండి నేనెళ్ళి మీ కందరికీ టిఫిన్ చేసి తీసుకొస్తాను" అని లోపలికి నడవబోయిన దివ్య నాపారంతా.

"ఇంత మందికి మీ ఒక్కరిచేత చేయించుకుని తినలేమాంటీ. సో.... మేమంతా కల్సి మీకు అంకుల్‌కి చేసి పెడతాము. టి వి లో సోమాసా ఎలా చేయాలో చెప్పారు అది చేస్తాను" త్రికాళి అంది.

"హతోస్మి! అంటీ అంకుల్ ముందు జాగ్రత్తకు ఐ మోసెల్ టాబ్లెట్స్ గునుక్కోక తప్పదు. అందుకోసం నేను బజారుకెళ్ళక తప్పేట్లు లేదు" స్నేహితురాల్ని ఉడికించింది సుజన.

"అంటీ! ఈ రోజు నేను మీకు సమాసా చేసి పెడతాను ఈ గాడిదలన్నీ సహాయం మాత్రమే చేస్తారు మీకు నా సమాసా నచ్చితేనే నా పెళ్ళికి చిరుహాసను నర్శింహకొండకు పంపండి లేకుంటే వద్దు."

"అరె నీ పెళ్ళా? వరుడెవరు? చెప్పలేదేం? పెళ్ళి చూపుల్లోనే అతను నీకు నచ్చాడా అని అడక్కేతల్లి" పావని భయపడుతున్నట్లు నటించింది.

ఇక ఈవిడకు కాబోయే అబ్బాయి అందం గురించి అతని చదువు గురించి అతని మంచితనం గురించి అతని తల్లిదండ్రుల వుదారం గురించి మనల్ని సుత్తికొట్టేస్తుంది" సుజన అందుకుంది.

"చూడండాంటీ! నేనసలు నోరు తెరవందే? అన్నీ వీళ్ళే వాగేస్తున్నారు ఎలా వుంటాడంటే బాగుంటాడు వాళ్ళమ్మ నాన్న కూడా మంచి వాళ్ళట అన్నానంతే" పెళ్ళి కూతురు త్రివాణి సిగ్గుపడుతూ అంది.

"అదేకదా ఏ తల్లిదండ్రులయినా అడపిల్లకయినా కావాల్సింది రండి లోపలికెళదాం" అందర్నీ లోపలి కాహ్వానించింది దివ్య.

"అంటీ! మైదాపిండి నెయ్యి కావాలి ఉర్లగడ్డలు కావాలి."

"మంచి శుభవార్త చెప్పావు ముందీ స్వీట్ తిని మీ ఫ్రెండ్స్‌కి పెట్టు అంటూ క్రీమ్ బిస్కెట్స్ తెచ్చి అందరిముందూ వుంచింది దివ్య.

స్నేహితురాళ్ళు బిస్కెట్లు తినే సమయం చూసి చిరుహాస చల్లగా మేడమీదకువెళ్ళి అజయ్‌కి తన స్నేహితురాళ్ళు వచ్చినట్లుచెప్పి ఇంక ఈ రోజు నీకు పాఠం చెప్పడం సాగదని చెప్పేసి వస్తుంటే ఆ అమ్మాయితో తన స్నేహితురాళ్ళు వచ్చినందుకు ఆనందాన్ని, తన స్నేహితురాలందించిన పెళ్ళి శుభవార్తనీ అధిగమించిన నిరాశ–యింకొద్దిసేపు అజయ్ ఎదురుగా వుండే అవకాశం జారిపోయినందుకు బాధ, తపన.

అజయ్‌కి తను అతన్ని ప్రేమిస్తున్నట్లు చెప్పేయాలనే ఆ అవకాశం తనకు త్వరలోనే రాబోతున్నందుకు ఆనందం.

పెళ్ళికి నర్సింహకొండకు ఎలాగయినా అజయ్‌తో వంటరిగా వెళ్ళి మాట్లాడాలి ఇప్పటినుండి తన స్నేహితురాళ్ళంతా తనతో కల్సి రాకుండా ఏర్పాటు చేసుకోవాలి. తల్లికి తండ్రికి అబద్ధం చెప్పయినా సరే అజయ్‌ని తీసుకుని త్రివేణి పెళ్ళికెళ్ళాలి. అజయ్ ఒప్పుకుంటే ఆ తర్వాత తన తల్లిదండ్రుల్ని ఒప్పించాలి. యిలా అనుకున్న చిరుహాసలో నూతనోత్సాహం.

"మమ్మీ! నువ్వు వంటింట్లోకి రాకు. ఆ అబ్బాయికి చేసిపెట్ట పోయాననే దిగులుకంటే తను సమోసా రుచికరంగా చేసుకుని తినలేక పోయాననే బాధ ఎక్కువవుతుంది దీనికి.

"అయ్యో ఆంటీ ఇదెక్కడిగోల నేనేదో మీకు చేసిపెడదామని ఆశపడితే" త్రివాణి దివ్య వైపు తిరిగి అంది.

"కాయ్ కాయ్ ఆంటీ నమ్మినా మేము నమ్మములే.... పెళ్ళి కుదిరినప్పటి నుండి ఇది వంటింట్లో నుండి బయటకు రావడంలేదని మీ అమ్మే చెప్పారు" సుజన మాటలకు దివ్య అంది.

"ఆడపిల్ల కెంత ధనమున్నా వంట వచ్చి వుండాలమ్మా. మీకు వంట రాదనుకో వంట మనిషి నెలకు పది కేజీలు నూనె, 4 కేజీలు డాల్డా, 10 కేజీలు చింతపండు అంటూ లిస్ట్ చెప్తే మీరు తెచ్చివ్వద్దూ.

ఎలా చేసిపెట్టినా తినాలకదా ఒకవేళ వంటావిడ మానేసిందే అనుకో.... మీకు వంట వచ్చుంటే మీరావిడ కోసం ఎదురుచూడ కుండా వంట చేసుకోగలరు."

"అలా చెప్పండాంటీ ఈ కోతులకు" త్రివాణి వెక్కిరించింది.

ఓ కె ఓ కె పదండర్రా మన వాణి చేసిపెట్టే సమోసా తినాలని ఇప్పటి నుండే నా నోట్లో లాలాజలం వూరుతోంది" పావని లేచి నిలుచుంది.

అందరూ కల్సి వంటిట్లో దూరారు.

"ఈ వుర్లగడ్డలు ఎలా కోయాలో చెప్పవే హెడ్ కుక్కూ" శ్యామలి అడిగింది.

"మైదాపిండి ఆయిల్ వేసి కలపమంటావా? లేక నీళ్ళేసి కలప మంటావా?" "పెళ్ళి కూతురా చెప్పు" సుజన కేకేసింది.

"ఇదిగో ఈ ఉల్లిపాయలు పచ్చిమిరపకాయలు పొడవుగా తరగనా? సన్నగా తరగనా నా వాణీ చెప్పవే" చిరుహాస గలగల లాడింది.

"అబ్బబ్బ ఆగండర్రా మీ ప్రశ్నలతో నేను నేర్చుకున్న సమోసా మర్చిపోయే ప్రమాదం వచ్చిపడేలా వుంది" త్రివాణి రెండు చేతులు తలమీద పెట్టుకుని వంటింట్లో వున్న పీటమీద కూలబడింది.

"అందులో నువ్వింత పోజిచ్చే ప్రమాదమేముందట?" పావని క్వొచ్చిన్ మార్క్ ఫేసు పెట్టి అడిగింది.

సమోసా రుచిగా కుదరలేదనుకో ఆంటీ మన హాసను పెళ్ళికి పంపదుగా."

"అంతేగా మీ ఆయన రాకుంటే ప్రమాదం ముంచుకొస్తుందికానీ హాస రాకుంటే నష్టమేమిటట?" సుజన కూడా వెళ్ళి త్రివాణి ప్రక్కన కూర్చుంది.

"అమ్మో చాలా బాధపడాల్సివస్తుంది నేను సో నువ్వు సమాసా రుచిగా చెయ్యవే" అని అంటున్న చిరుహాసమీద కొచ్చేసారంతా.

"ఏమిటట? దీని పెళ్ళికి రావాలని హటాత్తుగా ఇంత ఇంటరెస్ట్ పుట్టుకొచ్చేసింది. అందరం కల్సి దీని పెళ్ళి చూపులప్పుడు ఎంజాయ్ చేశాము చేద్దామని రెండుసార్లు ఫోనులుకొడితే తల నొప్పంటూ సాకులు చెపుతావా? పోనీ పెళ్ళి చూపుల టైమ్‌లో నిజంగానే తలనొప్పనుకో."

"ఏమిటి తల నొప్పనుకో అని సమర్థిస్తున్నావు. ఓ టాబ్లెట్ వేసుకుని వేడిగా టీ త్రాగేస్తే తలనొప్పిపోదా దీనికి రావాలనిలేకగానీ" పావని రెట్టించింది.

"రావాలని లేకపోవడమేమిటి పాపం అలా అనకండర్రా ఎవరి కయినా బాగుండనప్పుడెలావస్తారు. స్నేహితురాల్ని సమర్థించింది శ్యామలి.

"ఓ కె నీవన్నట్లు హాసగార్కి తలనొప్పే వచ్చింది రాలేదు. ఆ తర్వాత కనీసం పెళ్ళి కుదిరిందా? అబ్బాయేం చేస్తున్నాడు? యెలా వున్నాడు? అని అడగొచ్చుకదా! దానికి తలనొప్పి అడ్డొచ్చిందా?" సుజన అడిగింది.

"అసలు నాకేదో డౌట్‌గా వుంది. మనకు తెలియకుండా యిది ప్రేమాయణంలో పడిందా"? అని త్రివాణి చిరుహాస తలమీద ఒకమొట్టి కాయ యిచ్చి అంది.

చిరుహాస ఉలిక్కిపడినా సర్దుకుంది ఆ అమ్మాయి మనస్సులో అజయ్ తను చెప్పబోయే విషయం- అందుకతని ముఖంలో ఫీలింగ్స్ అతనందించే రెస్పాన్స్ అన్నీ కదలాడాయి కానీ పెదవి విప్పి నిజం చెప్పలేదు తన స్నేహితురాళ్ళకు.

కామెర్ల మనిషికి వూరంతా పచ్చగా కన్పించినట్లు నీకు పెళ్ళి కుదిరేసరికి అందరూ పెళ్ళిళ్ళ ప్రయత్నాల్లో వున్నారనుకుంటే ఎలా" అనే శ్యామలివైపు నవ్వుతూ చూచింది చిరుహాస.

"కబుర్లేనా నాకేమైనా హెల్ప్ చేసేదుందా?"

"పెళ్ళికూతుర్ని చేసేటప్పుడు నేను నీకు హెల్ప్ చేస్తాగానీ నన్నొదిలేయ్ నీ సమాసా అక్కరలేదు హాయిగా వి సి ఆర్ లో నాగార్జున సినిమా పెట్టుకుని చూస్తాను."

"నాగార్జున పిక్చర్‌కి వెళదామా యిప్పుడు. కృష్ణలో వుంది.

"నేను రెడీ...." పావని అంది.

"అమ్మకు చెప్పకుండా వచ్చాను" నసిగింది శ్యామల.

"ఒక పని చేద్దాం అందరిళ్ళకు ఫోన్‌చేసి చెప్పేద్దాం" ఉషారుగా అంది.

"ఏమీ వద్దు హాయిగా యిక్కడే కబుర్లు చెప్పుకుందాం పైకి పోదాం రండి" చిరుహాస అంది.

"మరి సోమాసా వద్దా" త్రివాణి మాటలకు అందరూ నవ్వారు.

"రుచిగాచేసి పెళ్ళి కాగానే మీ ఆయనకు పెట్టుకుందువులే పద"

"ఆంటీ నడిగి నేను సోమాసాచేసి పెట్టకపోయినా హాసను నా పెళ్ళికి పంపుతానంటేనే నేనీ వంటింట్లోనుండి వస్తాను."

అప్పటికే వంటింట్లో ఎలా చేస్తున్నారా? అని చూద్దానికి వచ్చిన దివ్య ఆ మాటలకు నవ్వుకుంది.

"అందరూ కల్సి వెళ్ళదురులే నీ పెళ్ళికి తప్పకుండా చిరుహాసను పంపుతాలే."

"థాంక్స్ ఆంటీ థాంక్యూ వెరీమచ్" అంటూ అందరూ మేడ మీదకు కదిలారు.

పిల్లల ఉత్సాహానికి నవ్వుకుంది దివ్య.

★ ★ ★ ★

"హాసా! మీ కారు డ్రయివర్ లేడుగా అంకుల్‌ని శ్రమ పెట్టవద్దు నేను కారుని పంపుతాను అందరూ ముందురోజు రాత్రి నరశింహ కొండ మీదకు వచ్చేయండి సరదాగా కబుర్లు చెప్పుకుందాము."

"మరుసటిరోజు మధ్యాహ్నం పెళ్ళికదా రాత్రికెందుకు ఆ రోజు ప్రొద్దున్నే వస్తాం" శ్యామల అంది.

"ఉహూఁ నేనొప్పుకోను మీరంతా నేను వెళ్ళేటప్పుడు రావాల్సిందే. మన కోసమే ఒక కాటేజ్ తీసుకుంటాను సరేనా?"

"మాకు తెలియదు నువ్వొచ్చి మా ఇళ్ళల్లో పర్మిషన్ తీసుకుని కారు పంపితే హాయిగా వచ్చేస్తాం" పావని మాటలకు సరేనంది త్రివాణి.

"ఆంటీ! హాసను శుక్రవారం రాత్రి పంపండి. అందరం కల్సు కునేది ఇలాటప్పుడే కదా!" అడిగింది త్రివాణి.

"నేను మీ అంకుల్ రావద్దా" సరదాగా అడిగింది దివ్య.

"భలేవారే ఆంటీ! మీరు అంకుల్ రావాలేగానీ నాకెంత సంతో షంగా వుంటుంది. అమ్మ వచ్చి కార్డు ఇస్తారాంటీ తప్పకుండా రండి."

"అంత శ్రమ వద్దులేమ్మా. మేము వస్తాములే ఆ ఫార్మాలిటీస్ పెట్టుకోకు" అలా అందేకానీ ఆ త్రివాణి ఇంట్లో వాళ్ళెవ్వరూ తెలియదు ఎలా వెళ్ళడం అనుకుంది మనసులో.

గేటు దగ్గర నిలబడి ఫ్రెండ్స్‌నంతా సాకనంపుతుంటే అజయ్ స్నానంచేసి ప్యాంటు చొక్కా వేసుకుని బయటకెళ్ళబోతున్నాడు.

నాలుగడుగులు దాటి అజయ్ వెళ్ళిపోగానే స్నేహితురాళ్ళంతా నాలుగడుగులు వెనక్కువేసి—

"ఎవరే ఆ మన్మధుడు" మెల్లిగా అడిగారు.

చిరుహాసకు ఏమి చెప్పాలో వెంటనే స్ఫురించలేదు.

"నాన్నగార్కి తెలిసినబ్బాయిలే—మీరు వెళ్ళిపోండి నేను మమ్మీ గాడితో వస్తాను." అని మాట మార్చింది.

"ఆ అబ్బాయి పేరేంటి? ఏం జాబ్ చేస్తున్నాడు? యింత అంద మైన అబ్బాయిని వదిలిపెట్టి వేరే ఎక్కడో మా స్నేహితురాలికి మ్యాచ్ వెతకొద్దని అంకుల్‌కి ఆంటీకి చెప్పాలి" త్రివాణి వెళ్ళబోతున్న అజయ్ వైపే చూస్తూ నిల్చుని అంది.

"హాసా! ఆ అబ్బాయి పేరేంటి అంటే చెప్పవేం?" సుజన ఆత్ర తగా అడిగింది.

"అజయ్"

"మన కాస్టేనా? వాళ్ళ అమ్మా నాన్న ఎక్కడుంటారు? ఇప్పుడు ఇక్క డెందుకున్నాడు? చాలా అందంగా వున్నాడు" పావని మాటలకు శ్యామల అడ్డొచ్చింది.

"మన వాణికి కోపం రాగలదు. ఎవరో దారినవెళ్ళే అబ్బాయి బాగున్నాడంటే."

"కోపం ఎందుకూ?"

"మరి మన వాణికి కాబోయే శ్రీవార్ని పొగడనందుకు."

"డోంట్ వర్రీ వాణీ! నీ ప్రక్కన పెళ్ళిపీటలమీద కూర్చుం టాడు కదా అప్పుడు ఆ అబ్బాయిని పొగిడేస్తాం పురోహితుడి మంత్రాలు కూడా వినిపించనంత గట్టిగా."

"ఉష్ ఇది గోడ్డుతల్లి లౌడ్ స్పీకర్ లేకుండా ఏడూర్లకు వినిపిం చేలా అరవకే" పావని నోరు మూపించి-

ఇంతలో స్వరూప్ కారు రావడంతో పిల్లలంతా కారుని చుట్టే సారు.

"అంకుల్ శనివారం నర్సింహా కొండమీద పెళ్ళి. మీరు ఆంటీ, చిరుహాస తప్పకుండా రావాలి" అని చెప్పింది త్రివాణి.

"అలాగేమ్మా మీరు లోపలికి రండి" అని పిల్చాడు స్వరూప్.

"చాలా సేపయిందంకుల్ మేము వచ్చి. వెళ్తామంకుల్" అంటూ వెళ్ళిపోయాకగానీ చిరుహాసు టెన్షన్ తగ్గలేదు.

అజయ్ వివరాలు యింకా డీప్‌గా అడిగితే ఏం చెప్పాలా? అని ఆలోచిస్తూనే వుందికానీ అజయ్‌ని వాళ్ళు తక్కువ అంచనావేసి మాట్లాడతారేమోనని భయపడింది. ఈసారి అజయ్‌ని తన స్నేహితురాళ్ళకు తనకు కాబోయే భర్తగా పరిచయం చేయాలి అనుకుంది.

వాణి పెళ్ళి వారం రోజులుంది. ఆరోజు ఎలాగయినా అజయ్ అక్కడకు వచ్చేప్లాన్ వేయాలి అనుకుంటూనే వెళ్ళి ఆరురోజులు గడిపింది చిరుహాస. ఆ సాయంత్రం ఫ్రెండ్స్‌కంతా ఫోన్‌చేసి చెప్పేసింది. మీరెళ్ళిపోండి నేను డాడీ వాళ్ళతో వస్తాను అని.

చిరుహాసను ఇంక బలవంతం చేయలేదు సుజన. కారణం వాళ్ళు ఆ అమ్మాయిని ఒంటరిగా తమతో పంపాలంటే చిరుహాస తల్లిదండ్రులు ఇష్టపడరని తెల్సుకాబట్టి- స్నేహితురాళ్ళని తప్పించగలిగింది. ఇక మిగిలింది తల్లిదండ్రి వాళ్ళనుకూడా పెళ్ళికి రావొద్దని నేర్పుగా చెప్పాలని తల్లి దగ్గర కెళ్ళింది.

"మమ్మీ! రేపే వాణి పెళ్ళి. మీరొస్తే అందరం కార్లో పట్టం కదా! మా ఫ్రెండ్స్‌ని వాణి కార్లో వెళ్ళిపొమ్మని చెప్పనా?"

"మేమెందుకులే అక్కడ మాకెవ్వరూ తెలియను. నువ్వు శ్యామలకి ఫోన్‌చేసి వాళ్ళు వెళ్ళేటప్పుడు నిన్ను తీసుకెళ్ళమని చెప్పు."

"వాళ్ళకి కారు లేదు మమ్మీ ఎలా?"

"విశ్వేశ్వర్ అంకుల్‌కి ఫోన్‌చేసి చెప్తారే వాళ్ళ డ్రయివర్‌ని పంపించమని."

"నేను ఫోన్‌చేసి చెప్పనా మమ్మీ"

"అలాగే చెయ్యి. ఆంటీకి అంకుల్‌కి ఎక్కడికయినా వెళ్ళే పనుంటే వద్దని చెప్పు బాగుండదు" వంటింట్లో నుండి కత్తిపీట మీద కూర్చుని కూరగాయలు తరుగుతూ అంది దివ్య. తను ప్రాక్టీసు మానేసాక వంటపని తనే చేసుకోవడం మొదలెట్టింది దివ్య.

చిరుహాసకు వాళ్ళ డ్రయివర్ రావడం ఇష్టంలేదు. పదినిముషాలు అటు యిటు తిరిగింది. తను అబద్ధం చెప్పినా మమ్మీగానీ డాడీగానీ మరలా ఫోన్ చెయ్యొచ్చు ఆలోచించి యింకో అబద్ధం చెప్పింది తల్లికి.

"మమ్మీ! పావని వాళ్ళన్న ఫ్రెండ్‌అట పెళ్ళికొడుకు తమ్ముడు. అందుకని మన కారిస్తే అందరం కల్సి వెళదామంది పావని.

"అలాగే వెళ్ళండి. కానీ ఈరోజు వద్దు రేపెళ్ళి త్వరగా వచ్చేయండి."

అప్పటికి స్థిమిత పడింది చిరుహాస ఫ్రెండ్స్ంతా ఈరోజు వెళ్ళిపోయినట్లు తల్లికిగానీ తండ్రికిగానీ చెప్పకూడదనుకుంది. ఎలాగయినా కారు తనే డ్రయివ్ చేసుకుని వెళ్ళేలా చూసి అజయ్‌ని రమ్మని చెప్పాలనుకుంది. అజయ్ మమ్మీ డాడీ చెప్తేనేగానీ రాడేమో అని భయపడింది. ఆలోచనలకు వాయిదా వేసింది ఆ రోజుటికి.

"డాడీ! ఈరోజు వాణి పెళ్ళికదా మీరు రానంటిరి, నాకు కారు ఇవ్వండి డాడీ ప్లీజ్ నేను స్లోగా వెళతాను" తండ్రిని బ్రతిమిలాడింది.

'అమ్మో! నీకు ఒంటరిగా కారివ్వడమే మీ అమ్మ చంపేస్తుంది నన్ను."

"మమ్మీ! అంతపనిమాత్రం చేయరులే డాడీ. చంపితే నన్ను చంపేస్తుందేమో కానీ" నవ్వుతూ అంది చిరుహాస.

"ఎవరు ఎవర్ని చంపారు" న్యూస్‌కబుర్లేమో అనుకుని అడిగింది దివ్య.

"పేపర్ కబుర్లు కాదు. బేబీకి కారు ఇవ్వాలట. వాళ్ళ ఫ్రెండ్ పెళ్ళికి వెళ్ళడానికి. బేబికి కారు ఇస్తే నువ్వు నన్ను చంపేస్తావని చెపుతున్నా."

"ఛ. అలాటిమాటలేంటి? ఫర్వాలేదులే ఇవ్వండి. పావని అన్న డ్రయివ్ చేస్తాడట."

"మమ్మీ! పావని అన్న నిన్నే వెళ్ళిపోయాడట. విశ్వేశ్వర్ అంకుల్ కావలికెళ్ళారట. ఆంటీ చెప్పింది" అబద్ధం చెప్పింది చిరుహాస.

"ఎలాగూ వాణి పిల్చిందిగా డాడీ వచ్చి వదిలేసి వస్తారు నువ్వు మ్ ఫ్రెండ్స్ కారులో వచ్చెయ్."

"డాడీ వద్దులే మమ్మీ, ఎందుకంటే, వాణి పెళ్ళికి ముందురోజే రమ్మంది. అలాటిది ఇప్పటికిప్పుడెళ్ళి వెంటనే వస్తే బాధపడుతుంది డాడీ అంతసేపు అక్కడ ఒంటరిగా వుండాల్సి వస్తుంది."

"ఒంటరిగా వుండడమేమిటి కానీ చాలామంది తెలిసినవాళ్ళుంటా రక్కడ కాకుంటే అంతసేపు నేనక్కడుండటం వీలవదు ఈరోజు ఆఫీసులో పని ఎక్కువగా వుంది నాకు."

"ఇప్పుడు నేను కారు తీసుకెళ్ళకపోతే ఫ్రెండ్సుముందు షేమ్‌గా వుంటుంది" దిగులుగా అంది చిరుహాస.

"ప్లీజ్ డాడీ! ఈ ఒక్కసారికి నాకు కారివ్వండి డాడీ స్లోగా వెళతాగా."

"ఓ.కె. ఓ కె. కానీ, మీ అమ్మ పర్మిషనిస్తేనే."

"ఈ ఒక్కసారి ఒప్పుకో మమ్మీ" తల్లి గడ్డం పట్టుకుని బ్రతిమి లాడింది చిరుహాస.

"ఆ నరసింహకొండ రూట్‌లో ఎప్పుడూ దొంగల భయమే వద్దులేమ్మా హాసా. పైగా అందరూ ఆడపిల్లలు వెళుతున్నారు."

మూతి ముడిచింది చిరుహాస.

"పోనీ ఒక పని చేయండి. అజయ్‌ని తోడు తీసుకెళ్ళండి" ప్రతాప్ సలహా యిచ్చాడు.

చిరుహాస ముఖం ప్రకాశవంతమైంది.

"అజయ్ ఎందుకులెండి, అసలే ఈ వాతావరణానికి కొత్తవాడు" విసుగ్గా ముఖంపెట్టి అంది దివ్య, ఆడపిల్లలతో అజయ్‌ని పంపడమేమి టన్నట్లు.

"పోనీ నేను రానా జేజీ, వదిలేసి వచ్చి మరలావచ్చి తీసుకొచ్చు కుంటాను."

"ఏం వద్దు. అక్కడకెళ్ళి వెంటనే వచ్చేది కాదుగా. అయినా ఏం బాగుంటుంది డాడీ మీ రొస్తే డ్రయివర్లాగ."

నిజమే ననిపించింది స్వరూప్‌కి, దివ్యకు కూడా.

ముఖం గంటు పెట్టుకుని దిగులుగా కూర్చున్న కూతుర్ని చూసి దివ్య మనసు కరిగింది.

"జాగ్రత్తగా వెళ్ళి త్వరగా వచ్చెయ్యండి" అంది.

మెరూన్ కలర్‌కి చిగురుపచ్చ బార్డర్ వచ్చిన మైసూర్ శిల్క్ చీర, చిగురుపచ్చ డిజైన్ వచ్చిన శిల్క్ జాకెట్, మంచి కెంపుల హాంగింగ్స్, కెంపులహారం, కెంపులు పొదిగిన బ్రేస్‌లెట్.

అద్దంలో తన అలంకారం చూసుకుని తృప్తిపడింది చిరు హాస.

"మమ్మీ! హండ్రెడ్ రూపీస్ ఇవ్వవా ప్రెజెంటేషన్ కొనుక్కొస్తాను."

"అలాగే కాని, అంత ఖరీదయిన నగలెందుకు? చిన్న సెట్ పెట్టు కెళ్ళు."

"అజయ్ వెళుతున్నాడులే దివ్యా, భయంలేదు వెళ్ళనీ. ముచ్చటగా పెట్టుకుంది" కారుదగ్గరకు నడుస్తూ అన్నాడు స్వరూప్.

"మనం వున్నప్పుడయితే ఫర్వాలేదు. దాని ముచ్చటని నేను ఎప్పుడు కాదన్నాను గనుక. సరే త్వరగా వచ్చెయ్యండి" అంది దివ్య.

"చూడూ! కారు స్పీడ్‌గా పోనిస్తే మాత్రం ఒప్పుకోను. ఆడపిల్లలకు తోడు పంపుతున్నాం నిన్ను. జాగ్రత్త"

తలవూపాడు అన్నిటికి జవాబుగా అజయ్.

   

షాపింగ్ సెంటర్ దగ్గర కారాపి వందతూపాయలకు షేడ్స్ మారే టేబిల్ లైట్ కొని, ప్యాక్ చేయించి, కారులోవచ్చి కూర్చుంది.

ఆ ప్యాకెట్ అందుకోబోతున్న అజయ్‌ని వారించి తనే కారులో పెట్టింది చిరుహాస.

కారు మూలప్పేట దాటింది. చెరువుగట్టు దగ్గర చల్లని గాలి.

"ఇక్కడ కాసేపుండి వెళదామా అజయ్"

"మీ స్నేహితురాళ్ళంతా ఇక్కడ కలుస్తామన్నారా?" అమాయకంగా అడిగాడు.

"వాళ్ళంతా రాత్రే పెళ్ళికూతురుతో కలిసి వెళ్ళిపోయారట అజయ్. ఫోన్ చేస్తే చెప్పారు" ఎంతో శ్రమపడితే తనకి అజయ్‌తో యీ ఏకాంతం దొరికిందనే విషయం దాచింది చిరుహాస.

"మరి పెళ్ళి ఇక్కడేనా?"

పకపక నవ్వింది ఆమె.

"నర్సింహకొండమీద. సరే అక్కడికే వెళ్ళి ఆగుదాం పద" కారు స్పీడు పెంచిన చిరుహాసను చూస్తూ అన్నాడు.

"మీరు స్పీడు వెళుతున్నారు"

"అయితే నువ్వు డ్రైవ్ చెయ్యి అజయ్."

"స్టీరింగ్ నా కింకా బాగరాదు లెండి."

"నేను నేర్పిస్తాను. డ్రయివింగ్ సీట్‌లో కొచ్చేయ్" కారాపి అంది.

"ఊహుఁ వద్దులెండి మీ ప్రక్కన కూర్చోవడమేమిటి? ఎవరైనా చూస్తే బాగుండదు" అజయ్ కంగారుగా అన్నాడు.

"డ్రయివింగ్ నేర్చుకోవడానికి బాగుండకపోవడమేమిటి రా రా" వెనకసీట్లో వున్న అతన్ని పిలిచింది.

**"కారు పాడయిపోతుంది అనవసరంగా. మీరే స్లోగా పోనివ్వండి" సీట్లోనుండి కదలకుండా అన్నాడు.**

"స్టార్టింగ్ ఏముంది-ఇగ్నిషియన్ కి తిప్పి క్లచ్ నొక్కి ఫస్ట్‌గేర్ వేసి క్లచ్ మెల్లిగా వదులుతూ ఏక్సిలరేటర్ ఇస్తే కారు స్టార్టు అవుతుంది అంతే కదూ."

ఇంట్లో ఎవరయినా ఇంగ్లీషు పదాలు వాడుతుంటే అది చెవిలో వేసుకుని రెండవసారి ఆ పదాల్ని స్వచ్ఛంగా ఉచ్చరించగలుగుతున్న అజయ్ తెలివికి అబ్బురపడుతూ చెప్పింది.

"అంతేకాని, ఇంకా అనుభవం రాలేదు" నసిగాడు.

"మనం తిరిగి నెల్లూరెళ్ళే లోపల నీకు స్టార్టింగ్‌వచ్చేలా చేస్తాను నాకేం యిస్తావు."

"గుళ్ళో కొబ్బరికాయ కొట్టి ప్రసాదం తెచ్చి మీకిస్తాను"

"అదేం న్యాయం. పందెం నాతోవేసి కొబ్బరికాయ దేముడి కిస్తావా?"

"మిమ్మల్ని క్షేమంగా ఇంటికి తీసుకెళ్ళి అమ్మగారికి అప్పజెప్ప గలిగితే గుళ్లో కొబ్బరికాయ కొడతానని మ్రొక్కుకున్నాను."

"ఇంకా మా అమ్మకు నన్ను అప్పజెప్పలేదు కదా!"

"మీరేగా అన్నారు. తిరిగి నెల్లూరికెళ్ళే లోపల నాకు కారు స్టార్టింగ్ ఎలా చేయాలో పూర్తిగా నేర్పిస్తానని అంటే మనం తప్పకుండా క్షేమంగా వెళతామనే కదా అర్థం."

"ఏం నేను చెప్పినవన్నీ జరిగి తీరాలని రూల్ వుందా?"

"ఉంది. అంత తెలివిగలవాళ్ళు మీరు."

"మరి నామాటమీద అంత గురి ఉన్నప్పుడు నేను చెప్పినట్లు వినాలి కదా!"

"వినాలి"

"అయితే దిగిరా"

గబగబా వెనుక సీట్లోంచి దిగి డ్రైవింగ్ సీట్‌లో కూర్చున్నాడు అజయ్.

ఇగ్నిషియన్ కీ ఇస్తున్నాడు.

"అంతసేపొద్దు జస్ట్ చాలు"

"సరే" తనభాష సందర్భాన్ని బట్టి అర్థం చేసుకొన్నాడు.

"తర్వాత ఫస్ట్‌గేర్ వెయ్యి! నో నో క్లచ్‌మీద కాలు గట్టిగా నొక్కాలి. లేకపోతే గేర్‌బాక్స్ గోవిందా"

నవ్వి ఫస్టు గేర్ వేసాడతను.

"ఇక యాక్సిలేటర్ కొద్దిగా ఇచ్చి క్లచ్ వదిలెయ్"

అలా గురువుగారి ఆజ్ఞ ప్రకారమే చేస్తున్నాడతను. కానీ కారు గుద్దుకుంటోంది.

"అజయ్ క్లచ్ వదిలెయ్" కంగారుగా అంది చిరుహాస. కారెక్కడ చెడిపోయి ఆగిపోతుందోనని భయం ఆమె కళ్ళలో.

అజయ్ క్లచ్ వదిలేయగానే కారు ఆగిపోయింది.

"యాక్సిలేటర్ మీద కాలు తీయకతీస్తే కారాగిపోతుంది."

"ఓకే. ఓకే" మరలా ట్రై చేసాడతను.

అతను చిన్న చిన్న పదాలే ఇంగ్లీషులో చెప్తున్నా అతని ప్రొనౌన్సియేషన్‌కి ఆశ్చర్యపోతోంది చిరుహాస ఎప్పటికప్పుడు.

మధ్యలో గేదెలు అడ్డం వచ్చాయి. అజయ్ వేసిన బ్రేక్‌కి చిరుహాస ముందుకు తూలింది.

"క్లచ్ వదలొద్దు. అవి ప్రక్క వెళ్ళాక సెకండ్ గేర్‌లో కొచ్చేసి మూవ్ అయిపో" అతని భుజాల దగ్గరకి వచ్చి అంది.

అతను అలాగే చేసి కారుని ముందుకి పోనిచ్చాడు.

"అజయ్! నీకింత తెలివి వుందికదా! ఎప్పుడూ అంత దీనంగా, పిరిగ్గా వుంటావెందుకు."

అజయ్ ఆమె మాటలు వినడంలేదు. కారు డ్రయివింగ్ మీదే అతని ధ్యాసవుంది.

కారు కొండ ఎక్కడం ప్రారంభించింది. అది చాలా చిన్న కొండ. అయినా కొండ మలుపు తిప్పేటప్పుడు చిరుహాస పూర్తిగా అతనిమీద పడిపోయింది. ఆమెకది దివ్యాను భూతిగా వుంది. అది శాశ్వతమైతే బాగుణ్ణని వుంది.

అతను సడన్‌గా కారు స్లో చేసాడు. కారు వెనక్కి దొర్లి పోతోంది.

"అప్‌లో కారు స్లో చేయకూడదు. ఏక్సిలేటర్ ఇవ్వు" సరిగ్గా కూర్చుంటూ అంది చిరుహాస. అతను ఏక్సిలేటర్‌మీద పెట్టిన కాలుమీద తన కాలుంచి ఎక్సిలేటరిచ్చింది. అప్పటివరకు డ్రయివింగ్ మీదున్న ఏకాగ్రత చెరిగిపోయిందతనికి.

ఆమె స్పర్శ అతనిలో అలజడి రేపిందేమో కారు ఆపేసాడు.

"కారాపేసావేం అజయ్" అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

"వద్దులెండి. మీరే డ్రయివ్ చేయండి" ఎంతో ప్రయత్నంమీద అతని చేత అమ్మాయిగారు అనడం మాన్పించింది చిరుహాస.

"కాస్సేపు ఇక్కడ కూర్చుందామా అజయ్" కారుదిగి చిన్న చిన్న తెల్ల రాళ్ళ సరదాగా చూస్తూ అంది.

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? సరదాగా కబుర్లు చెప్పుకుందాం" అతని కళ్ళల్లో భావాల్ని పరిశీలిస్తూ అంది.

అతనికి ఆలోచనాశక్తి వస్తోంది. ఎదురుగా చిరుహాస అందమైన ముఖం, ఆమె మాటల్లో మంత్రశక్తి, ఆ చల్లటి వాతావరణం అతని గుండెల్లో పన్నీటి జల్లును కురిపిస్తోంది.

"వద్దులెండి వెళ్ళిపోదాం పదండి" వెనక సీట్లో కూర్చుంటూ అన్నాడు. అతని కళ్ళముందు యజమాని, యజమానురాలు మెదిలారు.

అజయ్ భయానికి నవ్వుకొంది చిరుహాస.

తనకు మాత్రం భయంలేదా? ఇంకా నిజం చెప్పాలంటే అతని కంటే తనకే ఎక్కువ భయం వుండాలి.

మొదటి పాయింట్ తను ఆడపిల్ల. రెండవ పాయింట్ తనకు పుట్టినప్పటినుండి తెల్సిన వూరి పరసర ప్రాంతాలు. ఎవరు కన్పించినా పరాయి అబ్బాయితో స్వరూప్ కుమార్తె ఒంటరిగా కూర్చుని కబుర్లు చెపుతుంది అని వాళ్ళ వాళ్ళ ధోరణిలో ఊహాగానాలతో కథలల్లుతారని ఆ అమ్మాయికి తెలియందేమీ కాదు.

కానీ అవన్నిటినీ అధిగమించి అజయ్‌తో ఏకాంతంగా సంభాషణ సాగించాలని, అతని కళ్ళల్లోకి చూస్తూ కాలం గాడి పేయాలని, అతని అందాన్ని స్వేచ్ఛగా చూస్తూ అతను చెప్పే కబుర్ల ఆనందాన్ని అనుభూతుల్ని గుండెల్లో భద్రపర్చుకొంటూ తర్వాత నెమరువేసుకోవడానికి తన గుండెల్లో భద్రంగా దాచుకోవాలనుంది.

అందుకే కోనేటి దగ్గర అమ్మవారి గుడివైపుకి డౌన్‌లోకిపోనిచ్చి కారాపింది.

"ఇక్కడ కారాపారేంటి?" చుట్టూ ఎగుడు దిగుడుగా వున్న పొదల్ని, రాళ్ళు రప్పల్ని చూస్తూ అడిగాడతను.

"ఓ.....నిన్ను నరశింహాకొండకెప్పుడూ తీసుకురాలేదుకదూ! ఈ మెట్లన్నీ దిగితే ఆ కోనేరు దాని ప్రక్కన గుడి వుంటుంది, అక్కడే నా ఫ్రెండ్ పెళ్ళి వెళదాం పద."

"మరి కారిలా వదిలేస్తే ఎలా? మిమ్మల్ని వదిలేసి నేను కారు దగ్గరకు వచ్చేస్తాను. మీరు పెళ్ళినుండి వచ్చేవరకు నేనిక్కడేవుంటాను"

"అయితే డ్రయివర్ జాబ్ చేస్తావా?"

"తప్పేముంది"

"ఊహుఁ నువ్వు నా దృష్టిలో ఎప్పటికీ డ్రయివర్‌వి కావు. డ్రయివింగ్ ఒక్కటే నేర్పించి మాకు డ్రయివర్‌గా వుంచుకోవాలనే ఉద్దేశ్యం మాత్రం నాకులేదు. నిన్ను వీలయినంత ఎత్తుకు ఎదిగేలా చేయాలనుకొనే నా ప్రయత్నానికి చన్నీళ్ళు చల్లకు అజయ్"

ఆమె మాటలు అతనికి పూర్తిగా అర్థమయ్యాయో లేదో కానీ నిశ్శబ్దంగా నడవసాగాడు.

అతనితో సమానంగా నడవలేక పోతున్న చిరుహాస నడకస్పీడు పెంచింది. అంతే ప్రక్కకు తూలింది హైహీల్ చెప్పువల్ల.

"అరెరె జాగ్రత్త" ఆమె రక్షణ భారం తన మీదున్నట్లు ముందు నడుస్తున్న అజయ్ వెనక్కి నాలుగడుగులు వేసాడు. అప్పటికే చిరుహాస నిలదొక్కుకుంది ఈసారి అతను మెల్లిగా నడవసాగాడు.

అతనలా ఆమెకు ప్రేమ పూర్వకమైన రక్షణ ఇస్తుంటే చిరుహాసలో స్పష్టంగా తోచని భావ సంపదకు ఒక రూపం ఏర్పడింది.

అతని ప్రక్కగా నడుస్తున్న చిరుహాసకి అది శాశ్వతమైతే బాగుణ్ణనిపించింది. ఆమెకి తెలియకుండానే ఆలోచనలు చుట్టుముట్టాయి.

తనెందుకు అజయ్‌ని పెళ్ళిచేసుకోకూడదూ! అంత తెలివి వున్న అజయ్‌కేం తక్కువ? ఎంత అందగాడయినా అందరూ డిగ్రీకూడా లేని వాడ్ని చిరుహాస పెళ్ళి చేసుకొంది అంటారా ?

డిగ్రీ వచ్చాకే చేసుకొంటే సరిపోతుంది కదా! అప్పుడు....తమ బంధు మిత్రులంతా స్వరూప్ తన అంతస్థుకి రెండింతలు హోదా వున్న

అల్లుడ్ని తెచ్చుకోక ఈ అడవి మనిషిని అల్లుడుగా ఎందుకు చేసుకున్నట్టు? అని ఇంకేదో ఊహించుకొని తనను దోషిగా తన తండ్రికి నిస్సహాయుడిగా సృష్టిస్తేనో....! నో నో విజయ్‌ని పరోక్షంగా కూడా అలా అంచనా వేసుకొనేలా, తండ్రి తల వంచుకొనేలా తను అంటి అనుమానాలమధ్య అజయ్‌ని పెళ్ళి చేసుకోదు.

తల్లీ, తండ్రిని ఒప్పించి సంతోషంగా తండ్రి తనకు చేసే వైభవ పేతమైన మండపంలో నునుసిగ్గుల పెళ్ళి కూతురిగా అజయ్ ప్రక్కన కూర్చుంటుంది. తండ్రి ఒప్పుకున్నా, తల్లి సుతరామూ ఒప్పుకోదని తెల్సినా ఆ అమ్మాయిలో గట్టి పట్టుదల, గట్టి నమ్మకం తను ఆమెను సులభంగా ఒప్పించగలనని—ఆ ఆలోచనలమధ్య పెద్ద రాయి తట్టుకొని ప్రక్కకు పడిపోతూ' వుంది. అసంకల్పితంగా అజయ్ తన రెండు చేతులమధ్య ఆమెను పట్టుకొని పడకుండా ఆపాడు.

ఈ మారు చిరుహాస శరీరంలో ప్రతి భాగం జల్లుమంది. వెంటనే అతన్ని తప్పించుకుని ప్రక్కకు రావాలనిపించలేదు. అతని చేతుల్లో అలా యిమిడిపోతే బాగుణ్ణునే కోరిక పటిష్టంగా ఏర్పడింది.

"మీరు ముందా చెప్పులుతీసి నా చేతికివ్వండి వాటి వల్లే రెండు సార్లు పడబోయారు."

"నేను పడబోతే పట్టుకునేందుకు నువ్వున్నావుగా అజయ్ ఇంక నాకేం భయం."

"మీరు పడబోయేది చూడకపోతే ఏ కాలో విరిగితే మీ అమ్మగార్కి నాన్నగార్కి నేనేం జవాబు చెప్పుకోవాలి. వచ్చేటప్పుడు అమ్మగారు జాగ్రత్త అని చెప్పనే చెప్పారు."

"అంటే నా కాలువిరిగినా పర్వాలేదుగానీ మా అమ్మకు, నాన్నకు జవాబు ఎలా చెప్పాలనేదే నీ భయమన్న మాట" ఉడికించింది చిరుహాస.

"అలా ఎప్పటికీ అనుకోవద్దు. మీకాలు విరిగితే నాకాలు విరిచయినా మీ కాలు నయం చేయమంటాను."

మాటల రూపంలో దృఢంగా అతని అభిమానాన్ని బహిర్గతం చేసాడు.

చిరుహాస గుండెల్లో సెలయేళ్ళు తుళ్ళాయి....అతని అభిమానానికి మరో రూపం.

అమ్మను, నాన్నను ఎదిరించయినా అజయ్‌ని పెళ్ళి చేసుకోవాలనే స్థిర నిశ్చయం.

మెట్లన్నీ దిగినా అక్కడెవ్వరూ కన్పించక పోవడంతో అజయ్ చుట్టూ చూసాడు.

పూజారికూడా లేని చాలా చిన్న దేవాలయం చుట్టూ స్థలం. ఒకపుగా పాడుబడిన కోనేరు.

"ఇదేంటి? మీరు పొరపడలేదు కదా! ఇక్కడ పెండ్లి సందడే లేదేంటి? మీ స్నేహితురాలి పెళ్ళి ఈ రోజు కాదేమో!"

అన్ని మెట్లు దిగిన అలసట చిరుహాస ముఖంలో స్పష్టంగా కన్పిస్తోంది.

"మా స్నేహితురాలి పెళ్ళి ఈ రోజే మహాశయా! కాకుంటే చిన్న మార్పు. మనం కొండ క్రింద దేవాలయంలో వున్నాము. వాళ్ళు కొండ మీద దేవాలయంలో వుంటారు." అనేసి "గొంతారిపోంది వాటర్ బాగ్ తెచ్చుకునుంటే బాగుండేది." స్వగతంగా అనుకున్నట్లుగా అంది.

ఆమె మాటలు గొంతునుండి వెలుపలికి రాగానే అతను పరిగెట్టాడు.

ఆ చిన్న కోవెల మూలలో ఒక చిన్న కుళాయి. అక్కడకు వెళ్ళి నీళ్ళు దోసిట్లో పట్టుకుని వచ్చి ఆమె దోసిట్లో పోసాడు.

అతని దోసిట్లో నీళ్ళయితే మిగలలేదు గానీ అతనందించిన ప్రేమ మాత్రం మిగిలింది.

ఇతను మంచి మనిషి మనసున్న మనిషి తన ప్రేమను ఎదుటి మనిషికి పంచి సుఖపెట్టగలిగే మనిషి. ఇతని నీడలో తన భవిష్యత్తు బంగారు బాటవుతుంది. అని పదిహేడేళ్ళ చిరుహాస మనస్సు పదే పదే చెప్పసాగింది.

మరలా దోసిట నిండా జాగ్రత్తగా నీళ్ళు తెచ్చి ఆమె దోసిట్లో పోస్తూ "మీరు మరలా మెట్లన్నీ ఎక్కగలరా? యిప్పటికే మీ ముఖం కందిపోయింది."

అతని చూపుల్లో ఆమె పట్ల అభిమానంతో కూడిన జాలి, సాను భూతి.

ఆ జాలి-సానుభూతి స్థానంలో చిరుహాస వేరే విధంగా వూహించు కుని తృప్తిపడింది. ఆ తృప్తిలో వెంటనే భావోద్రేకాన్ని ఆపుకోలేక అనే సింది.

"తప్పకుండా రాగలను అజయ్ నువ్వు ప్రక్కనుంటే ఏ పని నయినా సులభంగా చేసేస్తాను. ఆ మెట్లేకాదు నెల్లూరికి నడిచి రమ్మన్నా అలసటలేకుండా వచ్చేస్తాను."

"ఏమిటో ఈ రోజు ఏదోగా మాట్లాడుతున్నారు మీరు!"

"తప్పుగా మాట్లాడానా?"

"అలా అని నేనడం లేదు. కొత్తగా మాట్లాడుతున్నారు అంటు న్నాను" కలవరపాటుని కప్పి పుచ్చుకుంటూ అన్నాడు.

"అంత కలవరపాటెందుకు అజయ్ నేనంటే నీ కిష్టం లేదా?"

అజయ్‌కి అనుకోని ప్రశ్న ఇది అయినా అతను వెంటనే జవాబు చెప్పాడు

"మీరంటే నా కిష్టం లేకపోతే ఇంత దూరం మీతో నేనెందు కొస్తాను."

"అంటే....అంటే దానర్థమేమిటి అజయ్" కొద్దిగా తడబడుతూ అడిగింది చిరుహాస.

"ఏమో నా కెలా తెలుస్తుంది? నేనంత తెలివయిన వాడ్ని కాదను కుంటున్నాను. అడవిలో పుట్టి పెరిగి పెద్దదయిన వాడ్ని ఇప్పుడేదో మీ మంచితనంతో, మీ విశాల హృదయంతో కొంత ఆలోచించే శక్తి వచ్చిన వాడ్ని....దీనికంతా కారరణమయిన మీరంటే నాకిష్టం లేకపోవట మేమిటి?"

"అది కాదు అజయ్ నన్ను నీ భార్యగా చేసుకోవాలని లేదూ!" చిరుహాస ట్రాన్స్‌లో వున్నట్లుగా అడిగింది.

చిరుహాస ప్రశ్నకు అజయ్ నివ్వెరపోయినట్లు ముఖం పెట్టి తన చెవుల్ని శంకించాడు. కాదని తెల్చాక తేరుకుని అన్నాడు.

"మీరు సినిమాల్లో మాటలు మాట్లాడుతున్నారు."

"ఎన్ని సినిమాలు చూసావ్ అజయ్."

"డిష్ ఎంటెన్నాల పుణ్యమా అని ప్రతి రోజూ ఏదో ఒక రక మైన సినిమా చూస్తూనే వున్నాగా."

"నేనడిగిన ప్రశ్నకు జవాబిది కాదు" అతని వైపే చూస్తూ అంది చిరుహాస.

"మీరు పదండి మీ స్నేహితురాళ్ళంతా మీ కోసం ఎదురు చూస్తూ వుంటారు"

మాట తప్పించాడు గానీ అని కంఠంలో నుండి వచ్చిన ఆ మాటలు అతి కష్టం మీద వచ్చాయని చిరుహాస గ్రహించేసింది

"నా కోసం ఎదురు చూసే స్నేహితురాళ్ళ కోసం నేను ఆరాట పడ్డం లేదు. నీ విచ్చే జవాబు కోసం ఎదురు చూస్తున్నాను."

"మీకు అలాటి ప్రశ్న అడగాలని ఎలా అన్పించింది? నేను చదువు, ఉద్యోగం, ఆస్థిలేని అడవి మనిషిని ఆఖరకు నాగరిక ప్రపంచంలో మెలగడానికి కావాల్సిన తెలివి తేటలు కూడా లేనివాడ్ని."

"అని ఎవరన్నారు? నీ తెలివి తేటలేంటో నేను అంచనా వేయగలను. ఇక్కడే నువ్వు పెరిగుంటే మాలాగే చదువుకుని వుంటే అద్భుతమైన వ్యక్తిగా పరిగణించబడేవాడివి. వీలైతే సూర్యమండలం పోవడానికి కూడా ఓ క్రొత్త రాకెట్‌ని డిస్కవర్‌చేసి అందులో మొట్ట మొదటి వ్యక్తిగా నువ్వే వెళ్ళి వచ్చేవాడివేమో?"

ఆమె పొగడ్తలు అలా సాగుతూనే వున్నాయి. మధ్యలోనే అపి అతను సాలోచనగా అన్నాడు.

"మీరన్నట్టు బహుశా యిక్కడ పెరిగుంటే సూర్యమండలం వెళ్ళలేకపోయినా, అంతటి గొప్ప వ్యక్తిని కాలేకపోయినా, తెలివిగల వాడ్నయ్యుండునేమో కానీ పెరగలేదుగా....యింత పెద్దయ్యాక పలక పట్టుకుని మీ ముందు కూర్చుని అక్షరాలు నేర్చుకున్న మనిషిని యిలాటి ఒక అనామకుడ్ని తన కూతురు ఇష్టపడుతున్నందుకు మీ తల్లి దండ్రులు నన్ను అసహ్యించు కుంటారు."

"నువ్వెందు అనామకుడవుతావు అజయ్! నన్ను పెళ్ళి చేసుకుంటే నేను నీ కుంటాను నా వెనక మా మమ్మీ డాడీ నీకు కొండంత అండగా నిలబడతారు. మా మమ్మీ డాడీ అసహ్యించు కుంటే నన్ను అసహ్యించుకుంటారు గానీ నిన్నెందుకు అసహ్యించుకుంటారు? అసలు నీవెందు కింత భయపడుతున్నావో నా కర్థం కావడం లేదు నా కోరిక విని సంతోషపడతావనుకున్నాను కానీ యిలా బెంబేలు పడతావనుకో లేదు."

"మీరు అంతదూరం ఆలోచించకండి. ఒక్కపూట కూడా మా ఇంట్లో మా అమ్మ చేసిన రొట్టెలు తినలేకపోయారు. అంత సుకుమారముగా పెరిగారు. నేను మొరటువాడ్ని నాతో మీ జీవితం ఏ కోణంలో నుండి కూడా బాగుండదు."

"నిజం చెప్పు అజయ్ నేనంటే నీకిష్టంలేదూ!" ఆమెలో ప్రకంపన.

"మీరు నేను భార్యాభర్తలవడం జరగని పని. నామీద జాలితోనో, మీమీద ప్రేమతోనో మీ కోరిక కాదనలేక సార్ నన్ను మీతో తీసుకొచ్చి వాకు సంఘంలో ఎలా మెలగాలో తెల్పుతున్నారు. ఈరోజు నేను ఏదయినా పొరపాటుచేస్తే నన్ను నేను క్షమించుకోలేను. మనిషికీ మనిషి మధ్య స్నేహభావం వేరు, పెళ్ళివేరు."

అజయ్ మాటలు వింటూ అతను ఆర్జించుకున్న విజ్ఞానానికి విస్తుపోతోంది చిరుహాస కాస్సేపాగి అంది.

"మా మమ్మీ డాడీని ఒప్పించే బాధ్యత నాది. అప్పుడు నీకిష్టమేనా?' ఎంత గుచ్చి గుచ్చి అడిగినా అతని మనసులో తనపట్ల ఏ భావం వుందో తెల్సుకోలేకపోతోంది చిరుహాస.

"అడవిలో బ్రతికే మనిషిని ఒక మంచి వ్యక్తిగా రూపొందించాలనుకుంటే అది తప్పులేదు. కానీ ఇది అంటే నన్ను పెళ్ళిచేసుకోవాలనుకోవడం మాత్రం తప్పే. వాళ్ళ దృష్టిలో తప్పే అవుతుంది. కూతురి కోరిక కాదనలేక ఆ రోజు నన్ను తీసుకొచ్చారు కానీ అలాగే ఈ కోరిక కూడా తీరుస్తారనుకోవడం మీ భ్రమ మాత్రమే. పెద్ద దొరబాబుని తెచ్చి మీ పెళ్ళి వైభవంగా చేయాలని వాళ్ళెంతగా కోరుకుంటున్నారో మీకు తెలుసు. అలాంటివాళ్ళని మీరు బాధ పెట్టకూడదు."

"ఆ దొరబాబు మీరే ఎందుకు కాకూడదూ?" అతన్ని మాటల్లో తన ప్రశ్నకు జవాబు తెల్సుకోవాలనే బలమైన కోరికతో అడిగింది

"మీరు నిజంగానే ఇలా ఎలా మాట్లాడగలుగుతున్నారు? మా బంధు బలగం అంతా రెక్కల కష్టంమీద బ్రతికే మనుష్యులు. మొరటువాళ్ళు. మీ బంధుబలగమంతా కార్లలో తిరిగి ఇంటికొచ్చి అలసిపోయే సుకుమారులు. మా అమ్మా నాన్న తమకు కాబోయే వియ్యంకులని

చెప్పుకోడానికే మీ బంధుజనగం ముందు మీ అమ్మ, నాన్నగార్కి అవ మానంగా వుంటుంది."

"అంతేకాదు మీ తల్లిదండ్రులు మా అల్లుడికింత ఆస్థి హోదా వుందని చెప్పుకోవడానికి కూడా నా దగ్గరేమీలేదు."

"నాక్కావల్సింది నువ్వు అజయ్ అంతే. నీకెందుకు మా అమ్మ నాన్నలను ఒప్పించే పూచీ నాది. అసలు.... అసలు నీకు నేనంటే ఇష్టమో కాదో చెప్పనే లేదు" అతను అన్ని నెగటివ్ పాయింట్స్ చెపుతున్నా చిరుహాస మనసు మారకపోగా అతనార్జించిన లౌకిక జ్ఞానానికి ఇంకా ఎక్కువగా అతనిపట్ల ఆకర్షితురాలవుతుంది.

అతని మనస్సుపొరల్లో ఏదో అలజడి.

"నామీద మీకిష్టం వున్నా నాకు మీమీద ఇష్టం వున్నా నష్టం లేదుకానీ పెద్దలనెదిరించి నన్ను పెళ్ళి చేసుకుంటే మీరు చాలా నష్ట పోతారు. అదే నా భయం. అందని పండుకి ఆశపడ్డం అవివేకమవు తుంది" అతని మాటల్లో స్థిరత్వం.

"అందని పండని ఎందుకనుకుంటున్నావు అజయ్. నీ ఒళ్ళో రాలిన పండుని. తీసుకోవడం తప్పుకాదే" అక్కడున్న చిన్న గులక రాళ్ళను తీసుకుంటూ అంది.

తప్పో కాదో నాకు తెలియదు కానీ పెళ్ళి చేసుకున్నాక మీ కోర్కెలన్నీ నేను తీర్చలేకపోయిన మరుక్షణం మీకు ఈ పేదవాడి మీతా ఏవగింపు కలుగుతుంది

"నో... నో అలా ఎప్పటికి అనుకోకు. నా కెప్పటికి నీమీద ఏవ గింపురాదు నిన్ను చూసిన క్షణంలోనే నీ అందానికి అబ్బురపడ్డాను. అడవిలో అజ్ఞానంలో వున్న నిన్ను విజ్ఞానవంతుడిగా తీర్చిదిద్దాలను కున్నాను. అందుకే అమ్మను నాన్నను ఒప్పించి నిన్ను తీసుకొచ్చాము. రోజులు గడిచేకొద్దీ నిన్ను చూడకుండా వుండలేని స్థితికి వచ్చాను. నీతో

జీవితం పంచుకోవాలని ప్రతిక్షణం కోరుకున్నాను. ఇలా....ఇలా నా మనస్సు విప్పి నా కోరికను నీ ముందు వుంచాలని ఆ అవకాశం కోసం ప్రతిరోజూ ఎదురు చూసాను. సో అజయ్! ఒక ఆడపిల్లగా నా మనసులో భావాల్ని స్వతంత్రంగా నీతో చెప్పుకున్నాను కదా! కనీసం నీ మనస్సులో నామీద ఎలాటి అభిప్రాయం వుందో చెప్పలేవా?"

అతని ముఖాన, అరచేతుల్లో చెమటలు అంత చల్లగాలిలో కూడా.

"మీరంటే నాకెంత ఇష్టం అని అడిగితే చెప్పగలను. కొలమానికి కూడా అందనంత ఇష్టం అని కానీ నా ఇష్టం చెపితే సరిపోదు. మీ అమ్మా, నాన్న అయిష్టాన్ని మీరు తెలుసుకోవాలి."

చిరుహాస ముఖంలో వెలుగు ఆమె కళ్ళలో రిలీఫ్, ఆమెలో వుండే ప్రతి రక్తపు బొట్టూ ఆనందంగా తుళ్ళిసాగాయి.

"నువ్వెందుకంత భయపడుతున్నావో నాకర్థం కావడంలేదు. అజయ్ నీ నీడలో నాకింత చోటు ఇవ్వలేవా?"

"నా నీడలో మీకు చోటు చాలదేమోనని ఆలోచిస్తున్నాను."

అతనిలో చిరుహాస తనకై తను వచ్చి అలా అడుగుతున్నందుకు సంతోషంగా వున్నా ఆమె ప్రేమ మింగుడు పడనట్లు అతని ముఖంలో భావాలు.

"నీ నీడలో నాకు చోటు సరిపోతుంది. నన్ను చూసి నువ్వు భయ పడొద్దు. నీ ప్రేమ నాకు అందితే చాలు ఆ జీవితం ఎలా వున్నా సంతో షంగా సాగిస్తాను. నిన్ను విసిగిస్తానని, నా కోరికలను నువు తీర్చలేక పోవచ్చనే శంక వద్దు. నువ్వు ప్రక్కనుంటే నాకు ఏ కోరికలూ దరి దాపుకి రావు" చేతిలో వున్న గులకరాళ్ళను పడేస్తూ అంది.

"సర్వ సుఖాలనుభవిస్తున్న మీకు కష్టం ఎలా వుంటుందో తెలి యదు కనుక అలా అంటున్నారుకానీ డబ్బు లేకుండా మీరు బ్రతక-

లేరు. మీరలా సర్దుకోగలిగినా సరిసంపదల్లో పెరిగిన మీరు బీదగా బ్రతుకుతుంటే అదీ నా ప్రక్కన నేను సహించలేను" ఆకాశం వైపు చూస్తున్నవాడు తలదించి చిరుహాసను చూస్తూ అన్నాడు.

"మీరు నన్ను బీదప్రపంచంలోకి నెట్టడమేమిటీ? మా అమ్మా నాన్న నన్ను కాదనుకుంటే వాళ్ళే నన్ను పేదరాల్నిగా చేస్తారు. కానీ- అజయ్ ప్లీజ్ అజయ్ ఇంకా నన్ను పరీక్ష పెట్టకు నా మనస్సు పేద. సంపద మీద లేదు నీ మీదుంది."

"మీరంటే.... మీరంటే నాకు ఒక్క పర్సెంట్ కూడా అయిష్టం లేదు. కానీ...."

"ఇంకా కానీలు వద్దు. నేనెప్పుడూ నిన్ను పెళ్ళి చేసుకున్నందుకు పశ్చాత్తాప పడను. అమ్మా, నాన్నలని ఒప్పించాకే మన పెళ్ళి జరుగుతుంది. ఈరోజు ఎంత మంచిరోజో కదా! నా ప్రేమను నీ ముందు పర్చగలిగే అవకాశంభించింది.

ఎలాగయితేనేమి ఇప్పటికయినా నీ మనస్సులో నా మీదున్న ప్రేమను తెల్సుకోగలిగాను. మనిద్దరం ప్రతిజంటా జెలసీగా ఫీల్ అయ్యేలా బ్రతుకుదాం అజయ్" అతని భుజంమీద తలవాల్చిన చిరుహాసలో తన్మయత్వం, పరవశం-అతని రెండుచేతులు ఆమె భుజాన్ని చుట్టేసాయి.

చిరుహాసకు అజయ్‌ని ఒప్పించగలిగినందుకు ప్రపంచంలో వున్న ఆనందమంతా కుప్పపోస్తే అందులో తను కూర్చున్నంత తృప్తి అతని రెండుచేతులు తన భుజంమీద కలిగించే స్పర్శకు పులకింత.

★ ★ ★ ★

"హాసా! గంట ఏడయింది. మనం ఐదుగంటలకే స్టార్టు అవుదామనుకున్నాము" కూతుర్ని తట్టి లేపింది దివ్య.

"ఊహుఁ నన్ను లేపొద్దు. ఇలాగే వుండనివ్వు. మనం ఎక్కడకూ వెళ్ళొద్దు యిలాగే యిక్కడే వుండిపోదాం."

"అబ్బ హాసా! ఏ పిచ్చి పడితే అదేనా. నీకి ప్లేస్ ఎంత నచ్చితే మాత్రం ఇక్కడ ఎలా వుంటాం. ఇప్పటికే పాపం మీ డాడీకి బోలెడు పనులాగిపోయాయి. లేచి ముఖం కడుక్కో. నీకోసం టిఫిన్ తెప్పించి టేబిల్ మీద పెట్టాను తినేసేయి కారెక్కుదాం" ఈ మారు చిరుహాస కప్పుకున్న రగ్గులాగి విసురుగా తట్టి లేపింది దివ్య.

అప్పటికిగాని తియ్యటి కలనుండి తేరుకుని కళ్ళు తెరవలేక పోయింది చిరుహాస.

ఆ అమ్మాయికి తను నిజంగానే నరసింహకొండ దగ్గర అజయ్ భుజంమీద తలపెట్టుకుని పారవశ్యంలో వున్నట్టే అన్పించింది.

ఆ కల ప్రభావంనుండి తేరుకోలేక పోతోంది.

అజిరితో తన వాదన అఖరలో అతను ఒప్పుకున్న ఆనందం తీరకముందే ఆ అందమైన కల చెదిరిపోయినందుకు, అసలది కలయినందుకు నిరాశపడింది. అజిరి ఎంతందంగా వున్నాడు తన తండ్రి దుస్తుల్లో. ఎంత స్పష్టంగా మాట్లాడాడు.

ఇంగ్లీషు పదాలెంత అందంగా పలికాడు

ఎంత రాయల్‌గా వున్నాడు.

ఎంత సంస్కారంగా బిహేవ్ చేశాడు.

అలా అనుకుంటున్న చిరుహాసకు అతన్ని నిజంగానే తమతో వూరికెందుకు తీసుకెళ్ళకూడదూ? అనిపించింది.

"హాసా! ఇంకా పక్కమీదే వున్నావా? డాడీ తొందర చేస్తున్నారు లేచి రెడీకా. ఇంత వయస్సు వచ్చినా బద్ధకం పోలేదు కదా!"

తల్లి కంఠంవిని చెంగున దూకి బాత్‌రూమ్‌లోకి పరిగెట్టింది, బాత్ రూమ్‌లో బ్రష్ చేసుకుని ముఖం కడుక్కొని బయటకు వచ్చేవరకూ అదే ఆలోచన.

ఆ ఆలోచనలనిండా అజయ్. అతన్ని తమతో తీసుకెళ్ళి నాగరికుడిగా తీర్చిదిద్ది పెళ్ళి చేసుకోవాలనే గాఢమైన కోరిక చిరుహాసలో-

టిఫిన్ తినబోయి తల్లితో అంది.

"మనం ఒకసారి బొర్రాకేవ్స్ కెళదాం మమ్మీ"

"నిన్న స్కెచ్ పూర్తయిందిగా ఇంకెందుకు?"

"మమ్మీ. మనం అజిరిని మనతో తీసుకెళదామా?"

"అజిరిని మనతో తీసుకెళ్ళడమేమిటే! నీకేమయినా పిచ్చి పట్టిందా?"

"అజిరి రూపంకు తోడు చదువుంటే ఎంత బాగుంటుంది కదా! అందుకే మనం తీసుకెళ్ళి అతన్ని ఓ తెలివిగల మనిషిగా తీర్చిదిద్దుదాం మమ్మీ."

"ఆ గూడెంలో ఇంకా చాలా మందున్నారు హాసా" విసుగ్గా

"అందర్నీ తీసుకెళ్ళలేంగా మమ్మీ"

"మరి ఇతన్నే ఎందుకు తీసుకెళ్ళాలి."

"ఒకొక్కరిమీద ఒకొక్కరికి అభిమానం ఏర్పడుతుంది."

"అభిమానం అంటే."

కాస్సేపు పూరుకుని తనకొచ్చిన కలను తన భావాలను అతడ్ని

దిద్దుకుంటే పెళ్ళిచేసుకుంటే బాగుణ్ణనే కోరికను నిర్భయంగా బయట పెట్టింది.

చిరుహాస కొచ్చిన కల ప్రభావం అలా మాట్లాడేలా చేసింది. నిద్రలేచి అరగంటయినా ఆమెను చుట్టేసిన ఆ కలనుండి ఇంకా తేరుకో లేకపోతోంది. కలలో మారిన అజయ్-అతని సున్నితత్వం-అతని సంస్కారం అతని అభిమానం ఇవన్నీ నిజమవుతాయనే భ్రమలో వుంది.

తప్పకుండా అతన్ని మార్చగలనని అనుకుంటోంది.

ఆ కలను తల్లిముందు పరచటమేకాక దాన్ని నిజం చేస్తానం టుంది.

ఆ కలలో అజిరి ఎంతో త్వరగా మంచి భాషను నేర్చుకున్నా డని తను చదువు చెపుతుంటే ఏకసంతాగ్రహిలాగ నేర్చుకున్నాడని తండ్రి ఎప్పుడో నాలుగయిదుమార్లు డ్రయివింగ్ నేర్పిస్తే ఎంతో సూక్ష్మంగా నేర్చుకున్నాడని తన్మయత్వంగా చెప్పసాగింది.

ఆ అమ్మాయి చెప్పే వైఖరికి దివ్య తనమీద బాంబు పడుతు తున్నట్లు భయపడింది. చాలా సేపటికి తేరుకుని అంది.

"చూడమ్మా హాసా! కలలో అతను ఎంతయినా మారొచ్చు అందులో అబ్బురపడాల్సిందేమీలేదు. కల ప్రభావం వల్ల నీవిలాపిచ్చిగా వాగుతున్నావుగానీ నిజ జీవితంలో అంత త్వరగా ఎవరూ మారలేరు. అంతెందుకు కవిత ఆంటీ విషయమే ఎత్తుకుందాం అంకుల్ ఎంత కలివిడో నీకు తెల్సుకదా ఆమె నెందుకు మార్చుకోలేకపోయాడంటావ్. ఆమె మీద ప్రేమతో ఆమెను బాధపెట్టడమెందుకనుకోవచ్చొ లేదా ఆమె యిక మారదు అని నిశ్చయించుకోవచ్చు. అదీలేకుంటే యింట్లో కలతలు అశాంతికి తావివ్వకుండా మీ అంకులే అడ్జస్ట్ అయిపోయుం డొచ్చు ఎలా అయితేనేమి కవితను మార్చలేకపోగా మీ అంకులే అంద

ఏకి దూరమైపోయారు" ఒక్కసారిగా దివ్యకు తన భర్త త్రైరీల్లో మాట లంతా గుర్తొచ్చింది.

"మమ్మీ...."

ఏదో చెప్పబోతున్న కూతుర్ని ఆగమని సైగచేసి వెళ్ళి తలు పేసి వచ్చింది "తలుపెందుకేసావ్ మమ్మీ."

"మీ నాన్నగారొస్తే నీ మాటలువిని బాధపడ్తారని."

"ఏం కాదు నా కలలో డాడీనే నన్ను అజిరికి చదువు చెప్పమని ప్రోత్సహించింది అజిరిని తీసుకుని నర్సింహకొండమీద కెళ్ళమంది కూడా నాన్నే. కలలో కూడా అజిరి అంటే కోపంగా వుంది నువ్వే."

భర్త మనస్తత్వం తెల్సిన దివ్య అతన్ని కూతురు ముందు తేలిక పర్చడం ఇష్టంలేక మాట మారుస్తూ అంది.

"నువ్వు అతనితో కల్సి ఈ అనాగరిక ప్రదేశంలో బ్రతగ్గలరా? వాళ్ళు తినే జొన్న రొట్టె గొడ్డుకారం ఒక్క పూట తినలేని దానివి ఎల్ల కాలం తినగలవా? ఆరోగ్యం బాగలేకపోతే వీపు మీద వేసుకుని అనంత గిరి హాస్పిటల్‌కు పేషెంటును చేర్చే యీ మనుష్యుల మధ్య బ్రత గ్గలవా? అజిరి కూడా మన పద్ధతులకు అడ్జస్ట్ కాలేడు."

"మనిషిమీద ప్రేముంటే ఎలాటివాళ్ళతోనయినా సర్దుకోగల మమ్మీ నువ్వు భయపడేంతగా నాకేమీ అన్పించడం లేదు నేనొక దొంగని, ఒక స్మగ్లరనీ, ఒక బద్ధకస్థుణ్ని, ఒక కురూపిని పెళ్ళి చేసు కుంటాననలేదే? అమాయకత్వంతో బ్రతుకుతున్న ఒక అందమయిన ఆరోగ్యమైన యువకుణ్ని తీర్చిదిద్ది పెళ్ళి చేసుకుంటానంటున్నాను అది తప్పా?"

తప్పంతా ఈ బొర్రాకేవ్స్‌కి చిరుహాసను వెంటపెట్టుకుని రావ డమే అన్పించింది దివ్యకు ఎప్పటికప్పుడు తన కూతురు తన

మనస్సులో మాట పైకి అడిగేస్తుంటే ముచ్చటపడింది కానీ తను స్వరూప్ అలా మనస్సు విప్పి చెప్పుకోనుంటే యిన్ని సంవత్సరాల అశాంతి తప్పేదని బాధపడిందే కానీ ఈ రోజు ఆ మనస్తత్వంతోనే విరుహాస తన్నింత బాధ పెడుతుందని ఎప్పుడూ ఊహించలేదు.... తనని తను కంట్రోల్ చేసుకుని ఈ వార్త స్వరూప్ చెవికి రాకముందే విరుహాసను మంచి మాటలతో ఆ దారి తప్పించాలని నెమ్మదిగా అంది.

"తప్పని నేనూ అననమ్మా ఆఫ్టరాల్ ఓ గంట కవితాంటీ నీతో జాగ మూవ్ అవలేదని నువ్వు హర్ట్ అయ్యావుకదా! అలాటిది అసలు మన నాగరికతే తెలియని అతన్ని నువ్వు పెళ్ళి చేసుకుంటే అతని ఆచార వ్యవహారాలు అతని కలవాటయిపోయి నువ్వు సర్దుకోలేకపోతే నిన్ను అతను కుసంస్కారివనుకుంటే నువ్వు భరించగలవా? చెప్పు అతని పద్ధతులు మనకు అనాగరికం అన్పించినప్పుడు మన నాగరికత జీవితం అతనికి వెగటుగా వుండొచ్చేమో ఆలోచించావా?" చెప్పిందే అయినా మరలా ఈ విధంగా అర్ధమయ్యేలా చెప్పింది దివ్య.

"మమ్మీ ఆజిరి నాకు చాలా చాలా నచ్చాడు

మనం గమనించినంతలో అతను సంస్కారవంతుడుగానే కన్పించాడు నేను అతన్ని తీర్చిదిద్ది పెళ్ళి చేసుకుంటానని చెపుతున్నాను"

అంత విమర్శగా చెప్పినా అర్థం చేసుకోకుండా విరుహాస ఇచ్చిన జవాబుకు దివ్యలో సహనం చచ్చిపోయింది. ఆ స్థానంలో కోపం.

"సిగ్గుగాలేదూ నీకు యిలా మాట్లాడడానికి? నీ మంచిచెడ్డలు చూసుకునే మేముండగా ఒక ఆడపిల్లవు ఇంత నిర్భయంగా తెలిసీ తెలియని జ్ఞానంతో నీ ముందున్న నూరేళ్ళ జీవితంతో ఆటలాడుకోవాలనుకుంటున్నావా? ముఖ్యంగా నా పెంపకంలో పెరిగిన నువ్వు యింత నిర్లక్ష్యంగా మాట్లాడుతుతున్నావా?"

"తప్పేముంది మమ్మీ. నా మనస్సులో మాట నీతో డాడీతో కాక ఎవరితో చెప్పుకోగలను? మనస్సులో మాట ఎప్పుడూ దాచుకోకూడదు మమ్మీ. నాకు నచ్చిన మనిషతను అని చెప్పడం లజ్జయిన విషయం ఎలా అవుతుంది? డాడీకి యిష్టంలేని పనేదయినా నువ్వు చేస్తుంటే వద్దని చెప్పరా? డాడీకి నీ మీద ప్రేమ స్వతంత్రం వుంది కాబట్టి చెప్పగలుగుతున్నారు నేనూ అంతే కదా మమ్మీ—"

దివ్య కోపమంతా చప్పున చల్లారి పోయింది కూతురు సమస్యను ప్రక్కకు పెట్టి ఆమె మనస్సు నిండా భర్త ఆలోచనల్ని నింపుకుంది.

చిరుహాస చెప్పినట్లే తన భర్త తన భయాల్ని, తన అనుమానాల్ని తనకు చెప్పుకుంటే అతని జీవితం తృప్తిగా వుండేది లేందీ తన జవాబుని బట్టి వుండేది. తను....తన భర్త నెప్పుడూ కష్ట పెట్టాలని కోరుకోదు కాబట్టి తన జవాబుతో అతను సంతోషపడేవాడు.

వరండాలో నిల్చున్న స్వరూప్ కూడా ఆలోచనల్లో జారి పోయాడు.

మంచో చెడో తన భావాల్ని ఎంత ధైర్యంగా తల్లితో చెప్పుకోగలగింది ఆ పిల్ల....తనకింత వయస్సు వచ్చినా తన మనస్సుని భార్య ముందు పర్చలేకపోయినందుకు సిగ్గుపడ్డాడు.

అతని ఆలోచనలకంతరాయంగా లోపలి నుండి తన భార్య గొంతు వినిపించింది.

ఆసక్తిగా వినసాగాడు.

"నిజమే నీ మనసులో మాట నాతో మీ డాడీతో చెప్పుకోవడం తప్పని నేననడం లేదు. కానీ హాసా యిది జరిగే పనికాదు. అజిరిని నువ్వు నాగరికుడిగా తీర్చి దిద్దగలవేమో కానీ అతను మాత్రం తల్లి దండ్రుల్ని వదిలి నీతో బయలుదేరడు. అది సహజం. ఎవరి జీవితాలు

వాళ్ళకు తృప్తినిస్తాయి. అయినా అక్షరాలే సరిగ్గా రాని అజీరిని నువ్వు నీ కోర్కెల ప్రకారం తీర్చిదిద్దుకోవాలంటే ఒక రాత్రిలో వచ్చిన కలల నిజజీవితంలో జరగదు."

"ఎందుకు జరగదు మమ్మీ. మీరేగా పట్టుదల వుంటే ఏ పనైనా సాధించగలం అనే వాళ్ళు" చిరుహాస ఎదురుప్రశ్న వేసింది.

"నీకు పట్టుదలే వుందనుకున్నాము నువ్వు ఐదు సంవత్సరాలు శ్రమపడినా అతన్ని తీర్చిదిద్దినా నీ వనుకున్నంత గొప్పవాడుగా మారలేడు. నీ యిరవై మూడవ ఏట నువ్వతని అభిప్రాయాలతో ఏకీభవించలేకపోవచ్చు. లేదా అతన్ని నువ్వు నాగరికుడిగా మలచిన తర్వాత అతనికి నువ్వంటే ఇష్టం ఏర్పడకపోవచ్చు. ఐదు సంవత్సరాల కాలం మనుష్యుల్లో ఎన్నో రకాల మార్పుల్ని తెస్తుంది. ఇప్పుడున్న నీ దృఢమయిన కోరిక రేపు మారిపోవచ్చు. అదీ కాకపోతే అతనితో నీ దగ్గరతనం నీతో అతని చెడు గుణాల్ని ఐ మీన్ నీ కిష్టం లేని గుణాల్ని ఏరుకుని అసంతృప్తి పడొచ్చు. నీలో వున్న ఆత్మస్థయిర్యం దిగజారిపోవచ్చు కాదంటావా?"

కూతురి కళ్ళల్లో పొరాడే భావాల్ని చదువుతూ అంది దివ్య.

"మనలో ఆత్మస్థయిర్యం వుంటే మనం సాధించలేనిదేమీ వుండదు అనే దానివిగా మమ్మీ!" కొద్దిగా ఉక్రోషంగా అడిగింది చిరుహాస.

"కరక్టే హాసా! అది ఎందులో అంటావు నీకు సంబంధించినంత వరకే! నువ్వు నేర్చుకోవాలను కుంటున్న ఆర్ట్‌లో నువ్వెంతయినా సాధించవచ్చు నువ్వు చదువుకోవాలనుకున్న సబ్జెక్ట్‌లో ఎంతయినా ముందుకు పోవచ్చు. ఆఖరకు నువ్వు రాకెట్‌లో చంద్రమండలం వరకు వెళ్ళాలనే కోరికను కూడా తీర్చుకోవచ్చు. పై చదువులకోసం ఒంటరిగా విదేశాలకెళ్ళి గెలిచి రావొచ్చు కానీ హాసా! ఒక మనిషిని మార్చి చేసు

కోగలడమనేది మంచిది కాదు. ఇద్దరూ పెళ్ళివరకు మనస్సు మార్చుకో కుండా వుండాలి లేనప్పుడు నలుగురూ నాలుగు రకాలుగా అను కుంటారు."

"పోనీ అతన్ని పెళ్ళి చేసుకునే మారుస్తాను మమ్మీ!"

"పెళ్ళంటూ చేసుకున్నాక అతనికి నీ మీద వుండే అధికారంతో అతని జీవితంలోకి నిన్ను ఈడుస్తాడే గాని నీ జీవితంలోకి అతనురాడు, రావాలని ప్రయత్నించడు. నిన్ను కూడా అతనికిష్టమయిన రీతిలో మార్చుకుంటాడు."

ఇక్కడ ఆలోచనలో పడింది చిరుహాస.

ఆ పసిపిల్ల ఆలోచనకు అడ్డం పోలేదు దివ్య.

"మమ్మీ! నేను ఆజిరిని మనతో తీసుకెళదామంటున్నాను. ఆజిరి మనతో వుంటే అప్పుడు నన్ను మార్చడానికి అవకాశాలు లేవు కదా!" ఐదు నిముషాల తర్వాత పెదవి విప్పింది చిరుహాస.

"తీసుకెళతావే అనుకో అతనిలో నీ మీద ఇష్టం ఏర్పడిందే అనుకో అప్పుడు ఆ అబ్బాయికి మన ఆస్థంతా తనదేలా అన్పించి చెడు అలవాట్లకు లోనయితే!"

"నా ఇష్టాలు ముందుగా చెపుతానుగా మమ్మీ! ఈ డ్రింకింగ్, స్మోకింగ్ లాటివి ఆరోగ్యానికి మంచిది కాదని చెపుతాను. ఆ ఛాయలు కూడా తెలీనీ కుండా చేస్తాను."

విరక్తిగా నవ్వింది దివ్య.

"నవ్వకు మమ్మీ! మీ సలహా కొరకే కదా! నేనడిగేది. నీకేది మనస్సుకొస్తే అది మాట్లాడేయ్ మమ్మీ."

దివ్య దిగ్భ్రాంతిగా చూస్తోంది. కలవరంగా చూస్తోంది. దిగులుగా చూస్తోంది.

తన చిన్నారి చిరుహాస అప్పుడే అంత ఎదిగిపోయిందా? అని చూస్తోంది.

తనకంటే ఎంతో చిన్నదయిన హాస ఎంత నిర్మలంగా తన మనసుని అద్దంలా పరుస్తోంది? తన ప్రేమను దాచి అతని మీద మన స్సుని మళ్ళించుకోలేక అతన్ని తమతో తీసుకెళ్ళి ఏదో పనిప్పిస్తామని అడిగుంటే తను కాదనదు ప్రేమ ముదిరాక పెళ్ళి చేసుకుని ఇంటి కొస్తే.... తను కాదనలేదు. తొందరపాటు నిర్ణయం వల్ల కూతురు నష్ట పోయే అవకాశం కూడా వుంది.

అలా చేయకుండా తను ప్రేమించబోతున్న విషయం చెప్తోంది తన మనస్సు ద్వారాల్ని పూర్తిగా తెరుస్తోంది. ఎంత మంచి పద్ధతి. దివ్య యిలా ఆలోచిస్తుంటే వరండాలో నిల్చుని స్వరూప్ ఇంకో విధంగా ఆలోచిస్తున్నాడు.

పద్దెనిమి వేళ్ళ తన కూతురిలో వున్న ధైర్యం ఆ పసిపిల్ల మనసు తనకు లేకపోయినందుకు ఆశ్చర్యపోతున్నాడు.

ఇన్ని సంవత్సరాల తన అనుమానాలన్ని గుండెల్లో పెట్టుకుని తను అనవసరంగా అశాంతిని అనుభవించాడు.

దివ్యను అశాంతికి గురిచేసానన్న బాధ అతని ముఖంలో స్పష్ట ముగా గోచరిస్తోంది.

ఒక్కమారు తను మనసువిప్పి దివ్య ముందు పరిచుంటే ఆరోజు బాధపడ్డా తన మనసేమిటో చెప్పుండేది కదా! అని ఆవేదన పడు తున్నాడే గాని మన కూతురి మనస్సెలా మార్చాలా అని ఆలోచించడం లేదు.

అతనికి చిరుహాస ఆలోచనా విధానాన్ని మార్చగలనని నమ్మక ముంది.

తల్లి మౌనంగా కూర్చోవడంతో లేచి నిలబడింది చిరుహాస.

"ఎక్కడకి?" నిర్లిప్తంగా అడిగింది దివ్య.

"డాడీ ఏం సలహా చెప్తారో అడుగుదామని."

"మీ డాడీకి యిష్టం వుండదులే హాసా!"

"ఏంకాదు డాడీ తప్పకుండా సరే నంటారు తెల్సా? ఈ విషయంలో డాడీ బాగా ఆలోచించగలరు."

ఇక చిరుహాస దగ్గర తన భర్త మనస్తత్వం దాచి లాభంలేదు అనుకుంది. దివ్య తన తండ్రి మనస్తత్వం అర్థం చేసుకునయినా అజిరితో తన ప్రేమను మొదట్లోనే తుంచేసుకునేలా చేయాలని నిశ్చయించుకున్నాక చెప్పడం మొదలెట్టింది దివ్య.

"హాసా! మీ నాన్నగార్కి నేను ప్రాక్టీస్ చేయడమే ఇష్టంలేదు నీకు తెలుసా? అందుకే.... అందుకే నేను ప్రాక్టీస్ మానేసాను."

"అవునా! నాన్నగార్కి నువ్వు ప్రాక్టీస్ చేయడం ఇష్టం లేదా? అలా అని నాతో కూడా డాడీ చెప్పలేదే?" ఆశ్చర్యంగా అంది చిరుహాస.

మనసులోనే నిట్టూర్చింది దివ్య.

"ఎందుకని మమ్మీ చెప్పవూ?"

"మీ డాడీ చాలా మంచివారమ్మా! ఆయన మంచితనంతో నన్ను ఆర్నెల్ల క్రితంవరకు ప్రాక్టీసు చేసుకోనిచ్చారు. మీ నాన్నకు సమాజంలో ఆడపిల్ల గురించి కోటి భయాలు. ఆ భయమే కొన్ని సంవత్సరాలు మనశ్శాంతిని దూరం చేసింది" అనేసి కాస్సేపు ఆగింది.

వరండాలో నిల్చుని వింటున్న స్వరూప్ నెర్వెస్‌గా ఫీల్ అయ్యాడు.

దివ్య త్వరగా పెదవి విప్పితే తనభిప్రాయం పరోక్షంగా అయినా వినే అవకాశం కలుగుతున్నందుకతనికి సంతోషంగా వుంది.

"మీ డాడీకి నేను లేడీస్‌కి మాత్రమే ట్రీట్‌మెంట్ యిచ్చే పే అభ్యంతరమూ వుండదు. ఆ విషయం ఆయన దాచకుండా నాకు చెప్పి వుంటే ఆ రోజుకి నా భావాలెలా వుండేవో ఆయనతో చెప్పేదాన్ని. ఆయన భయాలు పోగొట్టేదాన్ని. ఆ అవకాశం మీ డాడీ నాకివ్వలేదు"

"మరి నీకెలా తెల్సింది మమ్మీ!" ఆ చిన్నపిల్ల అజీరి గురించి సంభాషణ జరగనట్లే అన్పించింది. దాని స్థానంలో తండ్రి మనస్తత్వం తెల్సుకోవాలనే ఆతృత మిగిలింది.

"తప్పని తెల్సినా డైరీలు చదివాను. అదీ మీ నాన్నగారు యు. ఎస్. ఎ కి వెళ్ళాక దిగులుగా అన్పించి మా పెళ్ళి ఫోటోల ఆల్బమ్ కోసం వెతికాను. ఆల్బమ్ కన్పించలేదు. కానీ మీ నాన్నగారు వ్రాసుకున్న డైరీల దొంతరలు కన్పించాయి.

వాటిని చూసి ఆశ్చర్యపోయాను. అందులో నా గురించేమని వ్రాసుకున్నారో అని సరదా కొలదీ పేజీలు తిప్పాను. ఆ డైరీల్లో కొంత కాదు మొత్తం నా గురించే వ్రాసుంది.

నా సరదా ఎగిరిపోయి నన్ను అణువణువూ బాధ చుట్టేసింది. ఒక్కో పేజీ తిప్పుతుంటే మీ డాడీ మనస్తత్వమే వేదుగుంది.

ఒకరోజు సరదాగా గెస్ట్‌హౌస్‌కు నేను మీ డాడీ వెళ్ళబోతుంటే ఒక పేషంటు కారు కెదురుగా వచ్చాడు. ఆ అబ్బాయికి పన్నునొప్పి విపరీతంగా వుందని వచ్చాడు.

ఆ అబ్బాయికి విజ్‌డమ్ టూత్ రిమూవ్ చేస్తే ఇన్‌ఫెక్ట్ అయింది. వరుసగా పదిహేను రోజులు కువాయిర్ డ్రస్సింగ్ చేస్తేగానీ తగ్గలేదు. ఆ రోజు నేను చేసిన కువాయిట్ డ్రస్సింగ్ పడిపోయింది. ఆ అబ్బాయి నొప్పికి ఓర్చుకోలేక పోయాడు.

ఆదివారం క్లీనిక్ ఓపెన్ చేయమని తెల్సి భయపడి ఇంటి కొచ్చాడు. కానీ మీ డాడీ వేరే విధంగా ఆలోచించాడు. ట్రీట్‌మెంట్

కోసం వస్తున్నాడా? లేక నా మీద అట్రాక్షన్‌తో వస్తున్నాడా? అనే భయం మీ డాడీ గుండెల్లో భూతమై కూర్చుంది.

అది మీ డాడీ తప్పనికూడా నేననను. కారణం అదే ఆపరేషన్ చేయించుకొచ్చిన మీ లక్ష్మిపిన్నికి సెప్టిక్ కాసందువల్ల వారం రోజులకే మానిపోయి హాయిగా వుండడంతో ఈ భయం. అదే ఆమెకు వారం రోజులకే బాగయిపోతే ఈ అబ్బాయికి ఎందుకు నయం కాలేదు అనేది సన్నడిగుంటే నేను వివరంగా చెప్పేదాన్ని.

నిట్టూర్పు విడపకుండా వుండలేక పోయింది దివ్య.

"లక్ష్మిపిన్నికి చేసిన ఆపరేషన్‌కి ఆ అబ్బాయికి చేసిందీ ఒకటే అయినప్పుడు ఎందుకలా అవుతుంది మమ్మీ"

"ఒక్కో మనిషికి ఒక్కో రకంగా రెసిస్టెన్స్ పవర్ వుంటుంది హాసా! ఒక్కొక్కరికి పుచ్చిపోయిన పన్ను పెరికితేనే వాళ్ళెన్ని జాగ్రత్తలు తీసుకున్నా యిన్‌ఫెక్ట్ అయి మానదు. ఒక్కొక్కరికి యాక్సిడెంట్‌వల్ల పళ్ళు విరిగిపోతే మంచిపన్ను పెరిగినా, నోట్లో గాయాల దగ్గర సూచర్స్ వేయలేక వదిలేసినా మందులు వ్రాసిచ్చినా వాళ్ళు ప్రిస్క్రిప్షన్ భద్రంగా జేబులో పెట్టుకుంటారేగానీ ఆ మందులు కొనరు, వాడరు. నేనిచ్చిన యిన్‌స్ట్రక్షన్స్‌కూడా పాటించరు.

అయినా కొందరికి ఏ ఇన్‌ఫెక్షనూ అటాక్‌కాదు అది వాళ్ళ శరీర తత్వాన్ని బట్టి వుంటుంది. కొంతమందికి ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా యిన్‌ఫెక్షన్ అటాక్ అయి త్వరగా మానదు. వాళ్ళ సహనాన్నే కాదు అలాటప్పుడు మా సహనానికి కూడా పరీక్ష పెట్టినట్లవుతుంది. పేషెంటు కోఆపరేటివ్ చేస్తే మా ట్రీట్‌మెంటు అలస్యంగానయినా మాని పోతుంది."

"ఆ విషయం డాడీకెలా తెలుస్తుంది మమ్మీ! నువ్వు వివరంగా

"మీ డాడీ ఇంత శోభను కడుపులో దాచుకున్నారని నాకెలా తెలుస్తుంది చెప్పు. ఎవరో కామాంధుల నడవడిని గురించి విని అలాటి వాళ్ళు నా ట్రీట్‌మెంటు కోసం కాకుండా నా స్వార్థానందంకోసం వస్తారేమోనని మీ డాడీకి భయం. నా ట్రీట్‌మెంట్ ఆడవాళ్ళకే పరిమితం అయితే ఆయనకు నిశ్చింతగా వుండేది పాపం"

"ఇలాటి భయాలుకూడా వుంటాయా మమ్మీ" నోరెళ్ళబెట్టింది చిరుహాస.

"వుంటాయమ్మా! ఎదుటి మనిషి కర్కోటకుడయితే అతని మనస్తత్వం తెలిసి అతనివల్ల తన ఆత్మీయులకు ఏదయినా హాని కలుగుతుందేమో అనే భయం వాళ్ళని వెంటాడుతుంది."

"అంత భయపడే డాడీ నీకు ఒక్కసారి అలాటివాళ్ళ మనస్తత్వం గురించి వివరించి వుంటే నువ్వే తను జాగ్రత్తలో వుండేదానివి కదా మమ్మీ."

"నిజమే హాసా! తన మనస్సులో బాధను నాకు చెప్పకోలేక పోయినా కనీసం నేనయినా సరదాగా పేషెంట్ల మనస్తత్వం వాళ్ళ బిహేవియర్ గురించి చెప్పకుంటే ఆయన కిన్ని సంవత్సరాలు మనస్తాపం వుండేదికాదు" అని మరలా మొదలుపెట్టింది దివ్య.

"కొంతమంది వాళ్ళ కృతజ్ఞతను వాళ్ళకు పండిన పంట ఇచ్చో, లేక స్వీట్స్‌ప్యాకెట్స్ ఇచ్చో అదీ కాకుంటే సాష్టాంగ ప్రణామాలు చేసో ఎగ్జిబిటివ్ చేసుకుంటారు. వాళ్ళ కళ్ళల్లో కృతజ్ఞతాభావం నిండి వుంటుంది.

అంతెందుకు విజ్ డమ్ టూత్ రిమూవ్ చేస్తే సెప్టిక్ అయినందు వల్ల పదిహేను రోజులు ఒకబ్బాయికి కుమయిల్ ట్రీట్‌మెంటు యిస్తే తగ్గింది. పాపం ఆ అబ్బాయి తన కృతజ్ఞతను తెల్పుకునే దానికి స్వీట్ ప్యాకెట్‌తో ఇంటికొస్తే మీ డాడీకి కోపం వచ్చింది.

ఉతని దురదృష్టం జాగ ఇన్ ఫెక్ట్ అయింది. ఎలాగయితే నేమి అతనికి నయమయింది. అతను ఎంతో సంతోషంగా నన్ను, మీ డాడీని వాళ్ళ ఇంటికి ఆహ్వానించాడు. నా భార్య మీకోసం ఎదురు చూస్తుంటుం దని చెప్పి వెళ్ళాడు" మంచినీళ్ళు త్రాగి మరలా వచ్చి కూర్చుంది దివ్య.

"నాన్నగారు ఆ పేషెంటుని అనుమానించారా మమ్మీ"

"ఊఁ" అని దీర్ఘంగా నిట్టూర్చి-

"హాసా! మనం చదివిన చదువుకు సార్థకత వాళ్ళనుండి మనం అందుకునే తృప్తికరమైన మాటల్లో, కళ్ళ వెలుగులో కన్పిస్తుంది. ఒక్కొక్కరు పల్లెటూరి జనం డాక్టరమ్మ రెండు చేతులు అందుకుని కళ్ళకద్దుకుంటారు. అది తప్పెలా అవుతుంది? అంతెందుకు కొంతమంది అమాయకులు డాక్టరమ్మను నువ్వు అనకూడదనే చిన్న మర్యాద కూడా తెలియదు.

అంత చనువుగా డాక్టరమ్మతో అతను మాట్లాడుతున్నాడంటే వాళ్ళిద్దరిమధ్య ఏదో కథ వుంది అని ఎవరయినా అనుకుంటే దానికి మనం ఏమిచేయగలం చెప్పు. హాస్పిటల్ అన్నాక ఎన్నో మనస్తత్వాల మనుష్యులు వస్తుంటారు."

"ఆదేగామమ్మీ డాడీ భయం"

"మీ డాడీకి నేనుఅనవసరంగా ఎదుటిమనిషివల్లఅపనిందలపాలవు తాననే భయం. పన్నునొప్పిబాధలో ఇంకఆపరేషన్ వద్దు అనిచెయ్యిపట్టు కునేవాళ్ళుకూడావుంటారు. కమలమ్మతిడుతూ వుంటుంది. అలాటివాళ్ళను కానీ పాపం వాళ్ళకెంత బాధుంటే అలా నా చెయ్యి పట్టుకుని ఉప శమనం పొందుతారు.

నేనెప్పుడూ పేషెంట్లను విసుక్కోను. ఎందుకంటే పేషంట్ల మనస్తత్వాల్నిబట్టి నేను ట్రీట్ మెంట్ యివ్వాలి. ఒకో్క పేషెంటు నోటి దుర్వాసనకు క్లీన్ చేస్తుంటే నోట్లో నీళ్ళు నిండక ముందే అరుస్తారు.

అదే ట్రీట్‌మెంట్‌కు కొంతమంది నేను ఆగేవరకు నోట్లో నీళ్ళు పూయరు.

ఇలా చిన్న సంఘటనలు, పెద్ద సంఘటనలు ఎన్నో వుంటాయి. అంతేకానీ పేషెంట్లు డాక్టరు చెయ్యి వినోదంగానో, ఆకర్షణతోనో తాకరు. వాళ్ళ బాధను తుడిచేసుకోవడానికి వస్తారేకానీ వేరే దృష్టితో వచ్చి గంటల కొలదీ ఆ కుర్చీల్లో కూర్చుని ఆఖరున డాక్టరమ్మ స్పర్శానందం కోసం ఎదురు చూడరు. అలాటివాళ్ళు ఇంత శ్రమకు తట్టుకోలేరు అదే గుర్తు."

"అలా అని ఖచ్చితంగా ఎలా చెప్పగలవు మమ్మీ"

"ముఖంలో నిష్కల్మషం, నిర్మలత్వం, వాళ్ళ కళ్ళల్లో వాళ్ళ బిహేవియర్‌తో ఖచ్చితంగా తెలుసుకోవచ్చు హాసా"

"నాకింత విపులీకరించి చెప్పావు కదా, డాడీ డయిరీలు చదివాక అయినా నువ్వు నాకు చెప్పినట్లే డాడీకి చెప్పి వుంటే బాగుండేది మమ్మీ"

"నీకు ఇదంతా చెప్పి డాడీని కించపర్చాలని నా ఉద్దేశం కాదు హాసా. ఒకే సంఘంలో, ఒకే నాగరికతలో పెరిగిన మా ఇద్దరి వివాహ బంధంలోనే ఇలాటి మిస్‌అండర్‌స్టాండింగ్స్ వచ్చాయి. అలాటిది ఎక్కడో అడవిలో పుట్టి పెరిగిన అతని మనస్తత్వానికి నీ మనస్తత్వానికి ఎలా సరిపోతుంది చెప్పు!

మీ ఇద్దరి మధ్య అవగాహన ఎలా కుదురుతుందంటావ్. ఇప్పుడు ఈ విషయాలన్నీ చెప్పి మీ డాడీ మనస్సు పాడుచేయొద్దు. ఆయన చాలా సెన్సిటివ్. నావల్ల ఆయన మనశ్శాంతిని కోల్పోయారు. మరలా నీవల్ల ఆయన మనసులో అలజడిని సృష్టించవద్దు. నేను మీ డాడీకి ఏదో చెప్పి ఈ రోజు మన ప్రయాణం ఆపుతాను. ఆలోచించుకో. నీ మేధాశక్తంతా

ఉపయోగించి ఆలోచించుకో. అప్పుడు అంటే ఈ వేడి చల్లారాక
నిర్ణయం నాకు చెప్పు"

లేచి నిలబడింది దివ్య.

వరండాలో నిలుచున్న స్వరూప్ ఊపిరి పీల్చడం కూడా మర్చి
పోయినట్లుగా లోపల సంభాషణను విన్నాడు.

అతని భావాల్లో ఏదో మార్పు.... భార్య మాటలు నిజమే అన్పి
చాయి.

తనే.... తనే అనవసరంగా మంచి మనుష్యులు వుంటార
విషయం మర్చిపోయి ప్రతిఒక్కరిలో పైశాచికపు మనస్తత్వాన్ని చిత్రించ
కుని భయపడ్డాడు.

ఆలోచించసాగాడు.

ఇప్పుడు తనేం చేయాలి?

తన తప్పును తెల్సుకున్నాకయినా భార్యకు సారీ చెప్పడ
సమంజసం.

కూతురు ముందు కంట్రోల్ చేసుకోగలిగిన కన్నీళ్ళు పైకి రాగ
తలుపు తీసుకుని వరండాలోకి వచ్చింది దివ్య.

కన్నీటి పొరల మధ్యగా ఆలోచిస్తూ నిలుచుని వున్న భర్త ఎద
రయ్యాడు.

భార్య కళ్ళల్లో నీళ్ళు అతన్ని కలవరపెట్టాయి.

"దివ్యా! ఏమయింది?" అన్న ప్రశ్న అప్రస్తుతం అని అతని
తెలుసు.

అందుకే ఆమె భుజంచుట్టూ చెయ్యివేసి ఆమెని నడిపించుకుంటూ

వెళ్ళి ఒక చెట్టు క్రింద కూర్చున్నాడు. ఆమెను తనకు అతి సమీప లో కూర్చొబెట్టుకున్నాడు.

అతనికి తన వేపునుండి కలిగిన భయాలను వివరించి చెప్పిన భార్యకు సారీ చెప్పాలనుకున్నాడు

స్వరూప్ పెదవి విప్పాడు.

"నేను అంతా విన్నాను దివ్యా ! బేబీ పసిపిల్ల అందుకే ఆలా ధైర్యంగా చెప్పగలిగింది. బాగా ఆలోచించాక తన నిర్ణయం అసంబద్ధ మయినదని దేబీ తప్పక తెల్సుకుంటుంది. అందుకని నేను వర్రీ అవడం లేదు. బేబీ తన మనస్సులో మాటను నిర్భయంగా నీతో చెప్పి ఒక విధంగా మనిద్దరి సమస్యకు పరిష్కారం చూపించి. నీ మనస్సులో మాటలు బేబీ ముందు చెప్పగలిగావు. నేను పరోక్షంగా నీ మాటలు విన గలిగాను.

యిప్పుడు అనిపిస్తోంది ఎవరయినా తమ మనస్సులో వ్యధని గానీ, సంతోషాన్ని గానీ ఆత్మీయులకు పంచుకుంటే మనస్సు హాయిగా వుంటుందని.

దివ్యా! నేను చందూ లెక్చరర్స్‌గా జాబ్ చేసేటప్పుడు నాకు ఎదురయిన అనుభవాలు చెపుతాను విను" అంటూ శ్రీకళ తనను సహా యము అడగడం, నిందలు పాలవడం తను రిజెయిన్ చేసేంతగా కదిలి పోవడం చెప్పి "నీరజ విషయంలో తన కోలెక్చరర్స్ తనని అలా జరిగి నందుకు గిల్టీగా ఫీలవ్వకూడదు. మనం గర్వించాలి అని ఎలా చెప్పారో వివరించి, అప్పటి నుండి ఆడపిల్ల మనస్తత్వం మంచిదైనా మగవాళ్ళల్లో పైశాచికం ఎలా వుంటుందో అని తెలుసుకుని ప్రతిక్షణమూ నీ ప్రాక్టీస్‌లో నీవు ఎన్ని ఇబ్బందులు నీకు తెలియకుండా ఎదురవుతాయో అని భయ పడేవాడ్ని.

నిన్నెవరయినా అవమానకరంగా మాట్లాడితే నేను భరించలేని అనిపించేది. నిన్ను పరోక్షంగా చెడుగా మాట్లాడుకుంటారేమో అని వ్యధ చెందేవాడ్ని. మగవాళ్ళకి నువ్వు ట్రీట్‌మెంట్ ఇస్తూ ఆడి పంటి డాక్టర్‌గా ప్రతి పేషెంట్ నోటిలో వేలు పెట్టాల్సి వచ్చినపుడు నీ చేతి స్పర్శ గా రాడీ మనుష్యులు వేరేవిధంగా వూహించుకుని వదలట్లులారేమోనని వణికి పోయేవాడ్ని."

"సారీ దివ్యా ఐయామ్ వెరీ సారీ నువ్వేమిటో తెలిసినా పేషం మనస్తత్వం ఎలాటిదో గ్రహించుకోలేని నేను కొన్ని సమయాల్లో అపోహ పడిన మాట నిజమే. అందుకు నేనిప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. నువ్వు బేబీకి చెప్పినంత వివరంగా నాకు అప్పుడే చెప్పుంటే అన్ని సంవత్సరాలు అలా భయపడేవాడ్ని కాదేమో! నువ్వు ప్రాక్టీసు మానేసి నందుకు సంతోషపడేవాడ్ని కాదేమో."

దివ్య ఒక్క మాట కూడా మాట్లాడలేదు.

తను ఒక పబ్లిక్ ప్లేస్‌లో చెట్టు క్రింద కూర్చుని వున్నాననే విష యమే మర్చిపోయినట్లు అతన్ని అల్లుకుపోయి ఏడ్చేసింది.

"దివ్యా! ఇంకెప్పుడు ఇలా కంటతడి పెట్టనివ్వను నిన్ను. సారీ దివ్యా!"

"ఇందాకటి కన్నీళ్ళు చిరుహాస భవిష్యత్ తల్చుకుని కార్చిన కన్నీళ్ళు. కానీ ఇవి నన్ను మీరు అర్థం చేసుకున్నందుకు వచ్చే ఆనంద బాష్పాలండీ. మీరు నాకు సారీ చెప్పడం ఏమిటి?"

"పాస్ట్ ఈజ్ పాస్ట్ ఇప్పుడు మనం బేబీ గురించి ఆలోచిద్దాం. బేబీని ఈ రోజంతా క్వార్టర్స్‌లో వదిలేసి ఈ చుట్టు ప్రక్కల తిరిగేసి వద్దాం. అప్పుడు బేబీ నిర్ణయం తెలుసుకుని తర్వాత మనం డిసైడ్ చేద్దాం" అన్నాడు స్వరూప్.

క్వార్టర్స్ లోపలకెళ్ళి చిరుహాసకు ఆలోచించుకొని నీ అభిప్రాయము మేము వచ్చాక చెప్పమని చెప్పి కారెక్కింది దివ్య. కారెక్కి మరలా వెనక్కి వెళ్ళి "ఎవరు తలుపు తట్టినా తీయకు హాసా" అని చెప్పి వెనక్కు తిరిగింది.

మధ్యాహ్నం ఒంటిగంటకు తిరిగి క్వార్టర్స్‌కి వచ్చారు దంపతులు ఇద్దరూ.

అదిరే గుండెల్ని చిక్కబట్టుకుని వణికే కాళ్ళను సరిచేసుకుని హాస పెదవి విప్పి ఏం చెప్తుందో అనే టెన్షన్‌తో దివ్య కాస్సేపు ఆగింది లోపలికి వెళ్ళకుండా. పిరికితనాన్ని పారద్రోలి అడుగు ముందుకేసింది.

తల్లిని చూడగానే పరిగెట్టుకుంటూ వచ్చింది. చిరుహాస కూతురి ముఖంలో భావాలను చదవగలిగింది దివ్య.

"సారీ మమ్మీ! నిన్ను నేను చాలా బాధ పెట్టాను. నీ ముఖమే చెపుతోంది నువ్వెంతగా మానసికంగా అలసిపోయావో ! మమ్మీ నేను ఆలోచించాను. మన సర్కిల్‌లో వున్న భార్య భర్తల మనస్తత్వాలను గుర్తుతెచ్చుకున్నాను. నాకు తెల్సినంతలో వాళ్ళ గుణగణాలను మంచి చెడులని కలిపితే ఆఖరికి నీ వాదమే కరెక్ట్ అనిపించింది. రాంగ్‌రూట్‌లో వెళ్ళాను. అతన్ని తీర్చిదిద్దేకాలాన్ని నా చదువుకు ఉపయోగించుకుంటే మీలాంటి మంచి మనసున్న మీ నీడలో నేనొక మంచి డాక్టర్ని కావచ్చు. లేదా మంచి రీసెర్చ్ స్కాలర్‌ని కావొచ్చు. పదిమందికి ఉపయోగపడేలా బ్రతకొచ్చు"

దివ్య మనసు దూదిపింజెల కంటే తేలికగా వున్నట్లు అనిపించింది.

"మమ్మీ! నిన్న అజిరిని చూడ్డమయితేనేమి? అతని అందాన్ని

నా కాన్వాస్ బోర్డుమీద ఎక్కించాలనుకోవడం వరకు సహజంగానే వుంది.

కానీ రాత్రి కల ప్రభావమే నేనలా మాట్లాడేలా చేసింది. ప్లీజ్ మమ్మీ. నన్ను ఎక్స్‌క్యూజ్ చెయ్యి. నేను మనసులోమాట అంత త్వరగా నీకు చెప్పకపోయుంటే యీ ఆందోళన నీకు కలిగించేదాన్ని కాదు.

ఇక నా లూజ్ టంగ్‌ని కంట్రోల్ చేసుకుంటాను" తళ్ళుదించుకు నయినా స్పష్టంగా చెప్పింది చిరుహాస.

"లేదమ్మా హాసా! పరాయి వాళ్ళముందు తన భావాలకు పూర్తి స్వరూపం రాకముందే త్వరపడి చెప్పుకోవడం అనర్థమే కానీ, తల్లి తండ్రులకు చెప్పుకోవడం నీకు శ్రేయస్కరమే అవుతుంది హాసా!"

కూతురు తీసుకున్న నిర్ణయం వినగానే ఆమె గుండెలమీదనుండి వెయ్యికేజీల బరువు తొలిగిపోయినట్లయింది.

నీరసంగా వున్న కాళ్ళలో వెయ్యి వాట్ల శక్తి వచ్చినట్లు ఫీల్ అయింది.

అప్పటివరకు అంత చల్లటిగాలిలోనూ చెమటలు క్రక్కుతున్న ముఖం ప్రకాశవంతమయింది. తన చుట్టూ పర్చుకున్న మనోవేదననబడే చీకటి తెరలు తొలిగిపోయి వెలుగును విరజిమ్మిన ట్లయిందామె మనస్సు.

కూతురి అభిప్రాయం ఎలా వుంటుందో ఆ మాటలను తను ఎదుర్కోగలదా అని వణికిపోయిన తన పెదాలను కూతురి మంచి నిర్ణ యాన్ని అందించిన పెదాలతో కలిపి ప్రేమగా ముద్దుపెట్టుకుని కూతురి తలమీద ఆప్యాయంగా నిమిరింది దివ్య.

"నాకు తెలసమ్మా హాసా! నీ మనస్తత్వం ఏమిటో నాకు బాగా తెలుసు. మీ డాడీకి నీమీద ఎంత నమ్మకమో చూడమ్మా. ఏమన్నారో

తెలుసా. బేబీ గురించి నాకు ఆలోచనలేదు. ఎందుకంటే బేబీ మన మాటల్లో సత్యాన్ని తప్పకుండా తెల్సుకుంటుంది.

తను తొందరపడి మన దగ్గరున్న స్వతంత్రంతో తనమనసులో మాట చెప్పినా తర్వాత ఆలోచించి మంచి నిర్ణయం తీసుకోగల తెలివి వుంది అని "

"మమ్మీ! నా ప్రక్కన కూర్చో, నేను నీ ఒడిలో తలపెట్టుకుంటాను" అని దివ్య ఒడిలో తలపెట్టుకుని నిద్రపోయింది.

ముగ్గురి మనస్సుల్లో భారాన్ని అనంతగిరి గెస్ట్‌హౌస్‌లో వదిలేసి కారెక్కారు.

★ ★ ★ ★

మధ్యాహ్నం భోజనానికికూడా రాని భర్తకోసం ఎదురు చూస్తూ కూర్చుంది దివ్య.

మధ్యాహ్నం భోజనానికికూడా రాలేదు. ఎక్కడ కెళ్ళారబ్బా! అని ఆలోచిస్తూనేవుంది సాయంత్రంవరకు దివ్య.

సాయంత్రం ఆరు గంటలకు స్వరూప్ వచ్చి రాగానే "దివ్యా" అని పిల్చాడు.

"మధ్యాహ్నం ఎక్కడ భోంచేసారు?" భర్త నడిగింది దివ్య.

"నా భోజనం విషయం తర్వాత? ఇవిగో యీ కీస్ తీసుకో."

"ఏం కీస్ ఇవి? ఎందుకు?" అర్థంకానట్టు అడిగింది దివ్య.

"నేను నీకూకూడా చెప్పకుండా వెళ్ళి ప్రొద్దుటినుండి చేసిన మంచిపని ఇది ఈమారూ దివ్యకేమీ అర్థంకానట్టు క్వశ్చన్‌మార్క్ ఫేస్ పెట్టింది.

"బాగతోట ఏరియాలో లక్కీగా ఒక యిల్లు దొరికింది. ఏకంగా కొనేసాను."

ఏదో కొంత అర్థమయినట్లనిపించినా పూర్తి రూపం దాల్చ లేదు.

"సీ క్లినిక్ కిస్ అవి "

అప్పటికి బోధపడింది దివ్యకు.

"సిక్కింట్లో తోచదు నాకు తెలుసు. మరలా ప్రాక్టీస్ మొదలెట్టు దివ్యా." అతను చాలా సామాన్యంగా చెపుతున్నట్లున్నా అతనిగొంతులో దోషభావం—

"నాకు తోచక పోవడమేమిటి? బేబీ ఇంట్లో వుండగా" మేడదిగి వస్తున్న చిరుహాసను చూస్తూ అంది దివ్య.

"మన బేబి ఆగస్టునుండి ఇంట్లో వుండదు."

"ఏం, అప్పుడే తాతగారి హోదా తెచ్చుకోవాలనుందా?"

"ఎం.డి.ఎస్.కు భర్తగా వున్న నాకు ప్రమోషన్ వచ్చి బి. డి. యస్. ఆ తర్వాత ఎం. డి. ఎస్ కు ఫాదర్ని కూడా అవ్వాలనుంది."

కాసేపటికి తండ్రిమాటలకర్థం బోధపడి ఎగిరి గంతేసింది చిరుహాస.

"థాంక్యూ డాడీ, థాంక్యూ వెరీమచ్! మా డాడీ బంగారం...." చిరుహాస తండ్రిని చుట్టేసి బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

కూతురి ముఖంలో ఆనందం, భార్య కళ్ళల్లో వెలుగు చూసి మనస్ఫూర్తిగా వాళ్ళ ఆనందంలో పాలు పంచుకున్నాడు.